# జగద్గురు సాహితీలహరి

శంకర భగవత్పాదుల సాహిత్యంపై
ప్రసిద్ధ సాహిత్యవేత్తలు

శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు
డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు
శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి, శ్రీ భాగవతుల కుటుంబరావు
డా॥ ఇలపావులూరి పాండురంగారావు, డా॥ పుల్లెల రామచంద్రుడు
డా॥ దివాకర్ల వేంకటావధాని గారల

ఉపన్యాస వ్యాసమంజరి

(శృంగేరీ పీఠాధిపతులు, జగద్గురు శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థస్వాములవారి
అనుగ్రహ భాషణంతో)

ప్రచురణ :



రిజిస్టర్డు సంఖ్య : 1164

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# JAGADGURU SAAHITHI LAHARI

A collection of Lecture-essays on SANKARA BHAGAVATHPAADA'S Contribution to world of Literature by His Holiness Sri Sri Sri Bharathi Theertha Swamy of Sringeri Sarada Peetham & SARVASRI Tummalapalli Ramalingeswara Rao, Dr. Kothapalli Ghanasyamalaprasadarao, Kesavapantula Narasimha Sastry, Bhagavathula Kutumba Rao, Dr. Ilapaavuloori Panduranga Rao, Dr. Pullela Srirama Chandrudu, and Dr. Divakarla Venkatavadhani.



ప్రచురణ సంఖ్య : 115

ప్రథమ ముద్రణ : జనవరి 5, 1986

ప్రతులు : 3,200

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలావీర్రాజు

ముద్రణ : సువర్ణ ముద్రణాలయ, నల్లకుంట
హైదరాబాద్-500 044.

ముఖచిత్ర ముద్రణ : శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాద్

ప్రతులకు :

యువభారతి కార్యాలయం

తిలక్ రోడ్, హైదరాబాద్-500 001 లేదా

యువభారతి

5 కింగ్స్‌వే, సికిందరాబాద్-500 003

వెల : రూపాయలు 20/-

---

ప్రచురణ పూర్వ విరాళం - రూ. 12

సాహితీ మిత్ర పథకంలో సభ్యులకు రూ. 10 కి అందించబడినది.



# యువభారతి పరిచయం

ఉత్తమ అధ్యయనంవల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమ భావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికి అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలు అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని కడచిన ఇరవై ఏళ్ళుగా, పాత కొత్తల మేలుకలయికను ప్రాతిపదికగా పెట్టుకొని నూటపది పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాస మంజరి కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ, తక్కువ వెలకు ఎక్కువ విలువున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రచురణలు వెలువరిస్తున్నదేగాని మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకొనేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో 8,500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 1,200 మంది, భారతీ భూషణులుగా 125 మంది చేరారు.

హైదరాబాదు,
జనవరి 13, 1985.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు, యువభారతి.



# మా మాట

సంఘశ్రేయస్సుకు ఉపయోగపడేవిధంగా వ్యక్తిత్వాన్ని మలచుకోవడమే సంస్కృతి. ఈ ప్రక్రియలో ఉత్తమాధ్యయనం అతిశక్తిమంతమైన సాధనం. మంచి పుస్తకాలను చదవడం వల్లనూ, మంచివాళ్ళతో స్నేహం చేయడం వల్లనూ జీవితం రసవంతంగా, ప్రయోజనాత్మకంగా, సుఖకరంగా, శివంకరంగా సాగిపోయే అవకాశాలు ఇతోధికంగా లభిస్తాయి. ఉత్తమ సాహిత్యంతో పరిచయం పెంచుకోవడంవల్ల వ్యక్తికి సంఘంలో విలువైన భూమికను నిర్వహించే యోగ్యత కలుగుతుంది. అధ్యయనం విస్తృతం కావాలి. బహు విషయాలతో పరిచయం పెరగాలె. సుజ్ఞానమున్న వ్యక్తులే ప్రజాస్వామ్య జీవిత విధానాన్ని పరిరక్షించుకోగలుగుతారు. తనకు తెలిసిందే సత్యమనీ, తాను నమ్ముతున్నదే ధర్మమనీ, తనకు తెలుసుకోవలసిన అవసరం కానీ, అగత్యం గానీ లేదనుకునే వ్యక్తులు సమాజానికి ప్రమాదమే. అందుకే ఉత్తమాధ్యయన పరిధిని పెంచాలనే మహత్వాకాంక్షతో "యువభారతి" కడచిన ఇరువదిరెండేళ్లుగా సాహిత్యోద్యమాన్ని నిర్వహిస్తున్నది.

ప్రతి యేట ఒక అంశాన్ని ఎన్నుకుని వివిధాంశాలుగా దానిని వింగడించి ఒక్కొక్క అంశంపై విజ్ఞులచేత ప్రసంగాలు ఏర్పాటుచేసి, ఆ ప్రసంగ పాఠాలను పుస్తకాలుగా మలచి అందిస్తున్నాము. తెలుగు సాహితిని సుసంపన్నం చేసిన సాహితీమూర్తుల ప్రతిభా పాండిత్యాలను గూర్చి సరళమైన శైలిలో వ్రాయించి ప్రచురిస్తున్నాము.

ఈ సంవత్సరం (1985) భారతీయుల చరిత్రనూ, జీవితాన్నీ, ఆలోచనా ఫణితినీ, తన అప్రతిమాన తపోదీక్షతో, ప్రతిభా వైదుష్యాలతో, పరిపూత జీవనంతో ప్రభావితం చేసి, ధన్యమొనర్చిన మహనీయుడు జగద్గురు ఆదిశంకరుల జీవిత సందేశాలను గూర్చి ఉపన్యాస మంజరీ కార్యక్రమాన్ని రూపొందించి నిర్వహించినాము.

జగద్గురు శంకరాచార్యులు రూపుదాల్చిన విజ్ఞానం. ఉత్తమ దేశికుడు. యావత్ప్రపంచానికి జ్ఞానాన్ని అందించిన జగద్గురువు. ఆయన ఎనిమిదవ శతా

బ్దంలో అవతరించి భారతదేశమందంతటా ఆర్ష సంస్కృతి పరిరక్షణకు కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసిన మనీషి. నాటినుంచి నేటిదాకా భారతదేశంలో పుట్టి తమ ప్రతిభా పాండిత్యాలతో ప్రజాబాహుళ్యాన్ని ప్రభావితుల చేసిన ఆర్షతత్త్వాభిమానులందరూ ఆ మహానుభావుని ప్రజ్ఞాపాటవాలను, ఆలోచనారీతులనూ. భక్తి రసామృతాన్ని ఆకళించుకున్నవారే. అనుసరించిన వారే. అనుభవించినవారే.

తర్కానుకూలమైనఆయన సత్యగవేషణావిధానాన్ని,ఆయన తపశ్చర్యావిధానాన్నీ* ఆయన సమగ్ర భారతీయ సమైక్య దృక్పధాన్నీ** ఆయన పవిత్ర జీవితాన్నీ గూర్చి పండిత నెహ్రూ ప్రస్తుతించినారు. పండిత్‌జీ స్వాతంత్ర్య సమర సేనాని. నవభారతనిర్మాత. భారతీయ సంస్కృతి నైరంతర్యానికి ప్రతీకగా గంగానదిని అభివర్ణించిన మనీషి. ఆయన రచన "డిస్కవరీ ఆఫ్ ఇండియా" ప్రతి భారతీయుడు చదువదగిన గ్రంథం. ఎంత మహోన్నత

---

* "Shankara was a man of amazing energy and vast activity. He was no escapist retiring into his shell or into a corner of the forest, seeking his own individual perfection and oblivious of what happend to others." .... .... ....

** "Every place of piligrimage contained a cross - section of the people of India in all the ir great variety of custom, dress and language, and yet very conscious of their common features and the bonds that held them together and brought all of them to meet in one place. Ev en the difference of language between the North and the South did not prove a formidable barrier to this inter course.

And this was so then and Shankara was doubtless fully aware of it. It would seen that Shankara wanted to add to this sense of national unity and common consciousners. He functioned on the intellectual, philosophical and religious plane and tied tc bring about a greater unity of thought all over the country. He functioned also on the popular plane in many ways, destroying many a dogma and opening the door of his philosophic sanctuary to everyone who was capable of entering it."

Pandit Jawaharlal Nehru
Discovery of India.

భావాలున్నవారు ఆనాడు స్వాతంత్ర్య సమరానికి నాయకత్వం వహించినారో, వారు ఎందుకంత గొప్ప నాయకులు కాగలిగినారో ఆ పుస్తకం భంగ్యంతరంగా ఉద్బోధిస్తుంది. మూర్తీభవించిన సమైక్యభావం పండిట్‌జీ. అతిపరిసీమితమైన, నిష్ఠురమైన, నిరుదారమైన సంప్రదాయాన్ని ఆదిశంకరులు ప్రతిపాదించలేదు. కనుక శంకరుల సాహిత్య పర్యాలోచనం మతపరమైన ప్రచారం అనిపించుకోదు. అట్లా అనుకోవడం అధ్యయన దారిద్ర్యమే. సంకుచిత మనస్తత్వమే. సహిష్ణుతా పరాఙ్ముఖత్వమే.

మొన్నటి నిన్నటి తెలుగు కవుల నెందరినో శంకరుల సాహిత్యతత్త్వం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కదిలించింది. గీర్వాణాంధ్ర సారస్వతాలతో తల స్పర్శి పరిచయం ఉన్నవారికి గాని ఈ విషయం అవగతం కాదు. భారతీయుల తత్త్వజిజ్ఞాసా స్వరూపానికి శంకరుల సాహితి దర్పణం.

శంకరుల వివేక వైభవాన్ని, కవితాపారమ్యాన్ని, ప్రత్యక్షంగా సంస్కృతము నుంచి పరోక్షంగా ఇతర భాషల నుంచి గ్రహించి, అర్థం చేసుకుని, ఆనందించీ, తరించి, కృతార్థుడు కాని భారతీయుడు లేడంటే సాహసం కాదు.

శంకరభగవత్పాదులు వ్యాసప్రోక్తమైన మహాభారతంలోని విష్ణు సహస్రనామాలకూ, భగవద్గీతకూ, ఇంకా వ్యాసుని బ్రహ్మసూత్రాలకూ, ఉపనిషత్తులకూ ప్రామాణిక వ్యాఖ్యానాలు వెలయించి పాండిత్యానికి ఉండవలసిన ప్రయోజనాన్ని భంగ్యంతరంగా నిరూపించుకుని ఆదర్శ శిఖరంగా వెలుగొందినారు. ఆయన వ్యాఖ్యాన సాహితి, భారతీయ ప్రతిభకు వైజయంతిక. ఆయన ప్రపంచ సార తంత్రం అతి నిగూఢమైన మంత్రశాస్త్ర పరిజ్ఞాన కోశం.

ఉపనిషత్తులలోని సారాన్నీ, భక్తి వేదాంత తత్త్వాలనూ, మానవ మనస్తత్వాన్నీ సునిశితంగా, కవితాత్మకంగా వివరించినారు తమ "వివేక చూడామణ్యాది" ప్రకరణ గ్రంథాల్లో.

శారదనూ, గణపతినీ, నృసింహస్వామినీ, లక్ష్మీదేవినీ, దక్షిణామూర్తినీ, పరమేశ్వరమూర్తినీ, మీనాక్షీ మాతృమూర్తినీ, పరాశక్త్యాది దేవతామూర్తులనూ ఆయన స్తుతించినారు. ఆ స్తుతి శ్లోకాలు స్తోత్ర సాహితికి అమూల్యాలంకారాలు. పరమ కవితామరవాహిని పొంగులు వారింది ఆ శ్లోకాలలో. ఆయా దేవతా మూర్తుల స్తోత్రాలలోని ప్రత్యక్షరం మధురతేజఃకోశం. దివ్యజ్ఞాన సంబోధకం.

ఆ శ్లోకాలను కంఠస్థం చేసిన సాధకునికి సుందరమైన భాషా సంస్కారం అలవడి తీరుతుంది.

శంకర భగవత్పాదుల "సౌందర్యలహరి", "శివానందలహరి", ఆయన మహోన్నత కవితా సంస్కారానికి ప్రతీకలు. ఆధ్యాత్మిక విద్యారహస్యాలను వ్యంజిస్తున్న ప్రజ్ఞా ప్రదీపికలు.

దైనందిన జీవితాన్ని వేదోక్తంగా నిర్వహించుకొనే పద్ధతికి స్వస్తి చెప్పి, స్వేచ్ఛను ప్రసాదిస్తున్న వేదాంత సందేశాలను పెడచెవిన పెట్టి, నిష్ఠురమైన, నిర్హేతుకమైన కర్మకాండలలో చిక్కుకొని, పరస్పరం భావ ఘర్షణను పెంచుకొని, సమైక్య భారతీయతాదృక్పథాన్ని దర్శించుకోలేక దుర్భర జీవితాన్ని గడుపుతున్న నాటి భారతీయులకు, తన మేథాసంపత్తితో, తన తార్కిక ప్రజ్ఞతో, తన మహిమోపేతమైన జీవితంతో చక్కని మార్గం చూపిన శంకర భగవత్పాదులు ధన్యజీవులు.

ప్రామాణికులు కాని కొందరు ఆయనను గూర్చి కొన్ని పిట్టకథలు; కట్టుకథలు అల్లి, ఆయన ప్రతిపాదించిన సిద్ధాంతాలకు తమ అజ్ఞానం చేత వక్ర భాష్యాలు చేస్తున్న ఈ తరుణంలో యువతరానికి ఆయనను గూర్చిన వాస్తవాలను తెలపాలని, 1200 సంవత్సరాల క్రితమే యావద్భారతంలోని బుద్ధి జీవులను ఒక త్రాటిపై నడపడానికి ఆ మహాత్ముడు చేసిన ప్రయత్నాన్ని వివరించాలని, "యువభారతి" ఒక చిన్న ప్రయత్నం చేయడానికి సమకట్టింది. ఈ ప్రయత్నం సమగ్రమైనదని యువభారతి అనుకోవడం లేదు. ఉడుతాభక్తిగా తనకు తోచిన రీతిలో, చేయగలిగిన రీతిలో చేసిన ప్రయత్నమిది.

శంకర భగవత్పాదుల జీవితాన్ని, సందేశాన్ని గూర్చి, వివిధాంశాలపై ఉపన్యాసాలను ఏర్పాటుచేసి మా ఇరవై రెండవ వార్షికోత్సవాల సందర్భంగా "జగద్గురు సాహితీ లహరి" అనే ఉపన్యాసమంజరీ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసినాము.

శృంగేరి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ స్వాములవారు 17 సెప్టెంబరు '85 నాడు ఆంధ్రసారస్వత పరిషత్ ప్రాంగణంలో ఈ ఉపన్యాసమంజరీ కార్యక్రమానికి శుభారంభం పలికి, ఆశీరమృతాన్ని అందించి మా ఉద్యమాన్ని ప్రోత్సహించినారు. వారికి మా భక్తిపూర్వకాభివందనములు.

శ్రీ స్వామి వారు ప్రారంభోత్సవ సందర్భంగా ప్రసాదించిన అనుగ్రహ భాషణాన్ని "జగద్గురు సాహితీ లహరి"లో యథాతథంగా అందిస్తున్నాము. ఈ ఉపన్యాసమంజరీ కార్యక్రమంలో "ప్రపంచ సారతంత్రాన్ని గూర్చి శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారు, శంకరుల జీవితం సందేశాలను గూర్చి డా॥ ఘనశ్యామల ప్రసాదరావుగారు, స్తోత్ర సాహిత్యాన్ని గూర్చి శ్రీ కేశవ పంతుల నరసింహశాస్త్రిగారు వ్యాఖ్యాన సాహితిని గూర్చి శ్రీ భాగవతుల కుటుంబరావుగారు, శంకరాద్వైతాన్ని గూర్చి, డా. ఇలపావులూరి పాండురంగారావుగారు, ప్రకరణ సాహిత్యాన్ని గూర్చి ఆచార్య శ్రీ పుల్లెల శ్రీ రామచంద్రుడు గారు, శివానందలహరి, సౌందర్యలహరిని గూర్చి ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు మా వేదికపై ప్రసంగించి, తమ ప్రసంగ పాఠాలను వ్యాసాలుగా రూపొందించి అందించి మమ్ములను కృతార్థులను చేసిన వాఙ్మయ నిధులు, శేముషీ సంపన్నులు. మేము నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి చేయూత నిస్తున్న సంస్కృతి సంరక్షులు. ఆర్ష విజ్ఞానంపట్ల నమ్మకమున్న ధర్మజ్ఞులు. వారి ఔదార్యానికి, మా ధన్యవాద పరంపరలు.

యావదాంధ్ర ప్రాంతంలోని సహృదయులు మాకు ఎప్పటివలెనే తోడ్పడుతూ మాకు అండగా ఉంటారని అభ్యర్థిస్తున్నాము.

హైదరాబాదు,
5-1-86.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు

# జగద్గురు సాహితీ లహరి

## ఉపన్యాస మంజరి

### పుస్తక ప్రచురణ కార్యక్రమ వివరములు

**మొదటి సమావేశం : 17-9-1985 మంగళవారం సా॥ గం. 6-15 ని**

శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థస్వామివారి
అనుగ్రహ భాషణం

విషయము : "ప్రపంచసార తంత్రము"
వక్త : శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు

**రెండవ సమావేశం : 6-10-1985 ఆదివారం సా॥ 6గంటలకు**

అధ్యక్షులు : శ్రీ టి. హరిహరశర్మగారు
ప్రిన్సిపాల్, విజయనగర్ కాలేజి ఆఫ్ కామర్స్, హైద్రాబాద్
ముఖ్య అతిథి : శ్రీ కె. వి. భాస్కరరావుగారు
అసిస్టెంట్ జనరల్ మేనేజర్, ఆంధ్రా బ్యాంక్
విషయం : "శంకరుని రచనలు, జీవితం, సందేశం"
వక్త : డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావుగారు

**మూడవసమావేశం : 3-11-1985 ఆదివారం సా॥ 6 గంటలకు**

అధ్యక్షులు : డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి
విషయం : "శంకర స్తోత్ర సాహిత్యం"
వక్త : శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు

నాల్గవ సమావేశం : 22-12-1985 ఆదివారం సా॥ 6 గంటలకు

అధ్యక్షులు : డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

విషయం : "భగవత్పాద శంకరుల వ్యాఖ్యాన సాహిత్యం"

వక్త : శ్రీ భాగవతుల కుటుంబరావుగారు

ఐదవ సమావేశం : 28-12-1985 శనివారం సా॥ 6 గంటలకు

(సభాస్థలి : త్యాగరాయ గానసభ, చిక్కడపల్లి, హైదరాబాద్)

అధ్యక్షులు : డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

విషయం : "శంకరాద్వైతం"

వక్త : డా॥ ఇలపావులూరి పాండురంగారావుగారు

విషయం : "శంకరుని ప్రకరణ గ్రంథాలు"

వక్త : డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు

ఆఱవ సమావేశం : 5-1-1986 ఆదివారం సా॥ 6 గంటలకు

అధ్యక్షులు : డా॥ ప్రసాదరాయ కులపతి
తెలుగుశాఖాధ్యక్షులు, హిందూ కళాశాల, గుంటూరు

విషయం : 'సౌందర్య లహరి, శివానంద లహరి"

వక్త : డా॥ దివాకర్ల వేంకటావధాని

# జగద్గురువుల జ్ఞానభిక్ష

"భజగోవిందం భజగోవిందం
గోవిందం భజ మూఢమతే!
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృఞ్ కరణే"

భారతీయు లీస్తోత్ర పాదాలను జీవన తత్త్వగీతిగా పాడుకొంటారు. ఈ గీతి నందించిన ఆచార్యులు ఆదిశంకరులు. ఆ సంగతి ఆ గీతి పాడుకొనే ప్రతి సామాన్యునికీ తెలిసియుండవచ్చు; తెలిసియుండక పోవచ్చు. కాని, ఆ గీతి ఏవ్యక్తి వ్రాసినా ఒక శక్తిలా ప్రవహించే ప్రభావం కలిగి ఉందని అందరూ అనుభవైకవేద్యంగా వ్యాఖ్యానిస్తారు. దానికి కారణం - డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు చెప్పినట్లు -

"Sankaracharya is one of the immortals of India's cultural history. You will find that, like other exponents in this country. he never claimed for himself any kind of originality for his teachings. His originality was in reinterpreting the great traditions of the country to suit the conditions of the time. He reinterperted the teachings of the upanishads. the Bhagavadgita etc, in a manner which world appeal to the eultivated minds of his generation. His reinterpretation was in the form of a new cretion. Even today it has a great appeal to us. శంకరులు చెప్పింది సనాతన ధర్మతత్వమే. ఉపనిషత్సారమే; కాని, ఆయన వ్యాఖ్యానించిన తీరు; అభివ్యక్తీకరించిన పద్ధతి స్వతంత్ర సృష్టిగా; సృజనాత్మకాభివ్యక్తిగా భాసించి జనుల హృదయాలను ఆకర్షిస్తుంది. సమకాలీన సామాజిక, మత పరిస్థితులకు సమన్వయ సూత్రంగా వెలసిన ఆయన ప్రవచనం సార్వకాలికమైన ఆధ్యాత్మికానుభవసత్యంగా నేటికీ స్ఫురిస్తున్నది. తరతరాలుగా భారతీయ రక్తంలో ప్రవహిస్తున్న ఆధ్యాత్మిక సంస్కారానికి విద్యాగౌరవాన్ని, ఆ రెండింటికీ కల అద్వైత భావాన్ని ఆదిశంకరులు తమ రచనల ద్వారా మనకు అందించారు. "చదువు

లలో సారమెల్లచదివితి తండ్రీ!" అన్న ప్రహ్లాదుని వాక్యం లక్ష్యమైతే "అనుభవావసాన మేవ విద్యాఫలమ్" అన్న శంకరుల వాక్యం లక్ష్యంగా స్ఫురిస్తుంది.

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః" అన్నది శంకరుల బోధామృత సారం. దీనిని అనుభవించటమే జ్ఞానపథం; మోక్షపదం. శంకరాచార్యులు జగద్గురువులు. ఎవరి బోధలు జన జీవనంలో నీరక్షీరంలా కలిసిపోయి బ్రదుకుపాటగా, వెలుగుబాటగా సాగుతూ ఉంటాయో ఆయన జగద్గురువు. ఎవరి బోధలు జాతి సంస్కారంగా రక్తంలో జాలువారుతాయో ఆయన జగద్గురువు. ఆదిశంకరులు అట్టి జగద్గురువులు. ఆయన చెప్పిన అద్వైతతత్త్వం భారత దేశంలో చదువుకోని సామాన్యునికి కూడా పుట్టుకతో వచ్చిన సంస్కారంలా సహజావ బోధలా తెలిసి ఉంటుంది; జీవన విధాన సూత్రంగా జాలువారుతూ ఉంటుంది. జనజీవనంలో జ్ఞానవాహినిని అంతస్స్రవంతిగా ప్రవహింప చేసినవాడే జగద్గురువు. ఆదిశంకరులకే ఆ బిరుదం అన్వర్థం!

శంకరాచార్యుల సూక్తిలో భారతీయ తత్త్వశాస్త్రం ప్రపంచానికి హస్తామలకంగా ప్రకాశించింది. శంకరులకు హస్తామలకుడనే శిష్యుడున్నాడు. ఆ గురుశిష్యుల ప్రథమ సమాగమం ఒక విచిత్రం; ఒక విధంగా ప్రతీకాత్మకం. మూకాంబిక క్షేత్రంలో శంకరు లొక మూగ బాలుణ్ణి చూచి "నీవెవడవు?" అని ప్రశ్నించారట. అతడు వెంటనే ఎలుగెత్తి యిలా అన్నాడట- "నేను ఈ శరీరాన్ని కాను; అంతటా నిండియున్న ఆత్మ స్వరూపమైన ఏకైక సత్యమే నేను." ఈ మాటలు విని శంకరు లాబాలుణ్ణి దీవించి, పరమసత్యాన్ని అరచేతిలో నుంచిన ఉసిరిక పండులా అవలీలగా చెప్పినందుకు "హస్తామలకుడు" అనే పేరు పెట్టారట. ఇది అప్పటి ఒక శిష్యుని మాట! ఇప్పుడు ప్రతివానికి తెలిసిన తేట! "నేను శరీరాన్ని కాను; నేను బ్రహ్మాన్ని" అన్న విజ్ఞానం భారత దేశంలో వ్యక్తి వచ్చిన ప్రతి వ్యక్తికీ సహజంగా ఉండే ఆధ్యాత్మిక సంస్కారం. అది జగద్గురువులు జాతికి పెట్టిన జ్ఞానభిక్ష!

శంకరుల అద్వైతతత్త్వం ఆధ్యాత్మిక సామ్యవాదంగా గోచరిస్తుంది. జీవులందరూ తత్త్వతః ఒక్కటే. ఇట్టి అద్వైతమే సత్యం; భేదభావం అజ్ఞానం. అద్వైతసారమే "ఆత్మవత్ సర్వభూతాని" అన్న ఆత్మజ్ఞానమై జీవులలో ప్రవహిస్తుంది. అట్టి జ్ఞాన స్రోతస్వినిని లోకాని కందించిన శంకరుల వాణి లోకశంకర

మైనది. ఆయన వాక్కు ఆత్మజ్ఞాన భాస్కరుని కిరణం; ఆయన వాఖ్య అద్వైత తత్త్వ వారిజ భానూదయం; ఆయన కవిత జ్ఞాన భక్తి మరంద భాగీరధి: ఆయన ప్రబోధ సర్వజన హస్తామలం.

"నానావిధం కుంభానాం నయాత్యేవ యధా నభః
నానా విధత్వం దేహానాం తద్వదేవ నయామ్యహమ్."

"కుండలు వేరైనా అందులోని ఆకాశం మాత్రం వేరు వేరు కాదు. అలాగే శరీరాలు వేరైనా వాటిలోని ఆత్మ మాత్రం ఒక్కటే. దానికి వైవిధ్యం లేదు." ఈ ఆధ్యాత్మికానుభవం సర్వ జీవసమభావానికి మూల బీజం. ఇదే నిత్యసత్యమైన బ్రహ్మజ్ఞాన మూలం.

వేదాంతంలో దేహం అనిత్యం; మిధ్య. శంకరుల అద్వైతాన్ని అధిక్షేపించే వారు "గజం మిధ్యా, పలాయనం మిధ్యా" అని హేళన చేయటం లోకంలో ఉన్నది. ఆ మాట అవివేక మూలం. శంకరుల ప్రబోధంలో దేహానికి, లోక వర్తనానికి పరమార్ధ సత్యత్వం అంగీకరింపబడదు కాని, వ్యావహారిక సత్యత్వం అంగీకరింపబడుతుంది. "అహం బ్రహ్మాస్మి" అన్న జ్ఞానం తెలిసిన జ్ఞానికి జగత్తంతా మిధ్యయే. ఆ అధికారం సాధించే వరకూ వ్యావహారిక, పరమార్థ సత్యాలు రెండూ ఉంటాయి. అద్వయ బుద్ధినుండి అద్వైతం వరకు ప్రస్థానం చేయటమే శంకర జ్ఞాన పథం.

మానవ జీవితాన్ని కర్మ భక్తి జ్ఞాన యోగాలద్వారా అద్వైతానుభూతి వరకూ ప్రస్థానం చేయించటానికి తాత్త్వక మార్గాన్ని చూపిన ఆచార్యోత్తముడు ఆదిశంకరులు. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" కదా! ధర్మ సాధనకు కర్మాచరణకు దేహం అవసరం. దేహం వ్యావహారిక సత్యం. దానియందు దైవ భావనం చేయటం శంకరులు చూపిన శివంకరమైన మార్గం.

"దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవః సదాశివః
త్యజే దజ్ఞాన నిర్మాల్యం సోఽహం భావేన పూజయత్"

అని శంకరుల ఆదేశం. ప్రతిమానవుని దేహమూ ఒక దేవాలయంగానూ, అందులోని జీవుణ్ణి సదాశివునిగానూ భావించాలట; అజ్ఞాన నిర్మాల్యాన్ని తొలగించి "సోఽహం" భావంతో పూజించాలట! సర్వజీవ సమాదర భావంతో పాటు

"సోஉహం" భావాన్ని అందిస్తున్న ఈ బోధ అద్వైతానుభవసిద్ధికి ప్రథమ సోపానం. "మానవ సేవయే మాధవ సేవ" అనే ఆధునిక భావనకు ఈ ఆధ్యాత్మిక అనుభూతి ఆధారం. లౌకిక జీవితంలో శాంతికి, ఆధ్యాత్మిక జీవితంలో క్రాంతికి ఈ సూక్తి మూలకందం.

నిత్యజీవితంలో సర్వకర్మలూ సర్వేశ్వరారాధన రూపాలనే సాధనను భక్తి పురస్సరంగా వ్యక్తం చేసిన ఈ క్రింది శ్లోకం మన సంస్కృతిలో ఒక భాగమై పోయింది.

"ఆత్మాత్వం, గిరిజామతిః, సహచరాః ప్రాణాః శరీరం గృహం
పూజాతే విషయోప భోగ రచనా, నిద్రా సమాధిస్థితిః
సంచారస్తు పదోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాగిరో
యద్ యద్ కర్మ కరోమి, తత్త దఖిలం శంభో తవారాధనమ్"

శంకరు లీశ్లోకంలో జీవితాన్ని భగవదారాధనగా మార్చారు; కర్మను యోగంగా మలచారు. దేహాన్ని దేవాలయంగా, జీవుణ్ణి శివునిగా కర్మను ఆరాధనంగా, భావించి సాధించి, తరించేవారికి మరే శాస్త్రవిజ్ఞానం అవసరం లేదు. వేదవేదాంత సారాన్ని నిత్యజీవితంలో అనుభవసారంలా ప్రవహింపచేసికొనటమే ఇది శంకరులు మనకిచ్చిన కర్మయోగజ్ఞానం.

శంకరులు మన కందించిన భక్తియోగజ్ఞానం అనన్యం, అపూర్వం. అది నేటికీ మనజాతి సంస్కారంలో వెలిగే తీరు విశిష్టం. ఒక చిన్న ఉదాహరణ :- మన దేశంలో ప్రతి మనిషీ, ప్రతి మానూ, ప్రతి రప్పా అన్నీ భగవద్భావన కుపయోగించే లింగాలే. లింగమంటే గుర్తు; జ్ఞాపిక; ప్రదీక, తల్లి పసిపాపను "బంగారు కొండా" అని ముద్దు పెట్టుకొంటుంది. అంటే సర్వదేవతా స్వరూపమైన మేరు పర్వత భావనం చేస్తున్న దన్నమాట! తల్లిని, తండ్రిని, గురువును, అతిధిని, భర్తను, భార్యను - అందరినీ దేవతలుగా భావించటం మనలో ఉంది. అంటే సజీవమూర్తులన్నీ ఏకైక దైవభావానికి ప్రతీకలన్నమాట! గుడిలో ఏదేవతా విగ్రహాన్ని చూచినా మన బొమ్మను చూచామని అనుకోము; శిలలో శివుణ్ణి చూచిన అనుభూతిని పొందుతాం. బ్రహ్మానికి బొమ్మను లింగంగా భావించటం మన భక్తి సంస్కారం. అంటే - సగుణమైన మూర్తులన్నీ నిర్గుణమైన బ్రహ్మాన్ని గురించి భావించటానికే, దానిని అనుభవించటానికి, అద్వైతసిద్ధిని పొందటానికీ బాహిర ప్రతీకలన్న మాట. బ్రహ్మాన్ని తెలిసిన తరువాత బొమ్మ మిధ్యయేగా ఈ

సంగతి అందరికీ తెలుసు. ఈ తెలివిడిని వేదాలూ ఉపనిషత్తులూ కలిగిస్తాయి. కాని, వాటిని చదివే శక్తి, అర్థం చేసికొనే శక్తి జాతికి అన్ని కాలాలలో ఉండక పోవచ్చు. ఆ శక్తి లోపించిన యుగంలో పుట్టి ఆ శక్తిని అన్ని కాలాలకు అందించిన ఆచార్యులు ఆదిశంకరులు "అహం బ్రహ్మాస్మి" లేదా "సోహం" అని తెలుసుకొంటే జ్ఞానభక్తియోగం; శివుడు లింగ రూపుడని తెలుసుకొని ఆరాధిస్తే, లేదా కృష్ణుడు రసరూపుడని భావించి ఆరాధిస్తే భగవద్వ్యాపరతి స్థాయియైన భక్తియోగం; మానవుడు మాధవుడని మన్నించి సేవిస్తే కర్మయోగం; ఈ సత్యాన్ని ఇంత కరతలామలకంగా చెప్పింది జగద్గురువు.

ఆదిశంకరులు జ్ఞానబోధియేకాదు; సాధనకూడా లోకానికి బోధించారు. ఆయన వ్యాఖచేసినప్పుడు ఉపదేష్ట; బోధ చేసినప్పుడు ఆచార్యుడు; కవిత చెప్పినప్పుడు ద్రష్ట, ఈ మూడు లక్షణాలూ ఆయనలో త్రివేణీ సంగమంగా జాలువారాయి.

"అజ్ఞానం త్యజ హే మనో పి చ సదా బ్రహ్మాత్మ సద్భావనాత్
సంకల్పా నఖిలా నపిత్యజ జగన్మిథ్యాత్వ సద్భావనాత్
కామాన్ సాధన సాధ్య దుఃఖ నివహధ్యానా దజస్రం త్యజ
క్రోధంతు క్షమయా సదా జహి బలాల్లోభంతు సంతోషతః

జ్ఞానసాధనకు ఈ శ్లోకం చెప్పిన సాధన తరణోపాయం. శంకరులు సూచించిన సాధన మనిషిలో భగవంతుణ్ణి దర్శింప చేస్తుంది. ఆధ్యాత్మిక భావనం ద్వారా మమత్వాన్ని లోకంలో సంభవింప చేస్తుంది. తనవలెనే లోకాన్ని చూడటం; తానే లోకమైపోవటం; సర్వం బ్రహ్మమనే అద్వైతసిద్ధిని పొందటం లభిస్తుంది. అనేకత్వంలో ఏకత్వాన్ని దర్శించటం, అనుభవించటం సాధ్యమౌతుంది. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుని ఈ వాక్యాలు చిరస్మరణీయాలు-

"Sankaracharya found people worshipping many gods, - Siva, Sakti, Vishnu etc. He looked upon all of them as the legitimate, valid forms of the supreme and he asked as not to quarrel about these names and other things, He was regarded as షణ్మత స్థాపనాచార్య. If he had been alive today, he would have extended this spirit of hormony to the other religions which also prevail in this country and in the world. He has essentially a democratt, a democrat preaching reconcilliation, hormony".

ఈ అంశాన్ని ఆధునిక సమాజానికి తెలియజెప్పటానికే యువభారతి "జగద్గురు సాహితీ లహరిని" నిర్వహింప తలపెట్టింది. శృంగేరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థస్వామి వారి అనుగ్రహభాషణాన్ని సంపాదించింది; శంకర సాహిత్యాన్ని సమీక్షించటానికి సాహిత్యాచార్యుల సంభాషణలను సంపుటీకరించింది వేదాంతం జాతిసంస్కృతి అన్నసారం; ప్రాణకోశం; మనశ్శక్తి; విజ్ఞానవికాసం; ఆనందకందం. దానిని జీవనవిధానంలో ప్రతిఫలింప చేసికోనటం ప్రగతి ప్రస్థానం. ఆ ప్రస్థానాన్ని యుగయుగాలకు అందించిన జగద్గురు సాహితికి ఇది అక్షర నీరాజనం. యువభారతి ధన్యం.

జి. వి. సుబ్రహ్మణ్యం

# యువభారతి
## సాహితీమిత్ర పథకం

యువభారతి తన కృషిలో పాలు పంచు-కొనే మిత్రుల కోసం ఎదురు చూస్తున్నది. సాహితీ మిత్రులుగా చేరి, సాహిత్యోద్యమ నిర్వహణలో బరువు బాధ్యతలు పంచుకొనే సహృదయుల సహకారం ఆకాంక్షిస్తున్నది. యువభారతితో సర్వదా సాహితీ బాంధవ్యాన్ని పటిష్ఠం చేసు-కోవాలనేదే సాహితీమిత్ర పథకధ్యేయం.

కేవలం రూ. 10/- లతోనే సాహితీ మిత్రులుగా చేరండి.

మీ సాహితీ స్నేహాన్ని అందించండి.



# ఎందరో మహానుభావులు

ఎందరో మహానుభావులు జగద్గురు సాహితీ లహరి కార్యక్రమాన్ని రూపుదిద్దటంలో సహకరించిన పెద్దలు పూజ్యులు శ్రీ శృంగేరిపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థమహాస్వాముల వారు ఆచార్య దివాకర్ల వేంకటావధాని డా॥ జి. వి, సుబ్రహ్మణ్యంగారలు.

జగద్గురు సాహితీలహరి ఉపన్యాస మంజరీ కార్యక్రమాలలో ఉపన్యాసాల నివ్వడమే కాకుండా వ్యాసాలు సమర్పించి ఈ గ్రంథానికి రూపుకల్పించిన సాహితీవేత్తలు శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారు, డా॥ పుల్లెల శ్రీరామ చంద్రుడుగారు, డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావుగారు, శ్రీ భాగవతుల కుటుంబరావు గారు, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు డా॥ ఇలపావులూరి పాండురంగారావుగారు.

బాబాఫరీద్‌సూక్తులు, డా॥ ఇలపావులూరు పాండురంగారావు గారు "తెలుగులో బాలసాహిత్యం" వెలగా వెంకటప్పయ్యగారు, నన్నయభట్టు, ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు, జానపదులు, జ్ఞాపదులు శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారు, అక్షరాలు ఆలోచన, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారలు

మా యువభారతి ప్రచురణలను చక్కని ముఖచిత్రాలతో తీర్చిదిద్దిన చిత్రకారులు శ్రీ శీలావీర్రాజుగారు తెల్లకాగితాన్ని అందించిన వాసవీ పేపర్ మార్ట్ విక్రయదారులకు, మా ప్రచురణలను ముద్రించిన శివాజీ ప్రింటింగ్ ప్రెస్ సికింద్రాబాద్, సువర్ణముద్రణాలయ వారికి

బ్లాకులు తయారు చేసిన మోహన్ ప్రాసెస్ వారికి

లహరి కార్యక్రమాలను తమ ప్రాంగణంలో జరుపుకొనుటకు దయతో అనుమతించిన ఆంధ్రసారస్వత పరిషత్, త్యాగరాయగాన సభల కార్యాలయ నిర్వాహకులు హరికిషన్‌రావు, పరబ్రహ్మమూర్తిగారలకు

నెలనెల కార్యక్రమాలను తమ ప్రాంగణంలో నిర్వహించుకొనడానికి దయతో అనుమతించిన శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం కార్యదర్శి ఎమ్. ఎల్. నరసింహారావుగారికి.

మా ప్రచురణ కొనుగోలు ఇతోధికంగా ప్రోత్సహిస్తున రాజారామ మోహన్‌రాయ్ గ్రంథాలయ ఫౌండేషన్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గ్రంథాలయ శాఖ డైరెక్టర్, జిల్లా గ్రంథాలయాధికారులు మరియు ఇతర పుస్తక విక్రేతలు.

ప్రకటనల ద్వారా ఆర్థిక సహాయాన్ని చేసిన ప్రకటన కర్తలకు.

మా యువభారతి కార్యక్రమాలు ఇతోధికంగా లోకానికి తెలియ చెప్పి ప్రోత్సహించే పాత్రికేయులు, సాహితీ శీలురకు.

మా సభలకు అవసరమైన ఫర్నిచరును సమకూర్చిన యూసఫ్ అండ్ కంపెనీ వారు విద్యుద్దీపాలంకరణ - హనుమాన్ ఎలక్ట్రికల్స్‌వారికి.

మా సాహిత్య కార్యక్రమాలకు వచ్చి యువభారతి సాహిత్యోద్యమాన్ని సాదరంగా ప్రోత్సహిస్తున్న సాహితీ స్నేహమూర్తులు, సహృదయులైన తెలుగువారికి.

"యువభారతి" చైతన్యం యువభారతీయుల సమైక్య కృషి. సాహిత్యోద్యమంలో కష్ట నిష్ఠూరాల కోర్చి శ్రమించిన యువభారతి సభ్యులు, అండదండల నందించిన "సాహితీ మిత్రులు," "భారతీ మిత్రులు", భారతీ భూషణలు."

ఎదురుగ కనబడేవి ఎందరైనా, కనుమరుగున ఉండి మమ్ములను దీవించేది. ఎందరో ? అందరూ మహానుభావులే అందరికీ మా వందనములు.

వై. వివేకనందం
కార్యదర్శి, యువభారతి.

# అనుక్రమణిక

యువభారతి పరిచయం
కార్యక్రమ వివరాలు
ఎందరో మహానుభావులు

జగద్గురువుల జ్ఞానభిక్ష డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

1. శ్రీశృంగేరీపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థుల అనుగ్రహ భాషణం

2. శంకర భగత్పాదుల ప్రపంచ తంత్రసారంపై
శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు

3. శంకర భగత్పాదుల ప్రకరణ గ్రంథాలపై
డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు

4. శంకర భగవత్పాదుల స్తోత్ర సాహిత్యంపై
శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు

5. శంకర భగవత్పాదుల జీవితం - సాహిత్యంపై
డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావుగారు

6. శంకర భగవత్పాదుల వాఖ్యాన సాహిత్యంపై
శ్రీ భాగవతుల కుటుంబరావుగారు

7. శంకర భాగవత్పాదుల ప్రతిపాదిత అద్వైతంపై
డా॥ ఇలపావులూరి పాండురంగారావుగారు




జగద్గురువులు
శ్రీ శృంగేరీ పీఠాధిపతులు
శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాములవారు




జగద్గురువులు

శ్రీ శృంగేరీ పీఠాధిపతులు

శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాములవారు

శృంగేరి పీఠాధిపతులు

# శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థస్వామివారి

# అనుగ్రహభాషణం

"వరమభయముదారం పుస్తకంచాఽక్షహారం
మణివలయ మనోజ్ఞైః పాణిపద్మైః దధానా
సితవసనలలామా కుందముక్తాభిరామా
వసతు శశినిభాస్యా వాచి వాగ్దేవతా నః"

మన యీ జగతీ తలంలో ఎంతోమంది తత్త్వవేత్తలు, దార్శనికులు ఆవిర్భవించారు. కాని శ్రీ శంకరభగవత్పాదులవంటి తాత్త్వికుడు, ఆయనవంటి దార్శనికుడు, ఆయనవంటి విద్వన్మూర్ధన్యుడు యింతవరకు చరిత్రలో జన్మించ లేదు; ఇక జన్మించుతాడో లేదో నాకు తెలియదు. జగత్తులో అటువంటి అద్వితీయమైన స్థానమును సంపాదించిన, మహాప్రతిభాశాలియైన, దార్శనిక శిరోమణియైన శంకరభగవత్పాదాచార్యులు మనుష్యునియొక్క ఆత్యంతికమైన లక్ష్యమగు మోక్షప్రాప్తికి సాధనమైన జ్ఞానముయొక్క స్వరూపాన్ని, జ్ఞానసాధనాన్ని జగత్తుకు తెలిపిన మహావ్యక్తి.

మనయొక్క సనాతన ధర్మానికి ప్రమాణమూర్ధన్యంగా వుండే వేద రాశి యొక్క చివరిభాగంలో వుండేటటువంటి గ్రంథాన్ని ఉపనిషత్తులు అని చెబుతూవుంటాం. వేదమునందు ముఖ్యంగా రెండు విషయాలను గురించి ప్రతిపాదన కానవస్తుంది. ఒకటి కర్మం; మరొకటి బ్రహ్మం. వేదముయొక్క పూర్వ భాగమంతయు కర్మనుగురించి చర్చించింది. వేదముయొక్క ఉత్తరభాగమంతయు బ్రహ్మమునుగూర్చి చర్చించింది. వేదము అనేకమైన శాఖోపశాఖలుగా వున్నటువంటిది. ఋగ్వేదానికి 21 శాఖలు, యజుర్వేదమునకు 101 శాఖలు,

సామవేదమునకు 1000 శాఖలు, అధర్వణవేదమునకు 9 శాఖలు. ఇన్ని శాఖలలో వున్నటువంటి ఉపనిషద్గ్రంథాలు మనకు ఉపలబ్ధం కాకపోయినా, కొన్ని గ్రంథాలు ఉపలబ్ధంగా వున్నాయి.

సామాన్యంగా చూచేటటువంటి వాళ్లకు ఒక్కొక్క ఉపనిషత్తులో ఒక్కొక్క విధంగా చెప్పబడి వున్నట్లు అనిపిస్తుంది. సామాన్యుడైనవాడు ఆపాతంగా ఆ ఉపనిషద్గ్రంథాలను చూస్తే తత్త్వం ఏమిటి అనే ఒక నిర్ణయానికి రాలేడు. ఎందుకంటే సమన్వయజ్ఞానం లేక. సమన్వయం అంటే పొందిక. ఈ ఉపనిషత్తు యిలా చెప్పింది, మరొక ఉపనిషత్తు మరొకలా చెప్పింది. ఈ రెండింటికీ పొందిక ఎలా కుదురుతుంది? అనే ప్రశ్న సామాన్యమానవునికి ఉద్భవిస్తుంది. దీనికి కేవలం పదపదార్థం తెలిస్తే చాలదు. వ్యాకరణం తెలిస్తే చాలదు. ఆ న్యాయపరిజ్ఞానం కావాలి.అందుకే వేదవ్యాసులవారు సమస్తమైనటువంటి వేదాంతాలకు సమన్వయంచూపిస్తూ అన్నింటికీ అద్వితీయమైన పరబ్రహ్మవస్తువునందే తాత్పర్యాన్ని చూపిస్తూ సూత్రములను వ్రాశారు. సూత్రము అనేటువంటి మాటకు అర్థం -

"అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతోముఖం
ఆస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదోవిదుః."

సూత్రం అంటే చాలా తక్కువ అక్షరాలతో వుండాలి. దాంట్లో సంశయానికి ఆస్కారం వుండకూడదు. అక్షరములు అంటే పదములు తక్కువగా వున్నా అర్థం మటుకు అతి గంభీరంగా వుండాలి; అతి విశాలంగా వుండాలి. ఆ సూత్రానికి ఎంత విస్తృతమైన వ్యాఖ్యానాన్ని చెయ్యటానికైనా ఆస్కారం వుండాలి. దాంట్లో నిరర్థకమైనటువంటి ఒక్క అక్షరం వుండకూడదు; మరి దాంట్లో ఆక్షేపణకు అవకాశం వుండేటటువంటి అర్థం వుండకూడదు. ఇన్ని లక్షణాలు వున్నప్పుడే అది "సూత్రం" అనిపించుకుంటుంది.

మనం సామాన్యంగా ఒక శ్లోకం వ్రాయవచ్చు, ఒక కావ్యం వ్రాయవచ్చు; దాంట్లో మనకు తక్కువ పదాలు వాడాలనే నియమం లేదు. మనం వ్రాసే కావ్యాలలో సందేహాలు ఎంతోమందికివచ్చే అవకాశం వుంటుంది. దాంట్లో గంభీరమైనటువంటి అర్థములేవీ వుండవు; వ్యర్థములైనటువంటి పదాలు ఎన్నో వుంటాయి; ఆక్షేపణలకు అవకాశాలు ఎన్నో వుంటాయి. ఈ వేటికీ తావులేనటు

వంటి వాటిని సూత్రములు అని మన పూర్వులు పరిభాషించారు. అంటే "సూత్ర ములు" అనే పారిభాషిక శబ్దాన్ని వాడారు. ఇటువంటి సూత్రములు-సూత్ర లక్ష ణములు కలిగి వుండేటటువంటివాటిని - ఆ వేదములకు సమన్వయం చూపేటటు వంటివాటిని వేదవ్యాస మహర్షులవారు అందించారు. కానీ కేవలం సూత్రముల వలననే వ్యాసులవారియొక్క హృదయాన్ని గ్రహించటం సామాన్యులకు సాధ్యం కాదు. అందువలన ఆసూత్రములకు వ్యాఖ్యానములు కావలసి వచ్చినాయి. వ్యాస భగవానులవారి సూత్రములు శంకరులవారికంటే పూర్వకాలమునందే ప్రచారంలో వున్నప్పటికీ వాటికి సమంజసమైనటువంటి అర్థమును తెలిపేటటువంటి గ్రంథం, పూర్వాపర సమన్వయాలను చక్కగా చూపించేటటువంటి గ్రంథం భగవత్పాద శంకరులవారి కాలంవరకు ఉత్పన్నం కాలేదు. శంకరాచార్యుల వారియొక్క భాష్యాన్ని ప్రశంసిస్తూ విద్యారణ్యులవారు"శంకరవిజయం"లో ఒక శ్లోకం చెప్పారు.

"విద్వజ్జాల తపఃఫలం శ్రుతివధూధమ్మిల్ల మల్లీస్రజం"

అంటే విద్వాంసులయొక్క తపఃఫలంగా వచ్చింది. అంటే నాటి విద్వాంసులు ఈ సూత్రజాలమునకు సమంజసమైనటువంటి వ్యాఖ్యానము వ్రాసే మహనీయుడు ఎప్పుడు ఉద్భవించునో, సూత్రములకు సమంజసమైనటువంటి అర్థం తెలుసుకునే భాగ్యం మనకు ఎప్పుడు కలుగుతుందో అని తపించారు. వారి తపస్సులకు ఫలి తంగా భగవత్పాదులవారి వ్యాఖ్యానం ఆవిర్భవించింది అని అంటారు. "శ్రుతి వధూ ధమ్మిల్ల మల్లీస్రజం"- వేదమాతయొక్క ధమ్మిల్లమునకు అంటే కొప్పునకు మల్లెపూవుల దండ వంటిది. ఎలాగైతే స్త్రీయొక్క కొప్పునకు పుష్పమాల అలం కారంగా వుంటుందో అలాగే వేదమాతయొక్క ధమ్మిల్లమునకు భగవత్పాదుల వారి భాష్యం మల్లికా పుష్పహారంవలె విరాజిల్లినది.

"వాగ్దేవీ చిరభోగ భాగ్యవిభవ ప్రాగ్భారకోశాలయం"

ఆ వాగ్దేవత యొక్క అదృష్టవిశేషంవల్ల యిటువంటి భాష్యగ్రంథం యొక్క నిర్మాణం జరిగిందని చెబుతూ -

"భాష్యం తే నిపిబంతి హంత న పునర్యేషాం భవే సంభవః"

అటువంటి భాష్యమును ఎవరైతే చక్కగా అధ్యయనం చేసి, దానిలో వున్నటు వంటి విషయాన్ని ఆకళింపుకు తెచ్చుకుంటారో, అనుభవానికి తెచ్చుకుంటారో

వారలకు మరల యీ సంసారమునందు ఉత్పత్తి అనునది కలుగదు. "భాష్యం తే నిపిబంతి హంత నపునర్యేషాం భవే సంభవః" అటువంటి మహాప్రభావం కలిగినటువంటిదని, వైశిష్ట్యపూర్ణమైనటువంటిదని, ఆ భాష్యమును విద్యారణ్యస్వామి వారు ప్రశంసించారు. అటువంటి భాష్యమును బాల్యమునందే రచించి, దానిని శిష్యులకు పాఠంచెప్పి, సర్వత్ర జనులకు ఆ అద్వితీయ ఆత్మతత్త్వాన్ని ప్రబోధం చేసినటువంటి మహనీయులు భగవత్పాద శంకరులవారు.

మనుష్యునకు కావలసిన ఆత్మగుణము లేవైతే వున్నాయో - "దయా సర్వభూతేషు", క్షాంతిః, అనసూయా, శౌచం, అనాయాసః, మంగళం, అకార్పణ్యం, అస్పృహ అనే ఎనిమిది ఆత్మగుణములు శంకరులయందు సర్వాంగీణంగా శోభించాయి. ఆయనకు వుండినటువంటి దయ అని అంటే నిరుపమానమైనటువంటిది. అతిబాల్యంలో ఉపనీతులై ఒక బీదబ్రాహ్మణ గృహమునకు భిక్షాటనకు వెళ్లిన సమయంలో ఆ గృహిణి యింటిలో ఏమీలేక కేవలం ఒక ఉసిరికాయను ఆయనకు జోలెలో పడవేసిన సందర్భంలో ఆమెయొక్క దారిద్ర్యాన్ని చూసి ఆయన మనస్సుకరగి, వెంటనే జగన్మాతయైన ఆ లక్ష్మీదేవిని ప్రార్థించటం, ఆతల్లి బంగారు ఉసిరికాయల వర్షాన్ని ఆ గృహములో కురిపించటం జరిగిన విషయాన్ని మనం "శంకరవిజయం"లో తెలుసుకుంటున్నాం.

అంటే ఆయనయొక్క మనస్సులో దయ ఎటువంటి సర్వాతిశాయిగా వుండెననటానికి యీ ఒక్క విషయం చాలు. క్షాంతిః అంటే ఓర్పు - ఆయనలో చూడాలి. ఆయనయొక్క శిరస్సును ఖండించటానికి ఒక కాపాలికుడు వచ్చినప్పుడు ఆయన సంతోషంగా వానికి అంగీకారము నిచ్చారట! ఎవరమన్నా యిస్తామా? ఎంత జాగ్రత్తగా వుంటాం మనం? కానీ ఆయనమాత్రం మీయొక్క శిరస్సు కావాలి అని ఒక కాపాలికుడు వస్తే మార్గం చూపారట! "నా శిష్యులెవరూ దగ్గర లేకుండా వున్నప్పుడు రా! అప్పుడు నీ పని నెరవేరుతుంది" అని. కాని ఈశ్వరసంకల్పం అలాలేదుకాబట్టి, ఆ కాపాలికుడు అత్యంత దుష్టమైన సంకల్పం కలవాడు కాబట్టి, అది ఈశ్వరునికి సహ్యం కాలేదు; ఆ కాపాలికుణ్ణి సంహరించి భగవత్పాదులవారిని ఆ నృసింహదేవుడు కాపాడాడు.

"అనసూయ" అంటే అసూయ లేకపోవటం. అంటే "అసూయ" అనే మాటకు అర్థం చెబుతారు - "పరోత్కర్ష అసహిష్ణుత్వం అసూయా" ఇంకొకరి

యొక్క అభివృద్ధి, మేలును చూసి సహించలేకపోవటం అసూయ. ఆ అసూయ లేకపోవటం అనసూయ. అంటే ఇంకొకనియొక్క ఉత్కర్షనుచూసి సంతోషించటం. భగవత్పాదులవారికి శిష్యుడుగా వున్నటువంటి హస్తామలకాచార్యుడు పన్నెండు శ్లోకములను, ఆత్మతత్త్వ ప్రతిపాదకములైనటువంటి శ్లోకములను చెప్పినప్పుడు ఆ శ్లోకములను చూచి మహా ఆనందపడి, అపారమైన సంతోషమును పొంది ఆ శ్లోకాలకు "నేను వ్యాఖ్యానం వ్రాస్తాను" అని వ్రాసినటువంటి అనసూయామూర్తి ఆయన. ఏమాత్రం అసూయాగంధం లేకుండా ఎక్కడ మంచివున్నా, ఎక్కడ ఉత్కర్షవున్నా, దానిని స్వీకరించాలి అన్న పాఠాన్ని జగత్తుకు చెప్పటానికి తన శిష్యుడైనటువంటి హస్తామలకాచార్యుడు చెప్పినటువంటి శ్లోకాలకు తాను భాష్యం వ్రాయటంద్వారా ఆ సందేశాన్ని జనానికి అందించారు.

ఇక ఆయనకున్నటువంటి "శౌచం" అంటే పావిత్ర్యాన్ని మనం చెప్ప వలసిన పనిలేదు. ఆయన పరిశుద్ధమైనటువంటి అంతఃకరణం, పరిశుద్ధమైనటు వంటి శరీరం కలిగిన వ్యక్తి.

"అనాయాసః" అంటే శరీరమును క్లేశపరచకుండా వుండటం. వారు ఆ విధంగా తపస్సు చేసినటువంటి మహానుభావులు.

"మంగళం" అంటే ప్రశస్తమైనటువంటి కర్మలను ఆచరించటం. ఆయన అప్రశస్తమైనటువంటి ఒక్కపనికూడా చేయలేదు. ఆవిషయంలో శంకర దిగ్విజయాన్ని చూస్తే ఎవరికైనా సందేహాలు రావచ్చు; కానీ ఆ సంశయములు నిర్హేతుకములు, అనుచితములు అనే విషయంకూడా శంకరవిజయంలోనే ఉత్తరత్రా ప్రతిపాదించారు. భగవత్పాదులవారి వాక్యాల్లోనే ఆ ప్రతిపాదనలు వున్నాయి.

"అకార్పణ్యం" అంటే లోభగుణం లేకపోవటం. కృపణః అంటే లుబ్ధుడు; కార్పణ్యం అంటే లోభం; అది లేకపోవటమే అకార్పణ్యం. ఆయనకు వున్నటువంటి ఔదార్యం చెప్పటానికి వీలులేదు. ఎవడు దేనిని అర్థించినాకూడా ఆయన కాదు అని అనలేదు. కాపాలికుని వంటివాడు ఆయన శిరస్సును అర్థించినా "కాదు" అని అనని ఆయన యిక దేనిని కాదనగలరు అని మనం వూహించుకోవాలి. దేనినీకూడా "నేను యివ్వను" అని ఆయన అనలేదు.

"అస్పృహః" అంటే దేనియందునూ కోరిక-ఆశ-అనేది లేకపోవటం. అస్పృహను ఆయనలో చూడాలి. కేరళలో రాజుగా వున్నటువంటి వ్యక్తి ఆయనకు, ఆయన బాల్యంలోనే మహిమలను గ్రహించి సంపత్తును పంపించాడు. "ఈ సంపత్తును నేను పంపిస్తున్నాను. ఈ గజములు, ఈ అశ్వములు, ఈ రథములు మీరు తీసుకోవాలి" అని రాజు పంపిస్తే - "మాకెందుకయ్యా-యీ సంపత్తు? మాకివేమీ అవసరంలే"దని "నిస్పృహస్య తృణం జగత్" అన్న నానుడిని సార్థకం చేసి చూపించారు. నిస్పృహుడైన వానికి త్రైలోక్యాధిపత్యం యిస్తానన్నాకూడా వాడు దానిని నిరాకరిస్తాడు, నాకు అక్కరలేదు అంటాడు. ఎందుకని? ఈ సంసారంలో ప్రతి ఒక్కటీకూడా భయహేతువైనదే! మరి అభయహేతువైనది ఏది అంటే "వైరాగ్యమేవ అభయం" అని అన్నారు. అందుకే ఒకచోట "విషయ భోగములను అనుభవించటమా, వైరాగ్యంతో వుండటమా అనే విషయాన్ని చర్చిస్తూ -

"న విషయభోగో భాగ్యం యోగ్యం కిల యత్ర
జంతుమాత్రమపి
బ్రహ్మేంద్ర రుద్ర మృగ్యం భాగ్యం విషయేషు వైరాగ్యం"

"న విషయ భోగో భాగ్యం" - విషయములను అనుభవించటం భాగ్యం అని అనుకోవద్దు. "యోగ్యం కిల యత్ర జంతుమాత్రమపి" తిర్యగ్జంతువులుకూడా విషయసుఖాన్ని అనుభవిస్తున్నాయి. దాన్నంతా మనం భాగ్యం అని అనవలెనా? మరి ఏది భాగ్యంఅంటే"బ్రహ్మేంద్ర రుద్ర మృగ్యం భాగ్యం విషయేషు వైరాగ్యం" బ్రహ్మేంద్ర రుద్రాదులకు కూడా మృగ్యం అంటే అన్వేషణీయం అంటే వెతకవలసింది, వాళ్లలోకూడా వున్నదా లేదా అని మనం వెతకవలసినదేదైతే వున్నదో-భాగ్యం-అది ఒక్కటే "విషయేషు వైరాగ్యం"- విషయములయందు వైరాగ్యమేదైతే వున్నదో "అదయ్యా! అసలు భాగ్యం - విషయభోగం కాదు భాగ్యం" అన్నారు పెద్దలు. దానికి లక్ష్యంగా ఆ శంకరులవారి చరిత్ర కనబడుతుంది. అటువంటి అపారమైన సంపత్తును అయాచితంగా - ఆయన తన యింట్లో తాను కూర్చుంటే ఆ రాజు పంపిస్తే దానిని తృణప్రాయంగా త్యజించారు.

ఈ విధంగా ఏవైతే ఆత్మగుణములు వుండవలసినవి మహాత్ములు చెప్పారో, ఆ ఆత్మ గుణములకు నిలయమైనటువంటి వారు - ఆచార్య శంకరులు.

కేవలం పాండిత్యం వుంటే చాలదు. ఆత్మగుణములు వుండాలి. కేవలం ఆత్మగుణములు వుంటే కాదు. పాండిత్యం కూడా వుండాలి. ఈ రెండింటియొక్క సమ్మేళనం భగవత్పాద శంకరులలో మనం చూడవచ్చు. ఆయనకు వున్నటువంటి పాండిత్య విషయంలో చెప్పేటటువంటి శక్తి మనకు లేదు. ప్రస్థానత్రయ భాష్యములను అవలోకిస్తే ఆయనకుండినటువంటి గంభీరమైన పాండిత్యం తేటతెల్లమవుతుంది.

ఆయనది కేవలం గుడ్డిగా చెప్పేటటువంటి సిద్ధాంతం కాదు. దేన్ని చెప్పాలన్నా కూడా అనేకమైనటువంటి ఉపపత్తులను చూపించి, దానిమీద రాగల ఆక్షేపణలను తామే యెత్తి, ఆ ఆక్షేపణలను ఖండించి, సిద్ధాంతాన్ని ప్రతిపాదించే వైఖరి భగవత్పాద శంకరులవారి భాష్యాలలో మనం చూడవచ్చు. వారియొక్క గీతాభాష్యం తీసుకోండి, ఉపనిషద్భాష్యం తీసుకోండి, సూత్రభాష్యం తీసుకోండి, మూడింటిలోకూడా వారు తమదైనటువంటి విశిష్టమైన రీతిని అవలంభించారు. ఎందుకని? వారికి ఆ సిద్ధాంతంలో వున్నటువంటి యాదార్థ్యం, హిమాచలం కంటె అప్రకంప్యమైనటువంటి విశ్వాసం నిరుపమానమైనటువంటివి. దాంట్లో ఏ మాత్రం సంశయంవున్నా, సంకోచం వున్నా, ఆవిధంగా పంక్తి వ్రాయటానికి అవకాశంవుండదు ఎందుకని? ఈ అద్వితీయ బ్రహ్మవాదం అనేటటువంటిది సకలవేదాంతములకు సమన్వయంచేసి చెప్పగల ఏకైకవాదం.

ఇక వేటిని మనం తీసుకున్నా అన్ని వేదాంతములకు ఏక వాక్యత చెప్పటం కష్టం. అనేకమైన వాదములు వేదాంత వాక్యములను పురస్కరించుకుని ప్రాదుర్భవించినవికదా అన్న ప్రశ్నకు వారు సమాధానం యిచ్చారు.

"అవును, వచ్చాయి". "వాక్యాభాస యుక్త్యాభాస సమాశ్రయాః సన్తః" ఎక్కడో మూలనున్నటువంటి ఒక్క వాక్యాన్ని తీసుకుని యీ వాక్యప్రతిపాదితమైనదే నా సిద్ధాంతమని చెప్పేవాడొకడు; మరొకమూలనున్న మరొక వాక్యాన్ని తీసుకుని తత్ప్రతిపాద్యమే నా సిద్ధాంతం అనేవాడు మరొకడు; మరెక్కడో మూలన వుండే ఒక వాక్యాన్ని తీసుకుని దానివలన నా సిద్ధాంతం వేదప్రతిపాద్యం అని అంటే - అది వానియొక్క సమన్వయలోపాన్ని చెబుతుందే తప్ప వాని ప్రతిభకు తార్కాణం కాదు. సమస్తమైన ఉపనిషద్వాక్యాలకు ఏక వాక్యతను

చూపించాలి అంటే అద్వితీయ బ్రహ్మవాదమే దానికి తగినదన్న విషయాన్ని, ఏదైతే భగవద్వేదవ్యాసులవారు చూపించారో, దాన్నే భగవత్పాదులవారు మనకు ప్రసాదించారు.

ఈ విధంగా పాండిత్యంలోగాని, ఆత్మగుణములలోగాని అద్వితీయమైన వ్యక్తి శంకరులు - అటువంటి శంకరులయొక్క చింతన చేయటం, వారు మనకు ఉపదేశించిన తత్త్వాన్ని మననం చేయటం మనకందరకూ అత్యంత ఆవశ్యకమైనది. శంకరభగవత్పాదులవారిలో వుండే మరొక వైశిష్ట్యం - వారు కేవలం తాత్త్వికులే కాదు - వారు మహా కవులు - అంతే కాదు - వారు మంత్రశాస్త్రంలో నిష్ణాతులు. వారి ప్రతిభ బహుముఖమైనది.

మంత్రశాస్త్రంలో వారికి వున్న వైదుష్యం, వారి ప్రతిభ - వారు రచించిన "ప్రపంచసారతంత్రం" అనే గ్రంథంలో మనకు స్పష్టంగా తెలుస్తుంది. ఆ "ప్రపంచసారతంత్ర" గ్రంథానికి వారియొక్క శిష్యులైన పద్మపాదాచార్యులవారు వ్యాఖ్యానంకూడా వ్రాశారు. అదేవిధంగా వారికివున్న కవితాశక్తికూడా నిరుపమానమైనదనే విషయాన్ని మీరందరూకూడా తెలిసికొనే వుండవచ్చు.

ఈ విధంగా సర్వాతిశాయి ప్రతిభాసంపన్నులైన శంకరభగవత్పాదాచార్యులవారి విషయంలో ఉపన్యాసమాలికను ఏర్పాటుచేయవలెనని "యువభారతి" వారు సంకల్పించిన విషయం ప్రమోదావహంగా వున్నది. అందులో వారు రచించిన "ప్రపంచసారతంత్రముమీద యీ రోజు మా ప్రియశిష్యులైన తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారితో ఉపన్యాసం చేయించాలని మీరు సంకల్పించింది చాలా సంతోషం. శ్రీ రామలింగేశ్వరరావుగారు మా పరమగురువులవారియొక్కయు, మా గురువులవారియొక్కము విశేషమైన కృపను సంపాదించినవారు. మాకు విశేషమైన ప్రీతికిపాత్రులైనవారు. వారు శ్రీ విద్యావిషయంలో భూరిపరిశ్రమ చేశారు. "ప్రపంచసారతంత్రం" మీద వారితో ఉపన్యాసం చేయించండి అని నేను "యువభారతి" వారికి సూచనచేశాను. తదనుసారంగా మీరు "ప్రపంచసారతంత్రం" విషయంలో యీరోజు ఉపన్యాసం వింటారు.

మీరు తలపెట్టినటువంటి భగవత్పాద శంకరుల "జగద్గురు సాహితీ లహరి" ఉపన్యాసమంజరీ కార్యక్రమం నిర్విఘ్నంగా నెరవేరి సకల ఆస్తికజనుల యొక్క భావములు, సకల ఆస్తికజనులయొక్క మనములు భగవత్పాద శంకరుల వారి విషయంలో కేంద్రీకృతం కావాలని నేను ఆశిస్తూ "మీయొక్క యీ కార్యక్రమములు నిర్విఘ్నంగా కొనసాగుగాక" అని మరొక్కమారు ఆశిస్తూ యీరోజు యీ కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్నాను.

"హర నమః పార్వతీపతయే హరహర మహాదేవ
జానకీ కాంత స్మరణం జయ జయ రామ రామ"

o....o....o

-ఇతి శివమ్-

శ్రీ శ్రీ గురవే నమః

# శ్రీ శంకర భగవత్పాదాచార్యుల వారి ప్రపంచ సార తంత్రము

శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

మనదేశం అతిపురాతనమైన నాగరికత, సంస్కృతి కలిగినది. ఇవి మానవజాతి చరిత్రలోనే గొప్పగా పరిగణింపబడుతున్నాయి. మానవజాతియొక్క తాత్త్విక చింతనాభావాలను సర్వోత్కృష్టమైన స్థితికి చేర్చినవారు శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు. అందుచేతనే ఆయనను - **The fairest flower of philosophy and religion, that any country in any age has produced where human thought attains its highest expression and even goes beyond the mystery which seems to be impenetrable'** అని యావత్తు ప్రపంచం కీర్తించింది.

శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు రచించినట్లుగా భావింపబడుచున్న తంత్రశాస్త్రగ్రంథము "ప్రపంచసార". తంత్రము అనగా శాస్త్రమని అర్థము. "తన్యతే విస్తార్యతే జ్ఞానం ఇతి తంత్రః" అనగా జ్ఞానమును విస్తరింజేయునట్టిదని వ్యుత్పత్తి భావము. తత్త్వమును, మంత్రార్థమును విస్తరింపజేయునట్టిదికూడ తంత్రమే. తంత్రమునకు త్రాణమొనరించున దను వ్యుత్పత్తికూడ కనుపించుచున్నది. తంత్ర నిర్వచనమున ప్రసిద్ధోక్తిగా (1) జ్ఞానము అనగా తత్త్వసిద్ధాంతములు, (2) యోగము అనగా ధ్యానవిధానము (3) క్రియ అనగా కర్మవిధానము (4) చర్య అనగా ప్రవర్తన (సాంఘిక విధులను గురించిన ఉపదేశములు) ఈ నాలుగునకు, వీటిని బోధించు గ్రంథమునకు తంత్ర మని పేరు వచ్చినది. వారాహీ తంత్రమున సృష్టి ప్రళయ, దేవతా నామార్చన, సాధన, పురశ్చరణ, షట్కర్మ, ధ్యానయోగము అను ఏడును తంత్రగుణములని యున్నది.

తంత్రములకు ఆగమములనికూడ పేరున్నది. భోగ మోక్షములకు ఉపాయములను బోధించుటవలన ఆగమములని-ఆగతాన్ శంభువక్త్రేభ్యః గతాంచ గిరిజాముఖే మతంచ వాసుదేవేన తస్మాదాగమ ఉచ్యతే - ఆగమద్వైత నిర్ణయ.

వేదములు నిగమములు. అవి భక్తి (ఉపాసన) జ్ఞానకర్మములయొక్క రూపములను తెలుపుచున్నవి. ఆగమము లనబడు తంత్రములు వాటికి సాధనోపాయములను నిరూపించుచున్నవి. కృత యుగమువారికి దేవాచారము, త్రేతా యుగమువారికి స్మార్తాచారము, ద్వాపర యుగమువారికి పురాణాచారము, కలి యుగమువారికి ఆగమాచారము అని ఒక అభిప్రాయము. మన నిత్యాచరణము నందుగల వ్రతము లన్నియు ఆగమ సంబంధములే. వేదములు ఈశ్వరముఖ సంభూతములుకాగా, ఆగమములు వేదముఖ సంభూతములని మహాభారత శాంతి పర్వమునందు కలదు.

దేవతంత్రములని పిలువబడే బ్రాహ్మణతంత్రములుగాక, బౌద్ధతంత్రములు, జైనతంత్రములు కూడ కలవు.

శ్రీ శంకరభగవత్పాదులవారు రచించిన "ప్రపంచసార" తంత్రమును తొలుత శ్రీరంగము వాణీవిలాస ముద్రణాలయము వారు శ్రీ శృంగేరీ జగద్గురు సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ మహాస్వామి చరణులకు అంకితముగా శ్రీ శంకర గ్రంథావళిలో 19, 20 సంపుటములుగా ప్రకటించిరి. దీనినే 1914లో కలకత్తా తాంత్రిక్ గ్రంథావళిలో ప్రకటించిరి. శ్రీరంగము వాణీవిలాస ప్రెస్సు వారి గ్రంథమునందున్న 33 పటలముల గ్రంథమే కలకత్తా వారి గ్రంథమున 35 పటలములుగా వచ్చినది. అయితే కలకత్తావారి గ్రంథములో గుప్త పటలమని మరియొక పటలము - మొత్తము 36 పటలములు - కలవు.

ప్రపంచసార - తంత్రమే - లేక తాంత్రికశాస్త్ర సంబంధ గ్రంథమా అని వివాదము కలదు. "శారదాతిలక" "శాక్తానందతరంగిణి" వంటివి తంత్ర శాస్త్ర సంబంధ గ్రంథములేగాని తంత్రగ్రంథములు కావు. తంత్రసార అను గ్రంథముకూడ నట్టిదే. అయితే తంత్రగ్రంథముగా చెప్పుటకు బలమైన హేతువు లున్నవి. దీనియందున్న తాంత్రికభూతశుద్ధి, త్రిపురవిద్యా వివరణము, జప, బీజ, యంత్ర, ముద్రా విషయములు దీనిని తంత్రగ్రంథ మని రూఢిచేయుచున్నవి.

మరియు నిది శివావతారమైన శ్రీ శంకరభగత్పాదులచే రచించబడిన దగుటచేత "తంత్రమని" అంగీకరింపవలసి వచ్చుచున్నది. శ్రీ శంకరభగవత్పాదులవారిచేత గాక మరొక శంకరునిచే రచింపబడినచో తంత్రమనిచెప్ప వలనుపడదు. తాంత్రిక వాఙ్మయమున మరికొందరు "శంకరులు" తారసిల్లుచున్నారు. వాసనాతత్త్వబోధిని కర్తయైన శంకరు డొకడు షట్చక్రనిరూపణ వ్యాఖ్యాతయైన శంకరుడు మరి యొకడు.

"ప్రపంచసార" తంత్ర రచయిత శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారే నని పెక్కుమంది పూర్వవ్యాఖ్యాతలు అంగీకరించినారు. లక్ష్మణాచార్య విరచిత మైన "శారదా తిలక" మన్న ప్రసిద్ధ మంత్రశాస్త్ర గ్రంథమునకు భాష్యమును రచించిన "రాఘవభట్ట" - షట్చక్రనిరూపణమన్న గ్రంథమునకు వివరణము వ్రాసిన "కాశీచరణ" షట్చక్రవివృతి" అను గ్రంథమున విశ్వనాథ మొదలగువారు పెక్కుమంది శ్రీ శంకరభగవత్పాదులే దీనిని రచించెనని ముక్తకంఠముతో చెప్పు చున్నారు.

ప్రపంచసార తంత్రమునకు పెక్కు వ్యాఖ్యానములు వచ్చినవి. ఈ వ్యాఖ్యాతలందరు దీనిని శ్రీ శంకరభగవత్పాద విరచితమని ధృవీకరించిరి.

శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారికి ప్రత్యక్షశిష్యులైన పద్మపాదా చార్యులు "ప్రపంచసార తంత్రము"నకు "వివరణ" మన్న వ్యాఖ్యానమువ్రాసెను. అది నేడు లభించుచున్నది. పద్మపాదాచార్యుల వారీ గ్రంథమునకు వివరణము వ్రాయుచు, తమ గురువు లీ గ్రంథమును రచించిరని చెప్పుటకన్న వేరేమి ప్రమా ణము కావలయును? పద్మపాదాచార్యులవారి వివరణమునకు "ప్రయోగ క్రమ దీపిక" అన్న వృత్తిగ్రంథ మొకటి అసంపూర్తిగా లభించుచున్నది. దీని కర్త పేరు తెలియదు. "విజ్ఞానచంద్రిక" యన్న వ్యాఖ్యాన మొక్కటి కలదని రాఘవ భట్ట ఉదహరించెను. అది నేడు లభించుటలేదు. ఉత్తమబోధ అనునతడు రచిం చిన సంబంధదీపిక యన్నది మరియొక వ్యాఖ్యానము. లక్ష్మణాచార్య రచించిన శారదాతిలక గ్రంథమునకంటె యీ సంబంధదీపిక ఆధునికమైనది. లక్ష్మణాచార్య క్రీ॥శ॥ పదియవ శతాబ్దము వాడు.

ప్రపంచసార తంత్రము.

"గీర్వాణేంద్ర సరస్వతి" రచించిన ప్రపంచసార సంగ్రహ మన్నది మరియొకటి. గీర్వాణేంద్ర సరస్వతి తన గ్రంథమున సత్సంప్రదాయ సర్వస్వ మన్న వేరొక వ్యాఖ్యానగ్రంథమును చూచితినని వ్రాసెను.

మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయమున తొమ్మిది వ్యాఖ్యానముల వ్రాతప్రతులున్నవి. అవి ప్రపంచసార వ్యాఖ్య, నారాయణ కృత ప్రపంచసార దీపిక, నాగస్వామి కృత తత్త్వదీపిక, నిత్యానంద కృత ప్రపంచసార గూఢార దీపిక, విజ్ఞానద్యోతిని, ప్రపంచసార వివృతి, ప్రపంచసార ప్రయోగవిధి, ప్రపంచ సార సంబంధ టీక, ప్రపంచసార వృత్తి అనునవి. తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునకూడ కొన్ని ప్రపంచసారతంత్ర వ్యాఖ్యానములున్నవని తెలియు చున్నది. వాటి వివరములను సంపాదించుటకు వ్యవధి చాలలేదు.

ఇంతమంది సాధకులు, విద్వాంసులు, మంత్రశాస్త్ర పారంగతులు - ప్రపంచసార తంత్రము శ్రీ శంకరభగవత్పాదులవారి కృతమని విశ్వసించినారు. నేపాలు రాజ్యమున లభించిన ప్రపంచసార వ్రాతప్రతియందు ఇది ఆచార్యపాదుల కృతమనియే కలదు.

ఇంతకు ముందే ఉదహరించిన రాఘవభట్ట మొదలగువారును, ప్రపంచ సారతంత్ర వ్యాఖ్యాతలును మాత్రమేగాక - మంత్రశాస్త్ర పారావారపారంగతుడై మిక్కిలి ప్రసిద్ధుడైన భాస్కరరాయ, సూతసంహిత వ్యాఖ్యాతయైన మాధవాచార్య. దేవీభాగవత వ్యాఖ్యాతయైన నీలకంఠ మొదలగువారు పెక్కుమంది మంత్రశాస్త్ర నిష్ణాతులు, న్యాయదార్శనికులు, ప్రపంచసార తంత్ర కర్తృత్వము శ్రీ శంకర భగవత్పాదులదే యనుటలో సంశయము లేదనిరి.

నిర్గుణ పరబ్రహ్మానుసంధానమును ప్రవచించు అద్వైత సిద్ధాంత ప్రచా రకుడైన శ్రీ శంకర భగవత్పాదులీ మంత్రశాస్త్ర గ్రంథమును వ్రాయుటపొసగునా యన్నది కొందరికున్న సందేహము. అద్వైత సిద్ధాంత ప్రవర్తకుడగు శ్రీ శంకర భగవత్పాదులవారు "సాధన" చేయవలయునని చెప్పు గ్రంథ మేదిగాని వ్రాసి యుందురా? అని వారి బాధ. సాధన అనగానే ద్వైతవాసన గుబాళించుచున్నది కదా? సాధింపవలసిన వస్తువు మరొకటి వున్నది కదా? ఇవి వీరికి పట్టిన బాధలు. ఆధునిక విశ్వవిద్యాలయములలో తాత్త్విక శాఖాధ్యక్షులవలె శ్రీ శంకరభగవ

త్పాదులు అద్వైత సిద్ధాంతమును ప్రవచించుచు - జర్మను లేక ఐరోపీయ తాత్త్విక చింతనాపరులవలె - సిద్ధాంతీకరించుచు, అతిలోక విషయములపై ఊహాజల్పనము చేయుచు నుండునని వీరి భావన.

ఇట్టి భావనలకు కారణ మేమనగా వీరు భారతీయ మానసికస్థితిని కోల్పోయి యుండుట. శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు భారతీయ జీవన పద్ధతిని మలచినట్లుగా పాశ్చాత్య తాత్త్వికులెవరును వారి దేశీయుల జీవితములపై ప్రభావముద్ర చూపినవారు కారు. శ్రీ శంకరభగవత్పాదాచార్యులకంటె తక్కువ వారైన యితరశాఖాసిద్ధాంత ప్రవర్తకులు నెఱపిన ప్రభావమంతకూడ పాశ్చాత్య తాత్త్వికసిద్ధాంతులు జీవితపద్ధతిపైన ప్రభావము చూపనే లేదు.

శ్రీ శంకర భగవత్పాదులు - కేవలము సిద్ధాంతప్రవర్తకులు మాత్రమే కాదు. ఆయన గురువు. జగద్గురువు. తన సిద్ధాంతమును అనుసరించు వారి మేధస్సును ఉన్నతస్థితికి లేవనెత్తి వెలుగుచూపుట మాత్రమేకాదు. - ఆయన సాధకుని స్వభావమును - నిత్యజీవిత విధానమును కూడ ఉన్నతస్థాయికి లేవనెత్తి దివ్యము - దివ్యతరము చేసిన మహనీయుడు.

ఆయన చతుర్దిక్కులందు చతురామ్నాయ పీఠములను స్థాపించినది అచ్చట బ్రహ్మసూత్రముల భాష్యమును, ఉపనిషద్భాష్యమును పఠనపాఠములు చేయుటకు మాత్రమే కాదు. సాధనచేత వేదాంతమునందు చెప్పిన ఆనందమును అనుభవసిద్ధము చేసికొనుటకు. చతుర్మహావాక్య వివృత బ్రహ్మకైవల్యస్థితిని సిద్ధముచేసికొను మార్గమైన సాధనయే-శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు ప్రపంచ సార తంత్రమునందు ప్రబోధించిరి.

మంత్రశాస్త్రమున - తాంత్రిక ఆగమ వాఙ్మయమున శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారికున్న సర్వోత్కృష్ట ప్రామాణికతను పూర్వకాలమున విద్వాంసులందరు సాధకులందరు మిక్కిలి గౌరవించిరి. శిరసావహించిరి. తర్కకర్కశ మార్గదృష్టి కలిగిన భాస్కరరాయలు కూడ తన చండీసప్తశతి వ్యాఖ్యానమునందు శ్రీ శంకరభగవత్పాదులకు ఆయన శిష్యచతుష్టయమునకు నతులు చేసి గ్రంథారంభము చేసెను.

శ్లో॥ శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదంచ హస్తామలకంచశిష్యం
తం తోటకం వార్తికకార మన్యానస్మద్గురూన్
సంతతమానతోఽస్మి॥

శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు గురువులకు గురువు. జగద్గురువులకు గురువు. ఈనాడు శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారిని గురించి వ్రాయుచు విద్వాంసుల మనుకొనుచున్నవారిలో అధికసంఖ్యలో నున్నవారికి శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు పూర్తిగా అవగాహన కాలేదు.

భారతీయులకు వేదాంతము కేవల మొక ఊహాప్రబల సిద్ధాంతము మాత్రమే కాదు. భారతీయుల నిత్యజీవితమున పడుగుపేకలుగా కలసిపోయినదది. తంత్రశాస్త్రము సాధనశాస్త్రము. దాని ప్రయోజన మేమనగా పరమసత స్థితిని చేరుట. పరమమైన సత్యము నిర్గుణమైనది, అఖండమైనది అనాద్యంతమైనది - సచ్చిదానందమైనది. పరబ్రహ్మము. సాధనామార్గమున సాధకుడు తొలుత గురువు అనుగ్రహముచేత మంత్రోపదేశమును పొంది సాధనచేయవలెను. మంత్రపురశ్చరణాది విధానములు నిర్ణయింపబడినవి. ఆప్రకారము చేయవలెను.

మన మతముగాని, మన మంత్రశాస్త్రముగాని - విభిన్న దేవతల - విభిన్న భావముల - కూటమి కాదు. విభిన్న సాధనామార్గముల లక్ష్యమొక్కటే. ప్రతి సాధకుని మనస్వితనుబట్టి - సంస్కారమునుబట్టి - అధికార యోగ్యతనుబట్టి వారి వారి సాధనామార్గములు - ఇష్టదేవతలు-ఉపాసనావిధానములు. ఈ ఉపాస్య దేవతావిధానములు ముఖ్యముగా అయిదు విధములు. శివ, విష్ణు, శాక్త, సౌర, గాణాపత్యములు. సుబ్రహ్మణ్యా మన్నదికూడ కలుపుకొని షణ్మతములన్న దొక అభిప్రాయము. ఈ అయిదింటియందు మరల నెన్నియో శాఖలు. ఉపశాఖలు. ఈ అయిదు ఉపాసనా విధానములను ప్రపంచసార తంత్రము విశదీకరించినది. ఇట్లు విభిన్నమార్గములను సమన్వయముచేసి - ఏకలక్ష్య ఏకవాక్యత నిరూపించిన ప్రప్రథమ మంత్రశాస్త్రగ్రంథము ప్రపంచసార తంత్రమే. ఆ తరువాత మరి కొందరీ మహామహుని అడుగుజాడలలో పయనించి గ్రంథములను రచించిరి. అట్టి వారిలో లక్ష్మణ దేశికేంద్ర, ఈశానశివ, కృష్ణానంద మొదలగువారు గణింప తగినవారు.

గురువుచేత ఉపదేశింపబడిన మంత్రము, దాని అధిష్టానదైవము - అధిష్టానదైవమును వర్ణించు ధ్యానశ్లోకము గమనింపవలయును. ఉపదేశము పొందిన మంత్రాధిష్టానదైవము స్వకీయబ్రహ్మమూర్తి. ఆమూర్తిపై లక్ష్యముంచి సాధకుడు బ్రహ్మసిద్ధిని పొందును. ఆమూర్తి తురీయము కాదు. "ఆదిత్యం అంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరమ్" - ఈ పంచాయతన దేవతలు - మరల - ఆయామూర్తి భేదములు - అన్నియు బ్రహ్మముయొక్క చిహ్నములే. సాధకుని అధికార యోగ్యతనుబట్టి ఇష్టదేవతారూపకల్పన. "సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా" సాధకుడు స్థూలమునుండి సూక్ష్మమునకు - ఆపైన కేవలబ్రహ్మము యొక్క పరానంద స్థితికి ప్రగతి కావించును.

హైందవమని నేడు చెప్పబడుచున్న మతమునందున్న భిన్న సాధనా మార్గములన్నియు వేదాంతసిద్ధాంతమునందు పర్యవసించుననియు - సప్తకోటి మహామంత్రములన్నియు పరబ్రహ్మసిద్ధినే లక్ష్యముగా కలవనియు నిరూపించునట్టి ఏకైక ప్రమాణ గ్రంథము శ్రీ భగవత్పాదుల ప్రపంచసార తంత్రము.

భిన్నభిన్న మంత్రములయొక్క పురశ్చరణమువలన బ్రహ్మానుభవ లాభమెట్లు కలుగునని సందేహము కలుగవచ్చును. సామాన్యులకు పరమాశ్చర్యము కలిగించు విషయమేమనగా - యీ మహామంత్రము లన్నియు - "పరబ్రహ్మ" ప్రతిపాదకములే. చతుర్మహావాక్య వివృతి చేయునవే. "బ్రహ్మాహమస్మి" అన్న బ్రహ్మానుసంధాన రూపములే.

ఉదాహరణకు శివపంచాక్షరీ మహామంత్రమును తీసికొందము. ఈ "నమఃశివాయ" మంత్రము మిక్కిలి ప్రసిద్ధమైనది. పద్మపాదాచార్యులవారు శివ పంచాక్షరీ మహామంత్రమునకు తొమ్మిది విధములుగా వివరణము రచించిరి.

మొదటి వ్యాఖ్యానము :

త్యాగోహి నమసోవాచ్యః ఆనందః ప్రకృతేస్తదా।
ఫలప్రత్యయ వాచ్యంస్యాత్, త్యాజ్యం పత్రఫలాదికమ్
త్యజామీద మిదం సర్వం చతుర్ణామిహ సిద్ధయే॥

నమశ్శివాయ మంత్రములో నమశ్శబ్దమునకు త్యాగమని అర్థము. శివ శబ్దమునకు ఆనందమని, ఆనందముచేత ఉపలక్షితములైనట్టి ధర్మార్థ కామ మోక్షములన్న

చతుర్విధ పురుషార్థములని అర్థము. "శివాయ" అనుటలో చతుర్థీవిభక్తి ప్రత్యయమైన "య" పదమునకు "ఫలము" అనగా వాంఛితమైన వాంఛ అని అర్థము. సమష్టి తాత్పర్యమేమనగా ఆనందము ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ సిద్ధియు లభించుటకై చేతితో గ్రహింపబడిన గంధ పుష్ప పత్ర ఫలాదులను, నైవేద్యమును - అనాదిగా స్వీకరింపబడిన బుద్ధి మొదలగు అనాత్మప్రపంచమును శివునకు సమర్పించుచున్నానని.

"నమః" శబ్దమునకు త్యాగము, సమర్పణ అను అర్థము శ్రుతులందు కన్పించుచున్నది. "ఏతద్వోన్నం సోపకరణం నమః" అని వైదిక కర్మకాండ యందు ప్రసిద్ధమైన వాక్యము. ఈ వాక్యమునకు "ఉపకరణములతో కూడిన యీ అన్నమును మీకు సమర్పించుచున్నానని అర్థము.

శివ శబ్దమునకు ముఖ్యముగా ఆనందమని అర్థమైనప్పటికి చతుర్విధ పురుషార్థములలో వర్గత్రయమైన ధర్మార్థ కామములను కూడ సూచించుటచేత - నాలుగు పురుషార్థములను సూచించుచున్నట్లే చెప్పవలెను. "త్యజామీద మిదం సర్వం" అనుటలో రెండుపర్యాయములు "ఇదమ్" అనుట - పూజాసమయమున హస్తమునందున్న పత్రఫలపుష్పాది పూజాద్రవ్యములనిన్నీ - అనాదిగా వెంట నున్న బుద్ధి దేహేంద్రియాది అనాత్మపదార్థమనిన్నీ - వీటిని త్యజించుట వలన నిష్కామకర్మవలన క్రమముక్తి సాధనమగుచున్నది. అనిత్యమగు బుద్ధిదేహేంద్రియాదుల సమర్పణమువలన నిత్యసత్యమగు ఆత్మనే గ్రహించినట్లగుచున్నది.

ద్వితీయ వ్యాఖ్యానం :

అథవా నమసోవాచ్యః ప్రణామో దైన్య లబ్ధయే
దైన్యం సేవా తథాజ్ఞప్తిః సిద్ధిః సర్వస్య వస్తునః
నమామి దేవదేవేశం సకామోఽకామ ఏవ వా॥

తాత్పర్య మేమనగా పరమభక్తి లభించుటకొరకు, పరమాత్మయొక్క సేవాప్రాప్తి కొరకు జ్ఞానలాభముకొరకు వినయముతో (సాష్టాంగప్రణామము) శివునికి నమస్కరించుచున్నానని-కోర్కెలతో నున్నవాడనైనను, కోర్కెలు లేనివాడనైనను.

నమస్కరించుటకు ఫలము దైన్యమట. దైన్యమనగా సేవ (భజ సేవయాం) జ్ఞానము, సర్వవస్తుసిద్ధి అని అర్థములు. సకామముగా చేసిన నమస్కా

రమునకు ఫలము సేవ. భక్తి మరియు సర్వవస్తుసిద్ధి.ఐహికాముష్మికము.స్వచ్ఛంద నాది బ్రహ్మలోకాంత సకలైశ్వర్యసిద్ధి. నిష్కామ నమస్కారమునకు ఫలము. జ్ఞానము. అనగా ఆత్మసాక్షాత్కార రూపమోక్షము. సకామ, నిష్కామ నమస్కారములకు - భక్తి, సర్వవస్తుసిద్ధి, ఆత్మజ్ఞానము - ఫలములు.

"ణమ" అను ధాతువునకు అణగియుండుట అను అర్థముండుటవలన యీ ధాతువునకు భావార్థమున "సున్"అను ప్రత్యయము చేరి నమస్ అయినది కాబట్టి నమశ్శబ్దమునకు అర్థము అణకువతో నమస్కరించుట యన్నది.

భగవంతునికి నమస్కరించుట వలన అనంత పుణ్యలాభమని స్మృతి వాక్యము. "ఏకోపి కృష్ణస్య కృత ప్రణామో దశాశ్వమేథావభృథేన తుల్యః"

దైన్యము-అనగా సేవ మొదలగునవి-కలిగినవానియందు భగవంతునికి కృప కలుగునని నింబార్కాచార్యులవారు ఆయన రచించిన దశశ్లోకి యందు చెప్పిరి.

కృపాస్యదైన్యాది యుజిప్రజాయతే
యయాభవేత్ ప్రేమవిశేషలక్షణా॥

తృతీయ వ్యాఖ్యానము :

నఞానిషిధ్యతే భావవికృతిః జగదాత్మనః
మననం దేవదేవేశనేహ నానా స్తిశబ్దతః
అయేతి గమయేత్యర్థే తస్మాచ్ఛుద్ధోస్మి నిత్యశః
ప్రణామో దేహగేహాదేః అభిమానస్య నాశనమ్॥

దీని తాత్పర్య మేమనగా - "ఓయి శివా! దేవదేవేశా! పరిణామరహితా! నమస్కారము. నీకు ప్రణామము చేయుటవలన నేను అభిమానరహితుడనైనాను. నాకు ఆత్మజ్ఞానమునొసగి నన్ను పరిపూర్ణ రసస్వరూపుని చేయుము" అని.

నమః శివాయలోని నఞ్ అను అవ్యయము జగదాకాశ దేహాంతఃకరణాదుల భావము రూపవికారము ఈశ్వరునికి లేదని చెప్పుచున్నది. వేదము

నందీ యర్థమే వెల్లడియగుచున్నది. శివునికి చేసిన ప్రణామము దేహాది సర్వ భువనాభిమానమును, అహంకార మమకారములను నిశ్శేషముగా నాశనము చేయు చున్నది, అట్టి నాశనమువలన ఆత్మసమర్పణ కలుగుచున్నది. అభిమానద్వయము పోగొట్టుకుని నీ భక్తుడను, నిర్మలుడను, పరిశుద్ధుడను. నీకు ప్రణతిచేయుచున్న నన్ను నీలో చేర్చుము. నీ అపరిణామరూపమును నాకిమ్ము. ఇది భావము.

"నమః" అని సంబోధమున పరిణామములేనివాడా అని అర్థము వచ్చుటకు వివరణ మేమనగా : మసీ అనుధాతువు దివాది గణమున నున్నది. పరిణామమని దాని అర్థము. న + మస్ అని విడదీయగా న అను అవ్యయమునకు నిషేధము అర్థము. "నమస్యతి" మార్పు పొందదు అను అర్థమున క్విప్ ప్రత్యయముచేర్చగా నమః శబ్దము వచ్చును.

చతుర్థ వ్యాఖ్యానము :

చతుర్థ వ్యాఖ్యానమునందు మూడు తెరగులున్నవి.

మొదటి పద్ధతి :

శివో బ్రహ్మాది రూపస్స్యాత్ శక్తిభిస్త్రిసృభిస్సహ
అథవాతుర్యమేవస్యాత్ నిర్గుణం బ్రహ్మతత్పరమ్।
నమసోనమనేశక్తిః నమనం ధ్యానమేవచ
చతుర్థ్యా అభేదసంబంధః కథ్యతే ప్రత్యగాత్మనో॥

శివుడైన పరమాత్మ తన మాయాగుణములచేత బ్రహ్మ విష్ణు రుద్ర రూపధరుడగుచున్నాడు. కావున ఆ త్రిమూర్తులకంటె శ్రేష్ఠుడు. ఆ త్రిమూర్తులు పరమాత్మయగు శివున కధీనులు. ఈ రూపముయొక్క ఉపాసనము సగుణోపా సనము. ప్రకారాంతమున శివశబ్దమునకు నిర్గుణ పరబ్రహ్మమగు తురీయ మన్న అర్థమున్నది. కావున శివోపాసన సగుణ నిర్గుణోపాసనోభయము. నమన మనగా నిధిధ్యాస. శివాయలోని చతుర్థీవిభక్తి యగు "య" జీవ పరమాత్మల కైక్యమును తెలుపుచున్నది. నిర్గుణోపాసన వలన శివైక్యము ఫలితార్థము.

త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు రుద్రులు శివాంశ సంభవులని, శివుడు పరమాత్మ యని, ఆ పరమాత్మ సృష్టి స్థితి లయ హేతువులగు త్రిమూర్తుల కతీ

తుడని, శ్వేతాశ్వతర ఉపనిషత్తు ప్రమాణము. "తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్.

నిర్గుణమైన తుర్య బ్రహ్మపరముగా శివశబ్దము లక్షణావృత్తిచేత నిరూపించును. మాండూక్య ఉపనిషత్తులో "ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే న ఆత్మా స విజ్ఞేయః" అని పాఠము.

"నమసోనమనే శక్తిః". ఇది నమశ్శబ్దార్థము చెప్పను. నమశ్శబ్దమునకు నమ్రత వాచ్యార్థము. ధ్యానమనునది లక్ష్యార్థము. ధ్యానమనగా నిధిధ్యాసనమే.

శివాయ-ఇది తాదర్థ్యే చతుర్థి. దానికొఱకై అన్న అర్థమునందువచ్చు చతుర్థీప్రత్యయాంత శబ్దము. శివార్థము - అనగా ప్రత్యగాత్మ తాదాత్మ్యలాభము కొరకు అని భావము.

## రెండవ పద్ధతి :

అహం శివశ్శివోహం చ మన్యే వేదాంత నిష్ఠయా,
ఇత్యేవం నమ ఇత్యుక్తం వేదైశ్శాస్త్రైశ్చ సర్వశః॥
అథవా దాస ఏవాహం అహం దాస ఇతీరణం।
ఇత్యేవం నమ ఇత్యుక్తం వేదైశ్శాస్త్రైశ్చ సర్వశః॥

ఉపనిషత్తులలో నున్న చతుర్మహా వాక్యములందున్న "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" అను వాక్యముల ననుసరించి నేను శివుడను అనియు ధ్యానింతును అనియు తాత్పర్యము. ఇచట నమః శబ్దమునకు ధ్యానింతును అని అర్థము. అనగా నిధి ధ్యాసనమును చెప్పను. ఇది ఉత్తమాధికారులకొఱకు.

మందాధికారుల విషయమున - దాసుడనే యైన నేను - లేక - నేను దాసుడనై శివునకు నమస్కరించుచున్నాను అని భావము. ఇచ్చట నమశ్శబ్దమునకు నమస్కారమని అర్థము.

నమశ్శబ్దమునకు ధ్యానమని చెప్పుటకు ఉపనిషత్తులందు పెక్కు ఆధారములున్నవి.

మూడవ పద్ధతి :

అథ వేద మిదం సర్వం త్యజామి పరమాత్మనే।
అర్థం ధర్మంచ కామంచ వాంఛంచ జగదీశ్వరమ్॥
ఏతన్మంత్రార్థ తత్త్వజ్ఞైః వేదవేదాంత తత్పరైః।
నిర్ణీతం తత్త్వగర్భం యత్ విజ్ఞేయం ముక్తి లబ్ధయే॥
అథవా ముక్తిలాభాయధ్యేయంతత్త్వం వివేకతః।
భిన్నం బుద్ధ్వా హృదాదేవం మంత్రణేశం జగద్గురుమ్॥

ఇచ్చటకూడ నమశ్శబ్దమునకు త్యాగమనియే అర్థము. పరమేశ్వరుడగు శివుని అనుగ్రహప్రాప్తి కొఱకు, పత్ర పుష్పఫలాదులను అర్థ కామములకుగాను త్యాగము చేయుచున్నాను. (ఇందు సగుణోపాసనము సూచితము). జగదీశ్వరుడగు పరమేశ్వరుని భావమును వాంఛించి త్యాగము చేయుచున్నాను. (ఇందు నిర్గుణోపాసనము సూచితము).

వేదములందు ప్రామాణ్యబుద్ధి కలిగి, వేదమంత్రార్థము నెరిగి, కర్మోపాసన నిష్ఠ కలిగినవారు కర్మ ఉపాసనలను కర్తవ్యములుగా చెప్పిరి. వేదాంత తత్త్వవిదులు - అనగా బ్రహ్మోపాసన తత్పరులు - నిర్గుణ బ్రహ్మోపాసనమును చెప్పిరి. కర్మ ఉపాసనము క్రమముక్తి నిచ్చును. నిర్గుణబ్రహ్మోపాసనము సాక్షాన్ముక్తిప్రదము.

పంచమ వ్యాఖ్యానం :

నమే రచి నమః ప్రోక్తోజంతా స్యాత్ జగదీశ్వరే।
తస్మాద్దాసోహ మిత్యేవమ్ మత్వా మాం ప్రాపయాత్మని॥

నమస్కారము అను అర్థబోధచేయు నమ ధాతువునకు అచ్ అను ప్రత్యయము పరముకాగా నమః శబ్దముత్పన్నమైనది. ఈ శబ్దమునకు నమస్కారకర్త - ఉపాసకుడు అని అర్థము. జము ధాతువునకు అదనము తినుట అని అర్థము. దీనికి తృచ్ ప్రత్యయము చేరి జన్తా అను శబ్దమును కలిగించుచున్నది. జమతి ఇతి జన్తా. అన్నింటిని భక్షించువాడు. తనయందు ఉపసంహరించువాడు.

అని అర్థము. శివుడని తాత్పర్యము. శీఙ్ - శయనించుట "సర్వనిఘృష్వరిష్వ లష్వ శివపట్ ప్రహ్వేష్వా అతంత్రే" అను వ్యాకరణ సూత్రానుసారముగా "శేతే అస్మిన్ సర్వమ్" ఇతనియందు అంతయు శయనించును-లయించును-అనుచు శివ శబ్దము. అందుచేత నమశ్శివాయ అనగా -

"సర్వలయకర్తయగు శివుడా, నేను నీకు నమస్కారము చేయువాడను. ఆత్మస్వరూప జ్ఞానమునిచ్చి నన్ను ఆత్మస్వరూపునిగా జేయుము" అని అర్థము. ఇచ్చట "శివాయ" అనుపదము "శివ+అయ" అని విభజింపబడినది.

షష్ఠ వ్యాఖ్యానము :

అస్మిన్ శేతే జగత్సర్వమ్ తన్మయం శబ్దగామియత్।
తద్వానాత్ శివ ఇత్యుక్తం కారణం బ్రహ్మతత్పరాః॥

నమా యస్యాస్తి లక్ష్మీశ సోహం దేవోన సంశయః।
తస్మాన్మే ప్రాపయహ్యైవ లక్ష్మీం విద్యాం సనాతనీం॥

యస్మాదానంద రూపస్త్వం దేవైర్వేదైర్నిగద్యసే।
తస్మాన్మే దేహి యోగీశ భద్రం జ్ఞానమ్ సుభావనమ్॥

"నామ రూపాత్మకముగా ప్రకృతిని విభజించు "శివ"దేవా! నేను జ్ఞాన లక్ష్మీహీనుడను. నీవు ఆనందస్వరూపుడవని వేదములు ఘోషించుచున్నవి. కావున దేవా! నాకు ఆత్మజ్ఞానరూపమైన లక్ష్మిని ఇమ్ము"అని సారభూతమైన తాత్పర్యము. ప్రపంచము ప్రకృతిమయమేననుటకు ప్రమాణము. "వాచారంభణమ్ వికారోనామ ధేయమ్ మృత్తికేత్యేవ సత్యమ్" అను శ్రుతిపాఠము.

"శిమ్" శబ్దమునకు శేతే అస్మిన్ - ఇందు లయించును అన్న అర్థములో, ప్రకృతి అని అర్థము కాగా, ఆ ప్రకృతిని విభజించువాడు శివుడని-శిం వనతి-భాజయతి-నామరూపాత్మనా వ్యాకరోతి, ఆకాశాది విభాగం ప్రాపయతి అను నర్థమున ఓ, వై అను ధాతువునకు "జ" ప్రత్యయముచేరగా వచ్చినరూపము శివః లేక వా అను ధాతువును గ్రహించి సూచించుట. అనగా విభజించుటే. శిమ్ వాతీతి శివః అనియు వ్యుత్పత్తి.

"మా" అనగా లక్ష్మి. "ఇందిరాలోకమాతా-మా" అని అమరకోశము. లక్ష్మి-జ్ఞానలక్ష్మి లేనివాడు. నమః దేవా నీవు లక్ష్మీశుడవు. నా అజ్ఞానరూపమైన అలక్ష్మిని పోగొట్టి జ్ఞానరూపమైన లక్ష్మిని పొందింపుము,

దేవ శబ్దమునకు దీవ్యతి విజిగీషతి - జయింపగోరుచున్నానని అర్థము.

సప్తమ వ్యాఖ్యానము :

యస్మాత్త్వం నేతినేతీతి। నఇత్యర్థమ్ మాసివేదజమ్।
తస్మాన్నమోసి భద్రంమే। యతోజాతో నమోఽనమః॥
శివంశివ మథాప్రాప్తః శివాయేతి నిగద్యసే
శివాయ మే తథా ప్రాప్త్యై శివాయం కురు సర్వదా॥

ఈ భాష్యపంక్తులకు సారమేమనగా - "శివా! నీవు అపరిచ్ఛిన్నుడవు. సర్వనిషేధాధిష్ఠానమవు. నేనీ విషయమును తెలిసికొన్నవాడనై అపరిచ్ఛిన్నుడను సర్వాశ్రయుడను అయి శుభమును పొందెదను. అఖండైకరస స్వరూపా! నాకు నీ స్వరూపప్రాప్తి కలిగించుము" అని.

నమశ్శబ్దమున "న" అను దానికి ఉపనిషత్తులందు "నేతి" "నఇతి" "నఇతి" ఇదికాదు. ఇది కాదు అని నిషేధింపబడిన సకలప్రపంచమును అని అర్థము. "మ" అనుదానికి - కొలుతువు - **measure** - వ్యవహార విషయముగా చేతువు అని. కొలతపాత్రలు వస్తువులను కొలిచి - వాని పరిమాణమును వెల్లడించి వాటితో సంబంధము లేకుండ నుండును. అట్లే శివుడును ప్రపంచమును వివర్త రూపమున తనయందు ఆవిర్భవింపజేయుట, మరల అదృశ్యము చేయుట - ఆ ప్రపంచ సంగరహితుడై యుండుట - సచ్చిదానందరూపుడు. న అను దానిచే అనాత్మనిషేధమునుతెలిపి, మ అనుదానిచే నిషేధాధిష్ఠానమై సర్వసత్యమైన బ్రహ్మము బోధించుటచే "నమః" శబ్దమయి బ్రహ్మకు నామధేయమైనది. ఆ బ్రహ్మను తెలిసికొనుటవలన నేనును "నమః" అపరిచ్ఛిన్నుడను అయితిని. అందువలన నాకు శుభము కలిగినదని భావము.

శివమ్ అనగా సకలోపద్రవ రహితమైనట్టిదియు, అఖండైక రసమైనట్టిదియు, రూపమును - ఆ =సమన్తాత్ - ఏతి ప్రాప్నోతి పూర్తిగా పొందును

అను అర్థమును చెప్పినపుడు "శివాయ" అనగా నిరతిశయాఖండానందస్వరూపా! అని భావము. శివాయ శబ్దమును ఆవృత్తి చేసికొనగా నన్నును అట్టి వానిని చేయుము అని అర్థము చెప్పుకొనవలెను.

అష్టమ వ్యాఖ్యానము :

శివాం యాతోమహాభద్ర
నమోహం మాయాయ ధ్రువమ్
తతో నమాయమహ్యం
మశ్శివాయం కురు సర్వదా.

హే శివాయ! అహంనమః మః శివాయ కురు॥ ఓయి విద్యాస్వరూపుడా నేను విద్యలేని వాడను. నీవు పూర్ణవిద్యామూర్తివి. ఈ ప్రపంచ మంతయు నాకు నీ రూపముగనే భాసించుచున్నట్లు అనుగ్రహింపుము. ఇది సారము.

శివా శబ్దమునకు బ్రహ్మవిద్య యన్నది అర్థము. "శివాం యాతః శివాయః" - బ్రహ్మవిద్యను పొందినవాడని భావము. శివాయ అనగా బ్రహ్మవిద్యా రూపుడని. సంబోధనమున "శివాయ" అను పదము. ఓయి బ్రహ్మవిద్యారూపుడా! అని. మా=లక్ష్మి, విద్య, న=లేనివాడు అన్న వ్యుత్పత్తినిబట్టి నమశ్శబ్దమునకు నేను విద్యాహీనుడనని అర్థము. నమశ్శబ్దములోని మః అనుపదమునకు ఈప్రపంచ మని అర్థము. "శివాయ" అనుపదమునకు ఆవృత్తిచేసికొని "శివాయంకురు" శివ స్వరూపముగా కనుపడునట్లు చేయుము. అని సంభావింపవలెను.

మా శబ్దము ప్రకృతివాచకము. "జీవేశావాభాసే న కరోతి మాయా చా విద్యాచ స్వయమేవ భవతి" అను శ్రుతి ప్రమాణముచేత అవిద్యనుకూడ తెలుపు చున్నది. మః=అనగా ఈ ప్రపంచము. మసీ పరిణమించుట. ఇది దివాదిధాతువు. దీనికి క్విప్ ప్రత్యయము చేరగా వచ్చిన స్వరూపము మస్యతి=పరిణమతి=వికారం గచ్ఛతి. అందుచేత పరిణామము పొందు ప్రపంచమని అర్థము.

శివాయం కురు=శివస్వరూపముగా కనుపడునట్లు చేయుము. భగవద్గీత లోని "వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః" అన్నది అనుసంధించుకొన వలెను.

నవమ వ్యాఖ్యానం :

ఈ నవమ వ్యాఖ్యానము రెండు పద్ధతులుగా నున్నది.

మొదటి పద్ధతి :

శివమేషి యతోజ్ఞాత్వా శివాయ స్త్వం ప్రపఠ్యసే
నతేమాయా యతోజ్ఞాత్వానమో వేదైః ప్రపఠ్యసే
నమోహంచ శివాయోఽహం నమోమహ్యం నమోనమః
నమోనమాయ శుద్ధాయ మంగళాయ నమోనమః॥

దీని సారము. "శివమును, నిరతిశయానందమైన స్వరూపమును తెలిసికొన్నవై వేదములు నిన్ను "శివాయ" అనుచున్నవి. మా=అవిద్య నీయందు న=లేదు. కాబట్టి వేదములు నిన్ను "నమః" అనియు పిలుచుచున్నవి.

నీ అనుగ్రహమును పొందిన నేనును ఆత్మనెరిగితిని. నీకంటె అన్యము నేమియు చూచుటలేదు. సర్వము నీరూపమే అగుట చూచుచున్నాను. ఇట్లు ఏకాత్మ దర్శనమువలన నేను అవిద్యారహితుడను, శివాయుదను (స్వరూపద్రష్టనూ) అయితిని. అందుచేత విజ్ఞులు నన్ను "ఇతడు నమః" నిరవిద్యుడని ప్రశంసింతురు.

ఓయి శివా! అవిద్యారహితుడవై, శుద్ధుడవై, మంగళస్వరూపుడవై, నిర్వికారుడవై, ఆనందప్రదుడవైన నీకు నమస్కారము."

శివాయ అనునది ఇణ్ గతావస్యాణ్ ప్రత్యయే రూపం శివాయ.

రెండవ పద్ధతి :

నమోనమ నసం శంభో నిరాకారాయతే నమః
నిర్గుణం నిష్క్రియం శాంతం ఇత్యాత్యాశ్రుతయోజగుః
నమో బ్రహ్మ నిరాకారం శివాయం శివసర్వదా
అతోహంచ నమో భద్ర శివాయోహం నసంశయః॥

దీని సారము: శివా! నీకు పరిణామము లేనందువలన నిన్ను "నమః" శబ్దము చెప్పుచున్నది. అనగా నీవు వికారరహితుడవు. నిర్వికారుడవు. నిన్ను

వేదములు నిర్గుణునిగా, నిష్క్రియునిగా, శాంతునిగా కీర్తించుచున్నవి. అట్టి నీకు నమస్కారము. నీవు అఖండ పరిపూర్ణుడవగు బ్రహ్మమవు. నీవేకరసుడ వెల్లప్పుడును. నేనును నీ స్వరూపుడను - నేనును నమః పరిణామ రహితుడను. పరిపూర్ణుడను. సంశయము లేదు. నీవు నన్ను అనుగ్రహింపుము.

నమః శివాయ మంత్రమునకు ముందున్న ఓంకారము - (మంత్రాద్యో జయతి!) నకు వివరణము చెప్పుటలేదు. మాండూక్య ఉపనిషత్తు తృతీయ ఖండమునందు మంత్రములందీయబడిన వివరణము గ్రహింపవలెను.

పద్మపాదాచార్యులవారు స్వగురు భావ వివరణదక్షులు. **Hir Masters Voice.** పంచాక్షరీ మంత్రమునకు పద్మపాదాచార్యులవారి భాష్యమును వివరించుట ప్రస్తుతమెట్లనగా - ఆయనయొక్క, ఆయన గురువులయొక్క దృష్టి - మహా మంత్రముల అర్థ తాత్పర్యముల విషయము నందెట్లున్నదో-తత్రాపి-ప్రపంచసార తంత్రగత విషయములను మనమెట్లు అవగాహన చేసికొనవలెనో-చెప్పుటకు.

శ్రీ పద్మపాదాచార్యులవారి పంచాక్షరీమంత్ర భాష్యశ్లోకములను, న్యాయ వ్యాకరణ, వేదాంతాది బహుశాస్త్ర మర్యాదలు తెలిసినగాని - అవగాహన చేసికొనలేము. "విబుధ జనులవలన విన్నంత కన్నంత" నేను తెలుగున వివరించినాను.

పంచాక్షరీ మంత్రార్థమట్లుండగా శ్రీ విద్యామంత్రములను గురించి కూడ శ్రీ శంకర భగవత్పాదాచార్యుల వారి అభిప్రాయము గమనింతము.

అథ బాలాత్రిపురసుందరీ మన్త్రార్థః.

ఇమితి బీజం వాగ్భవం క్లీం కామరాజ్యాఖ్యాం సౌః పరా బీజం అఇతిస్థితే.సూత్రమ్. అకస్సవర్ణే దీర్ఘః. ఆఇతిస్థితే. సూత్రమ్. వృద్ధిరాదైచ్ ఇతి వృద్ధిః ఇ ఇతి భవతి. అ-అగ్నిమీడేపురోహితం, ఇ, ఇషేత్వోర్జేత్వా. అ, అగ్నఆయాహివీతయే. బిందోశ్శంన్నో దేవీరితి, వాగ్భవ బీజమితి సంజ్ఞా. తదుక్తం.

వాగ్భవం ప్రథమం బీజం ద్వితీయం కామరాజకం
తృతీయం శక్తి బీజాఖ్యం నిగమ త్రితయోద్ధృతమితి
తృతీయస్తు పరాబీజమితి పాఠాంతరం.

అస్యార్థః. ఇంవేదచతుష్టయ స్వరూపం, బ్రహ్మవిష్ణు మహేశ్వర తురీయస్వరూపం పరాపశ్యంతీ మధ్యమావైఖరీ స్వరూపశబ్దబ్రహ్మాత్మకం.

క్లీం క్లీం కాంరాంతర్గత కకారస్య బ్రహ్మార్థః, ఈకారస్య తేజఃపుంజాత్మక చిచ్ఛక్తిరిత్యర్థః, లకారస్య లాతి=గృహ్ణాతీతి వ్యుత్పత్యాతద్విశిష్ట మిత్యర్థః, ప్రసిద్ధత్వాదకర్మకః అంతర్యామి రూపేణ ప్రతిపాదితో బిందుః, శివస్వరూప ఇత్యర్థః, సౌః, సః ఔఇతి భేదః సోచిలోపిచ్చేత్ పాదపూరణ మితి సంధిః, తచ్ఛబ్దస్య పూర్వోక్తస్వరూపా భిన్నబ్రహ్మవస్తు విసర్గ వాచ్యోఽహం చతుర్దశ స్వర వాచ్యః, అభిన్నోఽస్మీత్యర్థః అహం బ్రహ్మాస్మి. బ్రహ్మైవాహమస్మీతి.

ఇం క్లీం సౌః అహం బ్రహ్మాస్మి, సౌః క్లీం ఇం బ్రహ్మై

వాహమస్మి ఇతి బాలా మంత్రార్థః

అథకాది విద్యాపంచదశాక్షరీ విద్యామస్వర్థః

అత్రాయం పదవిభాగః క, ఏ, ఈల, హ్రీం, హస, కహల, హ్రీం, సకల హ్రీం; అర్థస్తు ఇణోగతా విత్యస్మాద్ధాతోరిచ్. ఏమా యాత్మికే (పరదేవతే) కే బ్రహ్మ విషయే, హ్రియంచ్ఛాంద సత్వాచ్ఛాందసేతి పూర్వరూపం లజ్జాం లజ్జోపలక్షితాష్ట పాశాత్మి కామవిద్యాం ఈల=నివర్తయ; ఈలప్రేరణ ఇతిధాతోః కాపిలాదిత్వా ల్లత్వం పరస్మైపదంచ్ఛందసం. హేర్లుక్ బ్రహ్మవిషయకాజ్ఞానం నివర్తయేత్యర్థః కహలహ్రీం. కనకదీప్త్యాంత్యస్మాద్ధాతోః హలగ్రహణ ఇతి ధాతోరపి, కస్య= బ్రహ్మణః హలహ్రీం=గ్రాహకశక్తిం, హస=ప్రకాశయహసి హస ఇతిధాతోః లోణ్మధ్యమః బ్రహ్మపరోక్షవృత్తిం ప్రకాశయేత్యర్థః; సకలహ్రీం=సర్వాంతఃకరణవృత్తిం ఈలేత్యనువృత్యా వ్యాఖ్యేయం; ఈల=నివర్తయ. సకలవృత్త్యుప శాంత్యాఖండప్రకాశ చిదానంద రూపాపత్తి సంపాదయేత్యర్థః.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవింద భగవత్పాద శిష్య శ్రీ శంకరభగవత్పాదస్య కృతిః పంచదశీవ్యాఖ్యా బ్రహ్మవిద్యావిలాసః. ఇతి శివమ్.

శ్రీ విద్యా షోడశాక్షరీ మహామంత్రమునందు 16 బీజములు; అష్టావింశతి అక్షరములు. దీని తాత్పర్యము వామకేశ్వర తంత్రమున శ్రీవిద్యార్థ విచారణ సందర్భమున ప్రపంచింపబడినది.

గ్రంథవిస్తరణ భీతిచేత - విస్తరించివ్రాయక యావన్మంత్ర భావము తెలుపుచున్నాను.

కాంస్యపాత్రస్థ జలమధ్య విలీనకాచ వద్దృశ్యమాన గుణత్రయ విశిష్టా విద్యాశబల పర్యాయ విమర్శలోలీభావాపన్న ప్రకాశాత్మకోచ్ఛ్వాణ గుణ త్రయాత్యంత సంవలిత ప్రపంచసృజనేచ్ఛయాంకురిత మహత్తత్వాపర పర్యాయ షట్త్రింశద్గర్భాఢ్య నాదాత్మకాహం భావాపన్నాహంకారాత్మక స్త్రీ పుంభావాపన్న పార్వతీ పరమేశ్వరాత్మక వాణీ హిరణ్య గర్భాత్మక లక్ష్మీనారాయణాత్మక అగ్నీ షోమాత్మక పృథివ్యప్తేజోవాయ్వాకాశాత్మక ప్రతిబింబరూపేణ బ్రహ్మగ్రాహక బ్రహ్మస్వరూపమాయే మదీయాజ్ఞాన నివృత్తిపూర్వక బ్రహ్మ పరోక్షవృత్తిం ప్రకాశయే త్యఖండార్థః.

ఈ మంత్రార్థములను పరిశీలించగా - మంత్ర పురశ్చరణము వేదాంత శ్రవణ మనన నిదిధ్యాసల వంటిదే యని స్పష్టమగుచున్నది. అందుచేత అద్వైత సిద్ధాంత ప్రవక్తయగు శ్రీ శంకరభగవత్పాదులవారు మంత్రశాస్త్ర గ్రంథ మగు ప్రపంచసార తంత్రమును రచించిరనుటలో దోషము లేదు.

మంత్రోపాసనము భక్తియుక్తమే. ఉత్తమ భక్తి మరల తాత్త్వానుసంధానమే అగుచున్నది కావున మంత్రోపాసనము బ్రహ్మానుసంధానమునకు విరుద్ధము కానేకాదు.

గీతా పరమేశ్వరుడు భగవద్గీతయందు భక్తులను నాలుగు విధములుగా నెన్ని వారిలో తనతో నభేదభావము నందిన భక్తుని ఉత్తమునిగా చెప్పెను. చతుర్విధా భజంతే మాంజనాః సుకృతినోఽర్జున। అర్తోజిజ్ఞాసురర్థార్థీజ్ఞానీచ భరతర్షభ। తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏక భక్తిర్విశిష్యతే )7-16, 17) ఆర్త, జిజ్ఞాస అర్థార్థులు ప్రయోజనాపేక్షకులగుటచేత గౌణ భక్తులు. జ్ఞాని నిరీహభక్తుడై పరమాత్మను స్వస్వరూపముగా భావించుటచే ఉత్తముడని భగవానుడు తెల్పెను. ఇట్టి అభేద భావనాశక్తివిశేషము శుద్ధచిత్తవృత్తునకే కలుగును. ఈ విషయమును అపరోక్షానుభూతియందు శ్రీ భగవత్పాదులు చెప్పిరి.

ఉదేతి శుద్ధచిత్తానాం వృత్తిజ్ఞానం తతః పరం.

గీతాశ్లోకమున నిత్యయుక్త - ఏక - భక్తి పదముల భావమేమనగా - ఈ భక్తుడు తీవ్రాభ్యాసమువలన తనయందే గాక క్రమముగా సర్వ భూతముల

యందును భగవద్రూపమును చూచును. ఇది ఉత్తమ జ్ఞానావస్థ. జనన మరణ రూపసంసారమును తొలగింపజాలిన ఆనందరూప ముక్తావస్థ.

భేదదృష్టితో ప్రారంభమైన భక్తి స్వస్వరూపమును దేవతాత్వమును సంపాదించి అభేదభావపూర్ణమై వైదికమార్గ ప్రవర్తకులు వ్యవస్థచేసిన వైదికభక్తి యగుచున్నది. ఇట్టి భక్తిపూర్వక మంత్రోపాసనమే శ్రీ భగవత్పాదులు ప్రపంచ సార మందు ప్రతిపాదించిరి.

దీనినే భట్ట నారాయణుడు వేణీసంహార నాటకమున యుధిష్ఠురునిచేత చెప్పించెను. "భవతు భగవన్ భక్తిః ద్వైతం వినా పురుషోత్తమే" (6-46). దీనినే వైదికులు "తన్మేమనః శివసంకల్పమస్తు" అని ప్రార్థించి, "చక్షుర్హృదయే, హృదయం మయి" (ఆత్మ చైతన్యే) అహమమృతే, అమృతం బ్రహ్మణి" అని సర్వస్వరూపమును శివునియందు లయము గావించి పారమేశ్వర భావమును వాంఛింతురు. (మహాన్యాసగత శివసంకల్పగ్ం హృదయమ్)

సాధకుడు తనయందు బ్రహ్మభావమును దర్శించుటను తైత్తిరీయనారాయణోపనిషత్తు చెప్పుచున్నది. ఆర్ద్రం జ్వలతి జ్యోతి రహమస్మి. జ్యోతిర్జ్వలతి బ్రహ్మాహమస్మి యోఽహమస్మి బ్రహ్మాహమస్మి అహమస్మి బ్రహ్మాహమస్మి అహమేవాహం మాంజుహోమి స్వాహా - ఇట్టి ఉత్తమస్థితిని చేరదలచిన ఋషులు "నా శివశ్శివ మర్చయేత్" అనిరి. (శివుడు కానివాడు శివుని అర్చింపరాదు.) ఇచ్చట శివ శబ్దము దేవతాన్యోప లక్షకము. ఏ దేవత అర్చనను చేయుచుండెనో అదే దేవతా భావమును పొందవలెనని భావము. అందుచేతనే, అర్చనయందు భూతశుద్ధి, న్యాసములు. పంచభూతాత్మక శరీరమును శుద్ధముచేసికొని తనశరీరమున మంత్ర న్యాసమును కావించుకొనుట అనగా తానా దేవతాభావము కల్గినవాడై తద్దేవతార్చనమునకు అర్హత కలవాడగును.

"ప్రపంచసార" యీ విధమైన వైదికోపాసనాకాండ సర్వస్వము. పంచ మహాభూతాత్మక ప్రపంచమున సాధనామార్గమును ప్రవచించునదికావున ప్రపంచ సారమని పేరు. బ్రహ్మసూత్రభాష్యమునకు శారీరక భాష్యమని నామముంచిన శ్రీ భగవత్పాదులీ సాధనశాస్త్ర గ్రంథమునకు "ప్రపంచసార" అని నామ ముంచుట సమంజసమే.

న్యాసాదులచే పరిపక్వ మొందిన సాధకుడు అంతరార్చనమున సమర్థుడగును. అంతరార్చనమే అంతర్యాగము. "అహందేవో నచాఽన్యోఽస్మి" "బ్రహ్మైవాహం నశోకభాక్" ఇవి మంత్రోపాసకుల భావములని శ్రీ భగవత్పాదులవారి విశదీకరణ.

ఇట్టి అంతర్యాగమును తిక్కనసోమయాజి హరిహరనాథ సంబోధనమున ఆంధ్రమహాభారతమున పెక్కుపర్యాయములు సూచించెను.

"యోగీంద్ర సంతతాంతర్యాగ పరీపాకరూప" (ఉద్యో. 1-1)

"అకలుషహృదయాంతర్యాగ సంసిద్ధమూర్తి" (అనుశాస. 2-428)

మనోఽంతర్ముద్రాలతికా ఫలత్వలసితా (అనుశాస. 2-421) మానసేజ్యధారా (శల్య. 2-421). వేదవ్యాసులవారు ద్రోణ పర్వమునందు దీనిని సూచించిరి. "శివం రుద్రముమాపతిం అనన్యభావేన సదా సర్వేశం సముపాసతే." "ఆత్మానం త్వాం ఆత్మనోఽనన్యబోధం విద్యానేవం గచ్ఛతి బ్రహ్మ శుక్రమ్."

తాను వేరు, ఉపాసింపబడు దేవతవేరు అని దేవతను తనకంటె భిన్నముగా భావించువాడు వాస్తవము నెరుగడని అట్టివాడు మనకు పశువెట్లో దేవతలకు వాడట్టి వాడని బృహదారణ్యక శృతి చెప్పుచున్నది.

"అథయోఽన్యాం దేవతాముపాస్తే, అన్యోఽసన్యోఽహ మస్మీతి ననవేద యథా పశుదేవం సదేవానాం" (1-4-10)

ఈ విషయమును శ్రీ భగవత్పాదులవారు అపరోక్షానుభూతియందుకూడ తెలిపిరి. ఈశ్వరభావమును పరోక్షముగా తెలిసికొని, తద్భావముతో ఉపాసించినకొలది క్రమముగా తాను ఈశ్వరభావమును సాధింపగలడని శిష్టవచనము. భావితం తీవ్రవేగేన వస్తుయన్నిశ్చయాత్మనా పుమాంస్తద్ధిభకేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ (అపరోక్షానుభూతి)

"ఆత్మయొక్క వాస్తవరూపమును వేరుగాతలచువాడు ఆత్మాపహారి - చోరుడు - సకలపాపభాజనుడు" అని సనత్సుజాతీయము.

యోఽన్యథాసంత మాత్మాన మన్యథా ప్రతిపద్యతే,
కిం తేన నకృతం పాపం చొరేణాత్మా పరిహారిణా

అందుచేతనే వివేకచూడామణి యందు "స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే" అని శ్రీ భగవత్పాదులనిరి.

సాధనా కల్పలతిక - (నీలమణి ముఖోపాధ్యాయునిచేత ప్రకటింపబడినది) అను గ్రంథమునందు భారతదేశము విష్ణుక్రాంత, రథక్రాంత, అశ్వక్రాంత విభాగములుగా చేయబడి భిన్నభిన్న విభాగములకు భిన్నభిన్న తంత్రములు చెప్పబడినవి. ఈ వివరములు శక్తిమంగళ తంత్రమున, మహాసిద్ధిసారతంత్రమున కూడ కలవు. రథక్రాంత దేశవిభాగమునకు అన్వయించు తంత్రములలో ప్రపంచసారతంత్ర మొకటి చెప్పబడినది. ఆ ప్రపంచసారతంత్రము, శ్రీ భగవత్పాదుల వారు రచించిన ప్రపంచసార తంత్రము - ఒకటియా - భిన్నములా అని వివాదము కొంత నడచినది. రథక్రాంతదేశ విభాగమునకు చెప్పబడిన ప్రపంచసార తంత్రము కేవలము శాక్తము. శ్రీ భగవత్పాదుల రచన మట్లుకాదు. ఈ రెండు భిన్నములేకాని ఒక్కటికావని విద్వాంసులు నిశ్చయించినారు. వైదికోపాసన అనుసరించు జనులకు, విష్ణుక్రాంత ప్రాంతమువారుగాని, రథక్రాంత ప్రాంతమువారుగాని, అశ్వక్రాంత ప్రాంతమువారుగాని - అందరకు - అద్వైతసిద్ధాంతము అన్వయించినట్లే - శ్రీ భగవత్పాదుల ప్రపంచసార తంత్రముకూడ అన్వయించు నని సర్వజనాంగీకారము.

"ప్రపంచ పంచక"మన్న పూర్వ తంత్రగ్రంథ మొకటి యున్నదని - దానికి సారముగా ప్రపంచసార రచింపడినదనియు - అభిప్రాయమొకటి కలదు. అట్లైనచో శ్రీ భగవత్పాదులు దీనికి "ప్రపంచపంచక సార" అని నామకరణము చేసి యుండెడివారని - ఈ రెండు గ్రంథములకు సంబంధము లేదని - ప్రపంచ సార తంత్రము స్వతంత్రరచన అనీ పరిశోధకులు తేల్చినారు. "ప్రపంచసార" అనగా భౌతికప్రపంచముయొక్క సార మని భావము.

ఈ తంత్రమునందే మహావిష్ణువు "తంత్రేఽస్మిన్ పంచభేదైరపి కమలజ తే దర్శితోఽయం ప్రపంచః" అని యీ గ్రంథము స్వతంత్ర గ్రంథమగుటయు - యిది ప్రపంచముయొక్క పంచవిధ భేదములను సారభూతముగా విశదీకరించుటయు వెల్లడించెను. ఈ పంచభేదములను పద్మపాదాచార్యులవారు-స్థూల, సూక్ష్మ, కారణ, సామాన్య, సాక్షి - భేదములుగా వివరించిరి.

ఈ ప్రపంచసారతంత్రము - మహావిష్ణువునకు కమలజుడైన బ్రహ్మకు సంవాదముగా రచింపబడినది.

మహాభాష్యమున పతంజలిమహర్షి అక్షరసమామ్నాయ మంతయు-ప్రతి మండితో బ్రహ్మరాశిః - బ్రహ్మరాశి యనెను. శ్రీ భగవత్పాదులు - శబ్ద బ్రహ్మ రూపమై - బ్రహ్మరాశియైన అక్షరసమామ్నాయ స్మరణముతో ఈ ప్రపంచసార గ్రంథమునకు మంగళాచరణముచేసిరి.

అకచటతపయాద్యైః సప్తభిర్వర్ణవర్గై
ర్విరచిత ముఖ బాహాపాదమధ్యాఖ్యహృత్కా।
సకల జగదధీశా శాశ్వతా విశ్వయోని
ర్వితరతు పరిశుద్ధిం చేతసః శారదా వః॥

ఇట్లు సప్తవర్ణములు - సమస్త మంత్రోద్ధారకము లగుటచేత యీ వర్ణములే శ్రీ శారదాదేవి ముఖాదులను విరచించినవని చెప్పుట.

శ్రీరంగము వాణీవిలాస ముద్రణాలయమువారి ప్రతినిబట్టి గాని, కల కత్తావారి ప్రతినిబట్టిగాని - పటలముల క్రమమును నేను గ్రహింపలేదు. శ్రీ పద్మ పాదాచార్యులవారి వివరణమునుబట్టి పటలముల క్రమమును గ్రహించి - ముప్పది యారు పటలములలోని విషయములను సంగ్రహముగా చెప్పుచున్నాను.

మొదటి పటలమున తొలువ తంత్రావతరణ గాథ. ప్రళయావసాన మున గుణప్రభిన్నులైన బ్రహ్మ విష్ణు రుద్రులు (రజస్సత్త్వతమోసంబంధులు) సృష్టి స్థితి క్షయస్పష్టనివిష్టచేష్టలు - తమ నిష్పత్తికృత్యమును గురించి ఆలోచిం చుచు మహావిష్ణువైన నారాయణుని సన్నిధికిచేరి, దుగ్ధాబ్ధియందు శయనించియున్న ఆయనను ప్రస్తుతులు చేయగా ఆయన వారి యందు ప్రీతుడై తనమూర్తిని వారికి కనిపించునట్లు చేసెను.

నీలోత్పల దళప్రఖ్యాం నీలకుంచిత మూర్ధజామ్।
అష్టమీచంద్రవిభ్రాజల్లలాటామాయత భ్రువమ్॥

ఇట్లు మహావిష్ణురూపము ఏడు శ్లోకములలో మనోహరముగా వర్ణింపబడినది.

దర్శన మన్ను గ్రహించిన మహావిష్ణువునకు బ్రహ్మ "స్వామీ! అనుగ్రహింపుము. మే మెవ్వరము? కేవయం? కేనభావితాః కింమూలాః కింక్రియాః మేమేమి చేయవలెను. అన్నియు మాకు చెప్పుము?" అని విన్నవము చేసెను. అంత శ్రీ మహావిష్ణువు వారికి "మీరు సృష్టి స్థిత్యంత హేతువులు. మీరు అక్షరసంభూతులు" అని చెప్పెను. బ్రహ్మ "అక్షర మనగానేమి?" దాని పుట్టుక యేమి? కుతోజాతం? దాని స్వభావమేమి? కిమాత్మకమ్" అని ప్రశ్నించెను. శ్రీ మహావిష్ణువు సృష్టి ప్రకారము, పురుషప్రకృతుల వివరణముల, వారికాల విషయము, భువనసృష్టి, భూతమండలము, భూతోదయము, ఇంద్రియములు, తత్త్వములు, గుణత్రయవ్యాప్తి శబ్దబ్రహ్మోత్పత్తి, చతుర్విధప్రాణిసృష్టి, శరీరోత్పత్తి, నాడీచక్రము, ప్రాణోదయము, చైతన్యగతిభేద అంతఃకరణ చతుష్టయము గురించి చెప్పెను. ప్రథమ పటలము 104 శ్లోకములు.

ద్వితీయపటలమున 67 శ్లోకములు. దీనియందు గర్భవాస వర్ణనము, గర్భవృద్ధి, రక్ష, ఉత్పత్తివిధానములు, దశవాయువులు, సప్తధాతువులు, షడూర్మలు, షట్కోశములు, క్షేత్రజ్ఞవ్యాప్తి, భూతేంద్రియాత్మత, గ్రహణీకథనము, మూలాధార నిర్ణయం, షడ్రసములు, అన్నపాకప్రకారము, వరాపశ్యంత్యాది కథనము, కుండలినీవ్యాప్తిప్రకారము, వర్ణోత్పత్తి, అహంకారోత్పత్తి, జంతుసంసార క్రమము మొదలగునవి కలవు.

మూడవ పటలమున 75 శ్లోకములు. దీనియందు వర్ణవిభూతి ప్రకరణము, వర్ణముల అగ్నిషోమసార్యాత్మకత్వము, స్వరస్పర్శ వ్యాపక వర్ణనిరూపణము, వర్ణముల స్త్రీ పుంస కత్వము, వర్ణపీర్యోద్భవకాలము, బిందు విసర్గల శశిసూర్య రూపత్వము, స్పర్శముల పంచవిధములు, వ్యాపకోదయ క్రమము. కలానామకథనము, ప్రణవకలావివరణము, కేశవాది మూర్తి తచ్ఛక్తి నామములు, శ్రీకంఠాదిమూర్తి తచ్ఛక్తి నామములు, వర్ణౌషధులు, వర్ణస్వరూప నిష్పత్తి ప్రకారము, వర్ణముల పుంప్రకృతి వాచకమన్యత్వము, హంస స్వరూప సూచనా, హకారము యొక్క సర్వవర్ణాది కారణత్వము, స్తంభనాదిప్రయోగ ప్రకారము కలవు.

నాలుగవ పటలమున 76 శ్లోకములు. దీని యందు మాయా బీజమును హ్రీం బీజమును గురించి అధికముగా గలదు. దీనికి నాద, ప్రాణ, జీవ ఘోష,

హృల్లేఖములని కూడ పేర్లు. హ్రీంకారమందున్న, హకార రకార ఈకార బిందువుల నుండి ఏఏ దేవతలు ఏఏ వర్ణములు ఉత్పన్నమైనవో - హ్రీం బీజాధిష్ఠాన దేవత భువనేశ్వరికి కుండలినీ శక్తికి హంసకు అభేదమెట్లో, మహావాక్య తాత్వార్థానుభవ ప్రాప్తి సాధించుట ఎట్లో, కుండలిని సర్వశబ్ద ధ్వనియోని ఎట్లో-ఆమె, సవిత, గాయత్రి - అగుట ఎట్లో, సప్త గ్రహములెట్లో, వర్ణములందు సప్త వర్ణ నాయకత్వమెట్లో - ఆమె నుండి ఖగోళచక్రమెట్లు ఉద్భవించినదో కలదు. ఆమెను తెలిసికొనుట కర్మ బంధ విమోచనమట. విష్ణోః పరంపదంప్రయాతి.

అయిదు ఆరు పటలములు కలసి 195 శ్లోకములు. ఈ రెండు పటలములు ముఖ్యముగా చెప్పనది దీక్షా విధిని గురించి. దివ్య భావమును కలిగించి దురితములను క్షీణింప జేయును కాబట్టి దీక్షయట - (దద్యాం చ దివ్యభావం క్షిణుయాద్దురితాన్యతో భవేద్దీక్షా) దీక్షకు తగిన, సముచితమైన వివరము లీయబడినవి. అట్లే దీక్షను తీసికొనుటకు తగిన ప్రదేశమును గురించి - వాస్తు పురుషార్చన గురించి (దీక్షాస్థల వాస్తుపురుష) చేయవలసిన బలులు మొదలగు వాటిని గురించి వివరములున్నవి. నిగమనమేమనగా గురు, దేవతా, మంత్రములకు ఐక్యము సంభావించుట కర్తవ్యమని.

ఏడవ పటలమున 70 శ్లోకములు. ఈ పటలమున ముఖ్యముగా చెప్పబడినది వాగ్దేవిసాధన, ఆమె మంత్ర జపవిధానములు. బ్రహ్మయే ఋషియైన మాతృకాన్యాసము జపమునకు ముందు చేసికొనవలెనట. ఈ మంత్రమునకు గాయత్రి ఛ్ఛందస్సు. సరస్వతి దేవత. ఆమె షడంగములు, వర్ణములు, ఆమె వర్ణనము ధ్యానశ్లోకములు. భారతీదేవి శక్తులు, మేధాప్రజ్ఞా, ప్రభా, విద్యా, ధీ ధృతి, స్మృతి, బుద్ధి, విద్యేశ్వరి. భారతిని, ఆమె శక్తులను ఆవరణ దేవతలను సాధకుడు అర్పింపవలెను. బ్రాహ్మ్యాద్యష్టశక్తులు. కవితా సిద్ధి ప్రయోగము అభిషేకఫలము, ఆరోగ్యప్రయోగము మంత్రోద్ధారణ సంకేతమ్, అర్ధనారీశ్వర ధ్యానము, భిన్నభిన్నన్యాసములు, మంత్రపంచకము, నవగ్రహన్యాసము ప్రపంచ యాగాదులు, జపాదుల కధికార నిర్ణయము, హోమద్రవ్య వివరణము తిలకధారణ ఫలము మొదలగునవి కలవు.

పంచాదద్వర్ణ భేదైర్విహితవదనదోః పాదయుక్కుక్షి వక్షో
దేశాం భాస్వత్కపర్దా కలితశశికలామిందుకుందావ దాతామ్ ।
అక్షస్రక్కుంభచింతాలిఖిత వరకరాం త్రీక్షణాం పద్మసంస్థా
మచ్ఛా కల్పామతుచ్ఛస్తన జఘనభరాం భారతీతాం నమామి॥

ఎనిమిదవ పటలమున 60 శ్లోకములు. ఇందు మొదటి భాగమున ప్రాణాగ్నిహోమ విషయము, సాధకుడు అవలంబింపవలసిన ఆసనాదులు, మూలాధార మధ్యగత శక్తి తత్త్వ ఉపాసన - పంచాగ్ని ఆవసతజ, సభ్య, ఆహవనీయ అన్వాహార్య, గార్హపత్య - కుండములందు హవిస్సుగా వ్రేల్చవలసిన వర్ణములు వ్యంజనములు, స్వరములు, వాటికి నవరత్న నామములు. సాధకుడు సూక్ష్మ శరీరమును పొందుట. ఈ హోమమున ఇంద్రియ గుణములను వ్రేల్చుట మొదలగు వివరములు.

రెండవ భాగమున సరస్వతీ మంత్ర విషయము, న్యాస పూజా జప హోమాదుల వివరములు.

47వ శ్లోకము నుండి 60వ శ్లోకము పర్యంతము సరస్వతీదేవీ స్తుతి.

అమల కమాలధివాసిని మనసో వైమల్యదాయిని మనోజ్ఞే
సుందరగాత్రి సుశీలే తవచరణాంభోరుహం నమామి సదా
వాగీశీస్తవమితియో జపాపార్జనాహవనవృత్తిషు ప్రజపేత్।
సతువిమల చిత్తవృత్తిర్దేహాపది నిత్యశుద్ధమేతి పదమ్ ॥

తొమ్మిదవ పటలమున 44 శ్లోకములు. దీని యందు త్రిపురాదేవి ఉపాసన చెప్పబడినది. ఆమె త్రిమూర్తులను సృష్టించినది కావున త్రిపురాదేవి యట.

సాధకుడు పీఠమును వామాది శక్తులను అర్చించి నవయోని చక్రమును లిఖించి దానిపై కలశము నుంచి కలశముపై దేవిని ఆహ్వానింపవలెను. నవయోని చక్రవర్ణనము, అర్చింప వలసిన శక్తుల మాతృకల, భైరవుల వివరణ కలదు.

సురాసుర సిద్ధ యక్ష విద్యాధర గంధర్వ భుజంగచారణ స్త్రీల వశీకరణ ప్రయోగము వివరింపబడినది.

పదియవపటలమున 69 శ్లోకములు. దీని యందు మూల ప్రకృతి అర్చన, మంత్ర, హోమ, అభిషేక, జపాదులు చెప్పబడినవి. మూల ప్రకృతి ధ్యానశ్లోకము ప్రకారము ఆమె అంబికా స్వరూపముననున్నది. పాశాంకుశవరాభయ ధారణ చేయుచున్నది. వీటి వివరణకు వ్యాఖ్యానమున్నది. తరువాత కర్మ క్రియా వివరణము.

పదునొకండవ పటలమున 70 శ్లోకములు. దీనియందు మూల ప్రకృతి యంత్ర వివరణముకలదు. గాయత్రి వివరణము శక్తులవివరణము నామాదులు కలవు. పిమ్మట 20 శ్లోకములలో ప్రకృతి స్తుతి రూపమైన సుందర కవితా ఖండము.

పన్నెండవ పటలమున 65 శ్లోకములు. దీని యందు శ్రీ స్వరూప లక్ష్మి ఉపాసన విషయము, ఆమె బీజాక్షర వివరణము, ధ్యానజపహోమాదుల వివరణము, ఆమె పీఠార్చనలో ఆహ్వానింప బడవలసిన శక్తుల నామములు కలవు. లక్ష్మీదేవిని రామ స్వరూపమున ధ్యానింపవలెనట. రాముని 32 శక్తులు చెప్పబడినవి. శ్రీ ఉపాసన వలన పరిశుద్ధత, దేహ సౌష్ఠవసౌందర్యములు, మేధ, విష్ణు భక్తి లభించునట. సాధకుడు పరిశుద్ధుడగుట మాత్రమే కాదు అతనికి చెందినవన్నియు పరిశుద్ధములగునట.

పదమూడవ పటలమున 90 శ్లోకములు. దీని యందు శ్రీ త్రిపుటా దేవి మంత్ర విషయములున్నవి. ఆ మంత్రముతో అంగన్యాసాదులు చేసి శ్రీదేవిని హృదయాంబుజమున పద్మస్థగా భావింప వలెనట. ఆమెను పూజించి ఆవరణ దేవతలను పూజింపవలెనట. ఆమె జపము 12 లక్షలు చేయవలెనట. ఆమె ధ్యాన శ్లోకములు. ధరణీబీజవివరములు. దీనికి వరాహ ఋషి నివృత్తి ఛందస్సు ధరణీదేవత, దీని తరువాత త్వరిత విద్యా విషయము. శీఘ్రఫలప్రదమగుట చేత త్వరిత విద్యయని పేరు. ఈ మంత్ర సాధన చేయునపుడు అప్సరోవనితలు కామోద్రేకము కలిగించి విఘ్నములు కల్పింతురట. అట్టి అవరోధములను అధిగమించినపుడే త్వరితాదేవి అనుగ్రహము. నిత్యామంత్రము దాని ఉపాసనా విధా

నము. ఈ నిత్యామంత్ర జప ఫలముగా నొకటి చెప్పబడినది. ఈ మంత్రమును సక్రమముగా ఉపదేశమును పొంది, తను వాంఛించిన స్త్రీని తలచి వేయి పర్యాయములు పురశ్చరణ చేసినచో - ఆ స్త్రీకి మన్మధావేశముకలిగి-వివశ అయి - ఈ సాధకుని కడకు వచ్చి చేరునట.

పదునాలుగవ పటలమున 88 శ్లోకములు. దీని యందు దుర్గాఉపాసనా విషయము. ఆమె ధ్యాన విషయము. ఆమె నవ శక్తులు. ఆమె ఆయుధములు, పరివార శక్తులు. మహారాజులను సైతము వశము చేసుకొన వచ్చునట. కొన్ని యుద్ధకళాశక్తుల వివరణము,

శంఖారిచాప శరభిన్నకరాం త్రినేత్రాం
తిగ్మేతరాంశు కలయా విలసత్కిరీటాం
సింహస్థితాం సకలసిద్ధి నుతాం చదుర్గాం
దూర్వానిభాం దురితవర్గహరాం నమామి ॥

పదునైదవ పటలమున 65 శ్లోకములు. ఇది సౌరప్రకరణము. దీని యందు సూర్యమంత్రము, ఋష్యాది, ధ్యానము, పురశ్చరణాది, నవశక్తులు, పీఠ మంత్రము, అర్ఘ్యదాన ప్రకారము, అజపామంత్రము, ఋష్యాధి, ధ్యానము, పురశ్చరణము, యోగ భేదములు, ప్రయోజన తిలక మంత్రము, ధ్యానము, పురశ్చరణాది, అర్ఘ్యద్రవ్యములు, గ్రహశాంతి విధానము, హోమసమిన్నియమములు, సౌరషాక్షర మంత్రము, ధ్యానము, పురశ్చరణ ప్రయోది కలవు.

పదునారవ పటలమున 65 శ్లోకములు. ఇది చంద్రప్రకరణము. దీని యందు చంద్రమంత్రము ధ్యానము, పురశ్చరణాది, విద్యామంత్రము, అగ్ని మంత్రము ధ్యానము, పురశ్చరణాది, శక్త్యాదికథనము, అగ్న్యావాహన మంత్రము ఋష్యాది, పురశ్చరణాది, చతుర్వింశాక్షర మంత్రము, ధ్యానము, పురశ్చరణాది వివరములు కలవు.

పదునేడవ పటలమున 78 శ్లోకములు. ఇది మహాగణపతి ప్రకరణము దీని యందు మహాగణపతి మంత్రము, ఋష్యాది, ధ్యానము, పూజావిధి, పురశ్చరణాది గణేశ శక్తి నామములు, ఆసన మంత్రము, తర్పణ భేదములు, గజార్ణ

నృపతి కర్తవ్యము, హోమ భేదములు, స్తంభనకర భూబీజము, మంత్రాంతరము, ధ్యానము, పురశ్చరణాది, క్షిప్రప్రసాదన మంత్రము, ఋష్యాది, ధ్యానము, పురశ్చరణాది, గణేశగాయత్రి, తర్పణ ప్రకారము కలవు.

బీజాపూర గదేక్షు కార్ముకరుజా చక్రాబ్జపాశోత్పల
వ్రీహ్యాగ్రస్యవిషాణ రత్నకలశప్రోద్యత్కరాంభో రుహః ।
ధ్యేయో వల్లభయాచ పద్మకరయా శ్లిష్టోజ్వలద్భూషయా
విశ్వోత్పత్తి వినాశ సంస్థితికరోవిఘ్నో విశిష్టార్థదః ॥

పదునెనిమిదవ పటలమున 54 శ్లోకములు. ఇది మన్మథ ప్రకణము.

అరుణమరుణ వాసోమాల్య దామాంగరాగం
స్వకరకలితపాశాం సాంకుశాస్త్రేషుచాపమ్
మణిమయముకుటాద్యైర్దీప్తమాకల్ప జాతై
రరుణనలిన సంస్థం చింతయేదంగ యోనిమ్ ॥

మన్మథ మంత్రము, ఋష్యాది, ధ్యానము, పురశ్చరణ పద్ధతి, మన్మథ శక్తి నామములు, మన్మథ యంత్ర వివరణము, మన్మథ గాయత్రీ మంత్రము, మాలా మంత్రము, మదన విధానము, ధ్యానము, శక్త్యావరణ దేవతల వివరణ, ప్రయోగ యంత్రము, హోమాదులు, అష్టాదశాక్షర కృష్ణ మంత్రము, ధ్యానము, పురశ్చరణ విధానము, ప్రాతర్మధ్యాహ్నాది భేదేన ధ్యానభేదములు, పూజా ప్రయోగాదులు కలవు.

మన్మథునికి మోహని, క్షోభని, త్రాసిని, స్తంభని, ఆకర్షిణి, ద్రావిణి ఆహ్లాదిని, క్లిన్నా, క్లేదిని, అను నవశక్తులున్నవట.

కామదేవాయ విద్మహే పుష్ప బాణాయ ధీమహి తన్నోఽనంగః ప్రచోదయాత్.

మన్మథునికి యువతి, విప్రలంబ, జ్యోత్స్న, సుభ్రూ, మందద్రవా, సురత, వారుణి, లోల, కాంతి, సౌదామిని, కామచ్ఛత్ర, చంద్రలేఖా, శుకి,

మదన, యోని, మాయావతి, అను 16 మంది ఆవరణ శక్తులున్నవట. ఆయనకు 16 మంది పరివార సేవకులు. శోక, మోహ, విలాస, విభ్రమ, మదనాతుర, అపత్రప, యువ, కామి, చూతపుష్ప, రతిప్రియ, గ్రీష్మ, తపాంత, ఊర్జ, హేమంత, శిశిర, వసంత, అనువారు.

పందొమ్మిదవ పటలమున 64 శ్లోకములు. ఇది ప్రణవ ప్రకరణము. ప్రణవము సకలవాంఛల నిచ్చు మోక్షము నిచ్చు కల్ప వృక్షమట. ప్రణవధ్యానము విష్ణురూప ధ్యానముగ చెప్పబడినది. విష్ణు ఆవరణ దేవతలు, విష్ణు శక్తులు, ఆత్మ దర్శన యోగము వివరింపబడినది. యోగమునకు కామ క్రోధ, లోభ, మోహ మదమాత్సర్యములు అభ్యంతరములట. యోగాంగములైన యమాదులు, ఓంకార నామావళి చెప్పబడినవి. ఓంకార స్వరమెట్లు శాంతమునందు పర్యవసించునో చెప్పబడినది, జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయ, తురీయాతీత అవస్థలు వివరింపబడినవి. అయిదవ అవస్థవిముక్త స్థితికి ముందున్నది.

పరకాయ ప్రవేశ స్థలాదులు వివరింప బడినవి. పంచభూతములను జయించు విధానము వివరింపబడినది. జీవన్ముక్తుని సిద్ధులు చెప్పబడినవి.

ఇరువదవ పటలమున 62 శ్లోకములు. దీని యందు నారాయణ అష్టాక్షరీ మంత్ర సంబంధమైన వివరములున్నవి; ఈ మంత్ర ఋషి సాధ్య నారాయణ, గాయత్రీ ఛందస్సు పరమాత్మ దేవత. ఈ మంత్రము "నేనాపరమాత్మనే సోహం పంచ భూతములందే యొక్కటికాను." (సోహం నతు పంచ భూత సంబంధీమితి మంత్రార్థం.)

అర్కాభం కిరీటాన్విత మకర లసత్కుండలం దీప్త రాజ
త్కేయూరం కౌస్తుభాభాశబల రుచిరహారం సపీతాంబరంచ ।
నానారత్నాంశు భిన్నాభరణ శతయుతం శ్రీధరాశ్లిష్ట పార్శ్వం
వందేదోః సక్తచక్రాంబురుహదరగదం విశ్వవంద్యం ముకుందమ్

ఇది ధ్యాన శ్లోకము.

సాధన చేయునపుడు సాధకుని శరీరమే మంత్ర దేవతా పీఠము మంత్రాక్షరములతో న్యాసము చేసినపుడు సాధకుడు తానే ఉపాస్య దైవమగునట.

విష్ణు దశావతారముల వివరణము కలదు. బుద్ధుని పేరు లేదు. బల రాముని పేరున్నది. కిరీటాది మంత్ర వివరణము, విమల మొదలగునవి పీఠ శక్తులు. మిగిలిన పటలమంతయు కలశస్థాపన, జప, అర్చనాదులను గురించి.

ఇరువది యొకటవ పటలమున 70 శ్లోకములు. ఇది మాస యంత్ర ప్రకరణము. మాస యంత్రముల సామాన్య లక్షణము, చరస్థిరోభయ రాశి కథ నము, త్రి, షడ్ - ద్వాదశ గుణిత యంత్ర విషయము, ద్వాదశ భాను నామ ములు, కేశవాదిపూజా మంత్రము, కేశవాదిత్యాది గాయత్రీ కథనము, ద్వాదశ రాశి యంత్రము, తత్పూజా పద్ధతి కలవు. ఈ పటలము ముగింపులో కవితా సుందరమైన శ్రీహరి స్తోత్రము కలదు.

ఇరువది రెండవ పటలమున 58 శ్లోకములు. ఇది వాసుదేవ ప్రకర ణము. వాసుదేవ మంత్రము, సృష్టి స్థితిసంహార క్రమమున న్యాసక్రమము, ధ్యానము. పురశ్చరణ, సుదర్శన మంత్రము, దిగ్బంధ మంత్రము, ఆగ్నిప్రకార మంత్రము వర్ణన్యాసము, సుదర్శన ధ్యానము, సుదర్శన గాయత్రి, రక్షాకర మంత్రము, చక్ర యంత్రము, మంత్రము, కుంభ పూరణము, ఆయుధ వర్ణనము శక్తినామములు, ప్రయోగ విధానము, స్థాన నిర్దేశము, బలి మంత్రము, రక్షో ఘ్నమంత్రము, రక్షాకర యంత్రము, యంత్రరచనా విధి వివరములుకలవు.

ఇరువది మూడవ పటలమున 72 శోకములు. ఇది శ్రీ పురుషోత్తమ ప్రకరణము. దీనియందు శ్రీ పురుషోత్తమ మంత్రము (త్రైలోక్యమోహనము) ద్వాదశాంగమంత్ర ప్రయోగ క్రమము, మారణాది ప్రయోగ మంత్రములు, ఋష్యాది వివరణము, షడంగ మంత్రము, వ్యాపక మంత్రము, చక్రాద్యాయు ధాష్టక మంత్రములు, గరుడ మంత్రము, త్రైలోక్యమోహనగాయత్రీ, శ్రీమంత్ర ము, శక్త్యాదుల మంత్రములు, త్రైలోక్య మోహన ధ్యానము, పురశ్చరణ పద్ధతి, హోమ విధానముకలవు.

ఇరువది నాలుగవ పటలమున 48 శోకములు. ఇది శ్రీకర ప్రకర ణము. దీని యందు శ్రీకర మంత్రము, ఋష్యాది వివరణము, ధ్యానము, పుర శ్చరణ పద్ధతి, పూజా ప్రయోగాదులు, మహావరాహ మంత్రము, దాని ఋష్యాది

వివరణము, ధ్యాన భేదములు, పూజా ప్రయోగ వివరణము, పురశ్చరణ పద్ధతి, వరాహ యంత్రోద్ధార విషయము కలవు.

ఇరువది అయిదవ పటలమున 58 శ్లోకములు. ఇది నృసింహ ప్రకరణము. దీని యందు నృసింహమంత్రము, దాని ఋష్యాదులు, ప్రసన్న ప్రతిపత్తి, క్రూర ప్రతిపత్తి, మానసపూజా, పురశ్చరణ పద్ధతి, ప్రయోగ విధి, గరుడ మంత్రము, దాని ఋష్యాదులు, హోమవిధి, షడక్షర మంత్రము, ధ్యానము, నృసింహ యంత్రము, రక్షా యంత్రము, ప్రయోగ విధి మొదలగు వివరములు కలవు.

ఇరువది అరవ పటలమున 66 శ్లోకములు. దీని యందు విష్ణు పంజర విధి, విష్ణు పంజర మంత్రము, విశ్వరూప మంత్రము, షోడశాక్షర సర్వార్థక సాధక మంత్రము, చక్రాది మంత్రముల షోడశాక్షర యోగము, చక్రాది మంత్ర కథనము, విశ్వరూప ధ్యానము, ప్రయోగ క్రమ పద్ధతి, జప విధానము, గీతాది మన్త్రి యోగవిధి, రక్షాది ప్రయోగ విధానము, మంత్ర ప్రయోగ క్రమముకలవు.

ఇరువది యేడవ పటలమున 73 శ్లోకములు. ఇది ప్రసాదప్రకరణము దీని యందు ప్రసాద మంత్రము చెప్పబడినది. చిత్తశుద్ధి కల్పించునది కావున దీనికి ప్రసాద మంత్రమని పేరు. దీని ఋష్యాదులు చెప్పబడినవి.

**శూలాహీటంక ఘంటాసిశృణికులిశపాశాగ్ని భీతీర్దధానం**
**దోర్భిః శీతాంశుఖండ ప్రతిఘటిత జటాభారమౌళింత్రినేత్రమ్**
**నానాకల్పాభి రామాపఘన మభిమతార్థప్రదం సుప్రసన్నం**
**పద్మస్థం పంచవక్త్రిం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి.**

ఇది ధ్యాన శోకము

శివుని సద్యోజాతాది పంచ ముఖములు, ఆ పంచముఖములకు భిన్న భిన్న మంత్రములు, ధ్యానములు, మూర్తిన్యాసాదులు, పురశ్చరణ విధానము, పీఠార్చన విధి, పీఠ దేవతల నామములు చెప్పబడినవి. వామ జేష్ఠ్య, రౌద్రి, కాళి, కలవికరణి, బల వికరిణి, బలప్రమధిని, సర్వభూతదమని, మనోన్మని పీఠ దేవతలు.

పంచ బ్రహ్మ విధానము చెప్పబడినది. షడంగ మంత్రము చెప్పబడినది. సత్యోజాతాది పంచశివుల వర్ణన, ధ్యాన శ్లోకములు రమణీయముగా నున్నవి.

సద్యోవేదాక్షమాలా భయవరదకరః కుందమందార గౌరో
వామః కాశ్మీర వర్ణోఽభయవరద పరశ్వక్షమాలావిలాసీ

శైవ పంచాక్షరమంత్రము చెప్పబడినది. దానికి ఋష్యాది న్యాసాదులు. ధ్యాన శ్లోకము పరమ రమణీయముగా నున్నది.

బిభ్రద్దోర్భిః కుఠారం మృగమభయవరౌసుప్రసన్నో మహేశః
సర్వాలంకారదీప్తః సరసిజనిలయో వ్యాఘ్రచర్మాత్తవాసాః
ధ్యేయో ముక్తాపరాగామృతరస కలితాద్రి ప్రభః పంచవక్త్ర
స్త్ర్యక్షః కోటీరకోటి ఘటితతుహినరోచిః కలోత్తుంగమౌళిః ॥

పురశ్చరణ విధానము చెప్పబడినది. తరువాత శ్రీశివస్తుతి పది శ్లోకములలో నున్నది. పిమ్మట శక్తి పంచాక్షర విధానము, ధ్యానము, పూజా ప్రయోగాదులు, శైవాష్టాక్షర మంత్రము, ధ్యాన ఋష్యాదులు చెప్పబడినవి.

ఇరువది యెనిమిదవ పటలమున 55 శ్లోకములు. దీనియందు దక్షిణామూర్తి మంత్రము, ఋష్యాది, ధ్యానము, పురశ్చరణపద్ధతి, అగ్నేయమంత్రము ఋష్యాది, అఘోరధ్యానము, పూజాయంత్రము, ప్రయోగవిధి, ఊర్ధ్వ వక్త్ర ప్రధానమంత్రము, మృత్యుంజయమంత్రము, దాని ఋష్యాది ధ్యాన పురశ్చరణ ప్రణవ ప్రధాన యోగములు, బాహ్య ప్రయోగాంగ యంత్రము. మధ్య బీజ ప్రధానాంతరయోగవిధి, తృతీయ బీజ ప్రధాన యోగాదికము చెప్పబడినవి.

ఇరువది తొమ్మిదవ పటలమున 46 శ్లోకములు. దీనియందు చింతామణి మంత్ర వివరము, ఉమేశదేవతా ధ్యానము, అర్ధనారీశ్వర ధ్యానము, క్రూర ప్రయోగధ్యానము, పురశ్చర్యా పద్ధతి. రోగాద్యుపశాంతికై ప్రయోగ భేదములు రక్షాకరయంత్రము, చండీశ్వర మంత్రము, ధ్యానము, పురశ్చరణ విధి, చండ గాయత్రిమంత్రము పూజా ప్రయోగాదులు కలవు.

అహీశశధర గంగాబద్ధతుంగా ప్రమౌళి
స్త్రీదశగణ నతాంఘ్రి స్త్రీక్షణః స్త్రీవిలాసః
భుజగవరశుశూలాన్ ఖడ్గవహ్నీ కపాలం
శరమపిధను రీశో బిభ్రదవ్యాచ్చిరం వః ॥

ముప్పదియవ పటలమున 73 శ్లోకములు. ఇది ప్రాముఖ్యము కలిగిన పటలము. దీనియందు గాయత్రిమంత్రమును గురించిన వివరములున్నవి.

గాయత్రిమంత్రవిధికథనము, జపాద్యధికార నియమములు, ప్రణవ సానుభవ సాధన కథనము, వ్యాహృత్యర్థ కథనము, ప్రణవ వ్యాహృతుల సంబంధము, అంతఃప్రణవ వ్యాహృతి పక్షమున ప్రణవాద్యర్థకథనము, ధ్యేయస్వరూప ధ్యాన ప్రకారము, గాయత్రిజపవిధి, నిరాకారధ్యానము, బహిర్జపక్రమము, యత్రీ మంత్రవర్ణ పదన్యాసము, గాయత్రీ ధ్యానము, ప్రయోగాదులు కలవు.

ముప్పదియొకటవ పటలమున 103 శ్లోకములు. ఇది త్రిష్టుబ్విద్యా ప్రకరణము. త్రిష్టుప్ మంత్రము వైదికము. దీని అధిదేవి కాత్యాయని. ఈ మంత్రము, దానిశక్తి వివరములు, మంత్ర పురశ్చరణవిధి చెప్పబడిన 44 అక్షరములున్న యీ మంత్రము వెనుకనుంచి చదివిన అస్త్ర మంత్రమగునట. ఇది ఎనిమిది విభాగములు. అవి జ్ఞానేంద్రియ కర్మేంద్రియ భూత పంచకాదులతో సంబంధముకలవి. ఈ మంత్రాక్షరములనుండి వహ్ని దేవతలుద్భవించిరట. ప్రతివహ్నిదేవతకు అయిదుమంది పరివారశక్తులు. పెక్కుమంది చెలికత్తెలు. నక్షత్రములు, మానుష, ఆసుర దైవములని. ఇవి ఇంద్రజాలాది ప్రయోగములందు ప్రయోజనముకలవి. స్తంభన వశీకరణ, ఆకర్షణ, విద్వేషణ, విమోహన, మారణ, అంగహానికరణ మొదలగు ప్రయోగములు, తన్ని వారణములు, మొదలగునవి చెప్పబడినవి.

ముప్పది రెండవ పటలమున 65 శ్లోకములు. దీనియందు లవణ మంత్రము చిటి మంత్రము, అగ్నిధ్యానము, యామవతీధ్యానము, కాత్యాయనీ ధ్యానము, భద్రకాళీధ్యానము, పురశ్చర్యావిధి, పుత్తలీ ప్రయోగ విధము, ఉపస్థాన మంత్రము, ప్రయోగభేదములు, బలిమంత్రము, బలిదానప్రకారము చెప్పబడినవి.

ముప్పదిమూడవ పటలమున 72 శ్లోకములు ఇది అనుష్టుప్ ప్రకరణము. దీనియందు ఆయుఃప్రద అనుష్టుప్‌మంత్రము, దాని ఋష్యాది ధ్యాన ఆవరణదేవతా, మంత్రవర్ణ దేవతా పురశ్చర్యావిధి హోమాది విధి చెప్పబడినవి. శతాక్షరమంత్రము దాని ఋష్యాది, ధ్యాన పురశ్చరణ హోమవిధి, అనుకూల మంత్రము, మంత్రయోగక్రమము, ఋగ్వారుణీ విధానము, దాని ఋష్యాదిధ్యానము, పురశ్చరణవిధి, హోమవిధి, నవశక్తి నామములు కలవు.

ముప్పది నాలుగవ పటలము. దీని యందు 77 శ్లోకములు. దీని యందు పెక్కు యంత్రములు వివరింపబడినవి. దీర్ఘాయుఃప్రదయంత్రము, జ్వరార్తిహరయంత్రము, వశ్యకర యంత్రము, ఆకర్షకరయంత్రము, షడ్గుణిత ప్రయోగము, ద్వాదశ గుణితమంత్ర ప్రయోగము, ఆకర్షకర ఘటార్గళయంత్రము, స్త్రీవశ్య కృద్యంత్రము, యంత్రాంతరము, వశ్య కృదపరయంత్రములు, ఆకర్షకరయంత్రము, బ్రహ్మశ్రీ యంత్రము, ధ్యానము, పురశ్చరణవిధి, రాజముఖీ మంత్రము, వశ్యకర ప్రయోగాంతరము, అన్నాధిపతిమంత్రము, మంత్రమూర్తి, అన్నపూర్ణామంత్రము, ధ్యానము, పూజా ప్రయోగము, బృహస్పతిమంత్రము, శుక్రమంత్రము వ్యాసమంత్రము, ధ్యానము, శత్రుజయోపాయనమంత్రము, ధ్యానము, అశ్వారూఢా (గుఱ్ఱాలక్క) మంత్రము- పురశ్చరణవిధి, ధ్యానము, అమలన్యాసము కలవు.

మునివ్రాతావీతం విమలధియ మంభోదరుచిర
ద్యుతిం వ్యాఖ్యాముద్రాకలన విలసద్దక్షిణ కరమ్ ।
పరంజానీ కృత్వాదృఢ కలిత కక్షైక వివరం
సమాసీనం వ్యాసం స్మరత నిరతం పుణ్యచరితం ॥

ముప్పది అయిదవ పటలమున 22 శ్లోకములు. ఇది ప్రాణ ప్రతిష్ఠా ప్రకరణము. దీని యందు ప్రాణప్రతిష్ఠామంత్రము న్యాసభేదాస్తత్ స్థానములు, ప్రాణశక్తి ధ్యానము, పురశ్చరణ విధి, ప్రయోగ మంత్రము, దూతీ మంత్రము, ప్రాణప్రతిష్ఠా, ప్రాణప్రతిష్ఠాకాలము, దూతీ స్థానము, స్వహృదయమున విశేష ప్రయోగము, మారణ విశేష ప్రయోగము. సర్వాకృష్యాదికరయోగము మొదలగునవి కలవు.

ముప్పది యారవ పటలమున 63 శ్లోకములు. దీనియందు సంతానము కలుగకుండుటకు కొన్ని హేతువులు, సంతానోత్పత్తికి కొన్ని ప్రయోగములు, హుతాహుసంఖ్య, సంకోచ మంత్రము, భూత మంత్రము, గురులక్షణము. గ్రాహ్య శిష్యలక్షణము, వర్జ్యశిష్యలక్షణము, దీక్షిత శిష్య ఆచారము పంచ విధ తంత్ర వివరణ కలవు.

రమ్యమప్యుజ్జ్వలమపి మనసోఽపి సమీహితమ్ ।
లోకవిద్వేషణం వేశం నగృహ్ణీయాత్ కదాచన ॥

అని సాధకులకు శ్రీ భగత్పాదుల హితవచనము

యదాశ్రయా విప్రకృతి స్వభావతో
విభిన్నతారాది సముత్థితౌజసః
జగంతి పుష్ణాంతి రవీందువహ్నయో
నమోస్తు తస్మై పరిపూర్ణ తేజసే ॥

శ్రీః

శ్రీః

# శ్రీ శంకర భగవత్పాదుల వేదాన్తప్రకరణ గ్రంథాలు

డా. పుల్లెల శ్రీరామచంద్రుడు

శ్రీ శంకరభగవత్పాదులు ఉపనిషద్బ్రహ్మసూత్ర భగవద్గీతలపై ప్రసన్న గంభీరములైన భాష్యాలు రచించి, ఉపనిషత్ప్రతిపాద్యమైన అద్వైత తత్త్వాన్ని ప్రచారంలోనికి తీసికొని వచ్చినారు. పై వ్యాఖ్యలకు ప్రస్థానత్రయ మని పేరు. సంస్కృత భాషతో పరిచయం మాత్రమే కాకుండా వివిధ శాస్త్రాల లోకూడా పరినిష్ఠితమైన జ్ఞానంకూడా ఉన్నవారు మాత్రమే ప్రస్థానత్రయం పఠించి అందులో ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని అర్థం చేసుకొనగలుగుతారు,ఎందుచేతననగా ఈ ప్రస్థానత్రయంలో అద్వైతసిద్ధాంత ప్రతిపాదనంతోపాటు ప్రసంగవశం చేత ఇతరమత విమర్శకూడా చేయబడింది. ఆ పూర్వపక్ష సిద్ధాంతాదులను సరిగా అర్థంచేసుకోవడం అధికశ్రమసాధ్యం. అందుచేత భగవత్పాదులు మధ్య మందాధికారులను దృష్టిలో ఉంచుకొని అనేక ప్రకరణ గ్రంథాలు రచించినారు. వీటిలో ప్రతిపాదించిన విషయం కూడా అద్వైతసిద్ధాంతమే. అయితే వీటిలో పరమత నిర్దేశం అక్కడక్కడ అతి స్వల్పంగా ఉన్నా అద్వైత సిద్ధాంత ప్రతి పాదనకే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడినది. అంతే కాకుండా. కొన్ని ప్రకరణ గ్రంథాలలో అద్వైత సిద్ధాంతాలకి సంబంధించిన కొన్ని అంశాలను ఎక్కువగా ప్రతిపాదించడం జరిగింది. బృహత్ప్రమాణాలైన "సర్వవేదాంత సిద్ధాంత సార సంగ్రహము"; "ఉపదేశసాహస్రి", "వివేక చూడామణి" మొదలైన గ్రంథాలలో వేదాన్త సిద్ధాంతం సమగ్రంగా ప్రతిపాదింపబడినది. అందుచేత ఈ ప్రకరణ గ్రంథాలను గూర్చి ముచ్చటించుకొనడానికి పూర్వం శ్రీ శంకర భగవత్పాదులు ప్రతిపాదించిన అద్వైత సిద్ధాంత స్వరూపాన్ని గూర్చీ, దానికంటె కూడా ముందు శంకర భగత్పాదుల కాలంనాటికి ప్రచారంలో ఉన్న ఇతర సిద్ధాంతాలను గూర్చి సంగ్రహంగా తెలుసుకోవడం అవసరం.

జీవాత్మ, పరమాత్మ, ప్రపంచకము వీటి స్వరూపాన్ని గూర్చి, వీటి పరస్పర సంబంధాన్ని గూర్చి చర్చించే శాస్త్రాలకు దర్శనాలని పేరు. తత్త్వాన్ని చూపుతాయి కాబట్టి వీటికా పేరు వచ్చినది. వేద ప్రామాణ్యాన్ని అంగీకరించేవారు "ఆస్తికులు" అంగీకరించని వారు "నాస్తికులు" అనే అభిప్రాయాన్ని బట్టి మన దేశంలో చిరకాలంనుంచి ఆరు నాస్తిక దర్శనాలూ, ఆరు ఆస్తిక దర్శనాలూ ప్రచారంలో ఉన్నాయి. వీటిలోకూడా ఎన్నో అవాంతర భేదాలు ఉన్నాయి. వీటి కాలక్రమాన్ని నిర్ణయించడంకూడా అసాధ్యమైన పని. చార్వాక-జైన-బౌద్ధ దర్శనాలు. సాంఖ్య - యోగ - న్యాయ - వైశేషిక - పూర్వ మీమాంసా - ఉత్తరమీమాంసా (వేదాంత) దర్శనాలు ఆస్తిక దర్శనాలు. బౌద్ధులలో మాధ్యమికులు. యోగాచారులు, సౌత్రాంతికులు, వైభాషికులు అని నాలుగు విభేదాలు ఉండడం చేత నాస్తిక దర్శనాలుకూడా ఆరు అనే ప్రసిద్ధి ఏర్పడినది.

చార్వాక మతము :

చార్వాకులు కేవల భౌతికతావాదులు. వీరికి ప్రత్యక్షం ఒక్కటే ప్రమాణం అనుమాన - శబ్దాదులు పూర్తిగా ఆధార పడదగిన ప్రమాణాలు కాదు. మనకు ప్రత్యక్షంగా కనబడేవి భూమి, జలం, అగ్ని, వాయువు అనే నాలుగు భూతాలే. ప్రపంచకం అంతా ఈ భూతాల కలయిక చేత కలిగిన సృష్టియే, చైతన్యవంతులనుకొనే మానవాదులతో కూడా ఈ భూతచతుష్టయం కంటె వ్యతిరిక్తమైన ఆత్మ అనేది లేదు. కొన్ని వస్తువుల కలయికచేత మాదకతా శక్తి పుట్టినట్లు ఒక విధమైన భూతాల కలయిక చేత చైతన్యంపుట్టి కొంతకాలానికి దేహం నశించడంతో అదికూడా నశిస్తుంది. అందుచేత ఈ దేహం నశించిన తరువాతకూడా ఆత్మ అనేది ఉంటుందనీ, ఈ దేహంతో చేసిన పుణ్యపాపాదుల ఫలితం అనుభవించడానికి మళ్లీ జన్మ ఎత్తుతూ ఉంటుందనీ అనుకోవడం మూఢ విశ్వాసం. సృష్టివినాశం మొదలైనవి భూతాల కలయిక, విడిపోవడం వంటి క్రియలద్వారా స్వాభావికంగా జరిగిపోతూ ఉంటాయి. వీటికి కారణంగా ఒక పరమేశ్వరుడనేవాడు ఉన్నాడని కాని, అతనిని సంతృప్తి పరచడానికి తపోదానాదులు చెయ్యాలనికాని, యజ్ఞాదులు చేస్తే స్వర్గాదులు లభిస్తాయని కాని చెప్పేవారంతా మోసగాళ్లు. స్వలాభపరులై పురుష ప్రయత్నం చేయలేని కొందరు పండితులు కల్పించిన వేదాలకు ఏ మాత్రమూ ప్రామాణ్యం లేదు.

"అగ్నిహోత్రం త్రయో వేదా స్త్రిదణ్డం భస్మగుణ్ఠనమ్
బుద్ధిపౌరుషహీనానాం జీవికేతి బృహస్పతిః"

అందుచేత అంగనాలింగనాదులవల్లకలిగే సుఖమే స్వర్గం. కంటకాదుల వల్ల కలిగే బాధే నరకం. రాజే పరమేశ్వరుడు. దేహ పరిత్యాగమే మోక్షం.

యజ్ఞంలో బలిఇచ్చిన పశువు స్వర్గానికి వెళ్లేపక్షంలో యజమానుడు తన తండ్రినే బలి ఇవ్వవచ్చుకదా!

"పశుశ్చేన్నిహతః స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి
స్వపితా యజమానేన తత్ర కస్మాన్న హింస్యతే"

మరణించినవారికోసం ఇక్కడ పెట్టే శ్రాద్ధం మరణించినవారికి తృప్తి కలిగిస్తే దూరప్రయాణంమీద బయలుదేరినవాళ్ళు తమతోకూడా ఆహారం తీసికొని పోవడం ఎందుకు? వాళ్లకోసం ఇంటిదగ్గర ఎవరికైనా భోజనం పెట్టుతూ ఉంటే చాలు కదా?

"మృతానామపి జన్తూనాం శ్రాద్ధం చేత్తృప్తికారణమ్
గచ్ఛతామిహ జన్తూనాం వ్యర్థం పాథేయ కల్పనమ్"

ఇక్కడ దానం చేస్తే స్వర్గంలోవున్నవాళ్లకు తృప్తి లభించే పక్షంలో మేడమీదఉన్నవాళ్ల తృప్తికోసం క్రింద ఎవరైనా భోజనంచేస్తే సరిపోతుందికదా.

"స్వర్గస్థితా యదా తృప్తిం గచ్ఛేయ స్తత్ర దానతః
ప్రాసాదస్యోపరిస్థానామత్ర కస్మాన్న దీయత్"

మృతులకోసం ప్రేతకార్యాలు చేయాలి. ఇది ఇవ్వాలి. అది ఇవ్వాలి అని అంటూ ఇదంతా తమ జీవనంకోసం బ్రాహ్మణులు కల్పించినదే.

"తతశ్చ జీవనోపాయో బ్రాహ్మణైర్విహిత స్త్విహ
మృతానాం ప్రేతకార్యాణి న త్వన్యద్విద్యతేక్వచిత్"

అందుచేత జీవించినన్నాళ్లూ సుఖంగా జీవించాలి. అప్పుచేసి నెయ్యి త్రాగాలి. దేహం భస్మం అయిపోయిన తరవాత మళ్లీ రమ్మంటే వస్తుందా?

"యావజ్జీవేత్సుఖం జీవేదృణం కృత్వా ఘృతం పిబేత్
భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః"

ఇది చారువాక్కులైన చార్వాకుల మతం. బృహస్పతి అనేవాడు ఈ మతం ప్రచారంలోనికి తీసికొని వచ్చినాడనీ, ఏతాదృశ ప్రచారక పరంపరలో చార్వాకుడు అనేవాడు ఒకడుండడంచేత దీనికా పేరు వచ్చినదనీ అంటారు.

## జైన దర్శనము :-

జైనమతంకూడా అతిప్రాచీనమైనది. దీనిని ఆయా కాలాలలో ఆవిర్భవించిన ఇరువది నలుగురు తీర్థంకరులు స్థాపింప ప్రచారంచేశారు.
కర్మబంధాన్ని జయించడంచేత వీరికి జైనులని పేరు. బుద్ధునికి సమకాలీనుడైన వర్ధమానమహావీరుడు ఇరువదినాల్గవ తీర్థంకరుడు. జైనులు ప్రత్యక్షాన్నిమాత్రమే కాకుండా అనుమాన - శబ్దాలనుకూడా ప్రమాణాలుగా అంగీకరిస్తారు. తీర్థంకరాదుల ఉపదేశాదులు శబ్దప్రమాణంలో చేరుతాయి. ప్రత్యక్షగోచరమైన పృథివీ - జల - వహ్ని - వాయువులే కాకుండా ఆకాశము. కాలము, ధర్మము, అధర్మము, అనే తత్త్వాలు కూడా ఉన్నాయి. ఈ ధర్మాధర్మాలు ప్రసిద్ధ ధర్మాధర్మాలకంటె భిన్నమైనవి. చలనానికి ఉపకరించేది ధర్మం. స్థితికి ఉపకరించేది అధర్మం. వీటికన్నింటికంటె భిన్నమైన ఆత్మకూడా ఉన్నది. ఎన్ని శరీరాలో అన్ని ఆత్మలు. వృక్ష లతాదులలోను, చివరికి రజఃకణాదులలోనూకూడా ఆత్మలున్నాయి. అయితే ఈ జీవాత్మల జ్ఞానంలో తారతమ్యం ఉంటుంది. దీనికి కారణం కర్మావరణం. ఈ ఆవణం దూరమైనపక్షంలో ప్రతీ జీవాత్మకూకూడా. అనంతజ్ఞానాన్నీ, అనంత శక్తినీ, అనంతానందాన్నీ పొందగల సామర్ధ్యం ఉన్నది. కర్మబంధాన్ని తొలగించుకొనడానికి సమ్యగ్దర్శనము. సమ్యగ్జ్ఞానము, సమ్యక్చరిత్రము అనే రత్నత్రయాన్ని పరిపక్షించుకోవాలి. తీర్థంకరాదుల ఉపదేశాలపై అచంచలవిశ్వాసం సమ్యగ్దర్శనం; వారు బోధించిన తత్త్వాన్ని అర్థం చేసుకోవటం సమ్యగ్జ్ఞానం; సత్యాహింసాద్యభ్యాసం సమ్యక్చరిత్ర. వీటిద్వారా జీవుడు కర్మబంధంనుంచి దూరుడై తనకు సహజమైన సర్వజ్ఞత్వ - సర్వశక్తత్వాదులను పొందగలుగుతాడు. ఇదే మోక్షం. జైనులు పరమేశ్వరుని అంగీకరింపకపోయినా పరమేశ్వరునికున్న సర్వజ్ఞత్వాదులు తీర్థంకరులకు ఉన్నవని అంగీకరించి వారిని పూజిస్తాడు.

జైనదర్శనములో "స్యాద్వాద" మనేది ఒక నూతనవాదము. దీనికే "సప్తభంగీనయ"మని పేరు. ఒకసమయంలో, కొన్ని పరిస్థితులలో, ఒక వస్తువును ఒక దృష్టికోణంతో చూచినట్లైతే అది ఒకవిధంగా కనబడుతుంది. అదే వస్తువు మరొకసమయంలో, వేరు పరిస్థితులలో మరొకవిధంగా కనబడుతుంది. ఈసత్యాన్ని పురస్కరించుకొని అంగీకరించబడినది ఈ సప్తభంగీనయం.

(1) స్యాదస్తి=ఉండవచ్చును. (2) స్యాత్‌నాస్తి=లేకపోవచ్చును. (3) స్యాత్ అస్తిచ నాస్తిచ=ఉండవచ్చును లేకపోవచ్చునుకూడా (4) స్యాత్ అవక్తవ్యమ్=వర్ణింపశక్యము కాకపోవచ్చును (5) స్యాత్ అస్తిచఅవక్తవ్యంచ= ఉండవచ్చును, వర్ణింపశక్యము కాకపోవచ్చును కూడా (6) స్యాత్ నాస్తి చ అవక్తవ్యంచ=లేకపోవచ్చును, వర్ణింపశక్యము కాకపోవచ్చును (7) స్యాత్ అస్తిచ నాస్తిచ అవక్తవ్యంచ=ఉండవచ్చును, లేకపోవచ్చును- వర్ణింప శక్యము కాకపోవచ్చును.

ఈ సప్తభంగీనయాన్ని బౌద్ధులు, నైయాయికులు, వేదాంతులు మొదలైనవారు ఖండించినారుగాని పరిశీలించి చూస్తే, ఏదో ఒక భూమికలో ఇలాంటి విరుద్ధ స్వభావాన్ని బుద్ధ్యగోచరము, మాయ, వర్ణనాతీతము, అనిర్వచనము ఇత్యాది పదాలతో ప్రతిదర్శనంలోనూ అంగీకరించవలసియే ఉంటుంది.

## బౌద్ధ దర్శనము :

బుద్ధుడు (క్రీ.పూ. ఆరవశతాబ్దం) నిరంతర తపస్సుచేసి నాలుగు సత్యాలను కనుగొని ప్రజలకి బోధించాడు. (1) ఈ ప్రపంచకంలో దుఃఖం ఉన్నది. (2) ఈ దుఃఖానికి కారణం ఉన్నది. (3) దీనిని పూర్తిగా తొలగించవచ్చును. (4) అందుకు మార్గం ఉన్నది - అనేవి ఈ సత్యాలు.

1) ప్రపంచకంలో దుఃఖం ఉన్నదనే విషయం అందరికీ తెలిసినదే. అయితే ఇది కేవలం పైపైన కనబడేది కాదు. స్థిర మూలమైనది. సుఖం అనుకొనే దానిలో కూడా దుఃఖం ఉన్నది అనేది మొదటి సత్యం (2) కార్య కారణ భావసమన్వయం చేత కనుగొన్నదిది. రెండవ సత్యం. ఒక భౌతికపదార్థమైనా,

మానసిక పదార్థమైనా, దాని స్థితి ఇతర పదార్థాల స్థితిపై ఆధారపడి ఉంటుంది. స్వతంత్ర సత్త ఉన్న పదార్థం ఏదీలేదు. అందుచేత ఈ ప్రపంచకంలో స్థిరంగా ఉండేది ఏదీలేదు. అన్ని వస్తువులూకూడా మార్పు చెందుతూ ఉంటాయి. ఇలాంటి పపంచకంలో పుట్టడమే మన దుఃఖాలకి మూలకారణం.ఇలా పుట్టడానికి కారణం విషయవాంఛ దీనికే తృష్ణ అని పేరు. ఈ తృష్ణకు కారణం అజ్ఞానం. మనకు అజ్ఞానమే లేకపోతే తృష్ణ కలగదు. తృష్ణ లేకపోతే ఈ భూమి మీద పుట్టడం గాని దుఃఖం గాని ఉండేవి కావు.

3) పైన చెప్పినట్లు దుఃఖాలకి కొన్ని కారణాలున్నట్లు తేలింది. ఆ కారణాలను తొలగింపగానే కార్యమైన దుఃఖం కూడా తనంతట తానే తొలగిపోతుంది. ఇది మూడవ సత్యం. (4) దుఃఖకారణం తొలగించడానికి ఒకమార్గం ఉన్నదనేది నాల్గవ సత్యం. ఈ మార్గానికి ఎనిమిది అంగాలు ఉన్నాయి. ఇది అష్టాంగకమార్గం. దీన్ని అనుసరించడానికి అందరూ అధికారులే. (1) సమ్యగ్ దృష్టి (2) సమ్యక్ సంకల్పము, (3) సమ్యగ్వాక్ (4) సమ్యక్కర్మాంతము (5) సమ్యగాజీవము (6) సమ్యగ్వ్యాయామము (7) సమ్యక్స్మృతి (8) సమ్యక్ సమాధి అనేవి అష్టాంగాలు.

1) పైన చెప్పిన సత్యచతుష్టయాన్ని బాగా తెలుసుకోవడం సమ్యగ్దృష్టి (2) సత్యాలను తెలుసుకొని వాటిని ఆచరణలో పెట్టడానికై నిర్ణయించుకోవాలి. వైరాగ్యం పెంపొందించుకొని, ఇతరుల విషయంలో దుష్టభావాలు విడనాడి ఎవరికీ ఏ అపకారమూ చేయకుండా ఉండాలి. ఇది సమ్యక్ సంకల్పము. (3) అసత్య - పరదూషణాదులు మానడం సమ్యగ్వాక్. (4) అహింస, అస్తేయము, ఇంద్రియ నిగ్రహము, సత్యవ్రతము, అమదము అనే పంచశీలాన్ని అలవరచుకొని జీవయాత్ర కొనసాగించడం సమ్యక్కర్మాంతము. (5) న్యాయ సంమతమైన జీవనం గడపడం సమ్యగాజీవనం (6) మానవుడు ఎంత ప్రయత్నం చేసినా పూర్వవాసనలు వానిని చెడుమార్గాలవైపు త్రిప్పుతూనే ఉంటాయి. అందుచేత జాగరూకత వహించి ఉండాలి - (అ) వెనుకటి చెడ్డ భావాలన్నీ మనస్సులోనుంచి తొలగించుకోవాలి (ఆ) క్రొత్తవి చెడ్డ భావాలేవీ మనస్సులో ప్రవేశించకుండా చూచుకోవాలి. (ఇ) మనస్సును ఎల్లప్పుడూ సద్భావాలతోనింపాలి (ఈ) ఆ సద్భావాలు తొలగిపోకుండా చూచుకోవాలి. ఇలాంటి చతుర్విధ ప్రయ

త్వానికి సమ్యగ్వ్యాయామము అని పేరు. (7) తానునేర్చిన సత్యాలు సర్వదా స్మరిస్తూ ఉండడం సమ్యక్ స్మృతి. (8) పై ఏడు అంగాలలోనూ పరినిష్ఠితమైన స్థితిని పొందగలిగిన సాధకుడు చిత్తాన్ని నిశ్చలం చేసుకొని ధ్యానస్థితి పొంద గలుగుతాడు. ఇది సమ్యక్ సమాధి. ఈ అష్టాంగ మార్గాన్ని అనుసరించినవానికి నిర్వాణం లభిస్తుంది.

బుద్ధుడు తాత్త్విక సిద్ధాంతాలేవీ మనకు గ్రంథ రూపంలో అందియ్య లేదు కాని ఆతని మౌలికోపదేశాలను ఆధారంగా చేసికొని తరువాతవారు అనేక సిద్ధాంతాలను ప్రచారంలోనికి తెచ్చారు. వీటిలో (1) మాధ్యమిక మతము లేదా శూన్యవాదము (2) యోగాచారమతము లేదా విజ్ఞానవాదము (3) సౌత్రాంతిక మతము (4) వైభాషిక మతము అనేవి ప్రసిద్ధమైనవి; ప్రధానమైనవి.

## 1) మాధ్యమిక మతము :-

ఈ మతం ప్రకారం ప్రపంచం అంతా అసత్యం మానసిక ప్రపంచము భౌతికప్రపంచమూకూడా అజ్ఞానకల్పితాలే, అయితే దృశ్యమైన ఈ ప్రపంచానికి ఆధారమైన సత్యమైన తత్త్వం ఏదైనా ఉన్నదా లేదా అని ప్రశ్న. అలాంటిది కూడా ఏదీ లేదనియే వీరి అభిప్రాయం. అందుచేతనే దీనికి "శూన్యవాదం" అని పేరు అని చాలామంది పండితుల అభిప్రాయం. శూన్యం అనగా ఏమీలేదనిఅర్థం కాదు. బౌద్ధులు ఈపదాన్ని ప్రసిద్ధమైన "ఏమీలేకపోవడం"అనేఅర్థంలో కాకుండా ఒక పారిభాషికపదంగా ప్రయోగించినారు. దృశ్యప్రపంచానికి ఆధారమైన పర తత్త్వం ఉన్నదనికాని, లేదనికాని ఉన్నదీ లేదు అనికానీ, ఉన్నదీ కాదు లేనిదీ కాదు అనికాని వర్ణించిచెప్పడానికి శక్యమైనది కాదు. మన ఇంద్రియాలకీ,మనస్సు కూ అందే గుణాలూ, విశేషాలూ ఏవీ లేకపోవడమే ఇందుకు కారణం. అందుచేత శూన్యవాదులని చెప్పబడే మాధ్యమికులు దృశ్యమాన ప్రపంచాతీతమైన ఒక పర తత్త్వాన్ని అంగీకరిస్తారు. అది సర్వగుణశూన్యం అవటంచేత శూన్యం అని అంటారు" అని కొందరు ఆధునిక పండితుల అభిప్రాయం. అయితే కుమారిల భట్ట - శంకరభగవత్పాదాది ప్రాచీనాచార్యులుకూడా ఈ వాదాన్ని ఈ అర్థంలో గ్రహించినట్లు లేదు. దీని అర్థం ఇదే అయినట్లయితే విజ్ఞానవాదానికి దీనికీఅంతగా భేదం ఉండదు. అందుచేత ఈ విషయం ఇంకా విమర్శయోగ్యమే అనిచెప్పాలి.

**యోగాచార మతము :-**

ఈ మతం ప్రకారం బాహ్యప్రపంచం అంతా కాల్పనికం. పరమసత్యమైన విజ్ఞానమే బాహ్యప్రపంచరూపంలో కనబడుతుంది. ఈ విధంగా అంగీకరించడంచేత "విజ్ఞానవాద"మనీ, యోగసాధనద్వారామాత్రమే బాహ్యప్రపంచాతీత పరతత్త్వానుభవం కలుగుతుందని చెప్పడంచేత "యోగాచారమత"మనీ దీనికిపేర్లు.

**సౌత్రాంతిక మతము :-**

(బాహ్యానుమేయతావాదము), ఈ మతం ప్రకారం బాహ్యప్రపంచమూ మానసిక ప్రపంచమూకూడా సత్యాలే. అంతరవిజ్ఞానమే బాహ్యప్రపంచకంగా కనబడుతున్నది అని చెప్పేపక్షంలో ప్రపంచం అంతా అన్నివేళల్లోనూ జ్ఞానగోచరం కావాలి. అలా జరగటంలేదు. బాహ్యవస్తువు ఒకటి వుంటేనేకాని జ్ఞానం కలగటం లేదు. ఎదుట ఒక వృషభం ఉన్నప్పుడు మాత్రమే మనకు వృషభజ్ఞానం కలుగుతున్నది. అది లేనప్పుడు కలగటంలేదు. అందుచేక జ్ఞానం కలగటానికి బాహ్యవృషభస్థితి కారణం. అయితే - మనకు వృషభజ్ఞానం కలగడాన్నిపట్టి, వృషభం ఉన్నట్లు ఊహిస్తున్నాము. అందుచేత బాహ్యపదార్థాలన్నీ అనుమేయాలే.

**వైభాషిక మతము :-**

ఈ మతంప్రకారం బాహ్యప్రపంచము, మానసిక ప్రపంచమూ కూడా సత్యమైనవే. బాహ్యప్రపంచం సౌత్రాంతికులు చెప్పినట్లు అనుమాన వేద్యంకాక ప్రత్యక్షవేద్యం.

బౌద్ధులు వేదప్రామాణ్యాన్నీ, ఈశ్వరాస్తిత్వాన్నీ అంగీకరించరు. వీరి మతం ప్రకారం జీవునితోసహా ప్రతివస్తువూ క్షణికమే. కర్మవశంచేత జీవనం నదీప్రవాహంవలె, దీపశిఖవలె, అవిచ్ఛిన్నంగా నడిచిపోతూ ఉండడంచేత ఏకత్వభ్రాంతి కలుగుతూన్నది అని వీరి అభిప్రాయం.

వేద ప్రామాణ్యాన్ని అంగీకరించకపోయినా జైన బౌద్ధ మతాలమీద వైదికమత ప్రభావం ఎంతగా ప్రసరించిందో వారంగీకరించిన కర్మసిద్ధాంత - సాధనామార్గాదులద్వారా స్పష్టం అవుతుంది. బౌద్ధులమీద ఉపనిషత్ప్రతిపాదితమైన "శుద్ధచిద్రూపమైన బ్రహ్మ ఒక్కటే పరతత్త్వము; భేదాలన్నీ కల్పితాలు" అనే సిద్ధాంతం ప్రభావం అత్యధికతగా ప్రసరించినదని చెప్పటంలో సందేహం లేదు.

సాంఖ్య-యోగ దర్శనాలు ;-

ఈ రెండూ చాలా దగ్గరసంబంధం ఉన్న దర్శనాలు. ప్రకృతి, పురుషుడు (జీవుడు) అనేవి రెండే మూలతత్త్వాలు. ప్రకృతి జడము. జీవుడు చైతన్యస్వరూపుడు. మనోదేహేంద్రియాదులకంటె భిన్నుడు. ఇతడు సాక్షివలె ఉండి ప్రపంచవ్యవహారాలన్నీ చూస్తూఉంటాడు. ప్రాపంచిక వ్యవహారాలన్నీ ప్రకృతే నడుపుతూ ఉంటుంది. జీవుడు అనుభవిస్తూ ఉంటాడు. ఈ విధంగా జీవునికి భోక్తృత్వమే కాని కర్తృత్వంలేదు, ఎన్ని దేహాలో అంతమంది జీవులు.

ప్రకృతి ప్రపంచకానికి మూలకారణం. అచేతనం - సత్వ రజస్తమో గుణాత్మకం. ఈ మూడుగుణాలూ సామ్యావస్థలో ఉన్నప్పుడు సృష్టి ఉండదు. అపుడు ప్రకృతి (ఈ అవస్థలో దీనికి ప్రధానము అని పేరు)నిశ్చలంగాఉంటుంది. పూర్వకర్మానుసారంగా పురుషునకు ప్రకృతితో సంయోగం ఏర్పడగా, మూడు గుణాలలో తారతమ్యం ఏర్పడి సృష్టిప్రారంభం అవుతుంది. ప్రకృతినుంచిముందు మహత్తత్వం పుడుతుంది. దీనిలో పురుషుని చైతన్యం ప్రతిబింబించి అది చేతన పదార్థంవలె కనబడుతుంది. అప్పుడు దానిని, సకలజగదుత్పత్తిహేతువైన బుద్ధి తత్త్వమని అంటారు. ఈ బుద్ధితత్త్వం అహంకారంగా పరిణమిస్తుంది. ఇది"నేను" "నాది" అనే అభిమానానికి కారణం. దీనితో సంబంధించడంచేత పురుషుడు నేనే కర్తను అని అనుకుంటూ వుంటాడు, సత్త్వగుణ ప్రధానమైన అహంకారంనుంచి త్వక్ - చక్షుః - శ్రోత్ర - ఘ్రాణ - రసనలు అనే ఐదు జ్ఞానేంద్రియాలు వాక్- పాణి - పాద-పాయు-ఉపస్థులనే ఐదు కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియ - కర్మేంద్రియోభయాత్మకమైన మనస్సు జనిస్తాయి. తమఃప్రధానమైన ప్రధానంనుంచి సూక్ష్మభూతాలు, వాటి నుండి పంచస్థూలభూతాలు జనిస్తాయి. ఈ విధంగా సాంఖ్యులు,

యోగులూ కూడా ఇవవైనాలుగు తత్త్వాలు అంగీకరిస్తారు. జీవుడు కర్మబంధంలో ఉండి అజ్ఞానవశంచేత, అనాత్మకమైన దేహేంద్రియాదులకు చెందిన సుఖదుఃఖాదులను తనపై ఆరోపించుకొని సుఖదుఃఖవశంవదుడవుతూ ఉంటాడు. ఈ జ్ఞానం తొలగగానే లౌకిక వ్యవహారాలన్నీ ఒక విధమైన నిర్లిప్తతతో చూస్తూ ఉంటాడు. ఈస్థితికే ముక్తి, కైవల్యడు, అపవర్గము అనిపేర్లు. జీవుడు ఈ స్థితిని ఈ శరీరం ఉండగానే సంపాదింపగలిగితే అది జీవన్ముక్తి. సాంఖ్యులు ఈశ్వరాస్తిత్వాన్ని అంగీకరింపరు. నవీనసాంఖ్యులు మాత్రం అంగీకరిస్తారు. ఈశ్వరాస్తిత్వం అంగీకరించకపోయినా వేదప్రామాణ్యం అంగీకరించడంచేత వీరు ఆస్తికులుగా పరిగణింపబడుతున్నారు.

యోగులుకూడా చతుర్వింశతి తత్త్వాలు అంగీకరంచి, తదతీతుడైన ఈశ్వరుణ్ణికూడా అంగీకరిస్తారు. అతడు సర్వజ్ఞత్వ సర్వశక్తత్వాది గుణవిశిష్టుడు. చిత్తంలో కలిగే అనేక వృత్తులను (భావాలను) అరికట్టి దానిని ఒకలక్ష్యంపై నిలిపిననేకాని వివేకజ్ఞానం కలుగదు. అందుచే దానికి తగిన అనేక ఉపాయాలు ఈ దర్శనములో చూపబడినవి. ఈశ్వరునిపై చిత్తం నిలపడం చిత్తవృత్తిని నిరోధించే ప్రధానోపాయాలలో ఒకటి.

## న్యాయవైశేషికములు :-

ఈ రెండు దర్శనాలూకూడా పరస్పరం చాలా సన్నిహిత సంబంధం కలవి. ప్రమాణాలు, శాస్త్రవాదము జరిగేటప్పుడు అనుసరించవలసిన పద్ధతులు, ప్రపంచములోని పదార్థాలు, మొదలైన విషయాలు దర్శనాలలో చర్చింపబడినవి. వీరికిగూడా మోక్షసంపాదనమే పరమలక్ష్యము. ఇది తత్త్వజ్ఞానంచేత సిద్ధిస్తుంది. ఆత్మ దేహేంద్రియ మనోబుద్ధ్యాదులకంటె భిన్నమే అయినా అజ్ఞానంచేత తదభిన్నంగా కనబడుతుంది. మనస్సు అణుపరిమాణం. నిత్యం. ఇది ఆత్మకు సుఖదుఃఖాద్యనుభవం కలిగిస్తుంది. ఆత్మ జడం. దీనికి జ్ఞానం సహజంకాదు.మనస్సు ద్వారా ఇంద్రియాలతో సంబంధం ఏర్పడినప్పుడు ఆత్మ జ్ఞానం కలుగుతూఉంటుంది. ఈవిధంగా జ్ఞానంఅనేది ఆత్మకి ఆగంతుకం అవడంచేత ముక్తావస్థలో దీనికిజ్ఞానం ఉండదు. ఆత్మ సర్వగతం. మిథ్యాజ్ఞానంవల్ల కలిగిన రాగద్వేషాదులచే ప్రేరేపింపబడి సుకృతదుష్కృతాలు ఆచరిస్తూ సంసారబంధంలో చిక్కుకొనిఉంటుంది.

తత్త్వజ్ఞానం కలిగినతరువాత, అనగా సకల సదార్థాల స్వరూపస్వభావాలు తెలిసి, నాకూ ఈ దేహేంద్రియాదులకూ సంబంధంలేదు అనే జ్ఞానం కలిగిన తరువాత, రాగద్వేషాదులు తొలగి సకలదుఃఖనివృత్తిరూపమైన మోక్షం (అపవర్గం) కలుగుతుంది. ఈ ముక్తస్థితిలో దుఃఖంవలె సుఖంకూడా ఉండదు. వీరి మతంలోదుఃఖాభావమే మోక్షం. జీవులు అనంతసంఖ్యాకులు.

వీరు ముక్తిసహాయంచేత ఈశ్వరాస్తిత్వాన్ని సాధిస్తారు. ఈశ్వరుడు జగత్సృష్టి - స్థితి - సంహారకర్త. జీవులు తమతమ పుణ్య పాప ఫలాలు అనుభవించాలంటే జగత్తు ఉండాలి. అందుచేత ఈశ్వరుడు - పరమాణువులు, కాలము దిక్కు, ఆకాశము, మనస్సు మొదలైనవాటి సహాయంతో జగత్తును సృష్టిస్తాడు. ప్రతి జీవుడూకూడా తత్త్వజ్ఞానం సంపాదించుకొని, ఎప్పుడో ఒకప్పుడు అపవర్గం పొందవచ్చును.

పూర్వమీమాంసా దర్శనము :-

కర్మకాండ ప్రధానమైన వేదాలలోని పూర్వభాగాన్ని ఆధారంగా తీసికొని బయలుదేరిన దర్శనం "పూర్వమీమాంసాదర్శనం". జ్ఞానప్రధానమైన వేదాల ఉత్తరభాగాన్ని ఆధారంగా చేసుకొని బయలుదేరినది "ఉత్తరమీమాంస". దీనికే "వేదాంతం" అనికూడా పేరు.

పూర్వ మీమాంస ప్రకారం వేదం అపురుషేయం. అనగా పురుషులు నిర్మించినదికాదు. అనాదిగా వచ్చుచున్నది; అందుచేత పురుషుల బుద్ధికి సంబంధించిన దోషాలేవీ దీనిలో ఉండడానికి అవకాశం లేదు. కావున ఇది పరమ ప్రమాణం. "ఇది చేయవలెను" అని వేదం విధించినది ధర్మం." ఇలా చేయకూడదు" అని నిషేధించినది అధర్మం. వేదంలో మూడు విధాలైన కర్మలు విధింపబడినవి. (1) కామ్యకర్మలు (2) నిత్యకర్మలు (3) నైమిత్తిక కర్మలు ఏదైనా కోరికతో చేసే కర్మలు కామ్యకర్మలు. అవి చేస్తే ఫలం-అది ఇహలోకానికి సంబంధించినది కావచ్చును-పరలోకానికి సంబంధించివి కావచ్చును-లభిస్తుంది, నిత్యమూ చేయవలసిన సంధ్యావందనాది కర్మలు నిత్యకర్మలు. వీటికి ఫలమేమీ ఉండదు. చేయకపోతే మాత్రం ప్రత్యవాయం కలుగుతుంది. చంద్రగ్రహణాదులు కలిగి

నపుడు చేయవలసిన కర్మలు నైమిత్తిక కర్మలు. ఫలం విషయంలో నైమిత్తిక కర్మలు నిత్యకర్మలవంటివే.

ప్రపంచకం సత్యమైనది. జీవులు అనంత సంఖ్యాకులు, జీవాత్మకు జ్ఞానం సహజం కాదు. కొన్ని పరిస్థితులలో జ్ఞానం పుడుతుంది. ఈ ప్రపంచానికి ఆదికాని అంతం కాని లేదు. ప్రపంచ వ్యవహారం ఇలాగే జరుగుతూ ఉంటుంది. ఇలాజరగడానికి కారణం కర్మయే. అందుచేత జగత్స్రష్ట్యాదులు చేసే భగవంతుడున్నాడని అంగీకరించవలసిన పనిలేదు. పూర్వమీమాంసకులకు కూడా మోక్షమే ప్రధాన లక్ష్యము. మానవుడు ఆత్మ నిగ్రహవంతుడై కామ్యకర్మలు వర్జించి నిత్యనైమిత్తికకర్మలు మాత్రం కేవల కర్తవ్యతా బుద్ధితో ఆచరిస్తూ ఉన్నట్లయితే పాపాలన్నీ నశించి మోక్షం లభిస్తుంది. కోరికలతో ఏ కర్మలూ చేయడం లేదు గాన పునర్జన్మ ఉండదు. ఏ దుఃఖములూలేని స్థితియే మోక్షం. ఈశ్వరాస్తిత్వం అంగీకరించక పోయినా వేద ప్రామాణ్యాన్ని అంగీకరించడం చేత మీమాంసకులు ఆస్తికులుగా పరిగణింపబడుచున్నారు.

శంకర భగవత్పాదులు ఆవిర్భవించి అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించే నాటికి ప్రచారంలో ఉన్న మతాలలో ప్రధానమైనవి ఈ మతాలు. వీటిలో మాధ్యమిక - యోగాచారులు తప్ప మిగిలిన వాళ్లందరూ జగత్తు నిత్యమనీ, జీవులకూ ఈశ్వరునికీ (ఈశ్వరుణ్ణి అంగీకరించే పక్షంలో) భేదమున్నదనీ, జీవులలోకూడా పరస్పరం భేదం ఉన్నదనీ ఈ భేదాలూ, ప్రపంచకంలో కనబడే అన్ని భేదాలూ కూడా సత్యమైనవీ నిత్యమైనవీ అనీ అంగీకరిస్తారు. మీమాంసకుల దృష్ట్యా, వేదాంతములని చెప్పబడే ఉపనిషత్తులకు అంతగా ప్రామాణ్యం లేదు. వారి లెక్క ప్రకారం వేదం అంతా కర్మకాండను మాత్రమే బోధిస్తుంది. వేదాల పరమతాత్పర్యం కర్మబోధనమే. దానికి విరుద్ధంగా ఏవైనా వాక్యాలుకాని, వేద భాగాలు కాని ఉన్నట్లయితే వాటిని కర్మసిద్ధాంతానికి విరోధంలేకుండా అన్వయించుకోవాలి. అందుచేత ఉపనిషత్తులలో జీవుణ్ణి గూర్చి, ఆత్మకు గూర్చి చెప్పే వాక్యాలు ఉంటే అవి కేవలం కర్మలు ఆచరించే జీవులను స్తుతించే వాక్యాలుగా మాత్రమే గ్రహించాలి. వాటి కంతవరకు మాత్రమే ప్రామాణ్యం. నిజమైన ప్రామాణ్యం ఆయా కర్మలను బోధించే వాక్యాలకు మాత్రమే.

వేదాల పూర్వభాగంలో కర్మలను విధించడమూ, ఉత్తర భాగంలో జ్ఞానమార్గాన్ని ఉపదేశించడమూ చూచి భగవత్పాదుల కంటె పూర్వం ఉన్న కొందరు మోక్షం కలగాలంటే కర్మలనూ ఆచరించాలి, జ్ఞానం కూడా సంపాదించాలి అనే మతాన్ని ప్రచారం చేశారు. దీనికి జ్ఞానకర్మ సముచ్చయవాదం"అని పేరు. అద్వైతాన్ని గూర్చి చెప్పేటప్పుడు మనం ఈ ప్రాచీన సిద్ధాంతాలను మాత్రమే దృష్టిలో ఉంచుకొని పరిశీలించాలి గాని, తరవాత వచ్చిన మతాల దృష్ట్యా చూస్తే దాని స్వరూప స్వభావాలు సరిగా తెలియవు,

శాంకరాద్వైత దర్శనము :

ఇది ఉపనిషత్తుల మీదా, వాటి అర్థం ఎలా నిర్ణయించాలో చెప్పే బ్రహ్మసూత్రాల మీదా ఆధారపడి ఉన్నది.

"సత్పదార్థం ఒక్కటే, దానిలో సజాతీయ భేదంకాని, విజాతీయభేదం కాని, స్వగతభేదం కాని లేదు" అని బోధిస్తూ ఉపనిషత్తులలో అనేక వాక్యాలు ఉన్నాయి. ఆ సత్పదార్థం బ్రహ్మ; లేదా ఆత్మ. ఈ బ్రహ్మవంటిది మరొక రెండవ వస్తువు లేదు గాన దీనిలో సజాతీయ భేదంలేదు. దీని కంటె భిన్నమైన స్వభావం గలది కూడా మరొకటేదీ లేకపోవడం చేత విజాతీయభేదం లేదు. ఒక వృక్షంలో కొమ్మలు, మాను మొదలైన వివిధావయవాలను బట్టి భేదం ఉన్నట్లు స్వగతభేదం కూడా లేదు. ఈ వాక్యాలను ఆధారంగా చేసుకొని శంకరాచార్యులు తమ అద్వైత సిద్ధాంతం ప్రతిపాదించారు.

మీమాంసకులు చెప్పినట్లుగా ఉపనిషద్వాక్యాలన్నీ అర్థవాదవాక్యాలని చెప్పి కొట్టివేయడానికి వీలులేదు. వేదాల పూర్వభాగాలు ఎంత ప్రమాణమో, ఉత్తర భాగాలుకూడా అంత ప్రమాణమే. ఒక భూమికలో వాటికి ప్రామాణ్యం ఉంటే మరొక భూమికలో వీటికి ప్రామాణ్యం ఉన్నది.

ఉపనిషత్తులలో ఉన్న అభేద ప్రతిపాదక వాక్యాలు ప్రమాణం కావాలంటే ఆత్మ వ్యతిరేకమైన ప్రపంచం అంతా కాల్పనికమని అంగీకరించి తీరాలి. అందుచేత శ్రీ శంకర భగవత్పాదులు బ్రహ్మ ఒక్కటే సత్యమనీ, జగత్తు మిథ్య

అనీ, జీవుడు జీవుడుగా మిథ్యఅనీ, అతడు వాస్తవంలో బ్రహ్మ స్వరూపుడనీ అనేక శ్రుతులను ప్రమాణంగా ఉదాహరిస్తూ సయుక్తికంగా ప్రతిపాదించారు. "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః" ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించడానికి ఆధారమైన ఏకైకప్రమాణం శ్రుతియే. శ్రుతిద్వారా ఈ సిద్ధాంత స్వరూపం తెలిసిన తరవాత తదనుగుణంగా యుక్తులు కూడా చూపుతే చూపవచ్చును అని భగవత్పాదుల అభిప్రాయం. ఈ సిద్ధాంతాన్ని సమర్థించడానికి తగిన పద్ధతులుకూడా శ్రుతులలో సూచింపబడి ఉన్నాయి. అద్వైత తత్త్వమే యథార్థమైనా భేదం కనబడడానికి కారణంగా "మాయ" అనేది ఒకటున్నదని శ్రుతివాక్యాలే సూచిస్తున్నాయి. వీటినన్నింటిని పట్టి భగవత్పాదులు తన సిద్ధాంతాన్ని రూపొందించారు.

కనుచీకటిలో పడిఉన్న త్రాడుచూచి, అది త్రాడు అని తెలియకపోవడంచేత (అనగా రజ్జుస్వరూపాజ్ఞానం చేత) అది పాము అని భ్రాంతి చెందుతున్నాము. ఆ సర్ప భ్రాంతికి కారణం అజ్ఞానం. త్రాడు కనబడే సర్పానికి ఆధారం. అదే విధంగా ఈ ప్రపంచంకూడా ఈశ్వర మాయచేత, ఈశ్వరునిపై (బ్రహ్మపై) కల్పింపబడి, అజ్ఞానం ఉన్నంతవరకూ అక్కడ ఉన్నట్లు మనకు కనబడుతుంది. త్రాడుస్వరూపం తెలియగానే సర్పం కనబడకుండా పోయినట్లు బ్రహ్మస్వరూపం తెలియగానే దానిపై మాయా కల్పితమైన ప్రపంచం తిరోహితం అవుతుంది.

మాయకు (అజ్ఞానానికి) "ఆవరణ శక్తి," "విక్షేపశక్తి" అనే రెండు శక్తులున్నాయి. ఉన్న యదార్థస్వరూపాన్ని మరుగు పరిచేశక్తి ఆవరణ శక్తి. దానిమీద లేనిదాన్ని ఉన్నట్లు చూపేశక్తి విక్షేపశక్తి. రజ్జుసర్పోదాహరణంలో - మన అజ్ఞానం రజ్జుస్వరూపాన్ని మరుగుపరచి, అక్కడ లేని సర్పాన్ని ఉన్నట్లు చూపుతున్నది. అట్లే మాయకూడా బ్రహ్మస్వరూపాన్ని మరగుపరిచి దానిమీద ప్రపంచం ఉన్నట్లు చూపుతున్నది. మాయకే "అజ్ఞానము", "అవిద్య" ఇత్యాది నామాంతరాలు ఉన్నాయి. ఈశ్వరునికి సంబంధించినంతవరకు అదిమాయ. జీవులకు సంబంధించినంతవరకు అవిద్య. లేదా అజ్ఞానము. ఉదాహరణకి - ఒక గారడివాడు ఒక రూపాయనాణెం తీసికొని అది చాలా రూపాయనాణాలుగా కనబడేటట్లు చేస్తున్నాడు. అలా చేయగలగడానికి కారణం అతనిలో ఉన్న మాయాశక్తి. చూచేవారు అన్ని నాణాలు చూడడానికి కారణం వారి అజ్ఞానం. అదే

విధంగా ఈశ్వరునిబట్టి ఏదిమాయ అంటున్నామో అదే జీవులనుబట్టి అవిద్యగా అజ్ఞానంగా పనిచేస్తున్నది. ఆమాయగారడీవానికి లొంగి ఉంటుంది. మనం ఆమాయకు లొంగి ఉంటాము. అదే విధంగా మాయ ఈశ్వరునికి లొంగి ఉంటే మనం మాయకు లొంగి ఉంటున్నాం.

త్రాడు మీద కనబడుతూన్న సర్పం ఉన్నదా లేదా అంటే ఉన్నదనీ చెప్పలేము. లేదనీ చెప్పలేము. నిజంగా ఉన్నదంటే అది ఎల్లప్పుడూ కనబడాలి. అలా కనబడడంలేదు. లేదు అంటే అది ఎప్పుడూ కనబడకూడదు. అయితే భ్రాంతి సమయంలో కనబడుతున్నది అందుచేత ఇది ఉన్నదనికాని (సత్) లేనిదనికాని (అసత్) చెప్పడానికి (నిర్వచించడానికి) శక్యంకాదు. అందుచేత ఇది అనిర్వచనీయం. బ్రహ్మమీద కనబడుతూన్న ప్రపంచ విషయంకూడా అంతే. ఇదికూడా అనిర్వచనీయమే. ప్రపంచ ప్రతీతికి కారణమైన మాయకూడా అనిర్వచనీయయే.

ఈ ప్రపంచం అంతా రజ్జువుపైన సర్పం ఆరోపింపబడినట్లు ఆత్మ మీద ఆరోపింపబడినది; వాస్తవంకాదు;" అని తత్త్వసాక్షాత్కారం పొందినవానికి, సర్పభ్రాంతి తొలగి పోయినవానికి దాని స్థానంలో రజ్జువే కనబడినట్లు, ప్రపంచం స్థానంలో ఆత్మయే (బ్రహ్మయే) కనబడుతుంది. అందుచేత శంకర భగవత్పాదులు వ్యావహారిక సత్యము, పారమార్థిక సత్యము అనిరెండు భూమికలు అంగీకరించారు. వ్యావహారిక దృష్టితో చూచినంతవరకు ఈ ప్రపంచమూ, ప్రపంచ వ్యవహారమూ అంతా సత్యమే, పుణ్యపాపాలు ఉన్నాయి. లోకాంతరాలు ఉన్నాయి కర్మఫలం ఉంది. ఈశ్వరుడుకూడా సర్వజ్ఞత్వమూ సర్వశక్తత్వమూ మొదలైన గుణాలతో సగుణంగా ఉన్నాడు. పారమార్థిక దృష్టిలో చూచినపుడుమాత్రం ఈ జగత్తులేదు, జగత్సృష్టిలేదు, సర్వజ్ఞత్వాదులు గల సగుణ బ్రహ్మలేదు; జీవుడూ లేడు. బ్రహ్మ ఒక్కటే పరతత్త్వం.

బ్రహ్మ సచ్చిదానందస్వరూపము; నిత్యసత్యము; మూడు కాలాలలోను అబాధితంగా ఉండేది (సత్). జ్ఞానస్వరూపమైనది (చిత్). ఆనందరూపమైనది. నిర్గుణము, అందుచేతనే దీనిని మాటలలో వర్ణింపజాలము, మనస్సుతో భావన చేయజాలము. ఏదైనా ఒక వస్తువునుగూర్చి భావన చేయాలన్నా, వర్ణించి చెప్పాలన్నా దానిలోవున్న గుణాలు, విశేషాలు, మొదలైనవాటిని పట్టి, అలా చేయడం

కుదురుతుంది. ఏ గుణాలూ, ఏ విశేషాలూ లేనిదానినిగూర్చి ఎలా భావించటం ఎలా వర్ణించడం ? అందుచేత, "ఇది కాదు" "అది కాదు" అనే మాటలలోనే దానినిగూర్చి చెప్పగలుగుతాము.

మాయా శబలితమైనపుడు ఆ బ్రహ్మకే ఈశ్వరుడని పేరు, సర్వజ్ఞత-సర్వశక్తత్వ - సర్వేశ్వరత్వాది గుణాలన్నీ ఈశ్వరునికే చెందుతాయి. ఈ ఈశ్వరునికి ఏ పేరు పెట్టినా పెట్టవచ్చును, స్వరూపం ఒకటే. ఈశ్వరుని స్థితికూడా వ్యావహారిక సత్యభూమికకు చెందినదే. అనగా శుద్ధబ్రహ్మయే, శుద్ధచైతన్యమే, మాయాసంబంధమునుపట్టి ఈశ్వరుడనే పేరుతో పిలవబడుతున్నది, ఆ మాయను దూరంచేస్తే మిగిలేది శుద్ధచైతన్యమే.

ఇంక జీవుడనేవాడు ఎవరు అనేది ప్రశ్న. అంతఃకరణ(మనస్సు) తో సంబంధించిన చైతన్యానికి జీవుడని పేరు. అంతఃకరణలు అనేకం ఉన్నాయి. వాటి సంబంధంచేత ఒకే చైతన్యం అనేకం అన్నట్లు భాసిస్తూన్నది. ఆకాశం ఒక్కటే. అది సర్వత్ర వ్యాపించి ఉన్నది. దానిని వేరువేరు ఉపాధులను పట్టి గృహాకాశం అనీ, మఠాకాశం అనీ, ఘటాకాశం అనీ వ్యవహరిస్తున్నాం. ఆఘటం ఒకచోటనుంచి మరొకచోటికి తీసికొని వెళ్ళినపుడు వెళ్ళేది ఘటమే; ఆకాశం కాదు. అంతఃకరణ - తదవచ్ఛిన్న చైతన్యాల విషయంలోకూడా అంతే. వివిధ ప్రదేశాలకీ, వివిధలోకాలకీ ప్రయాణం చేసేది అంతఃకరణమే. జీవునకు కొన్ని ఆవరణలు ఉన్నాయి, మొదటిది స్థూలదేహం. రెండవది సూక్ష్మదేహం లేదా లింగ శరీరం. మూడవది అంతఃకరణకు ఏది కారణమో అట్టి అవిద్య. దానికే కారణ శరీరం అని పేరు. స్థూలశరీరం ఇక్కడ పడిపోయినా సూక్ష్మశరీరం ప్రయాణాలుచేస్తూ కర్మానుసారంగా వివిధజన్మలు ఎత్తుతూ ఉంటుంది. పంచ జ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, పంచసూక్ష్మభూతాలు అనగా భూతతన్మాత్రలు, మనస్సు, అబుద్ధి అనే పేర్లతో పిలవబడే అంతఃకరణ ఇవి అన్నీకలిసి లింగ శరీరం. అంతఃకరణకే అదిచేసే పనులనుపట్టి నాలుగుపేర్లు ఉన్నాయి.

"మనోబుద్ధి రహంకారశ్చిత్తం కరణమాన్తరమ్
సంకల్పో నిశ్చయో గర్వహః స్మరణం విషయా ఇమే"

"అంతఃకరణాన్నే - సంకల్పం చేసినపుడు మనస్సు అనీ, నిశ్చయం చేసినపుడు బుద్ధిఅనీ, గర్వంకలిగినపుడు అహంకారమనీ, స్మరణం కలిగినపుడు చిత్తమనీ అంటాము".

పరమేశ్వరుని నుంచి మాయను దూరంచేస్తే శుద్ధ చైతన్యం శేషిస్తుంది. జీవునినుంచి అంతఃకరణాన్ని వేరుచేస్తే శుద్ధ చైతన్యం శేషిస్తుంది. ఈ రెండు శుద్ధ చైతన్యాలూ ఒకటే. అలవాటు ప్రకారం సౌకర్యంకోసం రెండు చైతన్యాలు అని అంటున్నాము కాని "రెండు" అనకూడదు.

ఈ మాటలాడుకొనేదంతా జీవపరమాత్మల ఐక్యాన్నిగూర్చిన పరోక్ష జ్ఞానదశలో జరిగేదే. దీని సాక్షాత్కారం కావాలంటే అనాదికాలంనుంచీ కర్మ బంధంలో చిక్కుకొని సంసారంలో భ్రమిస్తున్న జీవుడు స్వస్వధర్మాచరణ ద్వారా పాపాలను తొలగించుకోవాలి. సాధనచతుష్టయ సంపన్నుడు కావాలి. (1) నిత్యా నిత్యవస్తువివేకము. (ఏది నిత్యము ఏది అనిత్యము అనే విషయాన్ని స్పష్టంగా తెలుసుకోవడం), (2) ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము (ఇహలోకంలోనూ, పర లోకంలోనూ లభించే భోగాలమీద ఆసక్తిలేకపోవడము) (3) శమ - దమ - ఉప రతి - తితిక్షా - - శ్రద్ధా - సమాధానాలనే సాధనసంపత్తి. (4) ముముక్షుత్వము (మోక్షము పొందాలనే తీవ్రేచ్ఛ) అనేవి సాధనచతుష్టయం. శమం అనగా అంత రింద్రియాన్ని (మనస్సును) నిగ్రహించుకోనడం. దమం అనగా బాహ్యేంద్రియా లను పదింటినీ వశంలో వుంచుకోవడం. బాహ్యవిషయాలపై మనస్సు ప్రవర్తించ కుండా చేసుకోవడం ఉపరతి. తితిక్ష అనగా ఓర్పు. శ్రద్ధ అనగా ఆచార్య శాస్త్రో పదేశాల విషయంలో అచంచలమైన విశ్వాసం. సమాధానం అనగా చిత్తాన్నిబ్రహ్మ పై ఏకాగ్ర చేసుకొనడం. వేదాంతశాస్త్రాధ్యయనానికి ఈ సాధనచతుష్టయ సంపత్తి ఉన్నవాడే అధికారి. అనగా ఆతడుమాత్రమే తత్ప్రయోజనమైన మోక్షం పొంద గలుగుతాడు. ఇతరులు వేదాంతశాస్త్రం చదవడానికి ఏమీ నిషేధంలేదు కాని అది వారికి కేవలము పరోక్షజ్ఞానం మాత్రమే ఇస్తుందికాని, అపరోక్షజ్ఞానాన్నీ తద్ద్వారా మోక్షాన్నీ ఇవ్వజాలదు. అయితే ఈ పరోక్షజ్ఞానంకూడా ఉత్తరోత్తర సాధనకు ఉపకరించవచ్చు.

**ఇలాంటి అధికారం ఉన్న జిజ్ఞాసువు, ఆత్మజ్ఞానవంతుడూ, తాను సంసారార్ణవము తరించి, ఇతరులను కూడా తరింపచేయవలెననే అభిలాషగల**

వాడూ అయిన సద్గురువును చేరి. వేదాంతాధ్యయనము చెయ్యాలి. ఇది శ్రవణం విన్నదానిని బాగా మనస్సుకు పట్టించుకోవాలి. ఇది మననం దీనిని గూర్చి నిరంతరం ధ్యానం చేయాలి, అది నిదిధ్యాసనం. ఈ విధంగా శ్రవణ - మనన - నిదిధ్యాసనలు చేసిన సాధకుడు ఆత్మసాక్షాత్కారం పొందుతాడు. తాను శుద్ధ చిత్స్వరూపుడనీ, బాల్యయౌవన - వార్ధక్యాద్యవస్థలు, బ్రాహ్మణత్వ-క్షత్రియత్వాది వర్ణభేదాలు, బ్రహ్మచారి-గృహస్థాద్యాశ్రమ భేదాలు దేహనికి కల్పించినవే కానిఆత్మకు లేవని గ్రహిస్తాడు. అట్టిస్థితి ఈ దేహంలోనే లభించవచ్చు. అట్టి జ్ఞానం లభించిన తరువాత పూర్వజన్మలలో చేసిన పుణ్యాపాపాదులన్నీ భస్మం అయిపోతాయి. ఈ జ్ఞానం కలిగిన తరవాతకూడా కొంతకాలంపాటు ఈ శరీరం నిలిచి కర్మలు చేస్తే ఆ కర్మలుకూడా ఏమీ ఫలితాన్ని ఇవ్వవు. ఇంక ఏ కర్మకు ఫలితంగా ఈశరీరం వచ్చినదో ఆ ప్రారబ్ధకర్మఫలం పూర్తి అయేవరకూ మాత్రం ఈ శరీరం ఉంటుంది. అయినా ఇలాంటి జ్ఞానోదయం కలవాడు ముక్తుడే. ముక్తి అనగా ఏలోకానికో, ఏ దేవుని దగ్గరకో వెళ్లడం కాదుకదా ? శరీరం ఉన్నంతవరకూ అతడు ఇతరులదృష్టిలో జీవిస్తూన్నట్లు కనబడతాడు కాబట్టి అతడు జీవన్ముక్తుడు. ఈ శరీరం పడిపోతే అతనికి విదేహముక్తి లభించిదన్నమాట. అనగా "భిద్యతే హృదయ గ్రంథిః" అని చెప్పినట్లు ఇంతకాలంగా ఉన్న అంతఃకరణ (మనస్సు) నశిస్తుంది. ఇంక ఆ అంతఃకరణకు సంబంధించిన జీవుడు ఉండడు. ఇది శంకర భగవత్పాదుల సంక్షిప్త సిద్ధాంతం.

చార్వాకులు చెప్పిన "దేహమే ఆత్మ" అనే వాదం ఆపాతరమణీయం. దానిని జైన బౌద్ధ నైయాయికాదులే బహుధా ఖండించి ఉన్నారు, జైన బౌద్ధాదులు చెప్పిన రత్నత్రయ-మార్గాష్టకాదులు, ధ్యానాదులు వైదికమతం నుంచి గ్రహింపబడినవే. జీవులు కర్మానుసారంగా అనేక జన్మలెత్తుతారని జైనులూ, బౌద్ధులూ కూడా అంగీకరిస్తారు. అది వైదికులకుకూడా సంమతమే. అయితే జైనులుచెప్పే అనేక జీవవాదం, జీవులు దేహపరిమాణం ఎంతో అంతే పరిమాణం కలవారనే వాదం శంకరులకు గ్రాహ్యంకాదు. అట్లే శంకరులు చెప్పిన వ్యావహారికసత్యత్వం వంటివి బౌద్ధులుకూడా అంగీకరించారు. ప్రపంచం విషయంలో కూడా అటు మాధ్యమిక యోగాచారాదులకి, ఇటు శాంకరులకూ, సామ్యం ఉన్నది. అయితే శంకర భగవత్పాదులు ఆ విషయాలను బౌద్ధుల నుంచి గ్రహించినారనే అభిప్రాయంతో కొందరు ఆయనను ప్రచ్ఛన్న బౌద్ధులనడం యుక్తంకాదు. జాగర్తగా

పరిశీలించి చూచేవారికి ఈ సిద్ధాంతాలన్నీ ఉపనిషత్తులలోనే ఉన్నాయనీ, వాటినే బౌద్ధులు స్వీకరించినారనీ, ఔపనిషదతత్త్వ ప్రతిపాదన పరులైన శంకర భగవత్పాదులు వాటిని సిద్ధాంతీకరించడం యుక్తమే అనీ స్పష్టం అవుతుంది.

సాంఖ్యయోగాలు చాలావరకు అద్వైతానికి సన్నిహితమైనవే కాని కొన్ని ప్రధానాంశాలలో భేదాలు ఉన్నాయి. అచేతనమైన ప్రకృతి సృష్టిచేస్తుం దనీ, దాని పరిణామమే ఈ జగత్తనీ వారు చెప్పినదానిని వేదాంతులంగీకరించరు. మట్టికుండగాను, బంగారం ఆభరణంగాను మారినట్లు ప్రకృతి జగద్రూపంగా మారుతుందని సాంఖ్యులు చెప్పేది పరిణామవాదం శంకరాద్వైతులు మాయోపహిత చైతన్యంమీద, రజ్జువు మీద సర్పం కనడినట్లు, ప్రపంచం కనబడుతున్నది అని చెప్పుచున్నారు. దీనికి వివర్తవాదం అనిపేరు, పరిణామవాదాన్ని అంగీకరించే పక్షంలో జగత్తు సత్యంఅని అంగీకరించినట్లు అవుతుంది. ఇదే విధంగా వీరి సిద్ధాంతం ప్రకారం మాయోపహిత చైతన్యమే ప్రపంచానికి నిమిత్త కారణము, ఉపాదాన కారణమూకూడ, అందుచేత పరమాణువులు సమవాయి కారణం (ఉపాదాన కారణం), ఈశ్వరుడు నిమిత్తకారణం అనే నైయాయికమతం కూడా శాంకరాద్వైతులకు అంగీకారయోగ్యంకాదు. అదేవిధంగా పురుషుడుచైతన్య రూపుడు అనీ, ఆతని కర్తృత్వం లేదుకాని భోక్తృత్వం మాత్రం ఉన్నదనీ వారు చెప్పినది సమంజసం కాదుకర్తృత్వం లేనప్పుడు భోక్తృత్వం మాత్రం ఎందుకు అంగీకరించాలి. పురుష బహుత్త్వవాదం కూడా వేదాంతులకు అంగీకార యోగ్యం కాదు.

ఇంక ఆత్మ జడమనీ, జ్ఞానం ఆగంతుకమనీ, దుఃఖాభావమే మోక్షమనీ' జీవాత్మలు అనేకులనీ, పరమాత్మకేవలం నిమిత్తకారణమే, సమవాయి కారణం పరమాణ్వాదులనీ చెప్పేన్యాయవైశేషికులవాదం కూడా అద్వైతవిరుద్ధమే అవడం చేత దీనినికూడా శంకరభగవత్పాదులు వీలుకలిగినప్పుడల్లా ఎక్కువగా ఖండించారు.

కర్మవల్లనే మోక్షం కలుగుతుందనే మీమాంసకుల వాదంకూడ అసంగతమే. అనేక జన్మలలో సంచితమైన కర్మ ఒకజన్మలో చేసిన నిత్యకర్మల వలన నశిస్తుందనడంయుక్తంకాదు. అంతేకాకుండా నిత్యకర్మలకుకూడా ఫలంతప్పకుండా

కుండా అంగీకరించాలి. ఆత్మజ్ఞాన శూన్యమైన జడ పదార్థం అనే విషయం కూడా అసంగతమే. ఈ విషయంకూడా శంకరభగవత్పాదులు అనేక స్థలాలలో విశదీకరించారు.

కర్మజ్ఞాన సముచ్చయవాదంకూడా అసంగతమే అని భగవత్పాదులు అనేక స్థలాలలో ప్రతిపాదించారు. వేరు వేరులోకాలున్నాయి, వేరు వేరు భోగ్య విషయాలు ఉన్నాయి, నేను ఈ వర్ణంవాడను, ఈ వయస్సు వాడను, ఇత్యాది భేద బుద్ధి ఉన్నవాళ్లు చేయవలసినవి కర్మలు. ఆత్మ నిత్య - శుద్ధబుద్ధ -ముక్త స్వరూప మైనది. భేదాలు ఏవీ యథార్థములు కాదు. ఈ ఆత్మకు బ్రాహ్మణత్వాది జాతులు కాని, అవస్థా - ఆశ్రమాదులవల్ల ఏర్పడే భేదాలు కానిలేవు. అని చెప్పే జ్ఞాన మార్గంతో కర్మమార్గానికి ఏవిధంగానూ పొత్తు కుదరదు. అందుచేత ఇలాంటి జ్ఞానానికి పూర్వంమాత్రమే కర్మలకు అవకాశం. ఈ కర్మలు జననమరణ పరంపరా రూపమైన సంసారాన్ని మాత్రమే ఇస్తాయికాని మోక్షం ఇవ్వజాలవు. జ్ఞానం కలగడానికై చిత్తశుద్ధిద్వారాకర్మలు ఉపయోగించవచ్చును గాని మోక్షం ఇవ్వ కలిగినదిమాత్రం జ్ఞానం ఒక్కటే అని శాంకర సిద్ధాంతం.

శ్రీ శంకర భగవత్పాదులు తమ సూత్రభాష్యానికి "శారీరక మీమాంస" అని పేరు పెట్టినారు. ఇది ఏదో మనకు సంబంధించని మీమాంసకాదు. శారీరకునికి, అనగా జీవునికి, అనగా మన అందరికీ సంబంధించిన మీమాంస. ఆత్మ వున్నదని మన అందరికీ తెలుసు. "నేను నేను" అని మనం దేనిని నిర్దేశిస్తున్నామో అదే ఆత్మ. అయితే మనం తెలుసుకొనవలసినదల్లా ఈ నేను అనేది దేహమా, ఇంద్రియాలా, మనస్సా, లేదా వీటికన్నింటికంటె కూడా భిన్నమైన మరొకటా అనేది. ఆ విషయాన్నే ఉపనిషత్ప్రమాణాల సహాయంతో పరిశీలించి శ్రీశంకరభగవత్పాదులు "నేను" అనేది ఈ దేహేంద్రియాదులకు అతీతమైనదనీ, శుద్ధ చిత్స్వరూపమనీ, వాస్తవంలో ఈ"నేను" అనేదానికీ "పరమాత్మ" అనే దానికీ భేదంలేదనీ ప్రతిపాదించారు. దురవగాహమూ, అనుభవంలోనికి తెచ్చుకోవడానికి ఎంతోశ్రమపడితేగాని శక్యంకానిదీ అయిన ఈ తత్త్వాన్ని వారు అనేక ప్రకరణ గ్రంథాలలోకూడా ప్రతిపాదించి ఉన్నారు.

వాణీవిలాస ప్రెస్‌వారు ముద్రించిన "శ్రీశంకర గ్రంథావళి"లో శంకర భగవత్పాద రచితములుగా ముప్పైఏడు ప్రకరణ గ్రంథాలు చేర్చబడిఉన్నాయి.

"ఏకశ్లోకి" మొదలు "ఉపదేశసాహస్రి"వరకు ఈ గ్రంథాలలోని శ్లోకసంఖ్య భిన్న భిన్నంగా ఉన్నది. మనం వెనుక చూచినట్లుగా కొన్ని ప్రకరణ గ్రంథాలలో కొన్ని అంశాలూ, మరికొన్నింటిలో మరికొన్ని అంశాలూ ప్రతిపాదింపబడి ఉన్నాయి, ఇపుడువాటిని గూర్చి సంగ్రహంగా ముచ్చటించుకుందాము.

"శాస్త్రైకదేశసంబద్ధం శాస్త్రకార్యాన్తరేస్థితమ్
ఆహుః ప్రకరణం నామ గ్రంథభేదమవిస్తరమ్"

అని ప్రకరణానికి లక్షణం. "శాస్త్రంలో ఉన్నకొన్ని అంశాలను ప్రతిపాదించి, శాస్త్రం చేసేపనిని చేసేదీ, అతివిస్తృతం కానిదీ అయిన గ్రంథానికి ప్రకరణం అనిపేరు" అని దీని భావం,

1. అపరోక్షానుభూతిః :

దీనిలో 144 శ్లోకాలున్నాయి. మొదట సాధన చతుష్టయ సంపత్తిని విశదీకరించి దేహేంద్రియాదులకంటె భిన్నమైనది ఆత్మఅని ప్రతిపాదింపబడినది. తెల్లగా ఉన్నదానిని చూచి పచ్చగా ఉన్నదని అనుకోవటం ఎలాభ్రాంతియో, దూరంగా ఉన్న పెద్దవస్తువును చిన్నవస్తువుగా భావించడం ఎలాభ్రాంతియో దగ్గర ఉన్న చిన్న వస్తువునే ఉపనేత్రాలతో చూచి పెద్దదని అనుకోవడం ఏ విధంగా భ్రాంతియో, దేహాదులను ఆత్మ అనుకోవడంకూడా. అలాగే భ్రాంతి అందుచేత ప్రత్యక్షాన్ని మాత్రమే నమ్ముకొని ఒక నిర్ణయానికి రావడం ప్రమాదకరం.

సూక్ష్మత్వే సర్వవస్తూనాం స్థూలత్వం చోపనేత్రతః
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః"

(దీనినిపట్టి ఏదో ఒకవిధమైన మైక్రోస్కోప్ శ్రీశంకరులకుకూడా తెలుసునన్నట్లు తెలుస్తున్నది.

అందుచేత వాస్తవమైన ఆత్మస్వరూపం తెలుసుకోవలె నంటే యమ - నియమ-త్యాగ-మౌన-దేశ-కాల-ఆసన-మూలబంధ-దేహసామ్య-దృక్స్థితి - ప్రాణాయామ-ప్రత్యాహార-ధారణా-ధ్యాన-సమాధులనే పదిహేను అంగాలు అభ్యసించాలి,

(శ్లో 100-103) సర్వమూ బ్రహ్మయే అని గ్రహించి ఇంద్రియాలను వశంలో ఉంచుకొనడం యమము, విజాతీయమైన ఆలోచనలేవీ రాకుండా చూచుకుంటూ బ్రహ్మనుగూర్చి మాత్రమే నిరంతరచింతన చేయడం నియమం. ప్రపంచాన్ని చిదాత్మగా చూడడం త్యాగం. మనస్సుకుకూడా అందని బ్రహ్మ స్వరూపాన్ని మాటలచేత వర్ణించడం అసంభావ్యం అని గ్రహించి మాటలాడకుండా ఉండడం మౌనం. దేశమనగా విజనదేశము. అనగా ఆది-మధ్య - అంతాలలో ఎప్పుడూ కూడా జనంలేరు, ఆత్మ మాత్రమే ఉన్నదనే భావన విజనదేశాశ్రయణం. బ్రహ్మాది సర్వభూతాలనూ నిమేషమాత్రంలో కబళించి వేయడంచేత బ్రహ్మయే కాలమని గ్రహించడం కాలం, బ్రహ్మ చింతనానికి అనుకూలమైన ఉనికిపట్టు ఆసనం. సర్వదా సిద్ధమైన, సకలజగత్తునకూ ఆధారమైనది బ్రహ్మ అని గ్రహించడం సిద్ధాసనం. సర్వభూతాలకూ మూలమైనది బ్రహ్మ అని భావించి చిత్తం నిలపడం మూలబంధం. సమమైన బ్రహ్మయందు మనస్సును లీనంచేయడం దేహసమత. అంతేకాని ఎండిపోయిన చెట్టువలె అవయవాలు కదలకుండా కూర్చోవడం దేహసమతకాదు. జ్ఞానదృష్టితో సర్వమూ బ్రహ్మమయమని చూడడం దృష్టి, అంతేకాని నాసాగ్రం మీద దృష్టినిలపడంకాదు. చిత్తం మొదలైన అన్ని పదార్థాలనూ బ్రహ్మగానే భావించి ఇతరమైన చిత్తవృత్తులేవీ లేకుండా చేసుకోవడమే ప్రాణాయామము. ప్రాణాయామంలో రేచకము, పూరకము, కుంభకమూ అనేవి ఉంటాయి. అయితే ఈ ప్రాణాయామంలో ప్రపంచాన్ని అంతనీ నిషేధించడం రేచకం, నేనే బ్రహ్మను అని భావించడం పూరకం; ఈ భావనను స్థిరంగా ఉంచుకోవడం కుంభకం. అంతేకాని ముక్కు గట్టిగా పట్టుకోవడంకాదు ప్రాణాయామమనగా. అది అజ్ఞులు చేసే ప్రాణాయామం.

నిషేధనం ప్రపంచస్య రేచకాఖ్యః సమీరణః
బ్రహ్మైవాస్మీతి యా వృత్తిః పూరకో వాయురీరితః
తతస్తద్వృత్తి నైశ్చల్యం కుంభకః ప్రాణసంయమః
అయం చాపి ప్రబుద్ధానామజ్ఞానాం ఘ్రాణపీడనమ్" (119-120)

విషయాలన్నీ చిదాత్మకములే అని భావిస్తూ మనసును దానిలో మగ్నం చేయడం ప్రత్యాహారం. మనస్సు వెళ్లిన ప్రతీ ప్రదేశంలోనూ బ్రహ్మనుచూడటం ధారణం. "అహం బ్రహ్మాస్మి" అనే వృత్తితో, (ఇతర వృత్తులేవీ లేకుండా)

ఉండటం ధ్యానం. ఈవృత్తికూడా తొలగి శుద్ధ జ్ఞాన స్వరూపంగా వుండిపోవడం సమాధి. బ్రహ్మవృత్తి కలగడానికి ఉపయోగించేవి ఈ పదిహేను అంగాలు. ఈ వృత్తిని అలవరచుకొన్నవారు మాత్రమే బ్రహ్మసాక్షాత్కారం పొందుతారు. ఇది "అపరోక్షానుభూతి"లోని ప్రధానోపదేశం, ఇందులో యమ నియమాదులకు శంకర భగవత్పాదులు చెప్పిన లక్షణాలు యోగశాస్త్రీయ లక్షణాలకంటె భిన్నమైన వనే విషయం సుస్పష్టం.

2. వాక్యవృత్తిః :-

గురుశిష్య సంవాదరూపమైన "వాక్యవృత్తి" లో 53 శ్లోకాలున్నాయి. "తత్త్వమసి" అనే మహావాక్యంలో ఉన్న "తత్" "త్వమ్" పదాల అర్థాలు, వాటి ఏకత్వము ప్రతిపాదింపబడినవి.

3. స్వాత్మనిరూపణమ్ :-

ఇదికూడ గురుశిష్య సంవాదరూపమైనది. 154 శ్లోకాలున్నాయి. "తత్" "త్వమ్" పదాల అర్థాలు చెప్పి, అద్వైత తత్త్వాన్ని ప్రతిపాదించడ మనేదే శ్రుతుల పరమ తాత్పర్యమనీ, ప్రత్యక్షాది ప్రమాణాంతరాలచేత తెలియవచ్చే ద్వైత ప్రపంచాన్ని గూర్చికానీ, జీవాదుల పరస్పర భేదాన్నిగూర్చిగాని, చెప్పడానికి శ్రుతి ప్రయత్నించవలసిన పనిలేదనీ సయుక్తికంగా నిరూపించబడింది.

"ప్రత్యక్షాద్యనవగతం శ్రుత్యా ప్రతిపాదనీయమద్వైతమ్
ద్వైతం న ప్రతిపాద్యం తస్య స్వత యేవ లోకసిద్ధత్వాత్"-54

ప్రపంచకాన్ని ప్రపంచకంగా చూస్తున్నంతవరకూ బ్రహ్మానుభవం కలగదు. బ్రహ్మానుభవం కలిగినతరువాత ప్రపంచకమే కనబడదు అని ఈక్రింది శ్లోకం సోదాహరణంగా ప్రతిపాదిస్తూన్నది :-

దన్తిని దారువికారే దారు తిరోభవతి సోఽపి తత్రైవ
తద్వజ్జగతి పరాత్మా పరమాత్మన్యపి జగత్తిరోధత్తే" -94

"కర్రతో తయారుచేసిన ఏనుగును (దూరంనుంచి) ఏనుగుగాచూచినంత వరకూ కర్ర కనబడదు. కర్ర కనబడిందా, ఇంక ఏనుగ కనబడదు. ప్రపంచక పరమాత్మల విషయంకూడా అంతే".

దీని చివర, గురూపదేశంచేత అజ్ఞానం పటాపంచలైన శిష్యుని అనుభవం

"అజరోఽహమక్షరోహం ప్రాజ్ఞోఽహం ప్రత్యగాత్మ
బోధోఽహమ్
పరమానన్దమయోహం పరమశివోఽహం భవామి పరిపూర్ణః"

మొదలైన నలభై శ్లోకాలలో అద్భుతంగా చిత్రింపబడింది. ఇలాంటి అనుభూతి వర్ణనం ఇతర ప్రకరణాలలోకూడా వున్నది.

4. ఆత్మబోధః:-

ఈ గ్రంథంలో 65 శ్లోకాలున్నాయి. మోక్షానికి ఏకైకసాధనం జ్ఞానం. అగ్ని లేనిదే వంట అసాధ్యమైనట్లు జ్ఞానం లేనిదే మోక్షం అసాధ్యం -

"బోధోఽన్యసాధనేభ్యో హి సాక్షాన్మోక్షస్య సాధనమ్
పాకస్య వహ్నివద్ జ్ఞానం వినా మోక్షో న సిధ్యతి" 2

కర్మవల్లకూడా మోక్షం కలుగదు. కారణమేమనగా - కర్మలుకూడా అజ్ఞానావస్థలో ఉన్నప్పుడు చేయబడేవే.

"అవిరోధితయా కర్మ నాఽవిద్యాం వినివర్తయేత్
విద్యాఽవిద్యాం నిహన్త్యేవ తేజస్తిమిర సంఘవత్" 3

అందుచేత స్థూల - సూక్ష్మ - కారణ శరీరాతీతము, పంచకోశాభ్యంతరము అయిన ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోవాలి. వాస్తవంలో అది సచ్చిదానంద రూపము, భేదవిహీనము అని ఈ గ్రంథం బోధిస్తున్నది.

5. శతశ్లోకీ :-

ఇది అద్వైత సిద్ధాంతానికి సంబంధించిన అనేక యుక్తులనూ, అనుభూతులనూ విశదీకరించే 101 స్రగ్ధరావృత్త శ్లోకాల ప్రకరణ గ్రంథం.

భారతీయ తాత్త్విక సంప్రదాయంలో గురువునకున్న స్థానం పరమేశ్వరునికున్న స్థానంకంటెకూడా గొప్పది. అలాంటి గురువు గొప్పతనాన్ని ప్రతిపాదిస్తూ ఈ గ్రంథం ప్రారంభింపబడినది. "జ్ఞానదాతయైన గురువుతో పోల్చడానికి తగినది ఈ మూడులోకాలలోనూ లేదు. స్పర్శమణి ఇనుమును బంగారంగా మారుస్తుంది కాబట్టి దానితో పోల్చవచ్చునేమో అంటే అదికూడా కుదరదు. స్పర్శమణి దగిలి ఇనుము బంగారంగా మారవచ్చునుగాని అది (అలా మారిన ఇనుపముక్క) మళ్లీమరొక ఇనుపముక్కను బంగారంగా మార్చజాలదు. అయితే శిష్యుని విషయం అలాకాదు. తాను గురువంతటివాడుగా అయిన శిష్యుడు ఇతరులనుకూడా మరల తనంతటి వాళ్ళనుగా చేయగలుగుచున్నాడు కదా!"

"దృష్టాన్తో నైవ దృష్టస్త్రిభువనజఠరే సద్గురోర్జ్ఞానదాతుః
స్పర్శశ్చేత్తత్ర కల్ప్యః స నయతి యదహో
స్వర్ణతామశ్మసారమ్;
న స్పర్శత్వం తథాపి శ్రితచరణయుగే సద్గురుః స్వీయశిష్యే
స్వీయం సామ్యం విధత్తే భవతి నిరుపమస్తేన వాఽలౌకికోఽపి" 1

"ఒక కీటకం ఉన్నది. దానికి గూడు కట్టుకొనేశక్తి సహజంగానే ఉన్నది. అది పుట్టినది మొదలు ఆ ముళ్లూ ఈ ముళ్లూ తెచ్చి గూడు కట్టుకుంటూ ఉంటూనే చివరికి మరణిస్తుంది, అదేవిధంగా అజ్ఞాని కర్మోపార్జితమైన ఈ శరీరాన్ని పొంది, దీని పోషణంలోనే వ్యగ్రుడై, చివరికి మరణిస్తాడు. ఆ కీటకానికీ, ఈ బూటకపు బుద్ధిశాలికీ తేడా ఏమిటి?"

"కశ్చిత్కీటః కథంచిత్ పటుమతి రభితః కణ్టకానాం కుటీరం
కుర్వంస్తేనైవ సాకం వ్యవహృతి విధయే చేష్టతే యావదాయుః
తద్వజ్జీవోఽపి నానాచరితసముదితైః కర్మభిః స్థూలదేహం
నిర్మాయాత్రైవ తిష్ఠన్ననుదినమమునా సాకమభ్యేతి భూయః" 6.

"సుఖదుఃఖాలను అనుభవించే ఈ శరీరం కంటె భిన్నమైనది జీవాత్మ కేవలం సాక్షిభూతము. దేహానికి సంబంధించిన సుఖదుఃఖాలు దీనికంటవు. పొట్ట పోషించుకోవడం కోసం వ్యాఘ్రాదివేషాలు ధరించి పిల్లలను భయపెట్టేవాడు నేను

వ్యాఘ్రమును కదా అని ఇతరజంతువులను ఏవిధంగా బాధించజాలడో, స్త్రీ వేషం ధరించిన నటుడు భర్తకోరికను ఏవిధంగా తీర్చలేడో అలాగే దేహాది వ్యాపారాలు జీవాత్మను ఏమీ చేయజాలవు; దానికి అంటవు."

"స్వీకుర్వన్ వ్యాఘ్రవేషం స్వజఠరభృతయే భీషయన్యశ్చ ముగ్ధాన్
మత్వా వ్యాఘ్రోఽహమిత్థం స నరపశుముఖాన్ బాధతే కిం ను సత్త్వాన్
మత్వా స్త్రీవేషధారీ స్త్ర్యహమితి కురుతే కిం నటో భర్తురిచ్ఛాం
తద్వచ్ఛారీర ఆత్మా పృథగనుభవతో దేహతో యః స సాక్షీ" 7

"గృహస్థుడు, తన యింటిలోకూడా, ఏదోఒక గమ్యస్థానం చేరవలసి ఉండి, మధ్యలో ఒకరింట ఆగిన అతిథివలె ప్రవర్తించాలి. అలా వుండే వానికి సుఖదుఃఖాలు అంటవు. మేఘపుంజంవలె వచ్చేది వస్తూ వుంటుంది; పోయేది పోతూ వుంటుంది."

"తిష్ఠన్ గేహే గృహేశోఽప్యతిథిరివ నిజం ధామగన్తుం చికీర్షు
ర్దేహస్థం దుఃఖసౌఖ్యం న భజతి సహసా నిర్మమత్వాభిమానః
ఆయాత్యాయాస్యతీదం జలదపటలవద్యాతృ యాస్యత్యవశ్యం
దేహాద్యం సర్వమేవ ప్రవిదితవిషయో యశ్చ తిష్ఠత్యయత్నః" 16

"జగత్తుకు కారణం (మాయ) అసత్యమే అయినా దాని కార్యమైన జగత్తు సత్యంవలె భాసించవచ్చును. అసత్యస్వప్నస్త్రీ సంగమంవల్ల సత్యంగా రేతఃస్ఖలనం జరుగుతూన్నది కదా! మానసిక కల్పన లేని దానినికూడా ఉన్నట్లుగా చూపిస్తుంది.

స్వాప్నస్త్రీసఙ్గసౌఖ్యాదపి భృశమసతో యా చ రేతశ్చ్యుతిః స్యాత్
సా దృశ్యా తద్వదేతత్ స్ఫురతి జగదసత్కారణం సత్యకల్పమ్
స్వప్నే సత్యః పుమాన్ స్యాద్యువతిరిహ మృషైరానయోఃసంయుతిశ్చ
ప్రాతః శుక్రేణ వస్త్రోపహతిరితి యతః కల్పనామూలమేతత్" 36

"తాను రాజైనట్లు స్వప్నం చూచినవానికి మెలకువరాగానే అయ్యో! రాజ్యం పోయినదే అనివిచారం కలగదు, స్వప్నంలో అగమ్యాగమనం చేసినా

పాపం అంటదు. అదేవిధంగా జ్ఞానోదయం కలిగినవానికి అంతకు పూర్వం జరిగిన జగద్వ్యవహారం బంధహేతువు కాదు".

భుఞ్జానః స్వప్నరాజ్యం సనకలవిభవో జాగరం ప్రాప్యభూయః
రాజ్యభ్రష్టోఽహమిత్థం న భజతి విషమం తన్మృషా మన్యమానః
స్వప్నే కుర్వన్నగమ్యాగమనముఖమఘం తేన న ప్రత్యవాయీ
తద్వజ్జాగ్రద్దశాయాం వ్యవహృతిమఖిలాం స్వప్నవద్విస్మరేచ్ఛ" 33

ఈ విధంగా ఎన్నో విషయాలను, హృదయానికి హత్తుకునేటట్లుగా బోధిస్తున్నది "శతశ్లోకి".

6. దశశ్లోకి :-

ప్రతి దృశ్యవస్తువుకీ కారణం ఉంటుంది; దానికొక కారణంవుంటుంది దానికి కారణం మరొకటి. ఈవిధంగా విశ్లేషణం చేసుకుంటూపోతే మిగిలేది శుద్ధమైన ఆత్మతత్త్వమే, అదే నేను; దీని అనుభవం నాకు రోజూ కొంతవరకు సుషుప్తిలో కలుగుతూనే వున్నది అని చెప్పే -

"న భూమిర్న తోయం న తేజో న వాయు -
ర్న ఖం నేన్ద్రియం వా న తేషాం సమూహః
అనైకాన్తికత్వాత్సుషుప్త్యే కసిద్ధం -
స్తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్"

ఇత్యాది శ్లోకాలలో ఈ"దశశ్లోకి"సకలదృశ్యపదార్థాలనూ నిషేధించగా మిగిలే ఆత్మతత్త్వాన్నిగూర్చి బోధిస్తుంది,

7. "సర్వ వేదాన్త సిద్ధాన్తసార సఙ్గ్రహః :-

ఇది బృహత్ప్రమాణాలైన మూడు ప్రకరణగ్రంథాలలో ఒకటి. మిగిలిన రెండూ "ఉపదేశసాహస్రి" "వివేకచూడామణి" అనేవి. దీనిలో 1006శ్లోకాలు

ఉన్నాయి. నమస్తోపనిషత్తుల సిద్ధాంతమూకూడా గురుశిష్య సంవాద రూపంలో ఈగ్రంథంలో ప్రతిపాదింపబడినది. ఆత్మస్వరూపము, బంధ హేతువులు, జ్ఞానము జ్ఞానసాధనాలు, మోక్షస్వరూపమూ, ఇవన్నీ విశదంగా ప్రతిపాదింపబడినవి. దాదుపు 250శ్లోకాలలో వేదాంతశాస్త్రంలో ప్రతిపాదింపబడే విషయం, సంబంధం, అధికారి, ప్రయోజనము అనే అనుబంధచతుష్టయాన్ని గూర్చి చర్చించి, సాధన చతుష్టయసంపత్తి అతివిస్తృతంగా, వివిధో దాహరణలతో వివరించబడినది. కామ క్రోధాదులే సంసారానికి హేతువులనే విషయంగూడా విస్తృతంగా ప్రతిపాదింప బడింది.

దృశ్యమైనది, సావయవమైనది అయిన ప్రతి పదార్థమూ నశ్వరమే. అందుచేత స్వర్గ - కైలాస - వైకుంఠాదులుకూడా అశాశ్వతములే. అవి నిత్యము లనే బుద్ధి భ్రాంతి మాత్రమే.

"సర్వస్యానిత్యత్వే సావయత్వేన సర్వతః సిద్ధే
వైకుణ్ఠాదిషు నిత్యత్వమతిర్భ్రమ ఏష మూఢబుద్ధీనామ్" 20

"కామం(కోరిక)చాలా చెడ్డది. అది కలగకుండా వుండాలంటేసంకల్పం అనగా ఆయా విషయాలను గూర్చిన ఆలోచన, విడిచిపెట్టాలి, అపుడు ఇంక కామం పుట్టదు.

"కామస్య బీజం సంకల్పః సంకల్పాదేవ జాయతే
బీజే నష్టేఽఙ్కుర ఇవ తస్మిన్నష్టే వినశ్యతి" 64

ధనం ఉన్నందుకు రెండే ప్రయోజనాలు - ఒకటి భోగాలు అనుభ వించడం. రెండు దానం చెయ్యడం, భోగాలవల్ల గర్వం పెరుగుతుంది. దానం చేస్తే అది పునర్జన్మ హేతువు. రెండువిధాలా కూడా ధనం అపాయ హేతువే. ధనంవల్ల మదం పెరుగుతుంది - మదం స్మృతిని పోగొడుతుంది. స్మృతి చెడితే బుద్ధి సరిగా పనిచేయదు. బుద్ధినాశం సర్వానర్థాలకీ హేతువు.

"భోగేన మత్తతా జన్తోర్దానేన పునరుద్భవః
వృద్ధై వోభయథా విత్తం నాస్త్యేవ గతిరన్యథా
ధనేన మదవృద్ధిః స్యాన్మదేన స్మృతినాశనమ్
స్మృతినాశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి" 75, 76

సంసారమనేది మృత్యుదేవత. మహాబలాఢ్యమైనది. కాంత, జిహ్వ, కనకం అనే మూడు ద్వారాలగుండా లోనికి ప్రవేశిస్తుంది. అది లోనికి రాకుండా చేసుకోవాలంటే ఈ మూడు ద్వారాలూ జాగ్రత్తగా కాపాడుకోవాలి.

"సంసారమృత్యోర్బలినః ప్రవేష్టుం
ద్వారాణి తు త్రీణి మహాన్తి లోకే
కాన్తా చ జిహ్వా కనకం చ తాని
రుణద్ధి యస్తస్య భయం న మృత్యోః" 87

కాంతాకనకాలు అనర్థహేతువులనే విషయం ప్రసిద్ధమే. అభోజ్యభోజన సురాపాన - అసత్యసంభాషణాదులద్వారా జిహ్వకూడా అనర్థహేతు వవడంచేత భగవత్పాదులు దానినికూడా వాటి ప్రక్క చేర్చినారు.

జ్ఞానంతోపాటు కర్మకూడా ఉంటేనే మోక్షం కలుగుతుంది, అనికొంత మంది అంటారు. అది అయుక్తము. ఆయా కామాలు కలవాడు కర్మలు చేయడానికి అధికారి. ఏ కామాలు లేనివాడే వేదాంత శ్రవణాధికారి. అందుచేత కర్మకూ జ్ఞానానికీ సముచ్చయం కుదరదు.

అతః సాపేక్షితం జ్ఞానమథవాపి సముచ్చయమే
మోక్షస్య సాధనమితి వదన్తి బ్రహ్మవాదినః
ముముక్షోర్యుజ్యతే త్యాగః కథం విహితకర్మణః
ఇతి శంకా న కర్తవ్యా మూఢవత్పణ్డితోత్తమైః
కర్మణః ఫలమన్యత్తు శ్రవణస్య ఫలం పృథక్
.... .... .... .... ....
కామీ కర్మణ్యధికృతో నిష్కామీ శ్రవణే మతః" (175-78)

అధ్యారోపాపవాదాల చేత పరతత్త్వాన్ని బోధించడం అనే పద్ధతి వేదాంత శాస్త్రంలో ఉన్నది. వాస్తవంలో లేని ప్రపంచాన్ని ఉన్నట్లుగా బోధించి సృష్టి క్రమాదులను తెలపడం అధ్యారోపం. దానిని క్రమంగా విశ్లేషిస్తూ స్థూలం నుంచి సూక్ష్మందాకా వెళ్లి వాస్తవంలో ఈ స్థూలప్రపంచం అనేది లేదు అని చెప్పడం అపవాదం. ఈ పద్ధతిలో గురువు శిష్యునికి తత్త్వబోధ చేశాడని చెపుతూ 295వ శ్లోకం నుంచి దాదాపు 150 శ్లోకాలలో పంచ మహాభూత సృష్ట్యాదికం ఉపనిషదనుసారంగా వివరింపబడింది. అన్నమయ - ప్రాణమయ - మనోమయ- విజ్ఞానమయ-ఆనందమయ కోశాలుకూడా వర్ణింపబడినవి. ఆత్మ స్వరూపం విషయంలో ఆయావాదుల అభిప్రాయాలనుతెలిసి పూర్వపూర్వవాదాలను ఉత్తరోత్తర వాదాల వాళ్లు ఎలాఖండించారో చెప్పబడింది. భార్యాపుత్రాదులే ఆత్మఅనికొందరూ (522-532) దేహమని కొందరు (533-538), ఇంద్రియాలని కొందరు (539-544) ప్రాణములే అనికొందరు (545-549) మనస్సు అని కొందరు (550-554), బుద్ధి అని కొందరు (555-559), సుషుప్తిలో జ్ఞానం ఉండదు కాబట్టి అజ్ఞానస్వరూపమని తార్కిక ప్రాభాకరులూ (560-564) చిజ్జడోభయాత్మకమని భాట్టాదులూ [మెరుగుడు పురుగులో కాంతి ఉండడమూ లేక పోవడమూ ఉన్నట్లే ఆత్మలో జ్ఞానమూ జడత్వమూకూడా ఉన్నవి ఆత్మాతశ్చిజ్జడతనుః ఖద్యోత ఇవ సంమతః"] (565-567) శూన్యమే అని కొందరూ (568-577) అంటున్నారు. శూన్యత్వం అనేది శాస్త్రసంమతమూకాదు, యుక్తి సహమూ కాదు; అందుచేత ఆత్మ చిత్స్వరూపమని ప్రతిపాదింపబడింది. (578-631)

జ్ఞాననిష్ఠునికి కర్మతో పనిలేదు. ఆతనికి జ్ఞానమే కర్మ, జ్ఞానమేసంధ్య, జ్ఞానమే సర్వమూను.

"జ్ఞానైక నిష్ఠానిరతస్య భిక్షో
ర్నైవావకాశోఽస్తి హి కర్మతన్త్రైః
తదేవ కర్మాస్య తదేవ సన్ధ్యా
తదేవ సర్వం న తతోఽన్యదస్తి" 857.

యోగారూఢుడు అవడానికి ప్రయత్నించే మోక్షేచ్ఛకలవాడు కర్మాంతరాసక్తుడైతే, తాటిచెట్టు ఎక్కేవాడు మరొకపనిచేస్తే క్రింద పడినట్లు పడిపోతాడు

"యోగం సమారోహతి యో ముముక్షుః
క్రియాన్తరం తస్య న యుక్తమీషత్
క్రియాన్తరాసక్తమనాః పతత్యసౌ
తాలద్రుమారోహణ కర్తృ వద్ధ్రువమ్ (864)

ఆత్మానుభూతి స్వరూపం ఎట్లు ఉంటుంది, జీవన్ముక్త విదేహముక్తుల లక్షణాలేవి అని శిష్యుడు అడిగిన ప్రశ్నలకు సమాధానం 938వ శ్లోకం నుంచి గ్రంథాంతం వరకూ చెప్పబడింది. ఈ సందర్భంలో చెప్పిన-శుభేచ్ఛ వివరణ, విచారణ, తనుమానసి, తత్త్వాపత్తి, అసంసక్తి. పదార్థభావన, తుర్యగ అనే ఏడు జ్ఞానభూమికలు, వాటి లక్షణాలు, జాగ్రజ్జాగ్రత్తు, జాగ్రత్స్వప్నము, జాగ్రత్సుషుప్తి, స్వప్నజగత్తు, స్వప్నస్వప్నము, స్వప్నసుషుప్తి, సుప్తి జాగ్రత్తు, సుప్తి స్వప్నము, సుప్తి సుప్తి మొదలైనవి ఇతర ప్రకరణ గ్రంథాలలోను, భాష్యాదులలోనూ కూడా లేని అపూర్వవిషయాలు. ఈ విధంగా ఇది సర్వవేదాంతసారం అని చెప్పడంలో సందేహం లేదు.

## 8. వివేక చూడామణి :

ఇదికూడ గురుశిష్య సంవాదరూపంలో నడచిన, 581 శ్లోకాల ప్రకరణ గ్రంథం, అద్వైతసిద్ధాంతానికి సంబంధించిన విషయాలన్నీ దీనిలోకూడాచక్కగా ప్రతిపాదింపబడినవి. సాధనచతుష్టయ సంపత్తి, పంచకోశాలు, దృశ్య ప్రపంచము, సాధనవిధానము, ఆత్మస్వరూపము, జీవన్ముక్తలక్షణము, ఆతని అనుభవం ఇవన్నీ విశదీకరింపబడినవి.

మనుష్యజన్మ, మోక్షేచ్ఛ, మహాపురుషుని ఆశ్రయము అనే ఈమూడూ ఈశ్వరానుగ్రహం ఉంటేనే లభిస్తాయి.

"దుర్లభం త్రయమేవైతద్దేవానుగ్రహహేతుకమ్
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః (3)

యోగాభ్యాసం చేసినా, సాంఖ్యంచదివినా, ఎన్నికర్మలు చేసినా, ఇతర విద్యలు ఎన్నిచదివినా "నేనే బ్రహ్మను" అనే జ్ఞానం కలిగేవరకూ మోక్షం

సిద్ధించదు. అందమైనవీణను గ్రహించి, దానిని అభ్యసించి చక్కగా వాయిస్తే ప్రజలను రంజింపచేస్తే చేయవచ్చునేమో! దానివల్ల సామ్రాజ్యం లభించాలంటే లభించదు. అదేవిధంగా అనేక శాస్త్రాలు చదివి వాటినిగురించి ధారాళంగా మాటలాడకలిగే పాండిత్యం సంపాదిస్తే దానివల్ల భుక్తిలభిస్తుందేమో కాని ముక్తి లభించదు. ముక్తికావాలంటే పరతత్త్వ జ్ఞానం ఒక్కటే సాధనం. శబ్దజాలంలో పడి ఎంతకొట్టుకున్నా చిత్తభ్రమకలుగుతుంది తప్ప మరొక ప్రయోజనం ఏదీ లేదు. అందుచేత ఆ ప్రయత్నాలన్నీ దూరంగాపెట్టి తత్త్వజ్ఞానం కలవానిని ఆరాధించి తత్త్వంతెలుసుకోవాలి.

"న యోగేన న సాంఖ్యేన కర్మణా నో న విద్యయా
బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్షః సిద్ధ్యతి నాన్యథా
వీణాయా రూపసౌన్దర్యం తన్త్రీవాదనసౌష్ఠవమ్
ప్రజారంజనమాత్రం తన్న సామ్రాజ్యాయ కల్పతే
వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్
వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తు ముక్తయే
అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా
శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణకారణమ్
అతః ప్రయత్నాద్ జ్ఞాతవ్యం తత్త్వజ్ఞాత్తత్త్వమాత్మనః.(58-62)

జీవబ్రహ్మైక్యాన్ని ప్రతిపాదించే నాలుగువాక్యాలు నాలుగు వేదాలనుండి గ్రహింపబడినవి. వాటికి మహావాక్యాలని పేరు. "ప్రజ్ఞానం బ్రహ్మ" (ఋ.వే.) "అహం బ్రహ్మాస్మి" (య.వే.) "తత్ త్వమసి" (సా.వే,) "అయమాత్మా బ్రహ్మ" (అథ.వే.) అనే నాలుగువాక్యాలకి అర్థంచెప్పడానికి ఒక ప్రత్యేకమైన పద్ధతిని గ్రహించవలసి ఉన్నది. అందుచేత చాలా చిన్నవైన ప్రకరణాలలో తప్ప మిగిలిన అన్ని ప్రకరణాలలోను శంకరభగవత్పాదులు "తత్త్వమసి" అనే మహావాక్యానికి అర్థం ఎలా చెప్పాలో చెప్పినారు. ఇతర వాక్యాలకుకూడా అదే పద్ధతి అవలంబించవచ్చును,

"తత్ త్వమ్ అసి" అనే వాక్యానికి "వెనుకచెప్పిన, సకల జగత్సృష్టి కర్తయైన, సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదులతో కూడిన ఆ పరమేశ్వరుడు నీవే" అని

అర్థము. "త్వమ్" అని నిర్దేశింపబడినవాడు శ్వేతకేతువన్ ఒక జీవుడు. ఇతడు కించిద్జ్ఞుడు. అల్పశక్తికలవాడు. సర్వజ్ఞత్వాదులు ఉన్న ఆ పరమేశ్వరుడూ, కించిద్జ్ఞత్వాదులున్న ఈ జీవుడూ ఒక్కరే ఎట్లు అవగలరు? అందుచేత ఈ అర్థం కుదరదు. మరొకవిధంగా చెప్పవలసి ఉంటుంది.

ప్రతీశబ్దానికి నిశ్చితమైన ఒక అర్థం ఉంటుంది. దానికి వాచ్యార్థం అని పేరు. ఉదాహరణకి "గంగాయాం జలమ్ అస్తి" అనే వాక్యానికి "గంగానదిలో జలమున్నది" అని అర్థం. ఇది వాచ్యార్థం.

అయితే "గంగాయాం ఘోషః అస్తి"అనే మరొక వాక్యంలోని "గంగా యామ్" అనే పదానికి "గంగానదిలో" అనే వాచ్యార్థం చెపితే కుదరదు, ఘోషము (గొల్లపల్లె) గంగానదిలో ఉండదుకదా? ఇలాంటి సందర్భాలలో అసలు అర్థానికి బదులు దానికి దగ్గరగా ఉండే మరొక అర్థం చెప్పుకోవాలి. ఇక్కడ "గంగా యామ్" అనుపదానికి "గంగాతీరమునందు" అని అర్థం. ఇప్పుడు "గంగాతీరము పై గొల్లపల్లె ఉన్నది" అనే అర్థం కుదురుతుంది. ఈవిధంగా అసలుఅర్థం విడచి చెప్పిన మరొక అర్థానికి లక్ష్యార్థం అని పేరు. ఆపదం ఆలక్ష్యార్థాన్ని బోధించిన వ్యాపారానికి (పనికి) "లక్షణ" అనిపేరు. ఇది మూడు విధాలు - "జహల్లక్షణ" "అజహల్లక్షణ", "జహదజహల్లక్షణ". వాచ్యార్థాన్ని పూర్తిగా విడచి లక్ష్యార్థాన్ని బోధించినట్లయితే అది జహల్లక్షణ. పై ఉదాహరణలో "గంగా" శబ్దం అసలు అర్థమైన ప్రవాహరూపార్థాన్ని పూర్తిగా విడచి "తీరము" అనే అర్థాన్ని బోధిస్తు న్నది. ఘోషమునకు తీరముతో మాత్రమేకదా సంబంధము? అందుచేత జహ ల్లక్షణ. కొన్నిచోట్ల వాచ్యార్థం విడవకుండా లక్ష్యార్థాన్ని బోధించడం జరుగు తుంది. "కున్తాః ప్రవిశన్తి" అని వున్నది. కుంతాలు(ఒకరకం ఆయుధం) తమం తట తాముగా లోనికి ప్రవేశించడం కుదరదు. అందుచేత "కుంతములు ధరిం చిన వాళ్ళు" అని లక్ష్యార్థం గ్రహింపబడినది. ఈ అర్థంలో కుంతములు అనే వాచ్యార్థంకూడా కలసి ఉన్నది, కుంతాలుకూడా లోనికి తీసికొనిపోబడుతున్నాయి కదా? అందుచేత అజహల్లక్షణ. వేదాంతులు "జహదజహల్లక్షణ" అనే మూడవ విధమైనదానినికూడా అంగీకరించారు. వాచ్యార్థంలోని కొంత భాగాన్ని విడిచి, కొంతభాగాన్ని గ్రహించిన లక్షణఅని అర్థం. దేవదత్తుడనే వానినికొంతకాలక్రితం ఎక్కడనో చూడడం జరిగింది. అతనినే ఈనాడు ఇక్కడ చూచి "ఓ! ఆ దేవ

దత్తుడే కదా ఇతడు" (సోఽయం దేవదత్తః) అని అంటున్నాము. అనగా ఆ దేవదత్తుడూ, ఈ దేవదత్తుడూ ఒక్కరే అని అర్థం. కాని ఆనాడు, అక్కడ చూచిన ఆదేశ కాలాలకు సంబంధించిన దేవదత్తుడు వేరు; ఈనాడు, ఈ దేశంలోవున్న, ఈ దేశకాలాలకు సంబంధించిన దేవదత్తుడువేరు. అయినా యిద్దరూ ఒక్కడే అంటున్నాము. ఆదేశకాలాలను విడిచిపెట్టి, ఈ దేశకాలాలను కూడా విడిచిపెట్టి దేవదత్తుడనే అంశంమాత్రం గ్రహించడం చేత అలా చెప్పడంకుదిరినది. ఈ విధంగా వాచ్యార్థంలోని కొంతభాగం విడిచి, కొంతభాగం గ్రహించడం చేత ఇది జహదజహల్లక్షణ. ఇదే విధంగా "తత్" అనే పదానికి సంబంధించిన "సర్వజ్ఞత్వాదులుగల చైతన్యము" అనే అర్థంలోని కొంత భాగమైన సర్వజ్ఞత్వాదికాన్ని విడచి చైతన్యరూపాంశాన్ని మాత్రం గ్రహించాలి. "త్వమ్" అనే పదానికి సంబంధించిన "కించిద్జ్ఞత్వాది విశిష్టచైతన్యము" అనే అర్థంలోని కించిద్జ్ఞత్వాది భాగంవిడిచి చైతన్యరూపాంశాన్ని గ్రహించాలి. అపుడు ఈ రెండింటికి అభేదం కుదురుతుంది. ఈ విధంగా "తత్త్వమసి" అనే మహావాక్యానికి ఎలాఅర్థంచెప్పాలో భగవత్పాదులు ఇతరప్రకరణ గ్రంథాలలోవలెనే దీనిలో కూడా వివరించారు, (249-251) (చూ.స.వే.సా.సం. 706-763) ఈవిధంగా అనేక విషయాలను ప్రతిపాదించే ఉత్తమప్రకరణ గ్రంథం "వివేకచూడామణి",

## 9. ఉపదేశ సాహస్రీ :

ఇది ప్రకరణాలన్నింటిలోనూ విస్తృతమైనది. దీనిలో 116 గద్య ఖండాలూ, 791 శ్లోకాలూ (మొత్తం 907) ఉన్నవి. కొన్ని గద్యఖండాలు పదిహేను పంక్తులు మించిఉన్నది. అద్వైత సిద్ధాంతానికి సంబంధించిన అన్ని విషయాలు గురుశిష్య సంవాదరూపంలో, శ్రుతియుక్తి ప్రమాణప్రదర్శన పూర్వకంగా ప్రతిపాదింపబడినవి. అన్ని ప్రకరణ గ్రంధాలూ ఒక ఎత్తు ఇది ఒక యెత్తు అని చెప్పవచ్చును.

గద్యప్రబంధ ప్రారంభంలో ఎలాంటి శిష్యునికి ఆత్మతత్త్వం ఉపదేశించాలి, ఉపదేశించే గురువుకూడా ఎలాంటి వాడై ఉండాలి అనే విషయాలు చెప్పబడినవి.

నిజమైన ఆత్మజ్ఞానం కలవానికి పరలోకభయంకాని, మృత్యుభయం కాని ఉండదు. అట్టి వానిదృష్టిలో బ్రహ్మాదిదేవతలుకూడా దయనీయమైన స్థితిలో ఉంటారు.

"పరలోకభయం యస్య నాస్తి మృత్యుభయం తథా
తస్యాత్మజ్ఞస్య శోచ్యాఃస్యుః సబ్రహ్మేన్ద్రా అపీశ్వరాః"(12-27)

సమస్త దైన్యాలకి మూలకారణం తృష్ణ, ఆ తృష్ణను తెంపుకొన్నవానికి ఈశ్వరత్వం ఎందుకు, బ్రహ్మత్వం ఎందుకు ?

"ఈశ్వరత్వేన కిం తస్య బ్రహ్మేన్ద్రత్వేన వా పునః
తృష్ణా చేత్సర్వతశ్ఛిన్నా సర్వదైన్యైకభూ వాఽశుభా" (12-28)

చతుర్దశ ప్రకరణమైన పార్థివప్రకరణంలో సాంఖ్య-నైయాయిక-బౌద్ధాదుల మతాలు ఖండించి వారు చేసిన బంధమోక్షాదికల్పన అసంగతమైనది అని ప్రతిపాదింపబడినది. తత్త్వం తెలుసుకోవాలని ప్రయత్నించేవారిలో అహంభావం కాని, శఠత్వంకాని ఉండకూడదు. వాళ్ల ప్రవృత్తి ఋజువుగా ఉండాలి.

"తస్మాద్భ్రాన్తిరతోఽన్యా హి బన్ధమోక్షాదికల్పనాః
సాంఖ్యకాణాదబౌద్ధానం మీమాంసాహతకల్పనాః
శాస్త్రయుక్తివిరోధాత్తా నాదర్తవ్యాః కదాచన" (14-64-5)

ఇదం రహస్యం పరమం పరాయణం వ్యపేతదోషైరభిమానవర్జితైః
సమీక్ష్య కార్యా మతిరార్జవే సదా న తత్త్వదృక్ శాఠ్యమతిర్హి కశ్చన"(70)

"పాలనుంచి తీసిన నెయ్యి మళ్లీ పాలలో కలిపినా పూర్వంవలె కలవదు ఆదే విధంగా "నేను బుద్ధ్యాదులకంటె భిన్నమైనవాడను" అనే దృఢజ్ఞానం కలవానికి మరల వాటితో పూర్వంవలె సంబంధం ఉండదు."

క్షీరాత్సర్పిర్యథోద్ధృత్య క్షిప్తం తస్మిన్న పూర్వవత్
బుద్ధ్యాదేర్జ్ఞస్తథానత్వాన్న దేహీ పూర్వవద్భవేత్" (15-61)

10. ప్రబోధసుధాకర :

ఇది 257 శ్లోకాల ప్రకరణ గ్రంథం. వైరాగ్యం కలగడానికిదేహమూ విషయాలు మొదలైనవాటికి సంబంధించిన దోషాలు వర్ణింపబడ్డాయి. సగం దేహం పామునోట్లో ఉన్న కప్పఎదట ఉన్న దోమలను తింటూన్నట్లు, మానవుడు ఆయుర్దాయం గడచినా, తెలియక, భోగ్యవిషయాలు సేకరిస్తూనే ఉంటాడు.

"ఉరగగ్రస్తార్థతనుర్భేకోఽశ్నాతీహ మక్షికాః శతశః
ఏవం గతాయురపి సన్విషయాన్సముపార్జయత్యన్ధః" 64

ఆత్మ సాక్షిభూతము. దేహాదుల ప్రవృత్తులేవీ దానికి అంటవు. ఇంటిలో దీపం వెలుగుతూన్నపుడు దొంగ ప్రవేశించి ఏవైనవస్తువులు అపహరించవచ్చును. అయితే అక్కడున్న దీపం ఆతనిని ప్రేరేపించదు, నివారించదు. దైవవశం చేత ఇంట్లో ఉన్నవానికెవనికైనా ఆపదకలిగినా, సంపదకలిగినా దీపం విచారించదు, ఆనందించదు, ఆత్మకు ఇతర దృశ్యజగత్తుతోఉన్న సంబంధంకూడా అలాంటిదే.

"నిశి వేశ్మని ప్రదీపే దీవ్యతి చౌరస్తు విత్తమపహరతి
ఈరయతి వారయతి వా తం దీపః కం తథాత్మాపి." 137

గేహాన్తే దైవవశాత్ కస్మింశ్చిత్సముదితే విపన్నే వా
దీపస్తుష్యత్యథవా ఖిద్యతి కిం తద్వదాత్మాపి. 138

బ్రహ్మకు సంబంధించినది మాయ. జీవుని ఆశ్రయించుకొని ఉన్నది అవిద్య. చిదచిత్తుల గ్రంథియే జీవుడు. అనగా అంతఃకరణంలో ముడివడిన చైతన్యమే జీవుడు.

"మాయా బ్రహ్మోపగతాఽవిద్యా జీవాశ్రయా ప్రోక్తా
చిదచిద్గ్రన్థిశ్చేతస్తదక్షయం జ్ఞేయమామోక్షాత్" 105

ఆత్మానుచింతనం చేస్తూ చిత్తాన్ని స్థిరంచేసుకొన్న వానికి చెవిలో కొన్ని నాదాలు వినిపిస్తాయనీ, వాటి అనుసంధానం చెయ్యాలనీ 144 నుండి 149వశ్లోకం వరకూ ప్రతిపాదింపబడినది. చివర 166వ శ్లోకం నుంచి 257వ శ్లోకం వరకు

కృష్ణభక్తివైశిష్ట్యాన్ని గూర్చి, కృష్ణుని అనుగ్రహాదులను గూర్చి విస్తృతంగా వర్ణింపబడింది. దీనినంతనూ పట్టిచూడగా ఇది శంకర భగవత్పాదుల రచన కాక అర్వాచీనుల దెవరిదో అయివుంటుందని తోచుచున్నది, శంకర భగవత్పాదులు జ్ఞానప్రతిపాదకమైన గ్రంథంలో ఈవిధంగా సగుణభక్తినిగూర్చి, యోగమారాలతో ప్రసిద్ధమైన నాదోపాసనాదులను గూర్చి వ్రాస్తారని భావించడానికి వీలులేదు, మొదట ప్రారంభంలోనే - వైరాగ్యము, ఆత్మబోధ, భక్తిముక్తిసాధనాలని చెప్పబడింది :-

"వైరాగ్యమాత్మబోధో భక్తిశ్చేతి త్రయం గదితమ్
ముక్తేః సాధనమాదౌ తత్ర విరాగో వితృష్ణతా ప్రోక్తా" 5

ఈ భక్తి "స్వస్వరూపానుసన్ధానం భక్తిరిత్యభిధీయతే"అని వివేకచూడామణిలో చెప్పిన భక్తివంటిది కాదు. అందుచేతకూడా ఇది ఎవరో అర్వాచీనులు రచించిన గ్రంథం అని చెప్పవలసి ఉన్నది.

## 11. స్వాత్మప్రకాశికా :-

అరవై ఎనిమిది శ్లోకాల ప్రకరణ గ్రంథం. దృశ్యమైన ప్రపంచం అంతా ఆత్మయందు కల్పింపబడినది. వాస్తవంలో ఇదేదీ లేదు అని గురువు శిష్యునికి ఉపదేశిస్తాడు. "మహాకాశం ఉన్నది. అక్కడ ఒక మఠంకట్టగా మఠాకాశం ఏర్పడినది. ఆ మఠంలో ఒక ఘటం వుంచగా ఘటాకాశం ఏర్పడింది. వాస్తవంలో ఉన్న ఆకాశం అంతా మహాకాశమే. అదేవిధంగా చిదాకాశంలో ఈశ్వరుడు, జీవుడు అనేవారు కల్పింపబడ్డారు"

"ఘటాకాశమఠాకాశౌ మహాకాశే ప్రకల్పితా
ఏవం మయి చిదాకాశే జీవేశౌ పరికల్పితా" 42

## 12. మనీషాపంచకమ్ :-

"జాగ్రత్స్వప్న సుషుప్తులనే అవస్థలు మారుతున్నా అనుస్యూతంగా ఉన్న ఆత్మస్వరూపం ఒక్కటే. అదే ఆత్మ బ్రహ్మాది పిపీలికాంత ప్రాణులలో వ్యాపించి ఉన్నది. అదే నేను. ఈదృశ్యదేహాదికం నేను కాదు అని దృఢమైన

జ్ఞానంవున్నవాడు బ్రాహ్మణుడైనా, చండాలుడైనా నాకు గురువే. అద్వైతతత్త్వం తెలిసిన తరవాత ఏవిధమైన భేదబుద్ధులకీ అవకాశంలేదు" అని -

"జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటితరా యా సంవిదుజ్జృమ్భతే
యా బ్రహ్మాది పిపీలికాన్తతనుషు ప్రోతా జగత్సాక్షిణీ
సైవాహం న చ దృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాస్తి చే
చ్చాణ్డాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ"

ఇత్యాది శ్లోక పంచకంలో బోధించబడినది.

## 13. అద్వైత పంచరత్నమ్ :-

"దేహేంద్రియాద్యతీతమైన ఆత్మతత్త్వమే నేను. దృశ్యప్రపంచం అంతా మాయాకల్పితం" అనే అద్వైతసిద్ధాంతం -

"నాహం దేహో నేన్ద్రియాణ్యన్తరఙ్గో
నాహంకారః ప్రాణవర్గో న బుద్ధిః
దారాపత్యక్షేత్రవిత్తాదిదూరః
సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహమ్" 1

మొదలైన రత్నాలవంటి శ్లోకాలలో ప్రతిపాదింపబడినది.

## 14. నిర్వాణ షట్కమ్ :-

మనోబుద్ధ్యహంకార చిత్తాలుకాని, వాటి ధర్మాలుకాని, ప్రాణాదులుకాని కర్మేంద్రియాలుకాని నేను కాదు. నాకు పుణ్యపాపాలుకాని, ధర్మాధర్మాలు కాని, జాత్యాది భేదాలుకాని లేవు. నేను పంచమహాభూతాదులు కూడాకాదు" ఈభావాలు-

మనోబుద్ధ్యహఙ్కార చిత్తాని నాహం
న కర్ణం న జిహ్వా న చ ఘ్రాణనేత్రే
న చ వ్యోమ భూమిర్న తేజో న వాయు
శ్చిదానందరూపః శివోఽహం శివోఽహమ్"

మొదలైన ఆరు శ్లోకాలలో ప్రతిపాదింపబడ్డాయి.

15. అద్వైతానుభూతిః :-

ఎనభై నాలుగు శ్లోకాల ప్రకరణం; ఎన్ని దేహాలతో సంబంధించివున్నా ఆత్మ ఒక్కటే. ఘటాలు వేరైనా ఆకాశం ఒక్కటేకదా?

"నానావిధత్వం కుమ్భానాం న యాత్యేవ యథా నభః
నానావిధత్వం దేహానాం తద్వదేవ న యామ్యహమ్"
ఈవిధమైన అద్వైతభావన బోధింపబడినది.

16. బ్రహ్మానుచిన్తనమ్ :-

ఇరవైతొమ్మిది శ్లోకాల ఈ ప్రకరణంలో "అహం బ్రహ్మాస్మి" అని చింతనం చేయగా చేయగా కొంతకాలానికి నిజమైన అనుభూతి కలుగుతుంది అని ప్రతిపాదింపబడినది. మహాభూతాది దృశ్యప్రపంచాన్ని తత్తత్కారణాలలో విలయంచేసుకుంటూ పోవాలి. అప్పుడు ఆదికారణమైన బ్రహ్మమిగులుతుంది. అదే నేను అని భావించాలి.

అజ్ఞానాశ్రయమైనది బ్రహ్మ. బ్రహ్మను ఆశ్రయించుకొని ఉన్న ఈ అజ్ఞానం (మాయ) నుంచి (మాయోపహిత బ్రహ్మనుంచి) ఆకాశం, ఆకాశంనుంచి వాయువు, దానినుంచి అగ్ని, దానినుంచి జలము, దానినుంచి పృథివి, దానినుంచి వ్రీహియవాదులు ఆవిర్భవించాయి. ఇది సృష్టిక్రమం. అయితే దీనికి విలోమ క్రమంలో ఒకదానిని ఒకదానిలో విలీనం చేసుకుంటూ పోవాలి. అనగా పృథివి కంటె భిన్నంగా వ్రీహియవాదులు లేవు; జలంకంటె భిన్నంగా పృథివి, అగ్ని కంటె భిన్నంగా జలం, వాయువు కంటె భిన్నంగా అగ్ని, ఆకాశం కంటె భిన్నంగా వాయువు, అజ్ఞానంకంటె భిన్నంగా ఆకాశము, బ్రహ్మకంటె భిన్నంగా అజ్ఞానము లేవు. ఇక చివరికి మిగిలినది బ్రహ్మయే. అదే నేను.

"అజ్ఞానాద్బ్రహ్మణోజాతమాకాశం బుద్బుదోపమమ్
ఆకాశాద్వాయురుత్పన్నో వాయోస్తేజస్తతః పయః
అద్భ్యశ్చ పృథివీ జాతా తతో వ్రీహి యవాదికమ్
పృథివ్యప్సు పయోవహ్నౌ వహ్నిర్వాయౌ నభస్యసౌ
నభోఽవ్యాకృతే తచ్చ శుద్దే శుద్ధోఽస్మ్యహం హరిః" 9-12

"బ్రహ్మైవాహం న సంసారీ ముక్తోఽహమితి భావయేత్
అశక్నువన్ భావయితుం వాక్యమేతత్సదభ్యసేత్
యదభ్యాసేన తద్భావో భవేద్భ్రమరకీటవత్" 18, 19

17. ప్రశ్నోత్తర రత్నమాలికా :-

అరవైఏడు శ్లోకాలు ఉన్న ఈ ప్రకరణంలో ప్రశ్న, దానికి ఉత్తరము అనే పద్ధతిలో ఆధ్యాత్మిక సాధకునికే కాకుండా, లౌకికవ్యవహార వ్యాపృతునికి కూడా ఉపయోగించే ఎన్నో ధర్మాలు, విషయాలు బోధింపబడినవి,

"కః పథ్యతరో ధర్మః కః శుచిరిహ యస్య మానసం శుద్ధమ్
కః పణ్డితో వివేకీ కిం విషమవధీరణా గురుషు" 4

"ఎక్కువ హితకరమైనది ఏది ? ధర్మము; పవిత్రుడు ఎవడు ? పరిశుద్ధమైన మనస్సు ఉన్నవాడు. పండితుడు ఎవరు ? వివేకం కలవాడు. విషం ఏది ? పెద్దలను అవమానించడం."

"కిం సంసారే సారమ్? బహుశోఽపి విచిన్త్యమానమిదమేవ
కిం మనుజేష్విష్టతమం స్వపరహితాయోద్యతం జన్మ". 5

ఈ సంసారంలో సారం ఏది ? మాటిమాటికీ ఇలా ఆలోచించడమే. ఎక్కువ కోరదగినది ఏది ? తనకూ పరులకూ హితము చేయడానికి ఉపకరించే జన్మ."

18. సదాచారాను సంధానమ్ :-

దీనిలో 55 శ్లోకాలున్నాయి. తత్త్వజ్ఞానం సంపాదించాలంటే వేదాన్తం తప్ప మరొక శరణ్యంలేదు. మీమాంసా శాస్త్రానికి జ్ఞానానికి చాలాదూరం. తర్కానికి ఒక హద్దు అంటూ ఉండదు. సాంఖ్యయోగాలు బేదాన్నిబోధిస్తాయి. వైయాకరణుల దృష్టి అంతా శబ్దాలు తయారు చేయడంలోనే. మిగిలినవాళ్ళందరూ వేద బాహ్యులు. వాళ్ల దగ్గర జ్ఞానం మాటకూడా వినిపించదు.

"కర్మశాస్త్రై కుతో జ్ఞానం తర్కే నైవాస్తి నేశ్చయః
సాంఖ్యయోగా భిదాపన్నే శాబ్దికాః శబ్దతత్పరాః
అన్యే పాషణ్డినః సర్వే జ్ఞానవార్తా సుదర్లభా
ఏకం వేదాన్తవిజ్ఞానం స్వానుభూత్యా విరాజతే." (58-29)

శబ్దానికి ఉన్న శక్తి ఊహింపరానిది ఉదాహరణకి-నిద్రపోతున్నవానిని పేరు పెట్టి పిలవగా అంత గాఢనిద్రలో ఉండగానే విన్నాడా, మెలకువ వచ్చిన తరువాతవిన్నాడా అంటే ఏమీచెప్పజాలము. ఏమైనా శబ్దానికి ఒక అనిర్వాచ్యమైన శక్తి ఉన్నదని అర్థంఅవుతుంది. అందుచేత వేదాంత వాక్యశ్రవణంవల్ల అపరోక్ష జ్ఞానం కలుగుతుందనడంలో సందేహం లేదు.

"శబ్దశక్తేరచిన్త్యత్వాచ్ఛబ్దాదేవాపరోక్షధీః
ప్రసుప్తః పురుషో యద్వచ్ఛబ్దేనైవావబుధ్యతే" 19

## 19. యోగతారావళీ :-

ఇరవైతొమ్మిది శ్లోకాలున్న ఈ ప్రకరణంలో యోగానికి సంబంధించిన బంధాలద్వారా కుండలినీ శక్తిని మేల్కొలపడం, అనాహతధ్వని శ్రవణం మొదలైన యోగశాస్త్ర విషయాలు చెప్పబడినవి. "శ్రీశైలగుహలలో నివసిస్తూ ఇలాంటి యోగసాధనలద్వారా సమాధిని ఎప్పుడు పొందగలుగుదునో కదా!" అంటూ (శ్లో. 28) చెప్పేవిధానము, ఇతర విషయలూ చూస్తే ఇది శంకరభగవత్పాదరచిత మని తోచదు.

## 20. ఉపదేశపఞ్చకమ్ :-

ఐదుశ్లోకాలలో ఆత్మజ్ఞానోపయుక్తమైన వివిధ విషయాలు ఉపదేశించబడినవి. చాలామంది పఠించే ప్రకరణం ఇది. అతి సులభమైన శైలిలో వ్రాయడం చేత సామాన్య భాషాజ్ఞానం కలవారికి గూడా అర్థం అవుతుంది. ఉదా ;-

"ఏకాన్తే సుఖమాస్యతాం పరతరే చేతః సమాధీయతాం
పూర్ణాత్మా సుసమీక్ష్యతాం జగదిదం తద్బాధితం దృశ్యతామ్
ప్రాక్కర్మ ప్రవిలాప్యతాం చితిబలాన్నాప్యుత్తరైః శ్లిష్యతాం
ప్రారబ్ధం త్విహ భుజ్యతామథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్" 5

"సుఖంగా ఏకాంత ప్రదేశంలో కూర్చొనండి. పరమాత్మపై మనస్సు నిలపండి. పూర్ణాత్మను సాక్షాత్కరించు కొనండి, ఈ జగత్తుఅంతా ఆ పరబ్రహ్మ చేత బాధితమని గ్రహించండి. జ్ఞానంచేత పూర్వకర్మలన్నింటినీ లయంపొందించి రాబోయే కర్మతో సంబంధం లేకుండా చేసికొనండి. ప్రారబ్ధకర్మను ఈ దేహం తోటే అనుభవించి పరబ్రహ్మ స్వరూపంతో ఉండిపొండి."

## 21. ధన్యాష్టకమ్ :-

సంసారబంధం నుంచి బైటకువచ్చి ఆధ్యాత్మిక పాలనాతత్పరులై ఆత్మ సాక్షాత్కారం పొందిన మహాత్ముల ఉత్తమస్థితి ఎనిమిది శ్లోకాలలో వర్ణింపబడినది.

"త్యక్త్వా గృహే రతిమధోగతి హేతుభూతా
మాత్మేచ్ఛయౌపనిషదర్థరసం పిబన్తః
వీతస్పృహా విషయభోగపదే విరక్తా
ధన్యాశ్చరన్తి విజనేషు విరక్తసఙ్గాః 3

అధోగతికి కారణమైన గృహనివాసాభిలాషను విడచి, ఉపనిషదర్థరసాన్ని ఇష్టంవచ్చినంతగా త్రాగుచు, ఏ ఆశలూలేనివారై, విషయభోగములందుకాని అధికారమునందుకాని ఆసక్తిలేనివారై ఉన్న ధన్యాత్ములు సంగవర్జితులై విజన ప్రదేశాలలో సంచరిస్తూ ఉంటారు.

## 22. జీవన్ముక్తానందలహరీ :-

ఆత్మసాక్షాత్కారం పొందిన జీవన్ముక్తుడు ప్రారబ్ధక్షయం అయేవరకూ శరీరంతో ఉంటాడు. అనేక కార్యకలాపాలలో పాల్గొంటూ ఉంటాడు. ఎన్ని విధాలుగా ప్రవర్తించినా మళ్ళీ వ్యామోహంఅనేది అతనికి కలగదు. ఈ విషయం "మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షతతమాః" అనే చతుర్థచరణం గల పదహారు శ్లోకాలలో వర్ణింపబడినది. పదిహేడవ శ్లోకం ఫలశ్రుతిరూపం.

క్వచిచ్ఛైవైః సార్ధం క్వచిదపి చ శాక్తైః సహ వస
న్కదా విష్ణోర్భక్తైః క్వచిదపి చ సౌరైః సహ వసన్

కదా గాణాపత్యైర్గతసకలభేదోఽద్వయతయా
మునిర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షతతమాః" 14

గురువు ప్రసాదించిన జ్ఞానదీక్షచే పూర్తిగా అజ్ఞానం తొలగిన, ముని అద్వైత బుద్ధికలవాడవడంచేత ఒకప్పుడు శైవులతోను, ఒకప్పుడు శాక్తులతోను, ఒకప్పుడు వైష్ణవులతోను, ఒకప్పుడు సూర్యోపాసకులతోను, మరొకప్పుడు గాణాపత్యులతో నివసిస్తూ, ఏ వ్యామోహమూ లేకుండా ఉంటాడు.

23. అనాత్మశ్రీవిగర్హణమ్ :-

ఆత్మసాక్షాత్కారం సంపాదించలేనివాడు ఐహికాముష్మిక భోగభాగ్యాదులు ఎన్ని సంపాదించినా వ్యర్థమే అనే విషయం "యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్" అనే చతుర్థపాదంగల పదహారు శ్లోకాలలో ప్రతిపాదింపబడినది. చివరి రెండు శ్లోకాలలో ఫలశ్రుతి.

ధాతుర్లోకః సాధితో వా తతః కిం
విష్ణోర్లోకో వీక్షితో వా తతః కిమ్
శమ్భోర్లోక ః శాసితో వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్." 16

ఆత్మ సాక్షాత్కారం పొందలేనివాడు బ్రహ్మలోకం సాధిస్తే ఏమిటి, విష్ణులోకానికివెళ్లి చూచివస్తే ఏమిటి, శంభులోకాన్ని శాసిస్తేమాత్రం ఏమిటి?

నడిచి సముద్రం దాటితే ఏమిటి, గాలిని కుండలో కట్టివేస్తే ఏమిటి, మేరుపర్వతాన్ని చేతితో ఎత్తితే ఏమిటి?

"అబ్ధిః పద్భ్యాం లఙ్ఘితో వా తతః కిం
వాయుః కుమ్భే స్థాపితో వా తతః కిమ్
మేరుః పాణావుద్ధృతో వా తతః కిం
యేన స్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్" 9

## 24. స్వరూపానుసన్ధానాష్టకమ్ :-

"పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి" అనే చతుర్థపాదంగల ఎనిమిది శ్లోకాలలో ఆత్మసాక్షాత్కారం పొందిన జ్ఞానితన అనుభవాన్ని వర్ణించి చెప్పినట్లు ప్రతిపాదింపబడింది. తొమ్మిదవ శ్లోకం ఫలశ్రుతిరూపం.

ఏదితెలియనంతవరకూ ప్రపంచకం కనబడుతూ ఉంటుందో, దేని సాక్షాత్కారం కలగగానే ప్రపంచకం ప్రపంచకంగా కనబడదో ఆ నిత్య పర బ్రహ్మయే నేను."

"యదజ్ఞానతో భాతి విశ్వం సమస్తం
వినష్టం చ సద్యో యదాత్మప్రబోధే
మనోవాగతీతం విశుద్ధం విముక్తం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి" 4

## 25. యతి పఞ్చకమ్ :-

"సర్వసంగపరిత్యాగులై కౌపీనము మాత్రమే ధరించి చెట్ల క్రిందనివసిస్తూ, హస్తమే భోజనపాత్రగా ఉపయోగిస్తూ, ఐశ్వర్యాన్ని చిరుగుబొంతవంటిదానినిగా చూసూ ఉండేవాళ్లే నిజమైన భాగ్యవంతులు కదా".

"మూలం తరోః కేవలమాశ్రయన్తః
పాణిద్వయం భోక్తుమమన్త్రయన్తః
కన్థామివ శ్రీమపి కుత్సయన్త
కౌపీనవన్తః కిల భాగ్యవన్తః" 2

ఈ విధంగా సమానమైన చతుర్థచరణంగల ఐదు శ్లోకాలు ఉన్నాయి దీనిలో.

## 26. హస్తామలకీయ భాష్యమ్ :-

శ్రీ శంకర భగవత్పాదుల శిష్యుడైన హస్తామలకాచార్యుడు అద్వైత తత్త్వప్రతిబోధకాలైన పన్రెండు శ్లోకాలు రచించినారు. శిష్యవాత్సల్యపూర్ణులైన శ్రీభగవత్పాదులు దీనికి వ్యాఖ్య వ్రాసినారని ప్రసిద్ధికాని ఇది అర్వాచీనులవ్యాఖ్య

కావచ్చును. ఎంత శిష్యవాత్సల్యవంతులైనా భగవత్పాదులు తమ శిష్యుని "....తం ప్రత్యాత్మజ్ఞానమాచార్య ఉపదిశతి" అని అంటూ (వ్యాఖ్యాప్రారంభంలో) ఆచార్యుడని నిర్దేశిస్తారా అనేది సందేహాస్పదం. "భావాద్వైతం చేస్తే చేయవచ్చును గాని క్రియాద్వైతం మాత్రం చేయగూడదు, మూడులోకాలలో అన్నింటి విషయంలోనూ అద్వైతభావం ఉన్నా గురువు విషయంలో మాత్రం అది పనికిరాదు." అని వారే గురుశిష్యులమధ్య అద్వైతభావం చూపకూడదని చెప్పినవారు కదా.

"భావాద్వైతం సదాకుర్యాత్క్రియాద్వైతం న కర్హిచిత్
అద్వైతం త్రిషులోకేషు నాద్వైతంగురుణాసహ"(తత్త్వోపదేశము87)

## 27. పఞ్చీకరణమ్ :-

ఇది ఉపనిషదనుసారంగా మహాభూతాది సృష్టిని, లింగశరీరకారణ శరీరాదులను గూర్చి చెప్పే ఇరవైయైదుపంక్తుల గద్యరూపమైన ప్రకరణము,

## 28. తత్త్వోపదేశం :-

దేహాదులు ఆత్మకాదని చెప్పి "తత్త్వమసి" అనే మహామహావాక్యానికి జహదహల్లక్షణచేత అర్థం ఏవిధంగా చెప్పాలో 87 శ్లోకాల ఈ ప్రకరణంలో ప్రతిపాదింపబడినది.

## 29. ఏకశ్లోకీ :-

బృహదారణ్యకోపనిషత్తులోని చతుర్థాధ్యాయంలో ఉన్న ఒక జనక యాజ్ఞవల్క్య సంవాదంలో జనకుడు - యాజ్ఞవల్క్యా ! పురుషుడు ఏ జ్యోతిస్సు సహాయంచేత లోకవ్యవహారం జరువుకుంటాడు" అని ప్రశ్నిస్తాడు, "ఆదిత్యరూపమైన తేజస్సుతో"అని యాజ్ఞవల్క్యుడు సమాధానం చెబుతాడు. ప్రశ్న: "సూర్యుడు అస్తమించినపుడు ?" సమాధానం :- "అప్పుడు చంద్రునితో". ప్ర : "చంద్రుడస్తమించినప్పుడు ?" సమా : "అగ్నితో". ప్ర : "అగ్ని శాంతించినప్పుడు ?" సమా: వాక్కు అనే జ్యోతిస్సుతో." చుట్టుప్రక్కల అంతా అంధకారబంధురమై తన చెయ్యికూడా కనపడని పరిస్థితులలో మాటల సహాయంతోటేకదా పురుషుడు వ్యవహరించేది? ప్ర : "ఆ వాక్కుకూడా అస్తమించినప్పుడు? సమా : "అప్పుడు ఆత్మ

అనే జ్యోతిస్సుతో వ్యవహరిస్తాడు". (బృ.ఉ. 4, 3, 2-6) శంకరభగవత్పాదులు ఈ విషయాన్ని గ్రహించి, కొంచెం మార్పులుచేసి అద్భుతమైన ఈ "ఏక శ్లోకి" వ్రాశారు.

"కిం జ్యోతిస్తవ భానుమానహని మే రాత్రౌ ప్రదీపాదికం
స్యాదేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతిరాఖ్యాహి మే
చక్షుస్తస్య నిమీలనాదిసమయే కిం ధీర్ధియో దర్శనే
కిం తత్రాహమతో భవాన్పరమకం జ్యోతిస్తదస్మిప్రభో"

ప్ర : తవ కిం జ్యోతిః ? = నీకు జ్యోతిస్సు ఏది ?

స : మే అహని భానుమాన్, రాత్రౌ ప్రదీపాదికమ్ = నాకు పగలు సూర్యుడు రాత్రి దీపాదులు జ్యోతిస్సు.

ప్ర : స్యాదేవం ........మే = అదిసరియే. సూర్య దీపాదులనుగూర్చి తెలుసుకొనడానికి నీకు ఏది జ్యోతిస్సో చెప్పుము.

స : చక్షుః = అందుకు నేత్రమే జ్యోతిస్సు.

ప్ర : తస్య నిమీలనాదిసమయే కిమ్ = అవి మూసుకోవడం వంటి పరిస్థితులలో నీకు జ్యోతిస్సు ఏది ?

స : ధీః = బుద్ధియే తేజస్సు.

ప్ర : ధియో దర్శనే కిమ్ = బుద్ధినిగూర్చి తెలుసుకోవడానికి ఏది ?

స : తత్ర అహమ్ = అందుకు నేనే జ్యోతిస్సును.

గురువు : అతో భవాన్ పరమకం జ్యోతిః = అందుచేత నీవే (అనగా ఆత్మయే) పరమమైన తేజస్సు అని తెలిసికొనుము,

శిష్యుడు : ప్రభో ! తత్ అస్మి = ఓ గురూత్తమా ! తెలిసినది. ఆ పరమతేజస్సు నేనే.

ఈ శ్లోకంలో అద్వైతసిద్ధాంతాన్నంతటిని ఎలా సంగ్రహించి బోధించారో అది సహృదయైకవేద్యమైన విషయం.

"శతశ్లోకి" లో కూడా ఈ భావాన్నే శంకరభగవత్పాదులు మరొక శ్లోకంలో ప్రతిపాదించారు.

"కిం జ్యోతిస్తే వదస్వాహని రవిరిహ మే చన్ద్రదీపాది రాత్రౌ
స్యాదేవం భానుదీపాదిపరికలనే కిం తవ జ్యోతిరస్తి
చక్షుస్తన్మీలనే కిం భవతి చ సుతరాం దీర్ధియః కిం ప్రకాశే
తత్రైవాహం తతస్త్వం తదసి పరమకం జ్యోతిరస్మి ప్రభోఽహమ్" 95

30. మాయాపఞ్చకమ్ :-

"మాయ అఘటితఘటనా సమర్థము"అని ఐదు శ్లోకాలలో దాని ప్రభావం వర్ణింపబడినది. "వేద వేదాంతాదులు శోధించిన మహాపండితులను కూడా ధనం మొదలైనవి చూపించి పశువుల వంటి వారిని చేసే ఈ మాయ అఘటిత ఘటనా శక్తురాలు."

"శ్రుతిశత నిగమాన్త శోధకాన -
ప్యహహ ధనాది నిదర్శనేన సద్యః
కలుషయతి చతుష్పదాద్యభిన్నా
నఘటిత ఘటనాపటీయసీ మాయా" 2

31. ప్రౌఢానుభూతిః :-

ఆత్మ సాక్షాత్కారం పొందినవాని అనుభూతి విశదంగా పదిహేడు శార్దూలవిక్రీడిత వృత్తాలలో వర్ణింపబడినది.

32. బ్రహ్మజ్ఞానావళీమాలా :-

ఇరవై శ్లోకాల ఈ ప్రకరణంలో బ్రహ్మజ్ఞానం కావలసినవాడు ఏవిధంగా భావనచెయ్యాలో చెప్పబడింది,

"నిత్యశుద్ధవిముక్తోఽహం నిరాకారోఽహమవ్యయః
భూమానన్దస్వరూపోఽహమహమేవాహమవ్యయః

నిత్యోఽహం నిరవద్యోఽహం నిరాకారోఽహ మచ్యుతః
పరమానన్దరూపోఽహమహమేవాహమవ్యయః" 3, 4

ఈవిధంగా పదిహేడు శ్లోకాలున్నాయి.

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యాని. జీవో బ్రహ్మైవ నాపరః
అనేన వేద్యం సచ్ఛాస్త్రమితి వేదాన్తడిణ్డిమః"

అనే శ్లోకం దీనిలోనిదే.

33. లఘువాక్యవృత్తిః :-

స్థూల - సూక్ష్మ - కారణ శరీరాలనుగూర్చి చెప్పే పద్దెనిమిది శ్లోకాలున్న ఈ ప్రకరణం, వాటికన్నిటింకంటె భిన్నమైనది ఆత్మ అని బోధిస్తుంది. మనస్సుకు ఇంద్రియాలద్వారా ఆయా విషయాలతో సంపర్కం ఏర్పడినప్పుడు వాటి జ్ఞానం కలుగుతుంది. అది మనోవృత్తి. దీనిలో ఆయా పదార్థాల విశేషాలు భాసిస్తాయి కాబట్టి దీనికి సవికల్పం అని పేరు. ఇది జీవునికి సంబంధించినది, జీవరూపమైనది. ఒక వృత్తికీ ఒక వృత్తికీ మధ్య, అనగా ఒక చిత్తవృత్తి కలిగినపిమ్మట మరొక చిత్తవృత్తి కలిగేలోపుగా మధ్యనున్నది నిర్వికల్పమైన చైతన్యం. బ్రహ్మానుభవం పొందగోరేవాళ్లు ఒక వృత్తికీ ఒక వృత్తికీ మధ్య వ్యవధానం క్రమం పెరిగేటట్లు చూసుకోవాలి. సవికల్పం జీవుడు. నిర్వికల్పం బ్రహ్మ. ఈ రెండూ ఒకటే. "అహం బ్రహ్మాస్మి"అనే మహావాక్యానికిదే అర్థం.

"నష్టే పూర్వవికల్పే తు యావదన్యస్య నోదయః
నిర్వికల్పక చైతన్యం స్పష్టం తావద్విభాసతే"
"ఏకద్విత్రిక్షణేష్వేవం వికల్పస్య నిరోధనాత్
క్రమేణాభ్యస్యతాం యత్నాన్బ్రహ్మానుభవసాక్షిభిః"
"సవికల్పకజీవోఽయం బ్రహ్మ తన్నిర్వికల్పకమ్
అహం బ్రహ్మేతి వాక్యేన సోఽయమర్థోఽభిధీయతే" (11-13)

34. నిర్వాణమఞ్జరీ :-

దీనిలో పన్నెండు శ్లోకాలున్నాయి.

"అహం నైవ బాలో యువా నైవ వశద్ధో
న వర్ణీ న చ బ్రహచారీ గృహస్థః
వనస్థోఽపి నాహం న సన్యస్తధర్మా
జగజ్జన్మనాశైక హేతుః శివోహమ్" 2

ఈ విధంగా దృశ్యప్రపంచనిషేధం ద్వారా శుద్ధాత్మతత్త్వం ప్రతిపాదింపబడినది.

35. విష్ణుసహస్రనామ భాష్యమ్ :-

శంకర భగవత్పాదులు వ్యావహారిక భూమికలో సగుణ బ్రహ్మనుకూడా అంగీకరించారు. ఉపనిషత్తులలోకూడా అనేక సగుణోపాసనలు విధింపబడి ఉన్నాయి; వాస్తవానికి సగుణబ్రహ్మనుగ్రహం. ఉంటేనే కాని మానవునికి నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారరూపమోక్షం లభింపదు. ఆ సగుణబ్రహ్మ రూపాలలోకూడా శుద్ధ సత్త్వప్రధానమూర్తి శ్రీ మహావిష్ణువు అందుచేత శ్రీ భగవత్పాదులు మహాభారతాంతర్గమైన విష్ణుసహస్రనామస్తోత్రానికి వ్యాఖ్యవ్రాస్తూ అక్కడక్కడ అద్వైత సిద్ధాంత విషయాలనుకూడా ఉట్టంకించి ఉన్నారు.

36. సనత్సుజాతీయ భాష్యమ్ :-

విదురుని కోరికను అనుసరించి సనత్సుజాతుడు సాక్షాత్కరించి ధృతరాష్ట్రునికి తత్త్వోపదేశం చేశాడు. ఇదికూడా మహాభారతంలోనే ఉన్నది. దీనికి "సనత్సుజాతీయం" అని పేరు. దీనికి లభిస్తూన్న వ్యాఖ్య శ్రీ శంకర విరచితమే అని ప్రసిద్ధి. ఈ గ్రంథం అద్వైతతత్త్వప్రతిపాదకం అనే విషయంలో సందేహం లేదు కానీ వ్యాఖ్యాన పద్ధతినీ, శైలినీపట్టి చూస్తే ఇది భగవత్పాదరచన కాదేమో అనిపిస్తుంది, ఇంతేకాకుండా ఎనిమిదవ శ్లోకం వ్యాఖ్యానం చివర "ఉక్తంచ సురేశ్వరాచార్యైః - "స్వాభావఫలకారూఢ స్తద జ్ఞానమామిషు. తత్సోఽపి తదసంబద్ధ ఈశ్వరాద్యాత్మతాంగతః" (స.భా. పేజి. 447 పూనాప్రతి) అని అంటూ సురేశ్వరాచార్య వచనం ప్రమాణంగా చూపబడింది. దీనినిపట్టి ఇది శంకరాచార్య కర్తృకం కాదని స్పష్టంగా తెలుస్తూన్నది. అయితే శ్రీరంగంలో ముద్రించిన పుస్తకంలో ఈ వాక్యంలేదు. కారణం ఊహైకగమ్యం.

37. లలితాత్రిశతీ వ్యాఖ్యా :-

పరబ్రహ్మాశ్రిత మాయాశక్తి అనిర్వచనీయ ప్రభావం కలది. జగదుత్పత్త్యాదులకు కారణమైనది. ఈ శక్తిని, భవాని, దుర్గ, మహామాయ, దేవి ఇత్యాది నామాలతో పూజింపబడేది ఈ శక్తియే. ఈ శక్తిస్వరూపాన్ని వర్ణించే "లలితాత్రిశతి"కి శ్రీ శంకరభగవత్పాదులు వ్యాఖ్య వ్రాసి అక్కడక్కడ అద్వైత తత్త్వాన్ని వివరించి ఉన్నారు. ఇది విష్ణుసహస్రనామ భాష్యకోటికి చెందినది.

ఈవిధంగా శ్రీ శంకరభగవత్పాదులు మధ్యమాధికారులనూ, మందాధికారులనూ దృష్టిలో పెట్టుకొని ఎన్నో ప్రకరణగ్రంథాలు రచించి అద్వైత సిద్ధాంతాన్నే అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు అందించి ఉన్నారు. అభిరుచిని పట్టి ఏఒక్క గ్రంథాన్ని ఎన్నుకుని మనన గ్రంథంగా చేసుకున్నా చాలు; తరించవచ్చును. ప్రశాంతవాతావరణంతో కూర్చొని దశశ్లోకి, నిర్వాణషట్కం మొదలైనవాటిని స్వయంగా చదువుకొన్నా, ఎవరైనా యుక్తరీతిలో చదువుతున్నప్పుడు వినినా కూడా లోకోత్తరమైన ఆనందం తాత్కాలికంగానైనా అందరూ పొందవచ్చును.

యత్కృపావేశ సంసర్గాన్నిబద్ధోగ్రథితోమయా
తస్యైవ జానకీజానేః పదయోరయమర్ప్యతే
దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా
కర్మాస్మద్గ్రన్థ జాతస్య కేవలం కరణంవయమ్.

శ్రీః శ్రీః శ్రీః

# "సౌందర్య శివానంద లహరులు"

- డా॥ దివాకర్ల వేంకటావధాని

జగద్గురు శ్రీ శంకరాచార్యుల వారు, ఉత్తమ మధ్యమాధికారములుగల వ్యక్తుల కుపయోగపడుటకొఱకనేక గ్రంథములు రచించి యుండిరి. వానిలో ప్రస్థానత్రయభాష్యాదులు, విద్వదేకవేద్యములు. వివేకచూడామణి మొదలగు ప్రకరణ గ్రంథములను మధ్యమాధికారులు కూడ పఠించి తత్త్వము గ్రహింపఁగల్గుదురు. ఇంక సామాన్యవ్యక్తులకై వారు పెక్కు స్తోత్రగ్రంథములను రచించి యుండిరి. అట్టి స్తోత్రగ్రంథములలో సౌందర్య, శివానంద లహరులు అగ్రగణ్యములు. శంకరాచార్యులవారు జీవించిన కాలము ముప్పదిరెండు సంవత్సరములు మాత్రమే కాని ఆ స్వల్పకాలములోనే వారు రచించిన గ్రంథములును, కావించిన కార్యములును, మానవమాత్రుఁడొక్కఁ డిట్టి పనులు సాధింపఁజాలునా - యను భావమును కలిగించును. నిజమునకు వారవతారమూర్తులని చెప్పఁదగినవారు. అందుచేతనే "శంకరశ్శంకరసాక్షాత్తు" నానుడి ఏర్పడినది. నమకములో కూడ శంకరాచార్యులవా రవతరింతు రనుటకు సూచనలున్నవని పెద్దలు చెప్పుదురు. "నమః కపర్దినేచ వ్యుప్త కేశాయచ" అను విశేషణములు రెండును, స్థూలముగా చూచినచో పరస్పర విరుద్ధములుగా కనిపించును. జటాజూటము గల శివునికి నమస్కారము అని పైవాని అర్థము. కపర్ది వ్యుప్తకేశుఁడెట్లగును ? అందుచే మొదటిపదము కైలాసవాసియైన శంకరుని, రెండవది సన్న్యాసాశ్రమము స్వీకరించిన శంకరాచార్యులను సూచించునని విమర్శకులు ఆ పదముల అర్థములందలి వైరుధ్యములను తొలగించి సమన్వయము కల్పింప యత్నింతురు. అది సమంజసముగానే ఉన్నది. వేదమంత్రద్రష్టలైన మహర్షులు, త్రికాలవేత్తలు, భవిష్యత్తును కూడ వారు సూచింపగలరనుటలో నాశ్చర్యములేదు. నాస్తికమతములును, దురాచారములును ప్రబలి లోకుల నధఃపతితులఁగావించు సమయమున శంకరాచార్యుల వారవతరించి, పాషండమతములను దురాచారములను తొలగించి, షణ్మతములను స్థాపించి జగత్తునకు మేలు కల్గించియుండిరి.

శంకరాచార్యులవారు జ్ఞానప్రధానవాదులు. అట్టివారు భక్తిప్రధానము లయిన స్తోత్రగ్రంథములు వ్రాయుదురా? అని కొందఱు శంకింతురు. కాని,వారు భక్తికి విరుద్ధులుకారు. వివేకచూడామణిలో "మోక్షసాధన సామాగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని వారు చెప్పియుండిరి. అనఁగా, భక్తిద్వారా చిత్తశుద్ధిని జ్ఞానమును సంపాదించి మానవుడు మోక్షమును పొందవచ్చునని వారి యభిప్రాయము. అది యునుగాక "చిచ్ఛక్తి యుపాసనావశ్యకతను పలువురు మహనీయు లంగీకరించిరి "చిచ్ఛక్తిః పరమేశ్వరస్య విమలా చైతన్యమేవోచ్యతే" అని సంక్షేప శారీరకము చెప్పుచున్నది. మహాపండితులయిన అప్పయ దీక్షితులవారు చిచ్ఛక్త్యుపాసన వేద తంత్రాభియుక్తముని సమ్మతమని వ్రాకుచ్చియుండిరి. జ్ఞానోపాసనలకు అవినా భావసంబంధము కలదని పలువురు చెప్పుదురు. అందుచే శ్రీ శంకరులు శివశక్తి భక్త్యుద్బోధకములయిన శివానంద సౌందర్యలహరులను రచించి యుండిరనుటలో నాక్షేపము లేదు. సౌందర్యలహరికి ముప్పదియాఱు వ్యాఖ్యానము లున్నవఁట. వానిని రచించినవారిలో నొకరిరువురుతప్ప మిగిలినవారందఱును శంకరభగవ త్పాదులే సౌందర్యలహరీ కర్తలని అంగీకరించిరి. శిష్యపరంపరాగత సంప్రదా యముకూడ, భగవత్పాద కర్తృత్వమునే బలపరుచుచున్నది. అందుచే నా విష యమును, సందేహింపనవసరము లేదు.

తవ స్తన్యం మన్యే ధరణి ధరకన్యే! హృదయతః
పయః పారావారః పరివహతి సారస్వత మివ
దయావత్యా దత్తం ద్రవిడశిశు రాస్వాద్యతవయ
త్కవీనాం ప్రౌఢానామజనిక కమనీయఃకవయతా॥

అను శ్లోకమున పేర్కొనఁబడిన ద్రవిడశిశువు శంకరాచార్య స్వాములవారేనని పలువురితలంపు.

సౌందర్యలహరి అవతరణము గురించి లోకమున నొక జనశ్రుతి ప్రచారములో నున్నది. శ్రీ శంకరభగవత్పాదులు కైలాసమునకరిగి ఐదు శివ లింగములను తెచ్చిరఁట. శ్రీ చంద్రమౌళీశ్వరలింగ మందులో నొకటి. వారు కైలాసమున కరిగినప్పుడు శివుఁడు వారికి ప్రత్యక్షమై వారి పాండిత్య భక్తిప్రప త్తులకు మెచ్చి తాము శ్రీ రాజరాజేశ్వరినిగూర్చి వ్రాసికొన్న వంద శ్లోకములతో

కూడిన గ్రంథమును వారి కనుగ్రహపూర్వకముగా ప్రసాదించియుండిరఁట. ఆచార్యులవారు దానిని గ్రహించి వచ్చుచుండగా, నందికేశ్వరుఁడా గ్రంథమును వారి నుండి లాగుకొనెనఁట: అప్పు డందలి 41 శ్లోకము లాచార్యులవారి చేతిలో నుండి పోవ మిగిలిన 59 శ్లోకములును నందీశ్వరునికి చిక్కెనఁట: ఆచార్యులవారు తరువాత క్రిందికివచ్చి అ 59 శ్లోకములను శివుఁడు వ్రాసినట్లే దేవి యనుగ్రహమున యథాతథముగ రచించి యుండిరఁట. సౌందర్యలహరి యందలి

ప్రదీపజ్వాలాభి ర్దివసకర నీరాజనవిధి
స్సుధాసూతేశ్చంద్రోపల జలలవై రర్ఘ్య రచనా
స్వకీయై రంభోభిస్సలిల వినిధి సౌహిత్య కరణం
త్వదీయాభిర్వాగ్భి స్తవజనని వాచాంస్తుతిరియమ్॥

(తల్లీ: నీ సంబంధములయిన వాక్కులతోడనే వాక్పూర్వకమైన నీస్తుతి చేయుట దీపజ్వాలలచే సూర్యునికి హారతులిచ్చుట. చంద్రునకు చంద్రకాంతపు శిలలనుండి ద్రవించు నుదకములతో నర్ఘ్యమిచ్చుట; సముద్రజలములతోడనే సముద్రుని ప్రసన్నునిఁ గావించుకొనుట) అను సౌందర్యలహరి యందలి చరమశ్లోక మీ విషయమునే సూచించుచున్నది.

సౌందర్యలహరి యందలి మొదటి 41 శ్లోకములతో కూడిన పూర్వభాగమును ఆనందలహరి యనియు, 59 శ్లోకములతో కూడిన ఉత్తరభాగమును సౌందర్యలహరి యనియు పేర్కొందురు. మొదటిభాగము మంత్ర తంత్ర యోగ శాస్త్రరహస్యములతో కూడియుండును. రెండవభాగము శ్రీదేవి కిరీటాది పాదాంతము వఱకునుగల ఆమె యవయవముల దివ్యసౌందర్య వర్ణనముతో కూడియుండును. ఆనందలహరి, సౌందర్యలహరి అను పదములు పూర్వోత్తర భాగములలో నాయా శ్లోకములందు పేర్కొనఁబడి యున్నవి.

సౌందర్యలహరి యందు శ్రీదేవి పారమ్యము సూచింపఁబడినది. 97వ శ్లోకమున ఆచార్యస్వాములవారు "పరబ్రహ్మ మహిషివగు నో దేవీ: ఆగమవేత్తలు నిన్ను బ్రహ్మ ఇల్లాలవగు సరస్వతివని చెప్పుదురు. నిన్నే విష్ణుపత్నివగు లక్ష్మిగను, శివుని సహచారిణియగు పార్వతిగను పేర్కొందురు. కాని నీవు పై ముప్వు

రునుకాని నాల్గవశ క్తియియు, ఇతరులకు పొందశక్యముకాని నిరవధిక మహిమ గల మహామాయవునై సకల ప్రపంచమును, భ్రమింపఁజేయుచున్నావు." అని "గిరామా హుర్దేవీ"మ్మను 97వ శ్లోకము తెల్పుచున్నది. అట్లే 24న శ్లోకమున "తల్లీ! బ్రహ్మ జగత్తును సృష్టించుచున్నాఁడు. విష్ణువు రక్షించుచున్నాఁడు. రుద్రుఁడు లయము చేయుచున్నాఁడు. ఈశుఁడు బ్రహ్మ హరి రుద్రాత్మకమైన ఈ త్రయమును తిర స్కరించువాఁడై తన శరీరమునుకూడ అంతర్ధానము గావించుచున్నాఁడు అప్పుడు సదాశివ శబ్దపూర్వుఁడైన శివుఁడు (సదాశివుఁడు) ఆ తత్త్వచతుష్టయమును సర్వ మును, క్షణచలితములయిన లతలవంటి నీ కనుబొమల యాజ్ఞ నవలంబించి మరల ననుగ్రహించుచున్నాఁ"డని చెప్పబడినది. ఆమె పాదములకు చేయబడిన పూజ త్రిమూర్తులకు చేయఁబడిన పూజయే అగును. ఏలయన వారామె పాదము లను వహించు మణిపీఠముచెంత నెల్లప్పుడును బద్ధాంజలులై వర్తించుచుందురు. వేదశీర్షములయిన ఉపనిషత్తు లామె పాదములను శిరోభూషణములుగా ధరించు చున్నవి. శివుని జడముడియందలి గంగానది ఆమె పాదములకు పాద్యమైన ఉద కము. విష్ణుని శిరస్సునందలి మణులకాంతి వానికి లత్తుక సిరిని సమకూర్చును. ప్రథమశ్లోకమున నాచార్యులవారు శివుఁడు శక్తితో కూడియున్నచో ప్రభుత్వము నెరపుటకు సమర్థుఁడగుననియు, నట్లు కానిచో, నా దేవుఁడు కదలుటకు కూడ శక్తుఁడు కాఁడనియు, నామె హరిహర విరించాదులకుకూడ నారాధ్యురాలనియు చెప్పియున్నారు. ఈవిధముగ సౌందర్యలహరి యందు శ్రీదేవి యాజ్ఞచేతనే జగ త్సృష్టి స్థితి లయములు జరుగుచుండుననియు, నామె సర్వదేవతారాధ్యురాలనియు చెప్పఁబడినది. సాధారణముగా మనము బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రిమూర్తు లుగా పేర్కొనుచుందుము, ఆచార్యులవారు బ్రహ్మ, విష్ణువు రుద్రుడు, ఈశుఁడు, సదాశివుఁడు అను పంచమూర్తులను పేర్కొనియున్నారు. "గతాస్తేమంచత్వ" మ్మను 98వ శ్లోకమున బ్రహ్మ విష్ణు రుద్రేశ్వరాధికారములు పొందిన వేల్పులు దేవికి మంచత్వమును పొందిరనియు, శివతత్త్వాత్మకుఁడగు నధికారి స్వచ్ఛమైన కాంతియనెడి వ్యాజముచే చేయఁబడిన కప్పడు దుప్పటియై ఆమె యరుణకాంతులు ప్రతిబింబించుటచే కలిగిన రంగుచే నెఱ్ఱని వాఁడగుటకతన మూర్తిదాల్చిన శృంగా రమువలె కనులకు విందు కల్గించుచుండుననియు చెప్పఁబడినది. శ్రీదేవి సృష్టి స్థితి లయ తిరోధానుగ్రహములను పంచశక్తులుగల మహనీయురాలు.

ఆచార్యులవారు దేవి మహిమానుభావములను పెక్కువిధముల వర్ణించి యుండిరి. బ్రహ్మ ఆమె పాదపద్మములందు పుట్టిన సూక్ష్మతరమైన పరాగలేశమును గ్రహించి లోకములను చక్కగా నిర్మించుచున్నాఁడు. విష్ణువు ఒక్క శిరస్సుతో వానిని మోయఁజాలక సహస్రశీర్షుఁడైన శేషుఁడై వాని నతికష్టముతో మోయుచున్నాఁడు. శివుడా పాదపరాగలేశమును చూర్ణము చేసెడి భస్మధారణ క్రియ నాచరించుచున్నాఁడు. దేవి పాదపద్మరేణు వజ్ఞానుల హృదయ మందున్న అజ్ఞాన మను చీకటికి సూర్యుఁడుదయించు ద్వీపమునందలి పట్టణము. జడాత్ములకు చైతన్యమను పూగుత్తియందలి మకరందరసముయొక్క ప్రవాహము. దరిద్రులకు చింతామణుల హారము. సంసారసముద్రమున మునిఁగిన వారికి శ్రీమన్నారాయణావతారమైన వరాహము యొక్క దంష్ట్ర. ఇతర దేవతలు తమభక్తులనుదగ్గఱ కాకర్షించుటకై చేతులలో అభయవరముద్రలను ధరింతురు. ఒక్క దేవికిమాత్రము వరాభయసూచకములైన ముద్రలను ధరింపవలసిన అవసరము లేదు. ఏల యన భక్తులను భయమువలన రక్షించుటకును, వారికి వాంఛితాభ్యధికములైన ఫలము లొసంగుటకును ఆమె పాదములే సమర్థములై యుండును. మున్ను విష్ణు వామె నారాధించి వనితయై శివునిగూడ కలఁత పొందింపఁజాలెను. మన్మథుఁడు కూడ ఆమె దయచేతనే రతి నయనవేహ్యమయిన దేహముచే, మహామునుల మనస్సులను సైతము, మోహింపఁజేయుటకు దక్షుఁడగుచున్నాఁడు. వృద్ధులైనను, వికృతులైనను విరసులైనను దేవి కడగంటిచూపులకు పాత్రులైనచో జవ్వనులనుగూడ నాకర్షింపఁ జాలుదురు శరత్కాల చంద్రికవలె, నిర్మలమైనట్టియు, చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలిగినట్టియు దేవికొక్కమారు నమస్కరించు సజ్జనులకు మధుక్షీర ద్రాక్షామాధుర్యధుర్యములైన వాగ్విన్యాసము లలవడును. వశిన్యాదులతో కూడిన దేవిని చింతించువారు, వాగ్దేవి వదనకమలామోద మధురములైన వాక్కులతో కావ్యములను రచింపఁజాలుదురు. అవయవములనుండి కాంతిసముదాయము లనెడి అమృతరసము వెదజల్లు దేవి నెవ్వరు హృదయమున దృఢముగ నిల్పుదురో వారు పక్షీంద్రుఁడైన గరుడునివలె సర్పముల దర్పము నడంపఁజాలుదురు; అమృతమయములైన చూపులచే జ్వరతప్తులైన వారిని సుఖింపఁ జేయఁజాలుదురు. మహాప్రళయసమయమున బ్రహ్మ మరణమును, విష్ణువు అంతమును, యముఁడు వినాశనమును, కుబేరుఁడు విధ్వంసమును, ఇంద్రసంతతులు విహ్వలతను పొందుదురు. కాని దేవి భర్తయైన సదాశివుఁడొక్కడే నిత్యుఁడై క్రీడించును. జరామరణ

ములు హరించు అమృతమును త్రాగినను, కల్పాంతమునందు, బ్రహ్మేంద్రాదులైన దేవతలుకూడ విపత్తును పొందుదురు. కాని మహాభయంకరమైన విషమును భక్షించిన దేవి భర్తయైన శివునికిమాత్రము వినాశనము లేదు. అందుకామె చెవుల ధరించు తాటంకముల మహిమయే కారణము. బ్రహ్మహరీంద్రాదులు కూడ ప్రతి దిన మామెకు నమస్కరించుటకు వచ్చుచుందురు. దేవి యాజ్ఞాచక్రమునందు మనస్తత్త్వమును, విశుద్ధచక్రమునందు ఆకాశతత్త్వమును, అనాహతచక్రమునందు వాయుతత్త్వమును, స్వాధిష్ఠానమందు అగ్నితత్త్వమును, మణిపూలమునందు జలతత్త్వమును, మూలాధారనుందు పృథ్వీతత్త్వమునై జగము నంతను వ్యాపించి యుండును.

శంకరాచార్యులవారు సౌందర్యలహరి యందు కుండలినీశక్తి యుత్థాపనముతోకూడిన యోగరహస్యములను కూడ వివరించి యున్నారు. అమృత సముద్రము నడుమ కల్పవృక్షముల వరుసలచే చుట్టఁబడిన మణిద్వీపమందు కదంబ వృక్షవనావృతమైన చింతామణినిర్మిత గృహములో శివరూపమగు మంచమున దేవి పరమశివుని పర్యంకమే నిలయముగా జ్ఞానానంద ప్రవాహరూపిణియై ప్రకాశించుచుండును. దేవి విశాలమైన బ్రహ్మాండము నావరించి దానిని పాలించునట్లే పిండాండమైన మానవశరీరమున కుండలినీశక్తి రూపమున నుండి సహస్రారము' నందు పతియైన సదాశివునితో విహరించుచుండును. ఆనందలహరియందలి చివరి ఆరు శ్లోకములందును, ఆజ్ఞాచక్రము మొదలు మూలాధారచక్రమువరకును గల ఆరు చక్రములందును సదాశివునితో నివసించు దేవి తత్త్వమును, స్పష్టముగా వర్ణించియుండెను. ఆమె పాదపద్మముల నడుమనుండి ప్రభవించిన అమృతధారా వర్షముచే మానవశరీరమునందలి డెబ్బదిరెండు వేల నాడుల ప్రపంపమును తడుపుచు అమృతాతిశయ రూపమైన కాంతిగల చంద్రులచేత మరల స్వభూమియైన మూలాధారచక్రమును పొంది, సర్పసమానముగ చుట్టుకొన్న రూపముతో నందు నిద్రించును. ఈ విధముగా ఆచార్యులవా రిందు కుండలినీశక్తి యొక్క ఆరోహణావరోహణలను తొమ్మిది, పది శ్లోకములలో వర్ణించియున్నారు.

శ్రీ దేవికి నిలయమైన శ్రీచక్రమున 44 నలువదినాలుగు కోణము లుండును. ప్రథమ త్రికోణమునందలి ఊర్ధ్వకోణము. వెలికి పొడుచు అష్టకోణము లందలి యెనిమిది కోణములు, అంతర్దశార బహిర్దశారము లందలి ఇరువది కోణ

ములు, చతుర్దశారసంబంధులగు పదునాలుగు కోణములు, బిందువు అనునవి ఆ నలువదినాలుగు కోణములు. బిందువు కోణము కాకపోవుటచే కొందరు త్రయశ్చత్వారింశత్తను (43) పాఠమును గ్రహింతురు.

ప్రథ్వీతత్త్వముతో కూడిన మూలాధారమందేబదియారు కిరణములును, జలతత్త్వముతో కూడిన మణిపూరమునందేఁబదిరెండు కిరణములును, అగ్నితత్త్వముతో కూడిన స్వాధిష్ఠానమందు అరువదిరెండు కిరణములును, వాయుతత్త్వముతోకూడిన అనాహతమందేఁబదినాలుగు కిరణములును, ఆకాశతత్త్వముతో కూడిన విశుద్ధమందు డెబ్బదిరెండు కిరణములును, మనస్తత్వముతో కూడిన ఆజ్ఞయందరువదినాలుగు కిరణములును నుండ వానిపైనిగల సహస్రదళ కమలమున దేవి పాదద్వంద్వము వర్తించుచుండును. తటిల్లేఖవలె సూక్ష్మమైనదియు, సూర్య చంద్రాగ్ని రూపిణియు, షట్కమలముల ఉపరిభాగమున నుండు సహస్రారమందు వర్తిల్లునదియు అగు దేవి పాదాఖ్యకళలు, విహతమాయా, కామాదులుగల మనస్సుతో చూచుచు మహాత్ములుత్తమమైన యానంద ప్రవాహమున నోలలాడుదురు. ఆచార్యులవారు, "శివశ్శక్తిః కామః" అను శ్లోకమున పంచదశాక్షరి మంత్రమును కూడ గూఢముగా చెప్పియున్నారు. శివః=క; శక్తిః=ఏ; కామః=ఈ; క్షితిః=ల; రవిః=హ; శీతకిరణః=హ; స్మరః=క; హంసః=హ; శక్రః=ల; పరా=స; మారః=క; హరిః=ల; మఱికొందరు, శివః=హ; శక్తిః=స; కామః=క; క్షితిః=ల; రవిః=హ; శీతకిరణః=స; స్మరః=క; హంసః=హ; శక్రః=ల; పరా=స; మారః=క; హరిః=ల; అని చెప్పుదురు. ఈవిధముగా శివశక్తి కామ క్షితులు, రవి శీతకిరణ స్మరహంస శక్రులు; పరామారహరులు అను మూఁడు తెగలును హ్రీంకారములతో కూడి పంచదశాక్షరీ మంత్రమగుచున్నది. ఈ రెండు విధములగు మంత్రమునే మంత్రవేత్తలు కాది యనియు, హాదియనియు చెప్పుచుందురు. సౌందర్యలహరి యందలి ఒక్కొక్క శ్లోకమునకొక్కొక్క చక్రము కలదనియు, ఆ చక్రము లందు వివిధములయిన బీజాక్షరములు కలవనియు, వానిని లోహాదులతో నిర్మించి యథాశాస్త్రముగా పూజించి, నిర్దిష్టమైన నైవేద్యమును పెట్టినచో అట్లు పూజించువారి మనోరథము లిడేరుననియు సంప్రదాయజ్ఞులు చెప్పుదురు.

సౌందర్యలహరి యందు దేవి అవయవముల దివ్యసౌందర్యము వర్ణింపబడినది. ఆచార్యులవారు,

"క్వణత్కాంచీ దామాకరి కలభ కుంభ స్తన నతా
పరిక్షీణామధ్యే పరిణత శరచ్చంద్రవదనా
ధనుర్బాణాన్ పాశం సృణిమపి దధానాకరతలైః
పురస్తాదాస్తాన్నః పురమథితు రాహో పురుషికా.

(మొరయుచున్న మువ్వల మొలనూలు కలదియు, ఏనుగుగున్న కుంభస్థలముల వంటి కుచములచే వంగినదియు, కృశించిన నడుము కలదియు, శరత్కాలపూర్ణ చంద్రునివంటి ముఖముతో కూడినదియు, చేతులందు విల్లమ్ములను, పాశమును. అంకుశమును ధరించునదియునగు పురారి అహంకారరూపురాలగు దేవి మాయెదుట నిల్చుఁగాక; యని ఏడవశ్లోకమున దేవిని వర్ణించియుండిరి; బహుశః వారి కామె యట్లు దర్శనమిచ్చి యుండును. మహానుభావుఁడగు శివునికే అహంకార కారణ మన నింక నా దేవి సౌందర్య విశేషమును గూర్చి వేరుగ తెల్పనేల; ఆమె సౌందర్యము నుపమానద్రవ్యములతో పోల్చుటకు బ్రహ్మాది కవిపుంగవులకుకూడ శక్యము కాదు. ఏలయన దానిని చూచుట యందలి ఉత్కంఠచే వేల్పు వినిత లైన అచ్చరలుకూడ తపస్సునచేకూడ పొందశక్యము కాని శివసాయుజ్య పదవిని మనస్సుచే పొందుచున్నారు. దేవిని చూడఁదగినవాఁడొక్క శివుఁడే. అందుచేనామె సౌందర్యమును చూడఁగోరి అప్సరసలు నయితము, మహాతపఃఫల ప్రాప్యమైన శివసాయుజ్యమును పొందుచున్నారు. సౌందర్యలహరి యందలి శ్లోకములన్నియు ఉదాత్త కవితామయములైనట్టివి. అందలి కల్పనలును, భావములును, ఆచార్యుల వారి కవితాకౌశలమునకు తార్కాణములు. తరువాతి కవులు పలువురందలి భావములనే గ్రహించి తమ కావ్యములందలి నాయికలను వర్ణించి యున్నారు. ఇందు దేవి కిరీటము మొదలు, నఖాగ్రము వరకును, గల దేవి ధరించు వస్తువు లయొక్కయు, అవయవములయొక్కయు వర్ణనము కావింపఁబడినది. దేవిదికుర నికురంబము నల్లకలువల తోటనుబోలి, మేఘమువలె స్నిగ్ధమై, సుకుమారమై, ఒప్పారుచుండును. నిసర్గమైన వాని సువాసనలను పొందు నభిలాషచే నందన వనమునందలి కల్పవృక్షముల పువ్వులుకూడ దాని నాశ్రయించుచుండును. అనగా దేవి కేశపాశములకు సహజమైన సువాసన యుండుననియు, కల్పవృక్షముల పరి మళము కూడ దానికంటె తక్కువయే యనియు భావము. ఆమె ముఖము బల వంతములయిన కేశపాశములనెడి (శత్రువులైన) చీకట్లసమూహముచే చెఱపెట్టఁ

బడిన బాలసూర్యుని కిరణమోయననొప్పు సింధూరపుచుక్కను ధరించియుండును. ఆమె పాపట ముఖసౌందర్య ప్రవాహముయొక్క పరీవాహము నుండి ప్రవహించు చిన్న కాలువవలె నుండును. స్వభావముచే వక్రములయినవియు, తుమ్మెదకొదమల కాంతివంటి కాంతి కలిగినవియు నగు ముంగురులచే చుట్టఁబడిన దేవిముఖము పద్మకాంతిని పరిహసించుచుండును. దరస్మితమును, దశనకాంతికింజల్క రుచి సుందరమును, సుగంధముతో కూడినదియు, అగు ఆమె ముఖపద్మము శివుని నేత్రములనెడి తుమ్మెదలను, సర్వదా ఆకర్షించుచుండును.నిగనిగలాడు సౌందర్యమనెడు వెన్నెలకాంతిచే నిర్మలమైన దేవి లలాట మామె యౌదలదాల్చిన రెండవ చంద్రఖండమువలె నొప్పారును. ఆ రెండు చంద్రఖండములను నాలుగు కొమ్ములను కలియునట్లు తలక్రిందులుగా నుంచినచో అవి యొండొకటితో కలిసి కొని అమృతమయుఁడైన పూర్ణిమాచంద్రుని ఆకారమును ధరించును. దేవి కుడికన్ను సూర్యాత్మక మగుటచే పగటిని, ఎడమకన్ను చంద్రరూప మగుటచే రాత్రిని కలిగించును. కొంచెముగా వికసించిన హేమాంబుజమునుబోలు నామె మూడవకన్ను దినరాత్రుల నడుమనుండు సంధ్యాకాలమువలె నొప్పారును. ఆమె చూపు విపులమై (విశాలమై) మంగళకరమై (కళ్యాణియై) విశదకాంతితో కూడి కలువలకు పోరనలవికానిదియై (అయోధ్యయై) కరుణారసధారల కాధారమై (ధారయై) అవ్యక్తమధురమై (మధురయై) అంతర్వైశాల్యము కలదై (భోగవతియై) భక్తులను రక్షించునదియై (అవంతియై) ఈ విధముగ అనేక నగరములసమూహమును జయించి ఆయా నగరముల నామములచే, వ్యవహరింపఁదగి విజయమొందుచున్నది, దేవి దృష్టులెనిమిదియు, సంక్షోభణాకర్షణాది కర్మముల నొనరించుచున్నవి. ఆమె చూపు భర్తయైన సదాశివునియెడ శృంగారరసార్ద్రమును, శివుని కంటాభిన్నులయిన అన్యులయందు ఏవగింపు కలిగినదియు, సవతియగు గంగయందసూయ కలదియు, శివుని చరిత్రమందు ఆశ్చర్యము కలదియు, అతఁడు ధరించిన పాములవలన భయమొందినదియు, కమలముల సౌందర్యమును జయించునదియు, సఖులయందు చిరునవ్వుతో కూడిన వికాసము కలదియు, భక్తులయందు కరుణ కలదియునై నవరసాంచితమై యొప్పారును.

దేవి నయన త్రితయము నీలాంజన వ్యతికరము లగుటచే వేఱు చేయఁబడిన తెలుపు, నలుపు. ఎఱుపు అను మూఁడు రంగులు కలిగి కల్పాంతమందు నశించిన విష్ణు మహేశ్వరులను మరల సృష్టించుటకు రజస్సత్వ తమోగుణములను

ధరించుచున్నట్లు ప్రకాశించును. ఆ మూ(డు కాంతులునుగల దేవి నేత్రములు ఎఱ్ఱని శోణనది, తెల్లని గంగానది, నల్లని యమునానది అను మూ(డు తీర్థముల అనఘమైన సంగమమును తెలుపుచున్నట్లుం(డును. దేవి కన్నులు మూయుటచే జగము ప్రళయమును పొందును. తెరుచుటచే సృష్టింప(బడును. తన కనులు తెరుచుటచే నుదయించిన సమస్తజగమును, ప్రళయమునుండి రక్షించుటకై ఆమె కనులు నిర్నిమేషములై యొప్పారును. ఈ శ్లోకము "నిమేషోన్మేష విపన్నోత్పన్న భువనాళి" అను లలితాసహస్రనామ స్తోత్రమునందలి ఒక నామమునకు విపులీకరణము. దేవి చెవులలో కొండెము చెప్పు స్వభావముగల (ఆకర్ణ విశాలములయిన) నేత్రముల గుట్టు బయలుపరచు గుణముచే భయపడినవై మత్స్యములు జలములందు దాగుకొనుచున్నవి.

దేవి గండాభోగములందు ఆమె ధరించిన తాటంకములు ప్రతిఫలించుచుండును. సహజములు ప్రతిఫలన రూపములునగు ఆ నాలుగును నాలుగు చక్రములుగల మదనుని రథమువలె నొప్పారును. మహావీరు(డైన మన్మథు(డా రథము నెక్కి సూర్య చంద్రరూప చక్రములుగల భూమి యను రథము నధిరోహించిన ప్రమథనాథు(డయిన శివుని నెదుర్కొన యత్నించును. అమృత మాధుర్యమును ధరించు దేవి సూక్తులను శ్రవణపుటములచే త్రాగుచున్నదియు, అందలి చమత్కారమును, మెచ్చుకొనునపుడు చలించు తలగలదియు అగు సరస్వతి యొక్క కర్ణాలంకారములు ఝణఝణాత్కారముచే, ప్రతివచనము చెప్పుచున్నట్లు తో(చును. దేవి నాసావంశము వామభాగమున గల చంద్రనాడి యొక్క నిశ్వాసము వలన జారిన ముత్యములను లోపల ధరించుచున్నదై ఆ ముత్యముల సమృద్ధిచే వెలుపలకూడ ముక్తామణి ధరించినదివలె ప్రకాశించుచున్నది. పగడపు తీగ ఫలమును వహించినచో దేవి అధరముతో పోలిక పొంద(గలదు. దొండపండు దేవి పెదవుల ప్రతిబింబముచే ఎఱ్ఱగా చేయ(బడినదై దానితో నేవిధముగనుసామ్యము ను పొంద(జాలవు. (దొండపండు దేవి పెదవుల ప్రతిబింబముచే మాత్రము రాగము వహించిన దగుటచేతనే) బింబమను నామము( దాల్చెనని భావము.

దేవి నాలుక భర్తయైన శివు(డు త్రిపురసంహారాది సన్నివేశములందు ప్రదర్శించిన పరాక్రమగాథలను, మాటిమాటికి వర్ణించుటయే జపముగా( గలదగుటచే దాని అగ్రభాగమున నుండు సరస్వతి తెల్లనిదయ్యు, పద్మరాగారుణ వలె

చెన్ను మీరుచుండును. సరస్వతి శివుని త్రిపురవిజయాది గాథలను వీణతోగానము చేయుచు దేవి ప్రశంసించుట కారంభింపఁగా ఆమె వాక్కులందలి మాధుర్యముచే పరిహసింపఁబడిన తంత్రుల అవ్యక్తమధురమైన ధ్వనిగల తన వీణను, నెమ్మదిగ గా నెవచే కప్పివేయుచుండును. దేవియొక్క కంఠము తన్ముఖకమల శోభను వహించును. సహజముగా తెల్లదయినను కాలాగురురజంబాల మలినమైన దేవి ధరించిన హారలతిక మృణాళిలాలిత్యమును వహించును. దేవిచేతుల కాంతిక్రొత్తగా వికసించిన పద్మముల రాగమును పరిహసించుచుండును. ఆ పద్మములు క్రీడించుచున్న లక్ష్మీదేవి పాదములందలి లత్తుకరసముతో కూడియున్నచో కించిత్సాదృశ్యమునైన పొందజాలునేమో ! దేవి తన యూరుసౌందర్యముచే నేనుఁగు తొండములయొక్కయు, బంగారపు టరటి కంబముల యొక్కయు సౌందర్యమును, నిత్యము భర్తకు మ్రొక్కుటచే కఠినములయిన జానువులచే ఐరావత కుంభముల జంట సౌందర్యమును పరిహసించుచుండును. మంచుకొండపై నివసింపఁ జాలినవియు, రాత్రి చరమభాగమునందును నిర్మలములై ప్రకాశించునవియు, సమయాచారపరులకు సంపద సమకూర్చునవియు నగు దేవి పాదములు మంచుచే నశింపచేయఁబడునవియు, నిశయందు ముకుళించునవియు, లక్ష్మికించుక నివాసములైనవియు నగు పద్మములను జయించు ననుటలో నాశ్చర్య మేమున్నది ? కీర్తులకు నెలవును, ఆపదలకపదమును అగు దేవి చరణాగ్రమును కవులు కఠినమైన తాబేటి వీపు చిప్పతో నెందుకు పోల్చెదరో ! వివాహకాలమున సహజ కరుణాశాలియైన శివుఁడు రెండుచేతులతో నెత్తి యా పాదములను సన్నెకంటిపై నెట్లుంచెనో కదా ! దీనులకు అశానదృశంగా సంపదల నిచ్చునదియు,సౌందర్యసమూహమను మకరందమును వెదజల్లునదియు అగు కల్పకుసుమగుచ్ఛ సుందరమైన దేవి పాద పద్మములందు పడుచున్న భక్తులు మనస్సుతోకూడిన త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణములను అతీంద్రియములచే నారు పాదములుగల తుమ్మెదతనమును పొందుచుందురు. పెంపుడు హంసలు దేవి నడకలు నేర్చుకొనుటకో యన నామెవెంటనే యరుగుచుండును. దేవి పాదపద్మములు మనోహరములైన రత్నపు టందెల మ్రోతలనెడి మిషచే ఆ హంసలకు పాఠము చెప్పుచున్నవో యన నొప్పుచుండును. దేవి పురారాతియైన శివుని పట్టమహిషి. ఆమె పాదములను పూజించు విధి చపలేంద్రియులకు సులభముగా లభించునది కాదు. అందుచే నింద్ర ప్రభృతులగు దేవతలు దేవి ద్వారము చెంతనున్న అణిమాద్యష్ట సిద్ధులచేతనే మనోరథములను

పొంది పోవుచుందురు. ఈ విధముగా దేవి భక్తులకు అపవర్గ సౌఖ్యముతోపాటు లౌకికమైన సౌఖ్యమునుకూడ చేకూర్చును. ఏలయన ఆమెను భజించువాఁడులక్ష్మీవంతుఁడును. విద్యావంతుఁడును, సౌందర్యవంతుఁడును కాఁజాలుటయే కాక చిరకాలము జీవించుచు క్షపిత పశుపాశ వ్యతికరుఁడై బ్రహ్మానందమును కూడ ఆస్వాదించును.

ఆచార్యస్వాములవారి కవిత్వము పదప్రయోగ లాలిత్యముచేతను, భావగాంభీర్యముచేతను కాళిదాసాది మహాకవుల కవిత్వమును కూడ అతిశయించుచుండును. వారి భావము లొక్కొక్కప్పుడు మహా గంభీరములై అజన్మబ్రహ్మచారులైన వారికిట్టి భావములెట్లు కలిగెనా యను ఆశ్చర్యము కలిగించు చుండును. వారి భావగాంభీర్యమున కొక్క యుదాహరణము మాత్రమొసంగెదను.

"మృషాకృత్వా గోత్రస్ఖలన మథవైలక్ష్యనమితమ్
లలాటే భర్తారం చరణకమలే తాడయతితే
చిరాదంతశ్శల్యం దహనకృతమున్మూలితవతా
తులాకోటి క్వాణైః కిలికిలిత మీశానరిపుణా॥"

దేవీ! అకస్మికముగా గోత్రస్ఖలనము (ప్రియురాలిని తాను ప్రేమించిన అన్యస్త్రీ పేరుతో పిలుచుట) గావించి సిగ్గుచే నతుఁడైన భర్తను నుదుట నీ పాదపద్మము తన్నినదగుచుండఁగా చాలకాలమునుండి శివుడి ఫాలాగ్నిచే చేయఁబడిన అంతస్తాపమును మాపుకొనిన మన్మథునిచే నా కాలియందెలయొక్క మిషమున కిలకిల నవ్వబడినది. దేవి శివుని ఫాలభాగమును ప్రణయకోపవశమున తన్నగా నామె కాలి అందెల శబ్దము తన శత్రువైన శివుఁడును, తన్ను భస్మీకరించిన లలాటనేత్రమును అవమానింపఁబడుట చూచి తనకు మున్ను జరిగిన అపకారమువలని తాపము మరచి మన్మథుఁడా యందెల చప్పుడు మిషచే కిలకిల నవ్వుచున్నాఁడా యన్నట్లు తోచుచున్నది. ఆచార్యులవారి పద్యములం దప్రయత్నముగా నర్థశబ్దాలంకారములు దొరలుచుండును, వారి శ్లోకములందు పలుచోట్ల నుపమారూపకోత్ప్రేక్షకాలంకారములు గోచరించుచుండును. "అవిద్యా నామంత స్తిమిర మిహిర ద్వీపనగరీ" అను శ్లోకమాయన పదప్రయోగ లాలిత్యమునకు నిదర్శనము." "శరజ్జ్యోత్స్నా శుభ్రామ్" అను శ్లోకమున "నకృన్నత్వా నత్వా" అను ప్రయోగ

మున సకృత్; నత్వా; న; త్వా అని పదములను విడఁదీయవలెను. ఇందద్భుత మైన యమకమున్నది. ఆచార్యులవారు, స్తోత్రములను రచించినను, ప్రకరణము లను రచించినను, మహాభాష్యములను రచించినను అద్వైతమునే ప్రత్యక్షముగనో పరోక్షముగనో సూచించుచుందురు.

"భవాని త్వం దాసే మయి వితర దృష్టిం సకరుణా
మితిస్తోతుం వాంఛన్ కథయతి భవాని త్వమితియః
తదైవత్వం తస్మై దిశసి నిజసాయుజ్య పదవీం
ముకుంద బ్రహ్మేంద్ర స్ఫుట మకుట నీరాజితపదామ్."

(భవానీ! నీవు, దాసుడవైన నాపై దయతో కూడిన చూపు ప్రసరింపఁజేయుమని నుతింపగోరుచు నెవరు "భవానీ నీవు"అని మాత్రము పలుకుదురో వారికి వెంటనే విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగువారి ప్రకాశించు కిరీటములచే నీరాజితము లయిన పదములుగల నీ సాయుజ్యపదవి నొసఁగుదువు.) ఇచ్చట "భవానిత్వమ్" అనుచోట అద్భుతమైన శ్లేషకలదు. "ఓ భవానీ నీవు"అని ఒక అర్థము. రెండవ యర్థమున "భవాని" అనునది క్రియ. ఇది భూధాతువుయొక్క లోట్ ఉత్తమపురు షైక వచనము. నేను నీవగుదునని రెండవ భావము. జీవబ్రహ్మైక్యమే కదా అద్వైతము. దేవి పరబ్రహ్మస్వరూపిణి. కవి జీవుఁడు. అతఁడు దేవితోనైక్యము పొందఁగోరుచున్నాడు. దేవి "భవానిత్వమ్" అను పదములకుఁ గల అద్వైతార్థ మును గ్రహించి వెంటనే అతనికి నిజసాయుజ్యపదవి నిచ్చుచున్నది. భక్తుఁడు పెద్ద వాక్యమును పలికి శ్రమపడుట ఆమెకిష్టములేదు. అందుచే, "భవానిత్వమ్" అని అతఁడు పలుకఁగనే "ఆగుమని" తెలిపి అతనికి వాంఛితార్థము నొసంగు చున్నది. ఇది దేవి అపారమైన దయకు నిదర్శనము. ఇట్లే "విశాలా కళ్యాణీ" అను శ్లోకమునందుకూడ అక్లిష్టమైన శ్లేష గోచరించుచున్నది.

ఆచార్యస్వాములవారు విష్ణుసహస్రనామములకును, లలితా త్రిశతికిని భాష్యములు వ్రాసియుండిరి. మరి యెందుచేతనో లలితాసహస్రనామ స్తోత్రమునకు భాష్యము వ్రాసియుండలేదు. అది శివ్యాది దేవతా ప్రోక్తమగుటచే వారు వినయ ముతో దానిని విడిచి యుందురు. కాని ఆ లోపమును సౌందర్యలహరి రచనముచే పూరించిరని చెప్పవచ్చును. ఎలయన అందులోనున్న నామములు పెక్కు

సౌందర్యలహరియందలి శ్లోకముల రూపమున వివరింపఁబడినవి. "సుధాసింధో ర్మధ్యే"అను శ్లోకమును పరిశీలించిన అందు సహస్రనామములందలి ఐదారు నామములు గోచరించును. ఈ విధముగా సౌందర్యలహరి లలితాసహస్రనామ స్తోత్రమున కొకవిధముగా శ్లోకరూప భాష్యమని చెప్పవచ్చును.

దృశాద్రాఘీ యస్యా దరదళిత నీలోత్పల రుచా
దలీయాంసందీనం స్నవయకృపయామామపి శివే
అనేనాయం ధన్యోభవతి నచతేహాని రియతా
వనేవాహర్మ్యేవా సమకరనిపాతో హిమకరః".

# శివానంద లహరి

శ్రీ జగద్గురు శంకర భగవత్పాదుల వారుత్తమ మధ్యమాధమాధికారులను దృష్టిలో నుంచుకొని పెక్కు గ్రంథములను రచించియున్నారు. వానిలో ప్రస్థానత్రయభాష్యాదు లుత్తమాధికారులైన విద్వాంసులకును, వివేకచూడామణి ప్రభృతి ప్రకరణగ్రంథములు మధ్యమాధికారులకును, స్తోత్రాదులు సర్వజనులకును, ఉపయోగకరములుగా నుండును. శ్రీమదాచార్యులవారు రచించిన స్తోత్రగ్రంథములలో శివానంద సౌందర్య లహరులు తలమానికములని చెప్పదగినవి. మరల నా రెండింటిలో శివానందలహరి కేవల భక్తిప్రధానమైన ఉత్తమ స్తోత్రగ్రంథము. సౌందర్యలహరిలో భక్తితోపాటు తంత్ర మంత్ర యోగశాస్త్ర రహస్యములుకూడ వివరింపఁబడినవి.

శివానంద లహరి యనఁగా శివుని సేవించునపుడు, లేక ధ్యానించునపుడు భక్తులు పొందు ఆనందప్రవాహమని యర్థము. ఆభక్తి యెట్టిదో ఆఆనంద విశేషమెట్టిదో అందు చెప్పఁబడినది. ఆచార్యుల వారి దివ్యనామము వినఁగానే యెవ్వరికైన వారు మహావేదాంతులను విషయము స్ఫురణకు వచ్చును. కాని వారెంత గొప్ప వేదాంతులో అంత గొప్ప కవిపుంగవులు. "కవీనాం ప్రౌఢా నామ

జనికమనీయః కవయితా" అని వారు సౌందర్యలహరిలో నొక శ్లోకమున చెప్పి యున్నారు. వారి కవిత్వ మమృత ప్రవాహము. అందు సత్కవితా లక్షణము లన్నియు పుంజీకృతములై యుండును.

> సర్వాలంకారయుక్తాం సరళపదయుతాం సాధువృత్తాం సువర్ణాం
> సద్భిస్సంస్తూయమానాం సరసగుణయుతాం లక్షితాం లక్షణాఢ్యాం
> ఉద్యద్భూషాం విశేషాముపగతవినయాం ద్యోతమానార్థరేఖాం
> కల్యాణీం దేవ గౌరీప్రియః మమ కవితాకన్యకాం త్వం గృహాణ.

అను శివానంద లహరీ చరమశ్లోకమును పఠించిన, నిది తెలియవచ్చును. అందు శ్లేషపూర్వకముగా కవితాకన్యకల యిరువురి గుణములును చక్కగా వర్ణింపఁ బడినవి.

శ్రీమదాచార్యులవారు శివానందలహరిని శ్రీశైలమున నుండినప్పుడే రచించిరని చెప్పుదురు. వారు శ్రీశైలమున కరుదెంచినపుడు క్రకచుఁడను కాపాలికుఁడు వారిని దేవికి బలియీయ సంకల్పించి వారి యంగీకారమును పొందినట్లును, పద్మపాదుఁడు నృసింహస్వామి వారి యుపాసకుఁడగుటని తదావిష్టుఁడై ఆతనిని చీల్చి చెండాడి గురువుగారి నా యపాయమునుండి తప్పించినట్లును చెప్పు నైతిహ్య మొకటి కలదు. అందలి యాదార్థ్యము పరిశోధనీయము. కాని స్వామి వారు శ్రీశైలక్షేత్రమును దర్శించినమాట మాత్రము యథార్థము. కొందరు శివానంద లహరిని పూర్వోత్తరార్ధములుగా విభజింతురు. పూర్వార్ధము నందలి చివరి శ్లోకము "సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్" అను పాదముతోడను, ఉత్తరార్ధము నందలి మొదటి శ్లోకము "నపునః సాక్షాన్మదీయే మనోరాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీవిభుః"అను పాదముతోడను ముగియుచున్నవి. శ్రీశైలవాసియు భ్రమరాధిపుఁడునైన మల్లికార్జును డిందు వర్ణింపఁబడుట గమనింపవలసిన విషయము. పైరెండు శ్లోకములందును శ్లేషాలంకారము కలదు.

నారద శాండిల్యాదులు భక్తిని భగవంతుని యందలి పరమానురాగముగా నిర్వచించియున్నారు.

(సాత్వస్మిన్ పరమప్రేమరూపా; పరానురక్తిరీశ్వరే)

ఆచార్యస్వాములవారు కూడ

"అంకోలం నిజ బీజ సంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతాక్షితిరుహం సింధుస్సరిద్వల్లభామ్
ప్రాప్నోతీహ యధాతథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సాభక్తి రిత్యుచ్యతే"

అను శ్లోకమున భక్తిని నిర్వచించి ఉపమాన సామర్ధ్యముచేనది సాన్నిధ్య, సాలోక్య, సారూప్య, సాయుజ్య ముక్తులను చేకూర్చునని సూచించి యున్నారు. పరమశివుని మాహాత్మ్యము వర్ణనాతీతము. హరియు, బ్రహ్మయు, తిర్యగ్రూపులై క్రమముగ తత్పద శిరోభాగములను దర్శింప యత్నించి వైఫల్యము పొందిరన్న నితరుల విషయము వేఱుగఁ జెప్పనవసరము లేదు. అతఁడు స్తుత్యులలో నగ్రగణ్యుఁడనియు, మాహాత్మ్యాగ్ర విచారణ సమయమున, తాము ధానాతుషస్తోమ సదృశులుకాఁగా శివుఁడుత్తమోత్తమ ఫలరూపుఁడై యుండుననియు సేవకప్రాయులయిన దేవతలు గ్రహింపఁజాగలిరి. శివచరితామృతమును పానముచేయు భక్తుల దుఃఖములును, దురితములును, దురహంకార దుర్వచనాదులును, దూరికృతములై పోవుటలో సందేహము లేదు. శివపాదాబ్జ సేవకులకు తురీయ పురుషార్ధమైన ముక్తి కరతలామలకము కాఁజాలును. కల్పాంతమందైనను, దేవతలకు నాశము తప్పదు. వారి కమర్త్యనామమున్నను, వారుకూడ జననమరణ యుక్తులే. అందుచే వారిని సేవించువారికి శాశ్వతసుఖము లభించుననుట, సందేహాస్పదము. జన్మరహితుఁడును, అమృతరూపుఁడు నయిన శివుని భజించువారు పరమసౌఖ్యమును తప్పక పొందఁజాలుదురు. శ్రీమన్నారాయణుఁడంతవాఁడే శివునికి బాణత్వమును వాహనత్వమును, అర్ధాంగరూపమైన భార్యాత్వమును, సఖిత్వమును, మార్ధంగికత్వమును వహించుటయేగాక నయనార్పణముకూడ నొనరించియుండుటచే నతడు పూజ్యులలో పూజ్యతరుఁడయ్యెను.

బాణత్వం వృషభత్వ మర్ధవపుషా భార్యాత్వ మార్యాపతే
ఘోణిత్వం సఖితా మృదంగ వహతా చేత్యాదిరూపం దధౌ

త్వత్పాదే నయనార్పణంచ కృతవాం స్త్వద్దేహ భాగోహరిః
పూజ్యాత్ పూజ్యతరః స ఎవహి నచేత్కో వాతదన్యోఽధికః.

దీనివలన శివునికి సర్వదేవతలలో పూజ్యతమత్వము సిద్ధమగుచున్నది. కొంత కాలము శివపాదారవింద నార్చనమందును, కొంతకాలము శివధ్యాన సమాధులందును, కొంతకాలము శివనమస్కార కథావర్ణనాదుల యందును, కొంతకాలము శివదర్శనాదులయందును, కొంతకాలము శివస్తోత్రములందును, తత్పరుడై శివాశ్రిత మనస్కుఁడై యుండువాడు జీవన్ముక్తుఁడగును. శివపాదాకాశమునందు వర్తించు భక్తియను కావంబిని కురియు పరమానందవర్షముచే నెవ్వని మనస్సనెడి తాటాకము నిండఁజాలునో అతని జన్మమనెడి సస్యము తప్పక ఫలించును. అనగా నతఁడు ముక్తినొందును. అంజన సాహాయ్యముచే నిధులున్న ప్రదేశములు కనుఁగొని, బలిమంత్రాదులచే తత్రస్థిత సర్పాదులను వశము చేసికొనువారు ఆ నిధులను పొందఁజాలినట్లు ధ్యానముచే తమస్సునడంచుకొని పంచాక్షర్యాది మంత్రములను జపించు భక్తులు భుజగభూషణుఁడైన శివుని పాదపద్మములను పొంది కృతార్థజన్ములు కాఁజాలుదురు. భక్తిగుణాంచితమైన శివభావనాచాపముచే నమోఘమైన శివనామస్మరణ మార్గణములను విసరఁజాలు సుధీధానుష్కులు కిల్బిష రిపులను సులభముగా జయించి ఆనందరాజ్యలక్ష్మిని పొందఁగల్గుదురు. శివసేవానిరతులగు భక్తులను చూచి యముఁడు వక్షస్తాడనశంకచే పరుగెత్తును. దేవతలు కిరీటస్థగిత రత్నాంకురదీపములతో నీరాజన మొనంగుదురు. ముక్తివధువనురక్తయై వారి నాలింగనమొనరించుకొనును. శివుని యనుగ్రహము పొందుటకు భక్తియే పరమసాధనము. పూజాపురస్కారాదు లానుషంగికములు. ఇందుకు వనచరుఁడైన తిన్నఁడు సాయుజ్యమొందుటయే తార్కాణము.

మార్గావర్తిత పాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబు నిషేచనం పుర రిపోర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షిత మాంసశేష కబళం నవ్యోపహారాయతే
భక్తిః కిం న కరోత్యహో! వనచరో భక్తావతంసాయతే.

(అడవిదారులవెంట నడచిన పాదుక (చెప్పు) పశుపతి శరీరమును తుడుచు కుంచె ఆయెను. నోట పుక్కిలించిన నీరు త్రిపురహరునకు దివ్యమైన అభిషేకమయ్యెను

కొంచెము తినఁగా మిగిలిన మాంసఖండము నవ్యమైన నైవేద్యమయ్యెను. భక్తి యేమి చేయఁజాలదు ? వనచరుఁడుకూడ భక్తులలో (శ్రేష్ఠుడయ్యెను.) శివచరణాల వాలమున మొలచి, ఆనందామృతరసముచే వర్ధిల్లి, స్థైర్యమను మారాకు నాశ్ర యించి భక్తిలత భక్తమానస కాయమానము నాక్రమించి వారికి సత్యాభీష్ట ఫలా దుల నొసంగును, మానవుల హృదయములు వానరములవలె చపలములై, మోహా టవియందు సంచరించుచు, నాశా శాఖలయందు స్వేచ్ఛగా గంతులిడుచుండును. ఆదిభిక్షులైన శివుఁడు వానిని భక్తిరజ్జువుచే బంధించి తనతో త్రిప్పుకొన్నచో నవి యా చావల్యములుడిగి స్థిరత్వము పొందఁజాలును,

సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశా శాఖా స్వటతి ఝుటితి స్వైరమభితః
కపాలిన్; భిక్షో ! మే హృదయ కపి మత్యంత చపలం
దృఢం భక్త్యా బధ్వా భవ! భవదధీనం కురువిభో !

భిక్షుకులు తమవెంట కోతులనుకూడా తీసికొనిపోయినచో బాలబాలికలు వినోదము నకై వాటిని తమయిండ్లకుఁగొనిపోయి బిచ్చము పెట్టుదురు. అంటే భక్తహృదయ కపిని శివుఁడు తనవెంటఁ గొనెపోయిన యెడల నతనికి కూడ లాభముండునని ఆచార్యులవారీ శ్లోకమున చమత్కరించియున్నారు. వేదశాస్త్రాధ్యయనము కంటెను బాహ్యపూజానైవేద్యాదులకంటెను, సన్యాసాద్యాశ్రమ స్వీకారముకంటెను, హార్ద్రి మైన భక్తియే శివానుగ్రహ సంపాదనమున నధికదక్ష మగునని వక్కాణించి యున్నారు. కొందఱు శివుని పూజించుటకై కుసుమములఁ దెచ్చు నుద్దేశముతో గభీరములైన కాసారములకును, విజనములైన విపినములకును, విశాలములైన శైలములకును అరుగుదురు. హృదయములను సరోజములు తమలోనే ఉండగా వానిని శివుని కర్పించి, చిరసౌఖ్యము పొందుమార్గమును వారెఱుఁగరుగదా యని, వారు విచారించుచున్నారు.

గభీరే కాసారే విశతి విజనే ఘోర విపినే
విశాలేశైలేచ భ్రమతి కుసుమార్థం జడమతిః
సమర్ప్యైకం చేత స్సరసిజ ముమానాథ ; భవతే
సుఖే నావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో !

కొందరు శివానుగ్రహము కల్గునను నాశతో బ్రహ్మ చర్యమునో, స్సన్యాసమునో అవలంబింతురు. ఆశ్రమ స్వీకారముచే మాత్రమే మరియు పురుషార్థము లభింపదు. హృదయమును శివాధీన మొనరించుట ముఖ్యము. శివాధీన హృదయులగు వారే యాశ్రమ మందున్నను, శివుఁడు వారి భారము వహించును. పురాకృత కర్మ వశమున జీవులు నరత్వమునో, దేవత్వమునో, పశుత్వమునో, పక్షిత్వమునో పొందవచ్చును. శివపాదాబ్జస్మరణ పరమానందలహరీ విహారాసక్త హృదయులు కాజాలుచో వారు పొందు దేహ విశేషముల వలన నెట్టి హానియు కలుగదు. వారు శివానుగ్రహమునకు పాత్రులై తీరుదురు. ఎవని యంతఃకరణము శివపాదపద్మ లగ్నమై యుండునో అతఁడే పరమయోగి అతఁడే సౌఖ్యవంతుఁడు. కొందఱు తర్కాది శాస్త్రములను దీక్షతో నధ్యయనము గావించి యందపారమైనపాండిత్యము సంపాదింతురు. వారు పాండిత్య పాటవము చేతను, వాద నైపుణ్యము చేతను, మహాపండితులను సైతమోడింపవచ్చును. రాజాదరణము పొంది జాంబూనదాంబరాగ్రహారములను బడయవచ్చును. కాని ఘోరములైన నరక యాతనముల నుండి, తప్పించు కొనఁజాలరు. శంభుపాదాంబుజ భజన తత్పరులు వైదుష్య విహీనులయినను కైవల్యము పొందఁగలరు.

శ్లో॥ ఘటోవా మృత్పిండోఽప్యణురపి చ ధూమోఽగ్నిరచలః
పటోవా తంతుర్వా పరిహరతి కిం ఘోరశమనమ్
వృథాకంఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదాంభోజం శంభోర్భజ పరమసౌఖ్యం వ్రజసుధీః

కొందఱు తాత్కాలిక ఫలములనాసించి అయాదేవతల నారాధింతురు. అట్లారాధించి వారు వాంఛితార్థములను బడయవచ్చును. కాని మానవత్వమునకు పరమ లక్ష్యమైన బ్రహ్మసాయుజ్యమును పొందఁజాలరు అందుచే క్షుద్ర ఫలదులైన యితర దేవతల నారాధించుటకంటె దగ్గరనే వేచియుండు హరిబ్రహ్మాదులకు కూడ దుర్లభమైన శివపదాంభోజభజనము కావించుట మంచిదని ఆచార్యుల వారుపదేశించుచున్నారు.

శంకరాచార్యుల వారచ్చటచ్చట కవితా కౌశలమును చూపుచు పరమ శివుని గూర్చి వ్యాజస్తుతులు గావించు చుందురు. అవి స్థూల దృష్టి కుపాలంభాత్మకములుగా గోచరించినను పరమ భక్తి భాసురములై పఠితల హృదయముల నానంద సముద్రమున నోలలాడించు చుండును. శివుఁడాది కిరాతుఁడు కావున స్వామి వారతనితో నీ విధముగ పరిహాసమాడు చున్నారు : శివా, నన్ను విడిచి స్థలాంతరమున కరుగకుము. నామనస్సనెడి కాంతరమున మత్తములైన మాత్సర్యమోహాది మృగము లెన్నో ఉన్నవి. నీవు వానిని వేఁటాడి నాకు సౌఖ్యమును కల్గించుటతో పాటు మృగయావినోదరుచిలాభమును కూడ పొందుము"

శ్లో॥ మాగచ్ఛ స్త్వ మిత స్తతో గిరిశ ! భోమయ్యేవవాసంకురు
స్వామి ! న్నాదికిరాత ! మామకమనః కాంతార సీమాంతరే
వర్తంతే బహుశోమృగామదజుషోమాత్సర్య మోహాదయ
స్తాన్హత్వా మృగయావినోద రుచితా లాభంచ సంప్రాప్స్యసి

"భవా ! నతుల చేతను, నుతుల చేతను, పూజావిధుల చేతను
ధ్యాన సమాధుల చేతను, నీకు తృప్తి కల్గునట్లు చేసు.
బాప ప్రహరణములు కాని, ముసలా ఘాతములు కాని నీకు
ప్రీతి కరములగుచో తెల్పుము. వానినే సమర్పింతును"

శ్లో నతిభిర్నుతి భి స్త్వ మీశ ! పూజా
విధిభిర్ధ్యాన సమాధిభిర్నతుష్టః
ధనుషా ముసలేన చాశ్మభిర్వా
వదతే ప్రీతికరం తథాకరోమి !

అని స్వాములవారనునప్పుడు మనకు నవ్వు వచ్చును కాని అట్లు చేసి శివుని అనుగ్రహమును పొందిన వారును కొందఱు కలరు. శంభో ! నీకు గరళమశనము. పాము లాభరణములు. చర్మము కట్టుబట్ట ముసలి యెద్దు

వాహ్యానము నీవు నాకేమిత్తువు! అసలు నీకడ నేమి కలదు! నీ పాదములందచంచలమైన భక్తి నొసంగుము".

శ్లో॥ అశనం గరళం ఫణీకలాపో
వసనం చర్మచ వాహనం మహోక్షః
మమ దాస్యసికిం, కిమస్తి శంభో!
తవ పాదాంబుజ భక్తి మేవ దేహి!

ఇత్యాది భావములుగల శ్లోకములు, పైకి నిందాద్యోతకములుగానున్నను, పరమభక్తినిధానములై యానందము చూఱనిచ్చును. ఇట్టివి మఱికొన్ని శ్లోకములు కూడ కలవు.

శివుఁడు పరమదయామయుఁడు. అతడు భక్తుల కష్టములన్నియు తీర్చి వారికి సుఖము కలిగించుటకై యత్నించుచుండును. అందుచేతనే ఆచార్యుల వారు "దురాశా భూయిష్టమును, దుష్ట రాజ సౌధద్వారముల పడియుండునట్లు చేయునదియు, దురిత నిలయమును దుఃఖ జనకమునైన సంసారమున చిక్కుకొని యున్న ఈ నా కష్టమునేల తొలగింపవు? నీవిట్లుపేక్షించుట వలన, నెవరి కుపకారము కలుగును:" అని శివునడుగుచున్నారు నిజమునకు శివుఁడు సర్వైశ్వర్య సంపన్నుఁడు. అతనికి భక్తు లేమియు నీయజాలరు "మేరుగిరి నీ చెంతనే కలదు. ధనపతియైన కుబేరుఁడు నీకు చెంతనే యుండును. నీ యింట కల్పవృక్షమును కామధేనువును, చింతామణులును కలవు. అమృత కిరణుఁడయిన చంద్రుఁడు నీకు శిరోభూషణముగా నున్నాడు సకల శుభములును నీ పాదము లాశ్రయించి యున్నవి అట్టి నీకు స్వామీ! నేనేమీయఁజాలుదును. నా హృదయమును మాత్ర మర్పింతును. గైకొనుము." అని స్వాముల వారు చెప్పుచున్నారు.

కరస్థే హేమాద్రౌ గిరిశనికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామర సురభి చింతామణిగణే

శిరఃస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిల శుభే
కిమర్థం దాస్యేహం భవతు భవదర్థం మమమనః

దీని వలన మనస్సును శివునియందు దృఢముగా నుంచి భక్తితో నతని సేవించుట యొక్కటే యతని పొందుటకు మార్గమనియు, శివునికి సువర్ణాది వస్తువుల నిర్పించుటకు కంటె మనస్సు నిర్పించుటయే మేల్తరమనియు తెలియు చున్నది. కోకము సూర్యుని, చకోరము చంద్రుని కోరునట్లు భక్తులు భక్తితో చిన్మార్గలభ్యుఁడైన శివుని వాంఛింపవలయును.

ఆచార్యులవారి భావములు భక్తి భరితములై యుండుటే కాక అత్యంతోదాత్త ములును కవితా కమనీయములు నై యింపు నింపుచుండును. "సూర్యుఁడొక్కఁడు భూనభోవ్యాప్తమైన తమస్సును భేదించి లోకలోచన గోచరుఁడగుచున్నాఁడు. పశుపత్ ! నీవు కోటి సూర్య ప్రభావసమేతుఁడవయ్యును నాకుఁగానరా కున్నావు. నన్నావరించిన తమస్సు (చీకటి) ఎంతదట్టమైనదో కదా ! దానిని దొలఁగించి నాయెడ ప్రసన్నుండవగుము" అను నర్థము గల క్రింద శ్లోకము మానవుల నావరించి యుండునజ్ఞానమెంత గాఢమైనదో తెల్పుచున్నది.

ఏకోవారిజబాంధవః క్షితినభోవ్యాప్తం తమోమండలం
భిత్వాలోచన గోచరోఽపి భవతి, త్వంకోటి సూర్యప్రభః
వేద్యః కింనభవస్యహో ఘనతరం కోర్వ్యగ్భవేన్మత్తమః
తత్సర్వం వ్యపనీయ మేపశుపతే సాక్షాత్ప్రసన్నోభవ.

శివుఁడు రాలతో రవ్వలతో కూడిన కైలాస పర్వతముపై విహరిం చును. అతని పాదములు కోమలములైననవి. సకలైశ్వర్య సంపన్నుఁడైన యతనికి దివ్య గృహములును లేవా ? ఉన్నవి అయినను అతఁడు శిలాతలము లందు నటన మొనర్చుటకు జగద్గురువులు చక్కని కారణము చెప్పుచున్నారు. "ఈ భక్తుఁడు మరల జన్మమెత్తక మానఁడు. ఇతని మనస్సు కఠినమైనది. ఎప్పుడైన నితఁడు నన్ను స్మరించినచో ఆ కఠినమైన మనస్సున విహరింప వలసి వచ్చును. అందుచే నిప్పటి నుండియు కఠినశిలలపై నడచుట అభ్యాసము చేసి కొనుట మంచిది అని తలంచి అతడట్లు చేయుచున్నాడని వారు చెప్పుకారణము.

ఏష్యత్యేష జనిం మనోఽస్యకఠినం వస్మిన్నటా నీతి మ
ద్రక్షాయై గిరి సీమ్ని కోమలపదన్యా స స్త్వయాభ్యాసితః
నోచే ద్దివ్య గృహాంతరేషు సుమన స్తల్పేషు వేద్యాదిషు
ప్రాయస్సత్సు శిలాతలేషు నటనం శంభోకిమర్థంతవ

ఈ శ్లోకము మానవుల మనఃకాఠిన్యమును శివుని భక్త రక్షణ పరాయణత్వమును ఎంతో చమత్కారముగా వెల్లడి చేయుచున్నది.

జడతాపశుతాకళంకితా
కుటిల చరత్వంచ నాస్తిమయాదేవ !
అస్తియది రాజమౌళే
భవదాచరణ స్యనాస్మికిం పాత్రమ్.

శివుడు శూలమును, మృగమును, పాములను, చంద్రుని ధరించును. గంగ జలద్రూపిణి. లడలక భేదము కావున ఆమెయందు (జడత్వము) కలదు. త్రిశూల మను నర్థము గ్రహించిన నదియు జడమే. మృగమునందు పశుత్వమున్నది. చంద్రుడు కళంకి (నల్లని మచ్చ కలవాడు) పాములు వంకరనడక (వక్ర చరత్వము) కలవి. ఆచార్యుల వారు శివునితో "నాయందు జడత్వము కాని పశుత్వము (మూర్ఖత్వము) కాని, కళంకిత్వము (దోషిత్వము) కాని, కుటిల చరత్వము (వక్రవర్తనము) కాని లేవు. ఒకవేళ ఉన్నను నీకాభరణముగానుండుటకు పాత్రుడను కాకపోను, ఏలయన నీవు ధరించు నాభరణము లందా దోషములు లేకున్నవాయేమి ? అందుచే నన్ను కూడ నీ ఆభరణముగా ధరింపుము" అని శ్లోకసాహాయ్యమున రమ్యమైన భావమును వ్యక్తము చేసి యున్నారు. ఇట్లే గంభీర భావ సంభృతము లైన శ్లోకముల నెన్నింటినో వారు శివానందలహరిలో ప్రకటించియున్నారు.

ఆచార్యుల వారి కవిత్వము నిరవద్యహృద్యమైనది. వారు పైని పేర్కొనబడిన "సర్వాలంకార యుక్తా" మ్మను శ్లోకమున తమ కృతిని కన్యతో పోల్చి తత్స్వీకారము చేయుమని శివుని వేడుచు దాని యందలి గుణగణములు

వివరించి యున్నాడు. వారి కృతి సర్వాలంకారయుక్త, అందుపమలు, రూపకములు, ఉత్ప్రేక్షలు, శ్లేషలు, అర్థాంతరన్యాసములు, వక్రోక్తులు కొల్లలు గానున్నవి. గళంతీశంభోత్వచ్చరణ సరితః "(2) సదామోహాదవ్యాం (20) ధ్వతిస్తంభాధాదాం (21) భక్తో భక్తిగుణావృతే (36) ధీయంత్రేణ (40) ఛందశ్శాఖి శిఖాన్వితైః (45) నిత్యానంద రసాయనం (48) ఆనందామృత పూరితా (49) కారుణ్యామృత వర్షిణం (52) ఆనందాశ్రుభిః (627) అమితము దమృతం (68) ఆరూఢ భక్తి గుణ (71) భక్తిర్మహేశ (76) శివతన పరిచార్యా (84) ధైర్యాంకుశేన (96) మున్నగు శ్లోకములు రూపకాలంకారమునకును హంసః (61) మున్నగు శ్లోకములుపమాలంకారమునకును, కరస్థే హేమాద్రౌ (27) మాగచ్ఛ స్త్వమిత స్తతః (43) మున్నగునవి కావ్యలింగాలంకారమునకును, 22, 30, 49, 53 శ్లోకములు పరికరాలంకారమునకును, సంధ్యారంభ (50) భృంగిచ్ఛానటనోత్కటః (51) జడతా పశుతా (69) మున్నగునవి శ్లేషాలంకారమునకును, మార్గావర్తిత పాదుకా అను శ్లోకమర్థాంతరన్యాసమునకును, ఏష్యత్యేష జనిం (80) జలధి మథన దక్షః (85) అను శ్లోకములు వక్రోక్తికిని, భూదారతాం (73) ఆద్యాఽవిద్యా (91) సారసనా (94) మున్నగునవి శబ్దాలంకారములకును తార్కాణములు. మొత్తము మీఁద ఆచార్యుల వారు రూపకాలంకారము పైనధికాదరము చూపియున్నారు రసవత్పద ప్రయోగమునకును, మాధుర్య ప్రసాదాది గుణములకును, అర్థగాంభీర్యమునకును వారి కవిత్వము పట్టుఁగొమ్మ. వ్యర్థపద మొక్కటియు చొరనీకుండ వివిధ వృత్తములను వాడి వారు తమ కవిత్వమును భక్తులకును సహృదయులకును హృదయానందకము కావించియున్నారు.

స్వాముల వారు శివుని గుణములననేక శ్లోకములలో వివరించి యున్నారు. వారి శ్లోకములందలి విశేషణములు కొన్ని రూప వర్ణన పరము లైనను కొన్ని పరబ్రహ్మత్వ సూచకములు, సాభిప్రాయములు. శివుఁడు త్రయీవేద్యుఁడు, చిదాలంబుడు, మహాదేవేశుఁడు, సకల జగద్యోగక్షేమధురంధరుఁడు, బాహ్యాంతర వ్యాపి, సర్వజ్ఞుఁడు, నిత్యానంద రసాలయుఁడు, సురమునిస్వాంతాంబుజాతాలయుఁడు, తస్కరపతి లేదా తోపవన విహారి, పశుపతి, నిత్యుఁడు, కోటి సూర్య ప్రభుఁడు, కైవల్య సౌఖ్య ప్రదుఁడు శివుని వర్ణించు జిహ్వయే జిహ్వ

అతని దర్శించునయనములే నయనములు, అతని వర్ణించుకరము లేకరములు, అతని స్మరించువాఁడే ధన్యుఁడు.

ప్రభు స్త్వం దీనానాం ఖలు పరమ బంధుః పశుపతే
ప్రముఖ్యోహం తేషామసి కిముత బంధుత్వమనయోః
త్వయైవ క్షంత వ్యాశ్శివ ! మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నాత్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః

పశుపతీ ! నీవు దీనులకు పరమబంధుఁడవు. నేనట్టి దీనులలో నగ్రేసరుఁడను. ఇంతకన్న మనయిరువురికిని బంధుత్వమేమి కావలయును ? నేను చేయునపరాధములన్నిటిని శివా ! నీవే క్షమింప వలయును. నీవే ప్రయత్న పూర్వకముగా నన్ను రక్షింపవలయును. అప్పుడే మన బంధుత్వము సార్థకమగును.)

# శంకర భగవత్పాదుల స్తోత్రసాహిత్యం

శ్రీ కేశవవంతుల నరసింహశాస్త్రి

శ్లో॥ గురుపుంగవ ! పుంగవకేతన ! తే
సమతా మయతాం నహి కోఽపి సుధీః
శరణాగతవత్సల ! తత్త్వనిధే !
భవ శంకర ! దేశిక ! మేశరణమ్.

పరమశివావతారమైన ఆదిశంకరాచార్యులు, మానవ మనోవైకల్యహేతువులై, వివిధ సిద్ధాంత చర్చామచర్చికలతో దిగ్భ్రమను కలిగించి, మానవుడు తోడిమానవుని ద్వేషించుటకును హింసించుటకును తోడ్పడుచుండిన వివిధ నాస్తికమత కోలాహల కల్లోలమునుండి మానవసమాజమునుద్ధరించి, విశ్వశాంతిని నెలకొల్పి, ధర్మరక్షణము చేయుటకై యుద్భవించిన మహామనీషి, తత్త్వవేత్త. ఆ జగద్గురుడే పుట్టకుండినచో జగత్తు రక్తసిక్తమై, మానవ కంకాళభూయిష్ఠమై, కాకులు, గ్రద్దలు, క్రూరమృగములును దిరుగాడు ఘోరారణ్యప్రాయమైయుండెడిది. ఆమహనీయుని జీవబ్రహ్మైక్య సిద్ధాంతమును అంగీకరింపలేని యితరమతసిద్ధాంతములుగూడ ఆ మైలురాతిని దృష్టియందుంచుకొని వ్యవరించుటచేతనే నేడు ప్రపంచమున నెన్ని కూరకృత్యములు ఒరుగుచున్నప్పటికిని కొలదిగనో గొప్పగనో మానవతావాదము మిగిలియున్నది. "మానవుడే దేవుడు దేవుడే మానవుడు." అన్న ఆయన సిద్ధాంత రహస్యమును ఎందరు కర్కశతర్కవక్రబుద్ధులు ఆక్షేపించినప్పటికిని అది జనప్రియమైన సిద్ధాంతము. అది మానవ సమాజసమైక్యభావమునకు మూలకందము, అది విశ్వశాంతికి రక్షామంత్రము. అది మానవుని అమృతతత్త్వసిద్ధికి మహోపదేశము. కనుకనే ఆయన జగద్గురువు. ఆయన పలుకులు అమృతశీకరములు.

ఆ మహనీయుడు చేసిన దిగ్విజయయాత్రకు ఫలము మానవసమాజమునందలి యన్యమత విద్వేషనిర్మూలనము, సత్యమైన ఆత్మతత్త్వమునెఱుకపరచు

నందును వివిధమతములు విజృంభించి మానవులలో తమతమ అనుయాయుల చేత ఆయా చిహ్నములను ధరింపపజేసి ఇతరమత విద్వేషహింసలను పురికొల్పుచుండినవి. ఆమతములవారు: కుంకుమోర్ధ్వపుండ్రధారులును సువర్ణపాదాది చిహ్నములను ధరించువారునగు శాక్తులును, కుంకుమాంకితశిరస్కులును, కమల ముద్రాయుక్త భుజులు, తామరపూసలదండలు వేసుకొనువారునగు లక్ష్మీభక్తులును, పుస్తకాకార పుండ్రకములు చిహ్నములుగా ధరించిన వాగ్దేవతయే పరబ్రహ్మమని వాదించు శారదోపాసకులును, శ్రీవిద్యోపాసనము చేయుచు పూజావిధానము నందు మద్యమాంసాదుల నుపయోగించుచు కుంకుమరేఖాంకిత ఫాలభాగులై దేవియే సర్వోత్కృష్టయని వాదించు వామాచారశాక్తులును, అద్వైతమును దూషించుచు భుజములకు లింగములు కట్టుకొన్న శైవులు, ముఖముల పైన శూలచిహ్నములు ధరించి శరీరము నందంతట లింగముద్రలు ధరించిన రుద్రభక్తులు, భుజములకు డమరుకములు కట్టుకొని, లింగములు ధరించి, శిరస్సున శూలములు దోపుకొన్న జంగములు, ముఖ వక్షోనాభి బాహువులయందు శూలమును గాల్చివేసుకొన్న ముద్రలుగల పాశుపతులు, శంకరుడొక్కడే పరదైవమని వాదించుచు మానవులను తమమతమునను సరించుటకా కర్షించుచు, విముఖులగువారిని హింసించుచుండిరి. శంకరాచార్యులనంతశయనప్రాంతము(కేరళ)న కేగినప్పుడు పై మతముల వారివలెనే విష్ణువొక్కడే పరమదైవమని వాదించు వైష్ణవులు, పాంచరాత్రులు, వైఖానసులు, భక్తమతస్థులు, భాగవతులు, కర్మవిహీనులనువారు ప్రజలను పెడదారి పట్టించుచుండిరి. సుబ్రహ్మణ్యక్షేత్రమునకు వెళ్ళినప్పుడు బ్రహ్మయేపరమోత్కృష్ట దేవుడని వాదించు హిరణ్యగర్భమతస్థులు, అగ్నియే గొప్పయను వహ్ని మతస్థులు, సూర్యుడే పరబ్రహ్మమను సౌరమతస్థులు, గణపతియే మహాదైవమను గాణపత మతమువారు, కన్నడదేశముకేగినప్పుడు శ్మశానభస్మమును బూసికొని: తలపుర్రెల దండను శూలమును ధరించిన కాపాలికులు, ఉన్మత్తభైరవాదులు తారసిల్లిరి. భారత దేశమునందలి యనేకప్రాంతాలలో దేహాత్మవాదులైన చార్వాకులు, బౌద్ధులు, జైనులు, క్షపణకులు గోచరించి వాదించిరి. విష్వక్సేనమత, మన్మధమత, కుబేరమత, ఇంద్రమత, యమమత, లోకసేవక మతములవారు తమతమ యిష్టదైవములే గొప్పవారనుచు, వారివారి చిహ్నములకు దగినట్లు శరీరములపై వాతలు, పుండ్రములు, జపమాలలు ధరించుచు జనసందోహమునందు భయాశ్చర్య ప్రలోభములు గల్గించుచుండగా వారందరితోను వాదించి, వారివారిలోపములను వారికెఱుకపరచి, మానవకోటికంత

ప్రయత్నమే కాని కీర్తికాముకత్వముకాదు. ఆ కాలమున యావద్భారతము టికిని అద్వైతమే పరమలక్ష్యమని బోధించి, ఆయాదేవతలకు గల ప్రాశస్త్యమును శ్రుతిస్మృతి పురాణ ప్రమాణములతో నిర్ణయించి వారందరును శాంకరాద్వైతము నంగీకరించునట్లుచేసిన మహామేధావి ఆదిశంకరులు. మతకల్లోలముల కాలవాలమై యుండిన భరతఖండమున ఉపనిషద్రహస్యవిద్యాబోధ జ్యోతిని వెలిగించిన సహస్ర రశ్మికరుడు. వేదప్రామాణ్యమును సుస్థిరముగా నెలకొల్పిన స్థితప్రజ్ఞులు శ్రీశంక రాచార్యులు. ఆయన తరువాత వచ్చిన మతాచార్యులుకూడ ఆయనసిద్ధాంతము సామాన్య బుద్ధులకు గోచరముకాజాలదని సులభతరము చేయుటకే మార్పులు చేర్పులు చేసిరికాని యన్యముకాదు.

శ్రీశంకరభాగవత్పాదుల వారికి సమకాలీనులై వారును, వేదప్రామాణ్యము నంగీకరించు వారును నగు విభిన్న మతముల వారందరును వారు ప్రతిపాదించిన యద్వైతమతము ననుసరించి, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వప్రకాశ నిర్విశేషచి న్మాత్ర బ్రహ్మ మొక్కటియే సత్యము, తదితరమైన సకలప్రపంచము మిథ్యాభూతమనియు, జ్ఞానజ్ఞేయ జ్ఞాతృ రూపమైన భేదప్రపంచము అవిద్యా (అజ్ఞాన) కల్పితమనియు, ఆయవిద్య ఆచ్ఛాదకత్వ, విక్షేపకత్వ శక్తియుక్తమై నిత్య సత్య స్వరూపమైన పర బ్రహ్మము నావరించి ప్రపంచావభాసమును కలుగజేయుచున్నదనియు, అది సదస దనిర్వచనీయమై అనాది సిద్ధమైన భావరూపాజ్ఞానమనియు, "తత్త్వమసి" మొదలైన శ్రుతి వాక్యములచేత ఆత్మబ్రహ్మైక్యవిజ్ఞానము కలుగగా నా అవిద్యయు, తత్కల్పిత మైన సర్వప్రపంచమును నివృత్తమగుటయే మోక్షము అని విశ్వసించిరి. అనాదిభేద వాసనా దూషితములగుటచేత ఇతర ప్రమాణములు దుర్బలములు,నిత్య నిర్దుష్టమగుట చేత శ్రుతియే ప్రబల ప్రమాణమని నమ్మిరి. "ద్వయోః భావః ద్వితా, ద్వితైవద్వైతం, నద్వైతం అద్వైతం" అనువ్యుత్పత్తిని గ్రహించి బ్రహ్మ మొక్కటియే పరమార్థమని యంగీకరించిరి. శంకరులుపదేశించిన పంచాయతనమును (ఆదిత్య, అంబికా, గణ నాథ, మహేశ్వర, విష్ణురూపమైన సాలగ్రామములను) పూజించు కర్మోపాసనమును స్వీకరించిరి. పూర్వమీమాంసకులు కర్మల నాచరించుటవలననే సకలఫలములు సిద్ధించుననియు, బ్రహ్మమే లేదనియు వేదాంతములు (ఉపనిషత్తులు) అప్రమాణము లనియు వాదింపగా పరమ పురుషార్థమైన బ్రహ్మమును, ఉపనిషత్తులకు ప్రామాణ్యా మును సాధించుట ఒక ముఖ్యోద్దేశము,బౌద్ధమతస్థులు సర్వము శూన్యమే,ప్రపంచము భ్రాంతి సిద్ధమే యని నిరూపింపగా అధిష్ఠానము లేనిదే భ్రాంతి సంభవింపదు గనుక

ప్రపంచాధిష్ఠానమగు పరబ్రహ్మకు పరమార్థత్వ మవశ్యముగా నంగీకార్యమగునని ప్రమాణములతో ఉపపత్తులతో సాధించుట మరియొక ముఖ్యోద్దేశమన్న శాంకర సిద్ధాంతరహస్యమును గ్రహించిరి.రాగద్వేష నిరసనమునకు,వేదాంత శ్రవణాధికారము నకును "నిత్యా నిత్యవస్తువివేకము, శమదమాదిసాధనసంపద, ఇహాముత్రఫలభోగ విరాగము, ముముక్షుత్వము" అను సాధన చతుష్టయమే ముఖ్యముగాని ఇతరములైన వేష భూష భాషణాదులు ముఖ్యములుగావని యెఱిగి శంకరాచార్యులను జగద్గురువుగా నంగీకరించి సేవించిరి.

ప్రస్తుత ముఖ్యాంశం :

ఇంత మహత్తరమైన సిద్ధాంతమును లోకమునకందించి జగద్విజయమును పొందిన శ్రీ భగవత్పాదులు వివిధదేవతలను అనర్గళమైన తన కవితాధారతో స్తుతించి రచించిన స్తోత్రసాహిత్యమునకు మూలకారణమేమిటి? అన్నసంశయము బహుళ సంఖ్యాకులైన జిజ్ఞాసువులకు గలుగుట సహజము. ఆ సాహిత్యమును తనభక్తిని చాటుటకు రచించెనా? లేక లోకకళ్యాణార్థం వ్రాసి ప్రచారముచేసెనా? అని ప్రశ్నించినచో లోకకళ్యాణార్థమే యనిచెప్పకతప్పదు. వీతరాగుడై కేవలశివావతారమనిభావింప బడుచున్న ఆయనకు స్తోత్రములతోబనియేమున్నదిగనుక. మానవప్రపంచము తనసిద్ధాంతమును అవగతము చేసుకొన్నప్పటికిని వారికి జన్మజన్మాంతరములనుండి అనుస్యూతముగా నంటుకొనియున్న వాసనాప్రపంచము అంతసులభముగా నంటుకొని అంతసులభముగా తుడిచిపెట్టుకపోదు, అంత సులభముగా వారు రాగద్వేషవిముక్తులు కాజాలరు. వారికి దేహాత్మభావము(దేహమే నేను అనుభావము) క్రమముగా సమసిపోయి జీవభావము (నాలోఉన్న జీవాత్మయే అన్ని ప్రాణులలోను ఉన్నది, వాటికి నాకు ఏలాటి భేదములేదు అనుస్పృహ) నిరంతరముగా కలిగి, ఆత్మభావము (సృష్టికి మూలమైన ఆత్మతత్త్వమే అంతటనుగలదు అన్నదృఢజ్ఞానము) కలిగి, నాకు పరమాత్మకు భేదమేలేదు నేనే పరమాత్మను పరమాత్మయేనేను అన్ననిత్యనిరంతర సమాధిస్థితి కలుగవలెనన్నచో భక్తిపూర్వకమైన సాధనకావలెను. ఆ సాధనకు ప్రప్రథమమున తమతమ ఇష్టదైవధ్యానము ఆధారము. కనుక విశాలభారతమునందు సుప్రసిద్ధములైన పుణ్యక్షేత్రములలో వెలసియున్న దేవతాస్తోత్రధ్యానములు వారికవసరము. ఆ యుద్దేశము చేతనే శ్రీ శంకరభగవత్పాదులవారు ధర్మార్థకామమోక్షములను ప్రసాదింపగల వివిధ దేవతామూర్తుల స్తోత్రములను రచించి ప్రచారముచేసిరి. ఆయా

స్తోత్రములను భక్తిప్రపత్తులతో పఠించిన వారికి కలుగబోవుసత్ఫలితములను ప్రతి దానిచివరలో ఉల్లేఖించిరి. అనిర్వాచ్యమైన తన మహిమచేత మానవుల కాయా శ్రేయస్సులభించునట్లు వచించిరి.

సకల వైదిక లౌకిక కార్యములను నిర్విఘ్నముగా ఫలింపజేయు గణపతిని గురించి గణేశపంచరత్నమ్, గణేశభుజంగప్రయాతస్తోత్రమ్" అను వానిని రచించి

శ్లో॥ "ఇమం సుస్తవం ప్రాతరుత్థాయ భక్త్యా
పఠేద్యస్తు మర్త్యోలభే త్సర్వకామాన్ ।
గణేశప్రసాదేన సిద్ధ్యంతి వాచో
గణేశా విభౌ దుర్లభం కిం ప్రసన్నే ?"

అని ఫలశ్రుతిని చెప్పిరి. ప్రాతఃకాలమునందీస్తోత్రమును పఠించు వానికి వాక్సిద్ధితో పాటు సర్వవాంఛితములును చేకూరునని భావము.

లోక గురువై దక్షిణామూర్తి రూపమున సాక్షాత్కరించిన పరమశివధ్యాన మగు "దక్షిణామూర్తి స్తోత్రము"ను రచించి, ఓంకార రూపమైన విద్యోపదేశము చేసి నాయజ్ఞానాంధకారమును తొలగించునుగాక యని కోరుచు, నీ మూర్తిధ్యానము చేయు భక్తుడు ఐశ్వర్యమును, ఆయుష్యమును, విద్యను పొంది చివరికి వేదాంత మహారహస్య మునెఱుగు నన్నాడు.

శ్లో॥ యస్తేప్రసన్నామనుసందధానో
మూర్తిం ముదాముగ్ధశశాంకమౌలే !
ఐశ్వర్య మాయుర్లభతేచ విద్యా
మంతేచ వేదాంత మహారహస్యమ్"

సుప్రసిద్ధమైన "విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం" అని శార్దూల వృత్తంలో రచించిన శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమునందు అద్వైత వేదాంతరహస్యము నంతటిని బోధించి ముముక్షు జనానికి మహోపకారము చేశారు.

శివపంచాక్షరీ మహామంత్రోపాసకులకు ఆ మంత్ర బీజాక్షరములను, "నమ శ్శివాయ"అను మకుటముతో అయిదు శ్లోకములను, "నమశ్శివాయైచ నమశ్శివాయ"

అను మకుటముతో నెనిమిది శ్లోకములను చెప్పి శివధ్యానమును సులభతరం చేసినారు. దక్షిణ దేశవాసులకు ముఖ్యారాధ్యుడైన సుబ్రహ్మణ్యస్వామిని గురించి శ్రీ "సుబ్రహ్మణ్యభుజంగస్తోత్రమ్" అని ముప్పదిరెండు వృత్తములు వ్రాసి

శ్లో॥ "భుజంగాఖ్య వృత్తేన క్లుప్తం స్తవంయః
పఠేద్భక్తియుక్తో గుహంసంప్రణమ్య ।
సపుత్రాన్ కళత్రం ధనందీర్ఘమాయుః"
లభేత్ స్కందసాయుజ్యమంతే నరస్సః

అని ఫలశ్రుతి చెప్పిరి. కుమారస్వామి మహిమోపేతమైన యీ స్తోత్రమును పఠించువారికి పుత్ర కళత్ర ధన దీర్ఘాయువులు గలిగి చివరికి స్కందసాయుజ్యము లభించునన్నారు.

"ద్వాదశలింగ స్తోత్రమ్"

ఈ స్తోత్రము భారతదేశమహామహిమను వెల్లడించుటయేకాక దేశవాసులాయాక్షేత్రములకు వెళ్ళి శివారాధనము చేసి పరమశివానుగ్రహమును పొందవలెననియు, ఆయాప్రాంతములవారు ఆ జ్యోతిర్లింగసాన్నిధ్య నిత్యారాధనములతో తరింపవలయుననియు బోధించును. ఆయా శివలింగములుగల ప్రదేశములను ముందుతరములవారు మరువకుండునట్లు ప్రదేశములు, శివనామములు, వాని మహిమలును బేర్కొన్న యాచార్యులవారి దూరదృష్టియు, ప్రచారవైశారద్యమును కొనియాడదగియున్నవి. అవియివి, సౌరాష్ట్రమునందలి జ్యోతిర్లింగము "సోమనాథుడు", శేషగిరికి (తిరుమల) శిఖరభూతమైన శ్రీశైలమునందున్న లింగము "మల్లికార్జునస్వామి", ఆంధ్రదేశమున,

శ్లో॥ శ్రీశైలశృంగే వివిధప్రసంగే
శేషాద్రిశృంగేపి సదావసంతమ్ ।
తమర్జునం మల్లిక పూర్వమేనం
నమామి సంసార సముద్రసేతుమ్"

అవంతిదేశమున (ఉజ్జయని) నున్న శివుడు "మహాకాళనాథుడు", కావేరీ నర్మదల సంగమస్థానమైన మాంధాతృపురమున గల లింగము "ఓంకారేశ్వరుడు," ఈశాన్యదిశ

యందలి పారలికాక్షేత్రమునందున్నది "వైద్యనాథ"లింగము, ఆ మర్దమను నగరమున మహావైభవముతో గలది "నాగనాథలింగము" వారాణసి (కాశి) యందు వేంచేసియున్న శివుడు శ్రీవిశ్వనాథుడు. శాకిన్యాదిగణములచేత సేవింపబడుచు భీమాశంకరమను క్షేత్రమున గల శివుడు "భీమశంకరలింగము", సేతువును బంధించి శ్రీరామచంద్రుడు తామ్రపర్ణీసముద్రసంగమ స్థలమున ప్రతిష్ఠించినది "రామేశ్వరలింగము" భారత పశ్చిమప్రాంతమున గోదావరీ తీరమునగల లింగము "త్ర్యంబకేశ్వరుడు" హిమాలయ ప్రాంతమునందలి కేదారక్షేత్రమునగల లింగము "కేదారేశ్వరుడు", ఏలాపురమునందలి శివాలయమునందుగల లింగము "ధిషణేశ్వరస్వామి", అని పేర్కొని, ఈ ద్వాదశజ్యోతిర్లింగ దర్శన పూజనాదులేకాక ఈ జ్యోతిర్లింగస్తోత్రపఠనమును ప్రతిదినమున చేయుమానవుడు సర్వశ్రేయస్సులను పొందగలడని చెప్పుచు తానుస్వయముగా ఈ క్షేత్రములను దర్శించి, క్షేత్రవాసులకేకాక యావత్ప్రపంచవాసులకును శివమహిమనుదెలిపిన భగవత్పాదులకరుణాళుత్వము అనిర్వచనీయమనుట అతిశయోక్తికాదు.

ఇక "మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వంయువానం"అని ప్రారంభించి "భూరంభాంస్యనలోనిలోంబరమహర్నాధోహిమాంశుః పుమానిత్యాభాతి " అని ముగించిన పదిశ్లోకములచివర నమఇదంశ్రీ దక్షిణామూర్తయే" అని యుండుటచేత నిదియు దక్షిణామూర్తిస్తోత్రముగా ప్రసిద్ధిని పొందినమహత్తరరచన. ఇది అద్వైత సిద్ధాంత పీఠికకు చింతామణి తుల్యము. దీని కెన్నియోవ్యాఖ్యానములున్నవి. సురేశ్వరాచార్యులవారు వార్త్తికములను పేరుతో శ్లోకరూపవ్యాఖ్యానమును రచించినారు. దీని శ్రవణమననాదులవలన అవ్యాహతమైన యైశ్వర్యము సిద్ధించునని ఆ చార్యులవారే ఫలశ్రుతిగాచెప్పినారు. ఈ విధముగా సమాజములో ముముక్షువులైనవారికిని, ధర్మాభిరతిగలవారికిని, ఐహిక సుఖైశ్వర్యవాంఛలు గలవారికిని వారివారి యిష్టార్థములను సిద్ధింపజేయు వివిధ దేవతామూర్తులకు సంబంధించిన స్తోత్రములను వారివారిస్వస్థాన పరిసరములందుగల పుణ్యక్షేత్రనిర్దేశపూర్వకముగా శతాధికములుగా విరచించి వారిని దైవభక్తిపరాయణులుగాను, ఆస్తికులుగాను, తత్త్వధ్యాననిరతులుగాను చేసినారు.

మానవునికి కులముకంటే గుణమే ఆధిక్యమును చేకూర్చునన్న భావమును సుదృఢముగా విశ్వసించినవారిలో శ్రీ శంకరాచార్యుల వారగ్రేసరులని వారు రచించిన యీమనీషా పంచకశ్లోకములు వెల్లడించుచున్నవి.

ఒకనాడు జగద్గురువు గంగాస్నానముచేసి శిష్యయుక్తముగా కాశీనగర వీధులలో వచ్చుచుండగా ఆయన సమీపమునకు ఒకచండాలుడు వచ్చెను. అతడు తనను తాకునేమో! యనుకొని శంకరుడు ప్రక్కకుతొలుగుము" అనెను ఆ చండాలుడు "మీరు ప్రక్కకు తొలగమన్నది దేహమునా? దేహినా? అనగా నా శరీరము ప్రక్కకు తొలగవలెనా? లేక నాయాత్మప్రక్కకుతొలగవలెనా? ఏది మీ యుద్దేశము" అని బదులుపలికెను. ఆ మాటవినగానే వచ్చినవాడు ఆత్మజ్ఞానియనితెలుసుకొని తన యభిప్రాయమును (మనీషా=బుద్ధిః)ఇట్లు వెల్లడించెను.

శ్లో|| "జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరా యా సంవిదుజ్జృంభతే
యా బ్రహ్మాదిపిపీలి కాంత తనుషుప్రోతా జగత్సాక్షిణీ
సైవాహం నచ దృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాస్తి చేత్
చండాలోస్తు సతుద్విజోస్తుగురు రిత్యేషా మనీషామమ"

ఏ ఆత్మజ్ఞానం జాగ్రదవస్థలోను, స్వప్నావస్థలోను, సుషుప్తి (గాఢనిద్ర) లోను ఒకేరీతిగా స్పష్టముగా ప్రకాశించుచున్నదో, ఏ ఆత్మ విజ్ఞానకళ బ్రహ్మ మొదలుకొని చీమవరకు గల సర్వశరీరములందు నొకేవిధముగా పూసలలో దారమువలె అను స్యూతమైయున్నదో, జగత్సాక్షిణీ=ఏది దృఙ్మాత్రమై దృశ్యమైన ప్రపంచ మునకంతటికిని సాక్షియైయున్నదో అదినేనే కనపడుచున్నదే హాదిదృశ్య వస్తువునుకాను దృక్కును(చూచువాడను)మాత్రమే యను దృఢ జ్ఞానమెవ్వనికిగలదో అట్టివాడు ఉపాధివలన (దేహముతో) చాండాలుడైనను ద్విజుడైనను కానిమ్ము అతడు గురువేయని నా నిశ్చయము.

శ్లో "బ్రహ్మైవాహమిదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం,
సర్వంచైత దవిద్యయా త్రిగుణయా శేషం మయాకల్పితమ్,
ఇత్థం యస్యదృఢా మతిస్సుఖతరే నిత్యేపరే నిర్మలే
చండాలోస్తు సతు ద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ".

నేను పరబ్రహ్మ వస్తువునేకాని అన్యుడనుకాను. ఈజగత్తంతయు చిన్మాత్రమైన బ్రహ్మపదార్థముయొక్క విస్తృతియే జగత్తు బ్రహ్మయందు అవిద్యచేత కల్పితము గనుక అది బ్రహ్మాభిన్నమే. ఎడారియందు ప్రసరించిన సూర్యకిరణములు (ఎండ

మావులు) జలమువలె కనపడినను- ఆజలము, సూర్యకిరణములకంటే భిన్నము కానట్లు **అజ్ఞాన కల్పితమైన** జగత్తు **తనకధిష్ఠానమగు** బ్రహ్మముకంటే భిన్నము కాదని భావము. **సత్త్వరజస్తమోగుణాత్మకమగు అవిద్యచేతనే** ఈ సమస్తప్రపంచము నా చేతనే **కల్పింపబడినది, ఆత్యంతిక సుఖాత్మకము**, నిత్యము,నిర్మలము, సర్వోత్కృష్టమైన పరబ్రహ్మమునందు అవిద్యోపాధికుడనైన (జీవాత్మభావముగల) నేనే కల్పించుకొన్నాను అన్నదృఢప్రజ్ఞయెవ్వనికి కలదో అతడు చండాలుడైనను ద్విజుడైనను నాకు గురువేయని నా యభిప్రాయము.

శ్లో॥ "శశ్వన్నశ్వరమేవ విశ్వమఖిలం నిశ్చిత్యవాచా గురో
ర్నిత్యం బ్రహ్మనిరంతరం విమృశతా నిర్వ్యాజ శాంతాత్మనా
భూతం భావిచదుష్కృతం ప్రదహతా సంవిన్మయే పావకే
ప్రారబ్ధాయ సమర్పితం స్వవపు రిత్యేషామనీషామమ".

సద్గురువు యొక్క **ఉపదేశవాక్యము**ను నమ్మి ఈ జగత్తంతయు నశించునట్టిదే కాని యెన్నడు నిత్యముగా నిలుచుస్వభావముకలది కాదు. అని నిశ్చయించుకొని, నిత్యసత్యమైనపరబ్రహ్మతత్త్వమును చర్చించుచు (శ్రవణ,మనన, నిధిధ్యాసనములు చేయును), నిర్వ్యాజ శాంతమైన (లయవిక్షేపరహితమై) ప్రశాంతమైన చిత్తముకలవాడై బ్రహ్మసాక్షాత్కారమునుపొంది,ఆ బ్రహ్మతత్త్వజ్ఞానాగ్నిలో **భూతభవిష్యద్రూపమైన పుణ్యపాపఫలములను భస్మముచేసి** తన ద్విజచండాలాది రూపశరీరమును దానికి వచ్చురోగాదులను ప్రారబ్ధాను **భవమునకు** వదిలిపెట్టువాడు మహనీయుడని నా యభిప్రాయము.

శ్లో॥ "యాతిర్యఙ్నర దేవతాభి రహమిత్యంత స్ఫుటాగృహ్యతే
యద్భాసా హృదయాక్ష దేహవిషయాభాంతి స్వతోచేతనాః
తాంభాస్యైః పిహితార్క మండలనిభాం స్ఫూర్తిం సదాభావయన్
యోగీ నిర్వృతమానసోహి గురురిత్యేషా మనీషామమ."

ఏ సంవిత్కళ పశువులు,పక్షులు,మానవులు దేవతలు మొదలగు సర్వప్రాణులచేతను "అహం అహం" నేనునేను" అని తమతమ బుద్ధిగుహాంతరాళమున స్పష్టముగా గ్రహింపబడుచున్నదో, దేని యొక్క ప్రకాశముచేత అ చేతనములును, జడములును.

అప్రకాశస్వరూపములునైన హృదయేంద్రియదేహములు ప్రకాశించుచున్నవో, తనచేత భాసింపజేయబడు నాయావిషయములచేత (భాస్యములచేత) కప్పివేయబడిన సూర్య మండలమువలెనున్న ఆ సంవిత్కళను స్వాత్మతత్త్వముగా భావించుచు, బ్రహ్మానంద తుందిల మానసుడైన యోగిపుంగవుడు ఏ కులమత జాతికి సంబంధించినవాడైనను గురుమూర్తియే యని నా యభిప్రాయము.

అద్దపు ముక్కలు స్వయముగ ప్రకాశించునవికావు. చీకటిలో అవిప్రకాశింపవుగదా! కనుక అవి దీపభాస్యములు. దీపభాస్యములై రంగు రంగులుగా నున్న యాయద్దపు ముక్కలచేత కప్పబడినప్పుడును దీపము ప్రకాశించుచునేయుండును. కానిదీపముయొక్క స్వరూపమునుమాత్రము అజ్ఞానులు యథాతథముగా (ఉన్నదున్నట్లుగా) గ్రహింపక మూతలుగానున్న అద్దపుముక్కల రంగుకలదిగానే గుర్తించుచుందురు. విజ్ఞులట్లుగాక దీపమున కద్దపుముక్కల రంగులేదని గ్రహింపగలరు. అట్లే ఆత్మతత్త్వప్రకాశములగు దేహేంద్రియాదులచేత పిహితమైయున్న (కప్పబడియున్న) స్వయంప్రకాశమానమగు ఆత్మతత్త్వమును (సంవిత్కళను) అజ్ఞులు దేహేంద్రియాది స్వరూపముగనే గ్రహించుచు, వానినే ఆత్మగా భావించుచు సంసారమగ్నులగుదురు. తత్త్వవిదులు అట్లుకాక ఉపాధులైన దేహేంద్రియాదులను వేరుగా గ్రహించి తద్భాసక సంవిత్కళను ఆత్మతత్త్వముగ గ్రహించి, సర్వలోక వ్యవహార వివర్జితులై బ్రహ్మభావమునొంది, స్వస్వరూపానంద నిర్భర మానసులగుచుందురని భావము. అట్టియోగివర్యుడు సాక్షాత్ గురుమూర్తియేయని శ్రీశంకరులవారియాశయము.

శ్లో "యత్సౌఖ్యాంబుధి లేశలేశత ఇమే శక్రాదయోనిర్వృతాః
యచ్చిత్తే నితరాం ప్రశాంతకలనే లబ్ధ్వామునిర్నిర్వృతః
యస్మిన్నిత్య సుఖాంబుధౌగలిత ధీర్బ్రహ్మైవ నబ్రహ్మవి
ద్యః కశ్చిత్ససురేంద్ర వందిత పదోనూనం మనీషామమ."

ఏ బ్రహ్మస్వరూపమైన ఆనందసాగరము నందలి అల్పాల్పభాగ లాభముచేత దేవేంద్రాదులానందమును పొందగలుచున్నారో, మిక్కిలి ప్రశాంతమైన చిత్తమునందు ఏ బ్రహ్మతత్త్వమును పొంది నియమిత సర్వేంద్రియ మనోవృత్తియగు యోగివర్యుడు ఆనంద భరితుడగుచున్నాడో, నిత్యసుఖాంబుధి రూపమైనయే బ్రహ్మవస్తువునందు

విలీనమైన చిత్తముగల మహాత్ముడు (అమనస్కయోగి) బ్రహ్మవేత్త యగుటయేకాక సాక్షాత్ ఆ పరబ్రహ్మమే తానగుచున్నాడో అట్టి పరబ్రహ్మభావమును పొందిన మహాత్ముడు శరీరోపాధిచేత ద్విజుడైనను చండాలుడైనను అతడు సురేంద్రవందిత పదారవిందుడనియు, గురుమూర్తియనియు నానిశ్చితాభిప్రాయమని చెప్పగా నా చండాలుడు వ్యాసభగవానుడుగా మారి నీ తత్త్వజ్ఞాన పరిశీలనార్థమై యిట్టిరూపమున వచ్చితిననిచెప్పి యదృశ్యుడయ్యెను. తత్త్వజ్ఞానముచేత బ్రహ్మనిష్ఠుడయిన మానవునికి కులమత భేదము లేదని యీ మనీషా పంచక తాత్పర్యము.

బ్రహ్మతత్త్వమునకు భిన్నముకానిదై, అష్టాదశ శక్తిపీఠములలో నొకటియై, ఆంధ్రదేశవాసులకు సులభప్రాప్యయైన శ్రీశైలభ్రమరాంబికాదేవిని గురించి భ్రమరాంబాష్టకమును రచించి తెలుగువారిని అనుగ్రహించినారు,

శ్లో "చాంచల్యారుణ లోచనాంచిత కృపాం
చంద్రార్క చూడామణిం,
చారుస్మేరముఖాం చరాచరజగ
త్సంరక్షిణీం తత్పదామ్ ।
చంచచ్చంపక నాసికాగ్ర విలస
న్ముక్తామణీ రంజితాం
శ్రీశైలస్థలవాసినీం భగవతీం
శ్రీమాతరం భావయే"

ఇత్యాదిగా అష్టకమును వ్రాసి, తొమ్మిదవ శ్లోకముతో ముగించిన యీ రచనయందు భ్రమరాంబా స్వరూపమున నున్న శ్రీమాతయొక్క మహిమను, దేవీతత్త్వమును, సర్వశాస్త్ర సకలతంత్రగ్రంథ రహస్యములతో విశదపరచినారు.

శ్రీ శంకరాచార్యులవారి బాల్యమున వారి ముఖారవిందమునుండి నిర్గళితమైన ప్రప్రథమ "కనకధారాస్తోత్రము మొదలుకొని శతాధికములైన స్తోత్రమకరంద ధారలు వెలువడి, యావద్భారతమునందలి పుణ్యతీర్థక్షేత్రవాసులైన దేవతలయను గ్రహమాయాదేశవాసులకు లభించుట కుపయోగపడుచున్నవి. కనకధారాస్తోత్రము వలన తనకు భిక్షము పెట్టవచ్చిన బ్రాహ్మణవనితకు ఉసిరికాయకు ఫలితముగా

సువర్ణామలకముల వర్షము కురిసినట్లుగానే, ఆయా దేవతాస్తోత్రములను నియమనిష్ఠలతో భక్తిప్రపత్తులతో పఠించిన భక్తులకు వారి యిష్టార్థములు కోటి గుణితములుగా ఫలింప వలయుననియే ఫలించుననియే శ్రీ జగద్గురు శంకరాచార్య విరచిత స్తోత్ర సాహిత్య పరమోద్దేశము.

గృహస్థులైన వారికి స్తోత్రములద్వారా అభ్యుదయము కలుగుటను బోధించి నప్పటికిని "ఆత్మలాభాత్ పరోలాభోనాస్తి'' (ఆత్మజ్ఞాన లాభముకంటే మించిన ఇతర లాభమేదియు లేదు) యను సూక్తి ననుసరించి అనాత్మయైన జగత్తును, జగత్సుఖబాహుళ్యమును నిరసిస్తూ " అనాత్మశ్రీవిగర్హణమ్ " అను ఖండికను విరచించిరి. అందులో నీవిధముగా "తతఃకిం తతఃకిమ్'' అనుప్రశ్న పరంపరచేత మానవుని బుద్ధికి పదునుపెట్టు వాక్యములు కూర్చిరి.

"లబ్ధావిద్యా రాజమాన్యా; తతఃకిం ?
ప్రాప్తాసంపత్ ప్రాభవాఢ్యా; తతఃకిమ్ ?
భుక్తానారీ సుందరాంగీ; తతఃకిం ?
యేనస్వాత్మానైవ సాక్షాత్కృతోభూత్

ఎవనిచేత తనయాత్మ దర్శింపబడలేదో అట్టివాని చేత రాజగౌరవము పొందగల విద్య పొందబడినప్పటికిని లాభమేమి? ప్రాభవముగల సంపద ఆర్జించబడినప్పటికిని లాభమేమి? సౌందర్యవతియైన స్త్రీ అనుభవింపబడినప్పటికిని లాభమేమి? కనుక ఆత్మసాక్షాత్కారమునకై యత్నింపవలయును.

"కేయూరాద్యైర్భూషితోవా తతఃకిమ్ ?"
"తృప్తో మృష్టాన్నా దినావా తతఃకిమ్?"
దృష్టానానాచారుదేశా స్తతఃకిమ్
"గోత్రం సమ్యగ్భూషితం వా తతఃకిమ్"
"కీర్త్యావ్యాప్తాస్సర్వలోకా స్తతఃకిమ్ ?"
"యుద్దేశత్రుర్నిర్జితోవా తతఃకిమ్ ?"
"భూపేంద్రత్వం ప్రాప్తముర్వ్యాం తతఃకిమ్
"యేనస్వాత్మానైవ సాక్షాత్కృతోభూత్."

అని ఈవిధముగా పదియారు శ్లోకములలో ఆత్మేతరములగు వానివల్ల కలుగు తాత్కాలిక సుఖములన్నియు దుఃఖమయములే యనియు, నిరర్థకములనియు నిరంతరము భావించుచున్న మానవుడే ఆత్మసాక్షాత్కారమున కర్హుఁడనియు బోధించినారు. ఈ షోడశశ్లోకపఠన, తదర్థజ్ఞాన, తద్భావనలచేత మానవుడు గర్వమును విడనాడి, మోహమున మునుగక, రాగద్వేషరహితుడై, అహంకార శూన్యుఁడై ఆత్మసాక్షాత్కారరూప మోక్షమున కర్హుడగుననుటలో సంశయము లేదు.

అయితే ఆయాత్మజ్ఞాన లబ్ధికి దగిన యుపాయమును జెప్పక పోయినచో శంకరాచార్యుల కర్తవ్యము పూర్తి కాదు. అందువలన "ఉపదేశపంచకము"ను రచించి నారు. ఎత్తుగానున్న మహాసౌధము నెక్కుటకు సోపానములు కావలెను. ఈ పంచకము నకు 'సోపానపంచక" మనియు ప్రసిద్ధికలదు. ఈ ఐదుశ్లోకములలో నొక్కొక్కదాని యందు ఎనిమిదేసి వాక్యములున్నవి. వానిలో మానవుడు వరుసగా ఆచరించి మోక్షమును పొందునుపదేశములుకలవు. ఆయుపదేశములననుష్ఠించిన మానవుడు, సోపానములద్వారా సౌధతలమునకు జేరువానివలె, అనాయాసముగా మోక్షమును పొందగలడు. ఈ యుపదేశములలో ముప్పదితొమ్మిది విషయములు ముప్పది తొమ్మిది మెట్లవంటివి. నలుబదియవది ఫలభూతమైనదియు, ప్రాప్యమైనదియునగు మోక్షము (సౌధమువంటిది). అవియివి,

శ్లో "వేదోనిత్యమధీయతాం, తదుదితం కర్మస్వనుష్ఠీయతామ్
తేనేశస్యవిధీయతా మపచితిః, కామ్యేమతిస్త్యజ్యతామ్
పాపౌఘః పరిధూయతాం, భవసుఖేదోషోను సంధీయతామ్
ఆత్మేచ్ఛా వ్యవసీయతాం, నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతామ్."

నిత్యము వేదము చదువబడునుగాక (చదువవలెననియర్థము) వేదమునందు చెప్ప బడిన నిత్యనైమిత్తికాది సత్కర్మలు చక్కగా ఆచరింపబడునుగాక (ఆచరింపుము). ఆకర్మచేత ఈశ్వరారాధనచేయబడునుగాక (చేయుము).

కామ్య కర్మలయందు ఆసక్తి విడువబడునుగాక (విడువుము).

నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానముద్వారా పాపసముదాయము పారద్రోలబడునుగాక (పారద్రోలుము).

క్షణికమైన సంసారసుఖమునందలి దోషము అనుసంధానము చేయబడునుగాక (ఇవి దుఃఖప్రదములు, ఇవి గ్రహింపదగినవి కావు అని గుర్తింపుము).

ఆత్మజ్ఞానము నందలి కోరిక దృఢపడుటకై ప్రయత్నింపబడునుగాక (దృఢప్రయత్నమును చేయుము.)

అట్టి ఆత్మలాభేచ్ఛ దృఢపడిన వెంటనే స్వగృహమునుండి వెళ్ళిపోబడును గాక (వెళ్ళిపొమ్ము)

(పై యెనిమిది ఉపదేశములు ఎనిమిది సోపానములవంటివి)

శ్లో "సంగస్సత్సువిధీయతాం, భగవతోభక్తిర్దృఢాధీయతాం,
శాంత్యాదిః పరిచీయతాం, దృఢతరం కర్మాశు సంత్యజ్యతామ్,
సద్విద్వానుపసర్ప్యతాం, ప్రతిదినం తత్పాదుకే సేవ్యతాం,
బ్రహ్మైకాక్షర మర్థ్యతాం, శ్రుతిశిరోవాక్యం సమాకర్ణ్యతామ్."

నివృత్తినిష్ఠులైన సత్పురుషులయందు సంబంధము చేయబడునుగాక ఆసంబంధముచేత భగవద్భక్తి దృఢముగా నిలువబడునుగాక (నిలుపుము)

శమదమాదులు (అంతరింద్రియబహిరింద్రియ నిగ్రహాదులు)

వృద్ధిపరుపబడునుగాక (శమాది గుణములను వృద్ధిపరచుకొనుము).

ఆ గుణసంపదకలుగగానే సర్వకర్మలు పరిత్యజింపబడును గాక. బ్రహ్మ వేత్తయైన మంచి విద్వాంసుడు శాస్త్రీయముగా నుపసర్పణము చేయబడునుగాక (అతనివద్దికి వెళ్ళుము)

ప్రతిదినము నతని పాదుకలు సేవింపబడునుగాక (సేవింపుము)

అనశ్వరము అద్వితీయమునగు బ్రహ్మతత్త్వమునుపదేశింపుమని ఆగురువు ప్రార్థింపబడునుగాక (ప్రార్థింపుము)

ఆ బ్రహ్మవేత్తవలన ఉపనిషత్తులలోని మహావాక్యములు ("తత్వ మసి" మొదలగువానిని) చక్కగా వినబడునుగాక (వినుము)

పై యెనిమిదియుపదేశములు మరి యెనిమిది సోపానముల వంటివి)

"వాక్యార్థశ్చ విచార్యతాం, శ్రుతిశిరః పక్షః సమాశ్రీయతాం ।
దుస్తర్కాత్సు విరమ్యతాం, శ్రుతిమత స్తర్కోఽనుసంధీయతామ్
బ్రహ్మాస్మీతి విభావ్యతా, మహరహర్గర్వః పరిత్యజ్యతాం
దేహేహం మతిరుజ్ఝ్యతాం, బుధజనై ర్వాదః పరిత్యజ్యతామ్:"

ఆ మహావాక్యములయొక్క ('తత్త్వమసి', 'అయమాత్మాబ్రహ్మ' 'ప్రజ్ఞానం బ్రహ్మ', 'సర్వంఖలు ఇదంబ్రహ్మ', 'అహంబ్రహ్మాస్మి' అను వానియొక్క) తాత్పర్యము విచారింపబడునుగాక (విచారింపుము), ఆ విచారణములో నీ బుద్ధికి తోచినట్లుగాక ఉపనిషత్సమ్మతమైన పక్షమే ఆశ్రయింపబడునుగాక (ఉపనిషత్తునే ప్రమాణముగా గ్రహింపుము) కుయుక్తి నుండి విరమింపబడునుగాక (కుయుక్తులు విడువుము) వేదసమ్మతమైన తర్కము అనుసంధానము చేయబడును గాక (అట్టి తర్కము ద్వారానే వాక్యార్థమును నిర్ణయించుకొనుము) అట్టి తర్కము ననుసరించి నేను బ్రహ్మమునై యున్నాను అని భావింపబడును గాక (భావింపుము). ఆ భావనాబలమున నిరంతరము గర్వము విడువబడునుగాక (అహంకారమును విడువుము). పాంచ భౌతికమైన ఈదేహమునందు "నేను" అను బుద్ధి విడువబడునుగాక (దేహమే నేను అని యనుకొనుము). పండితులతో వాదము పూర్తిగా విడువబడునుగాక బ్రహ్మ వేత్తలతో వాదింపకుము).

(ఈ యుపదేశములు మరియొక యెనిమిది సోపానములు)

"క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం. ప్రతిదినం భిక్షౌషధం భుజ్యతాం
స్వాద్వన్నం నతుయాచ్యతాం,విధివశా త్ప్రాప్తేన సంతుష్యతామ్,
శీతోష్ణాదివిషహ్యతాం నతువృథా వాక్యం సముచ్చార్యతాం,
ఔదాసీన్య మభీప్స్యతాం, జనకృపా నైష్ఠుర్యముత్సృజ్యతామ్."

ఆకలిని వ్యాధిగా తలచి చికిత్సచేయబడునుగాక.

ప్రతిదినము ఆవ్యాధి శమించుటకై భిక్షాన్నమను మందు భుజింపబడును గాక (ఆకలిని రోగముగాను భిక్షాన్నమును మందుగాను భావింపుము). మధురములై రుచ్యములైన అన్నాదులు కోరబడకుండునుగాక (కోరకుము). దైవవశమున లభించిన దానితో సంతోషపడుము. శీతోష్ణాదులు (చలి,వేడి, జయము, పరాజయము,

లాభము, నష్టము, సుఖము, దుఃఖము, మొదలగు ద్వంద్వములు) ఓర్పుతో సహించవ బడునుగాక (వానిని ఓర్చుకొనుము). వ్యర్థముగా లోకసంబంధములు గల వాక్యములు ఉచ్చరింపబడకుండునుగాక (పలుకకుము). ప్రతివిషయము నందును తటస్థ భావము సహింపబడునుగాక (ఔదాసీన్యమును పూనుము). జనుల దయాకాఠిన్యములు (నిన్నొకరు దయతో చూడవలెనని కాని, దూషింపకుండవలెనని కాని భావింపకుము) పూర్తిగా విడువబడునుగాక.

(ఈ యెనిమిది యుపదేశములు తరువాతి సోపానముల వంటివి)

శ్లో॥ "ఏకాంతే సుఖమాస్యతాం, పరతరేచేతస్సధీయతాం
పూర్ణాత్మాసు సమీక్ష్యతాం, జగదితం తద్బాధితం దృశ్యతామ్ ।
ప్రాక్కర్మ ప్రవిలోప్యతాం చితిబలా న్నాప్యుత్తరై శ్లిష్యతాం,
ప్రారబ్ధం త్విహభుజ్యతామథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్:"

ఏకాంతదేశమున (విజన ప్రదేశమునందు) సుఖముగా కూర్చుండుము. సర్వోత్కృష్టమగు బ్రహ్మతత్త్వమునందు చిత్తము చక్కగా నిలుపబడునుగాక (నిలుపుము). సర్వాత్మకముగా పరిపూర్ణమైయున్న ఆత్మ సాక్షాత్కరింపజేసుకొనబడును గాక (ఆత్మను దర్శింపుము). బ్రహ్మము సర్వాధిష్ఠానమైయున్నందున ఈ కనబడుచున్న ప్రపంచమంతయు లేనిదిగా గుర్తింపబడునుగాక (లేదని యెఱుగుము). ప్రపంచ రహితమైన బ్రహ్మాత్మ విజ్ఞానమును పొంది దాని సామర్థ్యము వలన పూర్వము తానార్జించిన కర్మఫలములన్నియు నశింపజేయబడును గాక (జీవన్ముక్తుడవై సుఖదుఃఖ రూపములైన కర్మఫలములను విడువుము.) జ్ఞానఫలము చేత ఆగామి (రాబోవు) కర్మఫలములు నంటుకొనబడకుందువు గాక, ప్రారబ్ధము (ఇప్పుడున్న దేహమునకు కారణమైన పూర్వకర్మఫలము) ఈ దేహముతోనే అనుభవింపబడునుగాక అనగా కష్టసుఖములను అనాసక్తుడవై యనుభవింపుము. ఆ తరువాత ప్రారబ్ధవేగము తొలగిపోయిన వెంటనే కేవలపరబ్రహ్మాత్మ భావముతో నిలుతువుగాక (ప్రారబ్ధము వలన వచ్చిన యీ దేహము నశింపగానే కేవల పరబ్రహ్మభావమును పొంది ముక్తుడవుకమ్ము)

ఈ శ్లోకమునందు ఏడు ఉపదేశములు సోపానములుకాగా, ఎనిమిదవది సౌధరూపమైన ఫలప్రాప్తి. ఈవిధముగా ముముక్షువైన మానవునికి మోక్షప్రాప్త్యుపాయాచరణమును బోధించి ఈక్రింది శ్లోకములో "ఉపదేశపంచక" పఠనము వలన కలుగు ఫలమును చెప్పుచున్నాడు.

శ్లో "యశ్శ్లోక పంచకమిదం పఠతే మనుష్యః
సంచింతయ త్యనుదినం స్థిరతా ముపేత్య ।
తస్యాశు సంసృతి దవానల తీవ్రఘోర
తాపః ప్రశాంతి ముపయాతి చితిప్రసాదాత్;"

ఏ మానవుడు నిబ్బరముతో నీయైదు శ్లోకములను ప్రతిదినము పఠించుచు అర్థమును స్మరించుచుండునో అతనికి జ్ఞానస్వరూపుడగు పరమాత్మయొక్క అనుగ్రహము వలన జననమరణ రూపమైన సంసార దావానల ఘోరతాపము శాంతించి శాశ్వతానందము కలుగును.

ఇట్లు జగద్గురు పీఠాధిష్ఠితుడైన శ్రీశంకరాచార్యులు మానవులశ్రేయస్సుకై బహువిధ రచనలు చేసి లోకకళ్యాణముఁ జేకూర్చినాడని మనము గ్రహింపవలయును.

ఓం తత్సత్

# శంకర భగవత్పాదులు జీవితము-సందేశము

డాక్టర్ కొత్తపల్లి ఘనశ్యామలప్రసాదరావు

సంసారాధ్వని తాపభాను కిరణ ప్రోద్భూత దాహవ్యథా
ఖిన్నానాం జలకాంక్షయా మరుభువి భ్రాన్త్యా పరిభ్రామ్యతాం
అత్యాసన్న సుధాంబుధిం సుఖకరం బ్రహ్మాద్వయం దర్శయ
స్త్యేషా శంకరభారతీ విజయతే నిర్వాణసంధాయినీ

(వివేక చూడామణి)

భారత జాతీయ జీవనము పవిత్ర గంగాప్రవాహం వంటిది. ఈ స్రవంతిలో ప్రతి బిందువూ పవిత్రమే, అయిననూ కొన్ని కొన్ని క్షేత్రములందు అది మరింత పవిత్రమై సంస్కారప్రదమైయుండుట సహజము. మన జాతీయ జీవనమును పునీత మొనర్చిన పుణ్యపురుషులు ఎందరో ఉన్ననూ, తీర్థములలో ప్రయాగవలె, శ్రీ శంకర భగవత్పాదుల జీవనము మరింత పుణ్యప్రదము. త్రివేణీసంగమము జరుగుటవలన ప్రయాగ తీర్థరాజమనిపించుకొనినట్లే శ్రీ మచ్ఛంకరుల జీవితమున, భక్తి, జ్ఞాన వైరాగ్యములనెడి సద్గుణత్రయము సంగమించినది. అంతేగాదు వ్యష్టి, సమష్టి, పర మేష్ఠి, వేరు వేరు కావని, ఉన్నది ఒక్కటేనని, ఆయన - 'అద్వైతము'ను ప్రతిపా దించినాడు. అట్లే లౌకికజీవితమున, వ్యక్తి, సమాజము, జగత్తులను మూడింటికి సమన్వయమెట్లో ఆయన జీవితమున నిరూపించినాడు. అందువలననే ఆయన జగ ద్గురువు కాగలిగినాడు. ఆయనయే భారత జాతీయతను ఒక్కత్రాటిపైకి మరల తెచ్చిన వాడు. భిన్నత్వమున ఏకత్వమును చూడగలతత్త్వమును ఈ జాతీయజీవనమున మరల ప్రతిష్ఠించినవాడు, అన్నివిధములా, ఆయనకాయనయే సాటి యనవచ్చును. అంతటి మేధావిని మానవచరిత్ర ఎరుగదనిన అతిశయోక్తి కానేరదు. బ్రతికిన ముప్పది రెండేండ్లలోనే, వేల ఏండ్లకు చాలినంత విజ్ఞానపు భిక్షను విశ్వమున కందించిన

వాడాయన. నాగరికమై విజ్ఞానశాస్త్ర వికాసమున పరుగిడుచున్న ఆధునిక ప్రపంచము నకుగూడ, ఆయన ప్రతిపాదించిన అద్వైతభావన నాశ్రయించనిదే - శాస్త్రీయ సమ న్వయము సాధ్యముగుటలేదని విజ్ఞుల అభిప్రాయము. ఆయన జీవన, సందేశముల దిశాదర్శనమే ఈ వ్యాస పరమార్థము.

శంకర భగవత్పాదుల జీవనకార్యము పరమాద్భుతము. నవీనయుగమున హేతువాద దృష్టిని పెంపొందించిన పాశ్చాత్య నాగరికతాప్రభావమున పడినవారికి శంకరజీవనము, ఒక అభూతకల్పన యనిపించును. పాశ్చాత్య దేశములలో బుట్టి, పరిణతిచెందిన విజ్ఞానఖని అయిన సోదరి నివేదితమాటలలో చెప్పవలెననిన "ఆవి శంకరులవంటి అద్భుతమూర్తిని పాశ్చాత్యలోకం ఊహించనైనా ఊహించజాలదు." సనాతన భారతీయ జీవనసంస్కారము ఆదిశంకరుని జీవనవిశేషములను పరమేశ్వ రుని అవతార విశేషములనుగా సమన్వయ పరుచుకొనిన ఆయనను 'జగద్గురువు'గా స్తుతించినది. ఎవ్వని జీవితమైననూ దేశకాలపరిస్థితుల సమన్వయముతోనే కొనసాగును. కానీ మహాపురుషుల జీవితములు, అవసరమగుచోట, దేశకాలములకు తామే దిశా దర్శనము జేయునట్టి సంఘటనములతోబాటు, సార్వకాలికమైన సందేశమును మనము గ్రహింపదగు ఘట్టములనుగూడ కలిగియుండును. శంకరజీవితమున గూడ నిట్టి వనేకము గలవు.

తాను జన్మించిన కాలమున, తన దేశమునకు, తన జీవితముద్వారా క్రొత్త త్రోవలను దీర్చిదిద్దిన వారిలో శంకరుని స్థానము మహోన్నతము. కాబట్టి ఆయన జీవన విశేషములను, జాతికాయన చేసిన సేవలరూపమున - నాటి ప్రయోజనమునూ, నేటికినీ వానినుండి మనము గ్రహించదగు విశేషములను సూచించుచూ వ్యాఖ్యానించు కొనుట ఒక అవసరము. అట్లే విశ్వమానవ జీవనవికాస క్రమమున ఆదిశంకరులు పాత్ర ఎట్టిదను విషయమును పరిశీలించుటకూడ అవసరము. అట్టి విశేషములు లేనివాడు, తన దేశమున కెంతటి సేవచేసిననూ, తాత్కాలికమైన ప్రాధాన్యమునే పొందును. జగత్తు నకు సార్వకాలికమైన సందేశమునుగూడ అందించిన వాడగుటచేత నేఆదిశంకరులకు 'జగద్గురువు' అను ప్రశస్తి సార్థకమయినది.

భారతీయ సమాజమునకు ఆయన ఆనాడు చేసినసేవ, ఈనాటికినీ దానిని మన మెట్లన్వయించుకొనవచ్చును - అను అంశముతోబాటు - విశ్వమానవ విజ్ఞానవికాస మునకు ఆదిశంకరుల కానుక ఎట్టిదోగూడ, అంచనావేయనిదే, మన పరిశీలన సత్యము

కాదు. కావున ముందుగా భారత జాతీయ జీవనమునకు శంకరులొనర్చిన సేవలను, నేటికి అవసరమనిపించు వ్యాఖ్యానములతో వివరించి, తదనంతరము ఆధునిక విశ్వమునకు ఆయన జీవన సందేశముయొక్క ఔచిత్యము గురించి ఇందు ప్రస్తావింపబడును. ఈ వ్యాసము శాంకరదర్శనమును గురించిన పాండిత్య ప్రకర్ష ప్రదర్శించుట కాదు. సామాన్య భారతీయునకు శంకర జీవన సందేశగ్రహణమున పెద్ద బాలశిక్ష వంటిది మాత్రమే.

శంకరుల కాలము :

మన చరిత్రలోని అనేకమంది మహాపురుషుల కథలలోవలెనే, ఆది శంకరుల జననసమయమును గురించి గూడా అభిప్రాయభేదములున్నవి. ఆయన క్రీస్తుపూర్వము 509లో జన్మించినట్లు భావించువారే ఎక్కువ. భగవత్పాదులు స్థాపించిన వివిధ పీఠములతో పదిలపరుపబడిన ఆచార్యపరంపరలు ఈకాలమునే సూచించుచున్నవి. కాని శ్రీశృంగేరీశారదాపీఠ పరంపర మాత్రము ఆదిశంకరుల కాలమును క్రీస్తుశకము 788 ప్రాంతమును చెప్పుచున్నది. ఆధునిక చరిత్రకారులు కూడ ఈకాలమునే అంగీకరించుచున్నారు. చెప్పదగిన చరిత్రలేని వారికి, పుట్టిన తిథివారముల విస్మరణమే చరిత్ర కావచ్చును. చరిత్ర సృష్టించిన మహాత్ములజీవనము తిథివారముల పరిధుల నధిగమించి దేశకాలముల నావరించి జీవించును. ఆవిధముగా నేటికినీ సజీవమైయున్న శంకరాచార్య పరంపరలో ఆదిశంకరుల తేదీని గురించిన వివాదమునకు అంతవిలువ లేదు. కానీ ఉద్దేశపూర్వకముగా భారతచరిత్రను తేదీలను వక్రీకరించి వ్యాఖ్యానించిన పాశ్చాత్యమేధావుల వాదనలు, జాతీయజీవన వికాసావగాహనమున కలవరము కల్పించుచున్నవి గాన, సరియైన తేదీల నిర్ణయము గూడ జరుగకతప్పదు. అందుకు వివిధగ్రంథములూ, ఆయన స్థాపించిన పీఠపరంపరా వివరములతో బాటు, కారణజన్ములైన ఆయన జీవనకార్యమును-దేశకాలముల కన్వయించుట గూడ అవసరము. వీటిదృష్ట్యా ఆయన క్రీస్తుపూర్వముననే పుట్టవలసిన అవసరము కనిపించుట సహజము. అట్లే-క్రీ॥శ॥ 8వశతాబ్దమున కూడ దేశపరిస్థితులు శంకభగవత్పాదుల వంటివారి కృషి నాశించుచున్నవని ఎంచినచో-తత్కాలమున ఆచార్యపరంపరలో విరాజిల్లిన మరియొక శంకరాచార్యులవారు-తమ జీవనకార్యమును సఫలమొనర్చుకొని యుండవచ్చును. ఆదిశంకరుల వలెనే 8వ శతాబ్దమున గూడ శాంకరపీఠాధిపతులొకరు సనాతనధర్మ సంస్థాపనకు తీవ్రముగా యత్నించి

యున్నందుననే, అసలు ఇట్టి సంశయములకు ఆస్కారమేర్పడి యుండవచ్చును. ప్రస్తుతమున, ఆదిశంకరుల కాలమును క్రీస్తుకుపూర్వముగనే భావించి, వారి జీవన సందేశములు సంక్షిప్తముగా వివరింప యత్నముచేయబడును. ఇది భారతీయమైన ఆత్మావలోకనమునకు అక్షరాభ్యాసము. ఆత్మవిస్మృతిలోబడి, ఆదర్శహీనమై అన్ని రంగములలోనూ అంధానుకరణమున అలమటించువారికి, హైందవధర్మము అవసర మైనప్పుడెల్ల ఎట్లు స్వయంకృషితో, ఆత్మసాక్షాత్కారము నంది జ్ఞానజ్యోతులను విశ్వమునకు పంచగల్గినదో వివరించు చిరుయత్నమిది.

ఒకనాడు భారతదేశ పరిస్థితులు చాలా అస్తవ్యస్తములుగా నున్నవి. సనాతనధర్మావలంబియైన సమాజజీవనమునకు ప్రమాదమెదురైనది. బౌద్ధమత ప్రభావము స్వైరవిహారము చేయుచున్నది. వేదప్రామాణ్యము తిరస్కరింపబడినది. కర్మకాండలు కూడనివై పోయినవి. ఆత్మోన్నతిని గూర్చు యజ్ఞభావన త్రోవ దప్పి, కర్మకాండలు మూర్ఖాచరణములైన దశలో, మానవత నుద్ధరించబుట్టినట్టి అహింసావాదము వికృతమై అకర్మణ్యతను పెంచినది. నాస్తికత, హేతువాదములు ప్రబలినవి. సన్యాసమను పేరున బాధ్యతల తృణీకరించి, సోమరులై భిక్షుకవృత్తి నవలబించి, ముండితశిరస్కులై ఆరామములచేరి - ప్రపంచము శూన్యమనుచూ, ప్రవచించువారధికులైరి. వైరాగ్యములు వజ్రయానముగా మారి తాంత్రికమై లైంగిక జీవనమునకు దిగజారిపోయెడి స్థితి ఏర్పడినది. సమాజజీవితమున కాలంబ మైన కుటుంబవ్యవస్థ సడలినది. ఆస్తికములైన దర్శనములను పాటించువారు గూడ నిరీశ్వరవాదమును తర్కబద్ధముగా నిరూపించసాగిరి. జ్ఞాన ప్రాధాన్యము, సమాజ మున బుద్ధికి, తర్కమునకు లోబడి, భౌతికమై విచ్చలవిడి తనమును చాపక్రింద నీరు వలె వ్యాపింపజేయ జొచ్చినది. సిద్ధాంతములు, వాదముల చాటున ఆత్మవికాస శూన్య మైన - 'జడత' పెరుగజొచ్చినది. చైతన్యము మూఢాచారముల చాటున మూలుగు చున్నది. దేశమంతనూ ఇట్టి వికృతవాతావరణము వ్యాపించుచున్ననూ, అక్కడ క్కడ, సనాతన ధర్మపరాయణులు, నైష్ఠికులై తమ జీవనములు గడుపుట యున్నది, అది అవసరమునకు తగిన ఆలోచనతో గాదు. అలవాటుగా మాత్రమే సాగుతున్నది. వేదప్రామాణ్యమును నిలబెట్టుటకు కుమారిలభట్టువంటి మీమాంసకులు ఉద్యమించు చునే ఉన్నారు. ఒకప్రక్క వేదవేదాంగములు, ఉపనిషత్తులు షడ్దర్శనములు, అధ్య యనము చేయబడుచునేయున్నవి. కాని మేధావిలసనము, వాదనైశిత్యముల కున్నంత విలువ ఆత్మసంస్కారాసక్తికి లేదు. బౌద్ధుల తర్కమునకు చార్వాకుల వితండము

నకూ సనాతన వైదికమార్గానుయాయులు తలవంచి-ఎట్లెట్లో తమ విద్యలను, కర్మాను ష్ఠానమునూ నిలుపుకొనుచు కాల వైపరీత్యమునకు కరములు మోడ్చి - ఘడియలు లెక్కించుచుండిరి.

అప్పుడు దక్షిణభారతమున కేరళప్రాంతమున, 'కాలడీ'యను అగ్రహారము సనాతన వైదికసంప్రదాయమును నిలబెట్టుకొనుచూ యున్నది. దానిలో అర్యాంబ, శివగురువు లను దంపతులు, నైష్ఠికగార్హస్థ్యజీవనము జరుపుచుండిరి. వారికి చిర కాలము సంతానము కలుగలేదు. ఎన్నియో వ్రతములు, పూజలచేసి, శంకరునిగూర్చి అత్యంతభక్తితో వారు సేవలను చేసిరి. తత్ఫలితముగా వారికి ఒకానొక మాఘపంచమి తిథి నాడు ఒక బాలుడు కలిగినాడు. అతడు శంకరానుగ్రహఫలము గనుక, అతనికి అర్యాంబదంపతులు 'శంకరు'డని పేరు పెట్టినారు. ఆ శంకరుడు లోకశంకరుడు కావలెనని వారి ఆశ. శంకరుడు స్ఫురద్రూపి. చురుకైన అతని మేధాసంపత్తికి అగ్ర హారములో అందరూ ఆశ్చర్యపడెడివారు. శాస్త్రోక్తముగా ఉపనయనమొనర్చి వేదాధ్య యనమునకు శంకరుని అతని తల్లితండ్రులు గురుకులమున కంపిరి. ఎనిమిదియేండ్ల వయస్సు వచ్చునరికి శంకరుడు, వేదవేదాంగములను క్షుణ్ణముగా అధ్యయనమొన ర్చెను. ఆతని గ్రహణ ధారణ పాటవ మపూర్వము. గురుకులవాసమున నుండగా శంకరుని జీవితమున జరిగిన ఒక సంఘటన ఆయన జీవన దిశాదర్శనమునకు దోహదము చేసినది.

### గురుకులవాసం-మధుకరవృత్తి :

విద్యకొరకై గురుకులమున చేరినవిద్యార్థులు, మధుకరవృత్తితో జీవించుచూ వేదాధ్యయన మొనర్చుట నాటి పరిపాటి గదా. ఎంత సంపన్నుడైననూ ఈ మధు కరము నాచరించవలసినదే. జ్ఞాన సముపార్జనమునకునూ, సుఖాను భవమునకునూ చుక్కెదురు. కాన గురుకులావాసక్లేశము ననుభవింపక తప్పదు. అట్టి సమయమున విద్యార్థిని పోషించుకొనుభారము సమాజానిది, సమాజంలోని గృహస్థులు, సాదరంగా ఇచ్చే భిక్షతో జీవించి, చదివి, విజ్ఞానియైన విద్యార్థి-తన విద్యావివేకములను సమాజ హితమునకు తప్పక వినియోగించగలడు. ఆవిధంగానే అతడు సమాజఋణాన్ని తీర్చుకోవాలి. ఆవిధంగానే శంకరుడు నిత్యం మధుకరం చేసేవాడు. ఒకనాడు ఒక ఇంటిముంగిట నిలచి 'భవతీ భిక్షాందేహి' అని ఎలుగెత్తి పిలిచాడు. చాలా సేపటికి ఇంటి తలుపులు తెరచుకొని, ఒక ఇల్లాలు-మూర్తీభవించిన లేమి - వెలికివచ్చింది. ఏనాటికానాడే జీవనసంభారములు సమకూర్చుకొనునట్టి యజమాని ఇంటలేడు. కాన

భిక్షవేయుటకు ఇంటిలో ఏమియూలేదు. కాన ఆమె ఇల్లంతా గాలించి, చివరకు ఒక్క ఉసిరికను తెచ్చుసరికి ఆలస్యమయినది. ఆ ఉసిరికనే ఆగృహిణి, శంకరుని భిక్షాపాత్రలో నుంచినది. ఆనాడు అంతకన్నా వేరు భిక్ష తన యింటలేదని తన అశక్తతను ఆవేదనతో ఆప్యాయతతో ఆతనికి వెల్లడించినది. శంకరుని హృదయము చలించినది. అగ్రహారపు స్థితిగతు లాతని కళ్ళముందు కదలాడినవి. ఇరుగు పొరుగుల సంపన్నులుండగా, ఒక ఇంటిలో ఇంతటి దారిద్ర్య మెట్లున్నది ? ప్రక్క వాని బాగోగులు పట్టించుకొనని సంపన్నుల సంపద సమాజపుష్టికి నిదర్శనముకాదు. లేమిలో గూడ; మధుకరమడుగు విద్యార్థులకు, ఏదియో ఇచ్చి తీరవలెననెడి, 'సమర్పణాభావమే' సమాజమునకు సంపద. మానవతకదిలక్షణము సమాజంపట్ల తన కర్తవ్యం గుర్తించి, సమర్పణాభావంగల వారి వద్దనున్న సంపదే సమాజాన్ని నిలబెడుతుంది. అట్టివారిని చేరిన సంపదే సద్వినియోగం అవుతుంది. ఇది గుర్తించిన శంకరుడు ఆత్మానుసంధానములో ఐశ్వర్యలక్ష్మిని ఆవాహన చేశాడు. కనకధారాస్తవంతో ఆ ఇంట బంగారు ఉసిరికలను వర్షింపాడు. "ఈశావాస్యమిదంసర్వం .... తేనత్యక్తేన భుంజీథాః" యనే ఉపనిషద్వాక్యానికి నిత్యజీవనవ్యాఖ్యానం శంకరునికి గురుకులవాసంలోనే లభించిందన్నమాట,

సమాజ సేవకోసం సన్యాసదీక్ష :

శంకరుడు గురుకులవిద్య ముగించుకొని ఇంటికి వచ్చేనాటికే ఆతనితండ్రి పరమపదించాడు. ఇక మిగిలింది తల్లీబిడ్డలు. శంకరుడు తల్లికి ప్రాణం. తల్లి అతనికి దైవం. ఆ అన్యోన్యత వర్ణనాతీతం. అట్టి అనురాగవాత్సల్యాలు అరుదుగానైనా, వెదికే వారికి అక్కడక్కడ దొరకవచ్చు. ఆ మాతాపుత్రసంబంధం మన కందించే సందేశం అంతమాత్రమే గాదు. మాతాపుత్రసంబంధం ఎట్టిదో, ఎట్లు సార్థకమవుతుందో తెలిపే సంఘటన శంకరుల జీవితంలో మనకు దొరుకుతుంది.

రక్తం పంచి ఇచ్చిన తల్లియొక్క లాలనలో గడిచిన ప్రతిరోజూ, శంకరునికి తాను మధుకరం చేసేప్పుడు, మమతతో లాలించి, పెంచి పోషించిన-గృహిణులందరూ మాతృమూర్తులుగానూ, వారి రూపంలో ఈ సమాజం ఆయనకు అనుక్షణం కనులముందు మెదిలేవి. అంతేగాదు వేదమును అపౌరుషేయము, సర్వతో - ప్రమాణముగా తాను అధ్యయనము చేస్తుంటే దానినే, అప్రమాణముగా, నిరసించెడి వాతావర

ణము సమాజమంతటా నున్న సంగతి ఆయనను వేధించెడిది. తలగొరిగించుకొని, కాషాయం గట్టి, ప్రపంచం శూన్యమంటూ, కోరికలను జయించామని చెపుతూ బౌద్ధ శ్రమణులు తిరుగుతూండటం, చిల్లర ఆరామాల కుహనాజీవితం - వానిపట్ల ప్రజానీక మున గలవ్యామోహం-దాని వలన సమాజంలో కర్తృత్వభావన నశించటం ఆయన మనస్సును బాధించేవి. ఆయితే సనాతనధర్మంలో కూడా ఆశ్రమవ్యవస్థలో సన్యాసం నిర్దేశింపబడిందే. మరి దానికీ దీనికీ తేడా ఏమిటి? నైష్ఠికకర్మ జీవనమును నిర్వహించి నాలుగవ దశలో స్వీకరించే సన్యాసము అది. అది జీవనానుభవపరిణామము. కోర్కెను జయించినవాడని లోకమున గౌరవమందుటకు గుర్తుమాత్రమే. ఏది నిజమైన సన్యాసము? దేని వలన ఆత్మసంస్కారము కలుగును? ఈ ప్రశ్నలకు సమాధానము నిచ్చునుదాహరణముగా,సన్యాసాశ్రమ స్వీకారవాంఛ శంకరునకు కలిగినదనిపించును ప్రపంచము నిస్సారమని నిజమైన ఆలోచనాపరునకు సర్వదాస్ఫురించుచునే యుండును దీనిని సారవంతముగ చేసుకొనుట యెట్లు? త్యాగభావనతో కర్తృత్వ నిర్వహణ - ఇట్టి దీక్షలో పరిణతిచెందనిదే సమాజమున, సన్యాసముపట్ల గల భ్రమలను తొలగించి, సరియైన త్యాగభావమును ప్రతిష్ఠించ సాధ్యముకాదు కదా. వ్యక్తిగతమైన బంధనముల త్రెంచుకుని, సమాజపరమైన ఆత్మీయతల నలవరుచుకొనుట మొదటి మెట్టుగా, ఆత్మ పరమాత్మల తాదాత్మ్యమునకు యత్నించవచ్చును. అందుకుగాను సన్యాస దీక్ష అవసరము. శంకరుడు దానికి సిద్ధమైనాడు. శంకరునిది స్వధర్మ నిర్వహణమునుండి తప్పించుకొను శుష్కవేదాంతము కాదు. ఆతని సన్యాసము 'వ్యామోహమును విడచి, నిజ ధర్మాచరణ నిష్ఠకుపక్రమింపచేయు దీక్ష.

ఏ బంధమునైననూ త్రెంచుకొనగలము గాని, మాతాపుత్రబంధము మాత్రము తెగదు. అయిననూ తల్లియనుమతితో సన్యాసము స్వీకరించవలెనని శంకరుని ఊహ. తల్లితో నావిషయము ప్రస్తావించినపుడెల్ల ఆమె నిరాకరించ సాగినది. శంకరునిలో వైరాగ్యమునూ పెంపొందసాగినది. తల్లి నొప్పించుటకు తగిన తరుణము వెదుకు శంకరున కట్టి అవకాశము లభించినది. ఒకనాడు నదీస్నానమునకు తల్లీకొడుకులు పోయినారు. నీటదిగిన శంకరుడు అకస్మాత్తుగా - మునిగిపోనారంభించినాడు. అదిచూచి కంగారుపడిన కన్నతల్లికి, "తననొక మొసలి పట్టి లాగుకొని పోవుచున్నదనియూ, కనీసమట్టి అవసానదశయందైన సన్యాసస్వీకారమునకు అనుమతి నీయమనియూ కోరినాడు. పాపమా తల్లి ఏమనగలదు! అనుమతినీయక తప్పని స్థితి. అంగీకరించినది. కానీ తన అవసానమున అంత్యక్రియలను శంకరుడే

చేయవలెనని నియమము పెట్టినది. సన్యాసి అంత్యేష్ఠినిచేయరాదనెడి ఆచారము, తన తనయుని సన్యాసమునకు దూరముచేసి గృహస్థుగాచేయుట కుపకరించునని ఆమె ఆశ. సన్యాసము ఒక మానసిక పరిపక్వస్థితి గాని, నియమపాలనమున కేవలము లభించునది కాదుగదా! - తల్లి అనుమతించగనే మొసలి పట్టువిడిచినది. శంకరుడు సన్యాసి అయినాడు. సన్యాసం సమాజం నుండి పారిపోయేటందుకైనచో, ఎవరి అనుమతీ అక్కరలేదు. విరక్తి కలిగినంతనే పోవచ్చును. మనుషులమధ్య ఉంటూనే మమతాబంధాల నధిగమించి, మానవతాధర్మమును నిర్వహించవలెనన్నచో అయిన వారికి నచ్చచెప్పి వారి వ్యామోహముల నుండి విడివడాలనియే గదా శంకర జీవన సందేశము.

ఆధ్యాత్మవిద్యగా ఆచార్యుల సాధన :

తల్లియనుమతి పొంది, సన్యాసియై దేశాటనమున, బ్రహ్మవిద్యాధ్యయనము నకు తగిన గురువును వెదకికొనుచూ శంకరుడు బయలుదేరినాడు. కాలినడకన కొండలు, నదులు, అడవులుదాటి నర్మదానదీతీరమును చేరినాడు. అచటనేయున్న శ్రీగోవింద భగవత్పాదుల ఆశ్రమమును చేరినాడు. తాను చదివిన వేదవేదాంగము లను-మానవజీవితమునకు విశ్వవ్యవస్థకు, దైవతత్త్వమునకూ జోడించి పరిశీలించ నారంభించినాడు. ఆ ఆశ్రమమున శ్రీ గౌడపాదాచార్యులవారి శిష్యుడైన గోవింద భగవత్పాదుల దేశికత్వమున సర్వదర్శన సంగ్రహమును, సమస్త ఉపనిష త్సాహిత్యమును అధ్యయనము చేయనారంభించినాడు. ఇచ్చటనే ఆయన వైదిక సాహిత్యంలోని వివిధ గ్రంథములపై వ్యాఖ్యానములు వ్రాసినాడు, బాదరాయణుని యొక్క బ్రహ్మసూత్రములను, ఉపనిషత్తులను భగవద్గీతను-ప్రస్థానత్రయ మందురు. వానికి విపులమైన వాఖ్యానరూపమైన సమన్వయమును ఆయన విడమరచి చెప్పినాడు. వేదాంతదర్శనమును సర్వదర్శనములకూ పూరకముగా, రూపొదించి, అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించినాడు.

## సర్వదర్శన సందర్శనము

దర్శనమనగా నేమి :-

'దృశ్యతే అనేన ఇతి దర్శనమ్' అనగా దర్శింపచేయునది దర్శనము అది దేనిని చూపించును ? - నేనెవడను ? ఎచటనుండి వచ్చితిని ? ఈ జగత్తుయొక్క

సత్యస్వరూప మేమిటి? దీని సృష్టి కారణ మెట్టిది? అది చేతనమా? అచేతనమా? - ఈ విశ్వమున, నేనేమి చేయవలెను? ఈ మొదలగు ప్రశ్నలకు తాత్త్వికమైన సమాధానములు దర్శనము సమకూర్చును.

కిం కారణం బ్రహ్మకుతః స్మ జాతాః
జీవాను కేన క్వచ సంప్రతిష్ఠాః।
అధిష్ఠితాః కేన సుఖేతరేషు
వర్తామహే బ్రహ్మవిదోవ్యవస్థాం ॥ - శ్వేతాశ్వతరోపనిషత్తు.

"జగత్కారణమైన బ్రహ్మయెట్టిది? మనమెట్లు జన్మించితిమి? ఎట్లు జీవించగలుగుచున్నాము? ఎందున్నాము? ఏమగుదుము? ఎవరు ప్రేరేపింపగా సుఖాదివ్యవస్థ కలవారమగుచున్నాము?" ఈ ప్రశ్నల కుత్తరముగా, సిద్ధతత్త్వమును చెప్పునదీ, విధినిషేధముల శాసించునదీ దర్శనశాస్త్రము. మనదేశమున ఇట్టి దర్శన శాస్త్రములనేకము లున్నవి. ఇవి కేవలము విద్వాంసుల మనోవినోదము కొఱకు రూపొందింపబడినవి కావు. వివేచనాత్మకముగానూ, అనుభవపరిపాకముగనూ, మహర్షులు ధ్యాన యోగానుగతులై దర్శించినవివి. వారి వారి విజ్ఞానపరిణతికి ఫలస్వరూపములవి. ఈ దర్శనవాదులలో ఆస్తికులు, నాస్తికులును కలరు, వేదప్రామాణ్యమంగీకరించువారు ఆస్తికులు. అంగీకరించనివారు నాస్తికులు. చార్వాక, జైన, బౌద్ధులు, వేదప్రామాణ్య మంగీకరింపరు. 'నాస్తికో వేదనిందకః' అని మనువు నిర్వచించెను. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంసా వేదాంతవాదులు ఆస్తికులు. దైవమునుగాని, వేదమునుగాని, పరలోకమున్నదనిగానీ, పుణ్యపాపములనుగానీ చార్వాకు లంగీకరింపరు. వారు కేవలము కామానందులు, అర్థానందులు.

ఈ దర్శనములన్నియూ భారతీయ సమాజజీవనమున, పుస్తకములకు పరిమితములు గాక, ప్రజాజీవితమున ప్రభావము చూపుచుండును. కావున జన జీవనము, దర్శనములు వాదవివాదములలో కుక్కలుచింపిన విస్తరివలె విచ్ఛిన్నమై పోయినదశలు మనచరిత్రలో నగుపడును. అట్టి ఒకానొకదశలో ఆదిశంకరుడుద్భవించెను. ఆలోచన ప్రపంచమునకు సమన్వయ ఫణితి నందించెను.

జన్మతః పశుప్రాయముగానుండు మానవజీవితమునకు అర్థ కామ పరమైన చార్వాకము సర్వథా ఆమోదప్రదముగా నుండును. దీనినే లోకాయతనమనిగూడ

సందురు. స్వపక్షస్థాపనదృష్టి వీరికుండదు. ఇచ్ఛవచ్చినది చేయుట, దానిని ప్రశ్నించు వారిందరి వాదములనూ, వితండముగా, హేతువాదము పేరున ఖండించుట వీరి పద్ధతి ప్రత్యక్షమే వీరికి ప్రమాణము; ఇట్టి పామరభావనను విజ్ఞానోన్ముఖముగా మరలించి నప్పుడు మాత్రమే ఇతర దర్శనములకు అవకాశము కల్గును. వేదప్రామాణ్యము నంగీకరించు ఆస్తికదర్శనములన్నియూ జ్ఞానప్రాధాన్యం కలిగినవి. వానిలో వైశేషిక న్యాయ, మీమాంసా, సాంఖ్యములు దేవుని అవసరములేదనును. జ్ఞానమే ప్రధాన మనును. జైన, బౌద్ధములుగూడ, దైవప్రాధాన్యమును నిరాకరించినవే. ఆ విధముగా సృష్టికి మూలాధారమైన దైవశక్తి పట్ల నిర్లిప్తత, వ్యక్తియొక్క జ్ఞానముపైన మాత్రమే ఆదరమును, తమ, తర్కబద్ధమైన పదములద్వారా ప్రచారము చేయబడుట సమాజ మున జరిగినది. వ్యక్తిగతమైన జ్ఞానప్రాధాన్యము వలన, వాదవివాదములు, చెలరేగి - సమైక్యజీవనము విచ్ఛిన్నమైన స్థితి ఏర్పడినది. ఎవరి వాదము వారిరిదే-అందరినీకలుపు సూత్రము లోపించినది. ఆస్తికులలోని ఈ అనైక్యతకు నాస్తికవాదములోని, భౌతికత సౌలభ్యము, మరింత దోహదము చేసినవి. జైన బౌద్ధములు, నైతిక విలువలను ప్రతి పాదించుటచే, వానిలో జాలీ, ప్రేమ, అహింస వంటి మానవీయ సద్గుణములపై ప్రాధాన్యముంచుటచే తొలిదశలలో సర్వజనామోదమును పొందినవి. వారియొక్క ప్రపంచ శూన్యవాదము, శాశ్వతమైనదేదియూ లేదనువాదము, క్రమముగా, విచ్చల విడితనమును బోధించు చార్వాకమునకు సహాయపడసాగినది. ఆస్తికులలో అనైక్యత, నాస్తికవాదములలో సమైక్యతలు పెరిగి సమాజ మల్లకల్లోలమైపోయిన దశలో ఆది శంకరుడవతరించి - ప్రతి దర్శనమును తాను అధ్యయనముచేసి, వానిలో నుండి ఏకసూత్రతను, పరమసత్యమును కనుగొని ప్రవచించినాడు. ఇందుకుగాను ఆయన మొదటగ ఆస్తికదర్శనములలో సమన్వయమును సాధించి, పరమసత్యమును నిరూ పించి, సనాతనధర్మమును సువ్యవస్థిత మొనర్చి, అటుపిమ్మట నాస్తికదర్శనములను, వాదములను పరిశీలించి-ఏ తర్కనైశిత్యముచేత వారు ఆస్తికదర్శనములను నిరాక రించిరో, అట్టి తర్కముచేతనే, జైన బౌద్ధములను జయించినాడు. దేముడే లేడను బౌద్ధమున బుద్ధుడు దేముడైనప్పుడు, ఆ బుద్ధుడే సనాతనధర్మమున విష్ణువు అవతార ముగా పరిణమించుటకు పునాదులను వేసినవాడు శంకరుడే. ఆస్తికదర్శనముల జ్ఞాన ప్రాధాన్యము నంగీకరిస్తూ, జ్ఞానాధికరణం ఆత్మయనే సిద్ధాంతమును - జ్ఞానరూపమే ఆత్మగా నిరూపించి - జీవాత్మ - పరమాత్మల ద్వైతమును ప్రతిపాదించువాని నంగీ కరించుచునే - అజ్ఞానావరణభంగమున జీవాత్మపరమాత్మల నొక్కటిచేసి అద్వైత మును ప్రతిపాదించినాడు.

చార్వాక దర్శనము తప్ప మిగిలిన దర్శనములలో ఆత్మ అస్తిత్వమంగీకరింపబడినది. బౌద్ధం ఆత్మ అస్తిత్వం ఒప్పుకుంటుంది. కానీ నిత్యత్వం అంగీకరించదు. ప్రపంచం శూన్యమంటుంది. శంకరుడు ప్రపంచం శూన్యమన్నమాట నిజమే కానీ ఉన్నట్లుగా కనిపించటం గూడా నిజమే నన్నాడు. శూన్యం అంటే లేనిది - మిధ్య అంటే ఉన్నట్లుగా భాసించేది. మాయావాదంతో బౌద్ధాన్ని, జయించాడాయన. జైనంలో 'పరిణామవాదం' అంటే-ఆత్మ చిన్నదిగా పెద్దదిగా పరిణమిస్తుంది. చీమలో చిన్న ఆత్మ, ఏనుగులో పెద్ద ఆత్మ ఉంటుందనే సిద్ధాంతం - మరణానంతరం ఆత్మకు పుణ్యపాపాల, వాసనలు ఉంటాయి. అన్న వాదాలను తర్కించి, నిత్యమై అంతటా ఉన్నది ఆత్మయేననీ, మరణానంతరం పుణ్యపావ వాసనలు గలిగి యుండవలెనన్న ఆత్మ నిత్యమైతేనే కాని కుదరదనీ, చెప్పుతూ, ఆత్మనిత్యత్వాన్ని వాటికి ప్రతిపాదించటం జరిగింది. అలాగే ప్రకృతే సర్వస్వమనే సాంఖ్యదర్శన సిద్ధాంతాన్ని పరిశీలించి, ప్రకృతిలోని చైతన్యశక్తి ఈశ్వరుని వలననే కలుగుతోందని ప్రతిపాదించాడు. వైశేషికవాదంలోని పరమాణునిత్యత్వాన్ని, ప్రశ్నించి, ఆత్మనిత్యత్వాన్ని తత్వజ్ఞానాన్ని ఒప్పుకుంటూనే-ఈశ్వరుడు మాయా వచ్చినవని తన వాదనాబలంతో ఋజువు చేశాడు. జీవుడూ నిత్యుడే, పరమాత్మా నిత్యుడే అనే మీమాంసా - ద్వైత వాదాన్ని విశ్లేషించి - ఈ రెండూ ఒక్కటే అని ఋజువుచేశాడు.

అద్వైతసారం :

శంకరుని అద్వైత సిద్ధాంతంలోని సారమేమిటి? విశ్వంలో ఆత్మ ఒక్కటే నిత్యం, సత్యం, జగత్తంతా మిధ్య. ఆత్మనుంచే సర్వమూ పుడుతోంది. బ్రహ్మస్వరూప నిరూపణమునకు రెండు లక్షణములు కలవు. ఒకటి తాత్త్విక స్వరూపలక్షణం, రెండవది తటస్థలక్షణం. ఇది కొంత కాలమే యుండును. ఆగంతుక గుణములనది నిరూపించును. సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మయనుట, విజ్ఞానం, ఆనందం బ్రహ్మయనుట స్వరూపలక్షణం. ఉత్పత్తి స్థితి లయ హేతువు బ్రహ్మయనుట తటస్థలక్షణము అవిద్యయగు 'మాయ' వలన ఈ జగత్తు భాసించును. పారమార్థిక దృష్టిలో బ్రహ్మ తప్ప వేరేదియును లేదు. ప్రాతిభాసిక దృష్టిలో జగమున్నట్లు భాసించుచుండును. ఆవరణవిక్షేపములు మాయాశక్తులు. మాయా వచ్చిన్నదైన బ్రహ్మ ఈశ్వరుడు, ఉపాస్యుడు. ఆనందాత్మక బ్రహ్మప్రాప్తియే మోక్షము.

వేదాంత దర్శనప్రవర్తకుడైన బాదరాయణుని సందర్శనమున, గౌడపాదా చార్యుని ఆమోదమున శంకరుడు, తాత్త్విక ప్రపంచమున అద్వైతమను రాచబాటను వేసినాడు. సర్వదర్శనములకు,సర్వమతములకు సుప్రతిష్ఠను ఆయనయే కలిగించినాడు.

అందరిలోను ఉన్న ఆత్మ ఒక్కటే :

"వేదాంతు లొస్తున్నారు, నీ చెంబూ, కంచం జాగ్రత్త" అనే నానుడి మన తెలుగునాట ప్రచారమున నున్నది. అనగా నీతులు, సూత్రాలు చెప్పటం, ఆచారంలో స్వార్థం నిండి వుండటం ఉన్న వారిని గురించిన హెచ్చరిక వాక్యమిది. శుష్క వేదాంత ప్రసంగములు నిరర్థకములు. ఆదిశంకరుల జీవిత మందుకు పూర్తి విరుద్ధము. వేదాంత దర్శనమును ఆయన వ్యాఖ్యానించినది, మన కొఱకే. తన జీవితమునే ఆయన మనముందు ఆదర్శముగా నిలిపినాడు. గోవింద భగవత్పాదుల, ఆశ్రమమున యున్న కాలమున జరిగిన ఒక సంఘటనము మనకు కర్తవ్యమార్గోపదేశకము కాగలదు.

ఒకసారి ప్రలయకాల మేఘములవలే, మబ్బులు క్రమ్మి కుండబోతగా, దినముల తరబడి, ఎడతెగని వాన కురిసి, నర్మాదానది పొంగులెత్తినది. తీరమున నున్న ఆశ్రమము నీటమునిగిపోయినది. తీర స్థలములైన గ్రామములు జనపదములు జలదిగ్బంధమున చిక్కినవి. కట్టలు తెంచుకుని ప్రవహించు నర్మదాప్రవాహమును ఆదిశంకరులు తన దివ్యశక్తులతో అదుపు చేసినట్లు సంప్రదాయముగా చెప్పబడు చున్నది. ఆ వరదలలో మృత్యుముఖమున కొట్టుమిట్టాడు ఆర్త జనులకు ఆయన నిరంతర సేవలందించి - ఆత్మసాక్షాత్కారమునే అంతటా పొందగలిగినాడు. అనుష్ఠాన వేదాంతమే ఆయన జీవితమున మన కందించే సందేశము గదా.

ఏకాత్మత నెల్లెడా దర్శించిన ఆదిశంకరుడు వివిధ దర్శనముల ప్రతిపాదించుచున్న విద్వాంసులతో చర్చించి, విజయము సాధించి అద్వైతసామ్రాజ్యమును స్థాపించుటకు ఆయత్తమగుచుండగా, ఆయన జీవితమున నొక ప్రముఖ సంఘటనము జరిగినది. తన మాతృమూర్తి మరణావస్థలో నున్నదని వార్త రాగానే ఆయన హుటాహుటిని కాలడీ అగ్రహారమునకు కదిలినాడు. ఆయన ఇంటికి చేరుసరికి తల్లి ఆర్యాంబ చావు బ్రతుకులలో నున్నది. కన్నబిడ్డను చూచి తల్లి మనసు కరిగిపోయినది. తనయుడుగా శంకరుడు ఎంతగానో ఆమెకు పరిచర్యలు చేసినాడు. కదలలేని తల్లి కొరకు పూర్ణానదీప్రవాహమునే తన ఇంటి వద్దకు మళ్ళించిన మహామహుడాయన. పుత్రుని

పరిచర్యలో మరణవేదననే మరచినదా మాతృమూర్తి. సన్యాసియై తాను సాధించిన దేమిటో, తన అద్వైతసందర్శన మెట్టిదో తల్లి మనసున కుల్లాసముగా వివరించుచూ తత్త్వబోధ వంటి గ్రంథము ఆయన అప్పుడే కూర్చినాడు. అద్వైతపు లోతులనందు కొనుటకు, మహామేధావులకే సాధ్యముకాదు. మరి సామాన్యయగు ఆమె కెట్లు అవగత మగును. సామాన్యుని జీవితమును సవ్యముగా నడిపింపగల ఆత్మజ్ఞానమో, విధియో, నియమమో, భక్తియో, భావమో అందుబాటులోనికి రానిదే ఏ సమాజముననూ ప్రగతి యుండదు. ఈ విషయమును శంకరుడు గుర్తించాడు.

సన్యాసదీక్షా ? సమాజకర్తవ్యమా ?

శంకరుడు పరిచర్యచేస్తూ ఉండగానే, ఒకరోజున ఆమె పరమపదించింది. ఆ సంఘటన ఆయన వ్యక్తిత్వమునందలి విశిష్టతను వెల్లడిచేసే గీటురాయిగా రూపొందింది. తల్లికి అంత్యక్రియలు చేయవలసిన అవసర మొచ్చినది. శంకరుడు సన్యాసదీక్షను స్వీకరించినవాడు. సన్యాసి, అంత్యక్రియల వంటి, సాంసారిక బంధన ములకు లోనై ప్రవర్తించరాదు. కానీ తల్లికి తానొనర్చిన తొల్లిటి వాగ్దానము ప్రకారము కర్మకాండను శంకరుడారంభించాడు. సన్యాసాశ్రమ నియమముల నుల్లంఘించినందుకు, అగ్రహారములోని పెద్దలు అభ్యంతరము చెప్పారు. శంకరుడు వినలేదు. అగ్రహారము ఆయనను వెలివేసింది. శవవాహకులు కూడ దొరకలేదు. మొండిగా శంకరుడు స్వయముగా ఒక్కడే అంత్యక్రియలను, అగ్నిసంస్కారమును పూర్తిచేసినాడు. శంకరుని ఈ చర్య అగ్రహారమున చర్చనీయాంశమైనది. బ్రహ్మచర్య, గార్హస్థ్య-వానప్రస్థ, సన్యాసముల వరుస నతిక్రమించి,-ఆశ్రమ ధర్మ వ్యవస్థను భంగముచేసి-శంకరుడు సన్యాసము స్వీకరించాడు. అలాగే మరల ధర్మ శాస్త్రములను ఉల్లఘించి, తల్లికి అంత్యేష్టిచేసినాడు. దీనిని మనమెట్లు అర్థము చేసు కొనవలెను? సన్యాసము ఒక మానసిక పరిపక్వస్థితి. కామ్యకర్మలపట్ల విరక్తికలిగి నప్పుడే సన్యాసము సార్థక్యము. ఆశ్రమ స్వీకారమాత్రమున - ఇట్టి వైరాగ్యము కలుగదు. దానిని కలిగించుకొనుటకు గాను సర్వసామాన్యమైన కొన్ని విధి నిషేధ ములు, శాస్త్రములలో ప్రతిపాదింపబడును. వైరాగ్యసిద్ధి, లక్ష్యశుద్ధి యున్నప్పుడు, సర్వసాధారణ నియమములను ఒకప్పుడు ఉల్లఘించుట జరగవచ్చును. అట్టిచో ఆత్మప్రబోధమే యుక్తాయుక్త వివేకమునకు గీటురాయి. స్వధర్మవ్యవస్థను పాటించు టలో శ్రీరామచంద్రుడు, ధర్మసూక్ష్మముల నెరింగి ధర్మరక్షణకు అవసరమై

నప్పుడు ఉల్లంఘించుటలో శ్రీకృష్ణుడు మనజాతి కాదర్శములుగా ఇతిహాసములతో వర్ణింపబడినారు. శంకరుడు నియమోల్లంఘనము చేసినది రాగ, వ్యామోహములతో కాదు. ఇది మనము గుర్తించవలసిన విషయము. నియమములు ఆత్మవికాసమునకు గాని, అంధానుకరణమునకు గాదు.

ఆత్మ విద్యాప్రచారమునకు, ఆర్షధర్మ సంరక్షణమునకు సమాజపరమేశ్వర సేవకు అంకితమైన శంకరునకు తల్లి మరణముతో-చిట్టచివరి మమతానుబంధము గూడ తెగిపోయినది. 'ఆత్మార్థేపృథివీం త్యజేత్' అన్నట్లు భౌతికమైన సర్వబంధములనూ వ్యక్తిగతముగా త్రెంచుకొని-పరమాత్మ సాక్షాత్కారమునకు తొలిమెట్టుగా సమాజపరమేశ్వర సాక్షాత్కారము పొందినాడు శంకరుడు.

అద్వైతానికి పరీక్ష :

సమాజజీవితమున ఆర్థిక స్థితిగతులపట్ల శంకరుని అవగాహనమును, కనక ధారాస్తము గుర్తుచేయునట్లే - సాంఘికజీవనమున గలుగు ఉచ్చనీచములు, తరతమ భావముల గురించిన శంకరుని అవగాహనమును మనీషా పంచకస్తోత్రము మనకు తెలియచేయుచున్నది. అద్వైతవేదాంతమును స్వప్రమాణముగా లోకమున ప్రకటించుట ప్రారంభించి కాశీనగరమునకు చేరిన దినములలో ఒక సంఘటనము జరిగినది.

ఆదిశంకరులు ప్రయాణించుచుండగా, ఎదురుగా ఒక ఛండాలుడు వచ్చుట జరిగినది. నాటి సాంఘికాచారము ప్రకారము అతడు అస్పృశ్యుడు, దూరముగా నుంచ దగినవాడు. కావున శంకరాచార్యులవారి శిష్యులు వానిని చూచి, ఆచార్యులవారు వస్తున్నారు దూరంగా తొలగిపొమ్మన్నారు. ఆ ఛండాలుడు వెళ్ళలేదు సరిగదా. ఎవరు వెళ్ళిపోవాలో కనుక్కొనిరమ్మన్నాడు. శిష్యులు ఆశ్చర్యపడి శంకరునకా వార్త చెప్పారు. ఛండాలుడు వేసినా ప్రశ్న-మౌలికమైనది. తొలగిపోవలసినది దేహమా? ఆత్మా? దేనికి అస్పృశ్యత? దేహమైనచో సర్వుల దేహము ఒకనాటికి శిధిలము కావలసినదే. అది అశాశ్వతమైనదే. ఆత్మీయత యనుకొనినచో అది సర్వత్రా ఒకటే. శంకరునిలోనూ ఛండాలునిలోనూ ఒక్కటే అయి ఉన్నది. ఇది అద్వైత భావనకు పరీక్షాసమయము తాను చెప్పెడి సిద్ధాంతముపై తనకు ప్రత్యయమున్నచో-అస్పృశ్యుడన్న మాటవేదాంతమున తగదు. తనకే ప్రత్యయము లేనిచో ప్రపంచమునకు ఆ సిద్ధాంత ప్రయోజనమే లేదు. వెంటనే ఆదిశంకరునకు ఆత్మజ్ఞానము భాసించినది. "ఛండాలోస్తు నతు

ద్విజోస్తు గురు రిత్యేషా మనీషా మమ" అని స్తోత్రం చేశాడు. ఆ ఛండాలుని రూపంలో వేదాంత తత్త్వమును గుర్తింప చేయవచ్చిన వ్యాసభగవానుడు ప్రత్యక్షమై శంకరుని ఆశీర్వదించాడు. చీమనుండి బ్రహ్మవరకు, ఒకటని చెప్పు వేదాంత ధర్మమున, అస్పృశ్యత అనునది వికృతిగా పుట్టినదని చెప్పుటయేగదా. ఈ కథా సందేశము. ఇది మనకు నేటి ఆధునిక సాంఘిక వ్యవస్థలో నూతన జ్ఞానోదయమును కలిగించుగాక.

ఆదర్శగురుపు - ఆదర్శ శిష్యులు :

జ్ఞానమార్గము సాధారణ మానవులకు సులభగ్రాహ్యము కాదు. ఆత్మతత్త్వ నిరూపణకై అద్వైతప్రచారం చేస్తూనే, అడుగడుగునా ఈ దేశమున దేవతామూర్తులపై అతి మనోహరములైన స్తోత్రములను రచించి, సామాన్యునకు భక్తిమార్గమును చూపించినాడు శంకరుడు.

ఏ సిద్ధాంతానికైనా నాలుగు దశలుంటాయన్నారు విజ్ఞులు. అధీతి, బోధ, ఆచరణ, ప్రచారాలు అవి. అధ్యయనం చేయటం, తనలో ఆ విజ్ఞానం జీర్ణం చేసుకోవటం, పిదప తదనుగుణమైన, నడవడిని రూపొందించుకోవటం -ఆపైన దానిని సర్వత్రా ప్రచారంచేయడం అవసరం. ప్రచారంచేతనే ప్రజానీకం ప్రభావితమౌతూ ఉంటుంది. అద్వైత భావప్రచారానికి అవసరమైన వ్యక్తినిర్మాణం జరగాలి. అందుకే తగినశిష్యులను ఆయన సిద్ధం చేసుకున్నాడు. నీతులు చెప్పటమే గాక, జీవితరీతిని మార్చగల పరుసవేది ఆయన. పద్మపాదుని కథ ఇందుకు నిదర్శనము.

గంగాతీర ఆశ్రమంలో,గంభీరమైన వేదాంత ప్రవచనాలలో నిమగ్నుడైన ఒకానొకవేళ శంకరుడు శిష్యుని తనవద్దకు రమ్మని ఎలుగెత్తి పిలిచాడు. ఆ సమయమున నదికావలియొడ్డున యున్న ఆశిష్యుడు, గుర్వాజ్ఞను తలదాల్చి పరుగున వచ్చేశాడు. త్రోవలో నది అడ్డున్నదన్న ఆలోచనే అతనికి కలుగలేదు. అచంచలభక్తితో గురువును చేరవస్తున్న ఆతనికి గంగానది అడుగడుగునా పద్మాల సమర్పించినది. వాటిపై కాలూని నడచుకుంటూ గురువును చేరాడాయన. నిజంగా ఇది ఒక అద్భుతోదంతం. గురువుయొక్క ఆదేశంపై అచంచల విశ్వాసంగల శిష్యులకు ఎంతటి ప్రమాదకరము, కంటకాకీర్ణమునైన మార్గమైనా సరే సుగమమవుతుందని ఈ కథ మనకు ప్రబోధిస్తోంది.

ఇట్టి శిష్యుల నెందరినో సమకూర్చుకుంటూ, వేదప్రామాణ్యము నంగీక రించిన వారందరినీ కూడగట్ట నారంభించినాడాయన. ఆప్రయత్నంలోనే ఆయన కుమారిలభట్టును కలియటానికి వెళ్ళాడు. కుమారిలభట్టు భారతదేశమున బౌద్ధము ప్రవేశపెట్టిన వికృతులను ఖండించుటకూ, తుడిచిపెట్టుటకూ, జీవితము నంకితము చేసిన మహావ్యక్తి. ప్రజానీకమున వెలంవెఱ్ఱిగా ప్రబలుచున్న నాస్తికభావములకు-బౌద్ధదర్శనమునగల ప్రత్యేక ఆకర్షణ ఎట్టిదని గుర్తించుటకు ఆయన, తాను బౌద్ధుడై నట్లనిపించి, బౌద్ధుల తార్కికపద్ధతులలోని గుట్టునెరింగి-అదే ఆయుధమును బౌద్ధముపై ప్రయోగించిన వాడాయన. అయితే, తాను మారుపేరున బౌద్ధదర్శనాల నధ్యయనం చేస్తున్నదశలో, వేద నిందలను విన్నందుకు ప్రాయశ్చిత్తముగా, తన జీవిత చరమఘట్టమున, ఒకచో ఊకగుట్టలో తాను కూర్చుండి నిప్పుపెట్టుకొని కుమిలి ప్రాణత్యాగ మొనర్చినవాడు. స్వీయధర్మముపై ఆయనకెంతటి విశ్వాసము? దాని సంరక్షణకి ఎంతటి వీరావేశము? - కానీ - శంకరుడాయనయొక్క ప్రియ శిష్యుడగు మండనమిశ్రునితో మాత్రమే కలియగలిగినాడు,

జ్ఞానమా? కర్మలా? - ఏది ముఖ్యం!

శంకర జీవితమున మండనమిశ్రునితో సంవాదఘట్టము చాలా ముఖ్యమైనది, మండనమిశ్రుడు మీమాంసకుడు. వేదప్రామాణ్యము, యజ్ఞయాగాదుల ప్రాధాన్యములు మీమాంసాదర్శనమున ముఖ్యములు. వేదములందు జ్ఞాన, కర్మ మార్గములు రెండునూ చెప్పబడినవి. కర్మ మార్గమును మాత్రమే ప్రతిపాదించు మీమాంసకులచేత జ్ఞాన మార్గముయొక్క వైశిష్ట్యమును, వేద మూలకత్వమును గుర్తింపజేసినవాడు శంకరుడు, వాదములో నెగ్గుటకు కాదు వాదించునది. సత్యనిష్ఠతో వాద ప్రతివాదముల సమన్వయము సాధించుటకు. కావుననే కర్మకాండ ప్రాధాన్యము కాదనకుండగనే జ్ఞాన మార్గవైశిష్ట్యమును గుర్తింపజేసి, మండనమిశ్రుని తన మార్గమునకు తెచ్చుకున్నాడు. నిత్యజీవనము, వివిధ సంస్కార ప్రక్రియలలో, హోమములు, పంచయజ్ఞాలు, వానిలో వేదమంత్రముల ప్రాధాన్యముల నిలబెట్టుచూ, కర్మనిష్ఠను, జ్ఞాన సాధనాపూరకముగా మలచినవాడు శంకరుడు. వాదమున ఓడిపోతినని అంగీకరించి, ప్రతివాది యగు శంకరుని వేదాంతమార్గమునకు సన్యాసియై జీవితాంతము అంకితమైపోయిన మండనమిశ్రునిది ఎంతటి నిజాయితీ: - ఆనాటి సత్యనిష్ఠ యట్టిది.

ఉభయభారతి :

ఈ వాద ప్రతిఫలము మండనమిశ్రుని ఇల్లాలు ఉభయభారతిపై అశని పాతమువలె పడినది. భర్త సన్యాసియైపోవుచున్నాడు. ఆమె చలించిపోయినది. భర్తకునూ, శంకరునకునూ జరిగిన వాదమున మధ్యవర్తిగా నుండిన విదుషీమణి ఆమె. భర్త ఓటమిని ప్రకటించుట ఆమె సత్యనిష్ఠకు పరాకాష్ఠ. అయితే ఆమె వెంటనే శంకరునితో వివాదం పెట్టుకుంది. తనతో వాదించి గెలువనిదే తన భర్తను గెలిచినట్లు కాదన్నది. శంకరుడందుకు అంగీకరించినాడు. అమె కామకళారహస్యముల గురించి ప్రశ్నించినది. బాల్యముననే సర్వసంగపరిత్యాగమొనర్చిన శంకరునకు ఆ విషయములెట్లు తెలియును. తెలియదని అంగీకరించినచో ఓటమి తప్పదు. ఇది ఒక చిత్రమైన పరీక్ష .... ఆమెకు సమాధానము చెప్పుటకు ఆరు నెలలు గడువడిగినాడు. అటు పిమ్మట శంకరుడు అమరకుడను రాజుయొక్క కళేబరమున, పరకాయ ప్రవేశ విద్యతో ప్రవేశించి సాంసారికసుఖముల ననుభవించెననియూ, రాజ కళేబరమున నెవరో సిద్ధుడు ప్రవేశించెనని ఎంచిన, రాజామాత్యులు, వెదకి పట్టి శంకరశరీరమును కాల్చివేయబోవు తరుణమున, శంకరుడు, రాజశరీరమును విడచి, మరల తన శరీరమున ప్రవేశించి వచ్చి, వాదమున ఉభయభారతిని గెలిచెననియూ, వెనువెంటనే ఆమె గూడ తన భర్తతోపాటు సన్యాసము స్వీకరించి, వేదాంత ప్రబోధమున కుపక్రమించెననియూ చెప్పబడినది.

అమరుకకథలోని ఆంతర్యం :

ఈ వృత్తాంతము కట్టుకథయను వారున్నారు. శంకరుని వంటివారికి, పరకాయ ప్రవేశ విద్యద్వారా. రాజాంతఃపుర విహారము నంటగట్టుట తగదని వారి వాదన. కాని శంకర జీవితమును ప్రకటించు గ్రంథములన్నిటి యందునూ ఈ కథ యున్నది. వారెవ్వరికినీ ఈ వృత్తాంతమున అనౌచిత్యము కనిపింపనప్పుడు, దానిని అనౌచిత్యముగా భావించి, జరుగలేదనుట నేడు అసమంజసము. ఈ వృత్తాంతమునకు భూమికగా రెండంశములున్నవనవచ్చును. శంకరుడు అన్ని దర్శనములను తరచి చూచినవాడు. కానీ, చార్వాకమును గురించిన అవగాహనము కేవలము తర్కమునకు మాత్రమే పరిమితము చేసి యుండవచ్చును. చార్వాకము కామపురుషార్థమునకై దేహ ప్రాధాన్యమును ప్రతిపాదించినది. అట్లే శంకరవాదమున విశ్వమంతయూ చర్చింప

బడిననూ, సృష్టికి మూలకందమైన కామము దాని కాలంబమైన 'స్త్రీ' తత్వముల గురించిన యవగాహనములు ప్రధానముగా వ్యాఖ్యానింపబడలేదు. సృష్టియే ఆభాసయైనప్పుడు, సృష్టికారణమైన లైంగిక మీమాంసకు స్థానమెక్కడిది? తార్కికముగా ఇది సత్యమే. వాదనతో దీనిని త్రోసిపుచ్చిననూ, భౌతికమైన, దేహపరమైన వాసనల వాస్తవికతకనుగూర్చి ప్రశ్నించినప్పుడు, వేదాంతమున దానిని సమన్వయించుట ఎట్లు? ఈ ప్రశ్నలకు సమాధానముగానే ఉభయభారతి వాదము, పరకాయ ప్రవేశ విద్యా వృత్తాంతములను, శంకరజీవితమున పరిశీలింపదగునని నా కనిపించును. అందుకనే అమరుక చక్రవర్తి దేహమున చేరిన శంకరుడు, మాయాసంకలితమైన సంసారమున చిక్కి, సుఖములలో తేలుట, శిష్యులు గుర్తుచేసిన, పిమ్మట మాత్రమే శంకరుడుగా మరల రూపొందుట జరిగినట్లు చెప్పబడినది. దేహగత జీవాత్మయొక్క చిక్కులు, వానిపై కామ పురుషార్థప్రభావముల గుర్తించనిదే, ముక్తిప్రదమైన ఆత్మజ్ఞానము గురించి తెలియుట ఎట్లు? బోధించుట ఎట్లు? - శంకరుడు దీనినిగూడ అనుభవించియే, అధిగమించియే వేదాంత ప్రస్థానమును తీర్చినాడని ఈ వృత్తాంతము నిరూపించుచున్నది.

విజయ యాత్ర :

ఇట్లు ఆస్తికదర్శనములలోని భిన్నత్వమున ఏకత్వమును సాధించి, వేదాంత మార్గమును విస్తరించిన పిమ్మట, నాస్తికదర్శనములపై శంకరుని దృష్టి మళ్ళినది. బౌద్ధ దర్శనానికి వెన్నెముకలా భాసించిన తర్కమును ఆయన ఆత్మీయతతో జయించాడు. కార్యకౌశల్య మెప్పుడూ తర్కమనే ఇసుక ఎడారిలో మొలకెత్తదు. భావమనే లోయలోనే అది చిగురుస్తుందంటారు. బుద్ధుని విష్ణుదశావతారాలలో ఒకనిగా చూడగలిగే ఆత్మీయత ఆయన సొత్తైనది. జగచ్ఛూన్యవాదాన్ని మిథ్యావాదంగా మ్రింగేసింది. ఆదర్శప్రాయమైన సన్యాసాశ్రమంలో తన జీవితం నడుపుకుంటూ బౌద్ధంలోని సన్యాసవ్యవస్థ కన్నా మిన్న సనాతన ధర్మవ్యవస్థ యన్నట్లు చేశాడు. శంకరుని ఆత్మజ్ఞానం ముందు బౌద్ధం తలవంచక తప్పలేదు. భారతదేశపు పొలిమేరల నుండి దానిని దూరతీరాలకు పంపివేసింది వేదాంతవిద్య.

ఈవిధమైన వాదనలూ, చర్చలూ చేసుకుంటూ ఎన్నిసార్లో యావద్భారత దేశం కాలినడకన పర్యటించాడు శంకరుడు. మేధావులను తనవాదనా ప్రభావంతో

గెలవగలిగాడు. అయితే సామాన్య మానవజీవితంలోని 'విశ్వాస' ప్రాధాన్యత ఎంతటిదో శంకరుడు గుర్తించగలిగాడు. దేశంలో నాడున్న వివిధములైన, తాంత్రిక వైదిక ఉపాసనాపద్ధతులను పరిశీలించాడు. ఫలితంగా, పంచాయతన పూజావిధానాన్ని సమాజజీవితంలో ప్రవేశపెట్టెను. సర్వదర్శనాలనూ వేదాంతంతో సమన్వయించి నట్లే, సర్వతాంత్రిక ఉపాసనలనూ పంచాయతన పూజలో సమన్వయించినాడు శైవం, వైష్ణవం, శాక్తేయం, గాణాపత్యం, సౌరం-వీనన్నింటికీ, నడుమనున్న విరోధభావనలను తొలగించి, ఒక్క వేదికపై అందరినీ అర్చించుపద్ధతి. సామాన్య ప్రజానీకమును ఒక్కటిగా కలిపికట్టుట కుపయోగించినది. అట్లే దేశమునలుమూలలా అద్వైతపీఠములను స్థాపించి, సనాతన ధర్మవ్యవస్థకు రక్షణము తరతరములు సాగునట్లు ఆయన రూపొందించినాడు. వివిధ దేవతామూర్తులపై స్తోత్రములను రచించి, భక్తిభావమునకు చక్కని ఆలంబనము కల్పించినాడు. ఇట్లు విచ్చలవిడిగా, భిన్నములైయున్న ఆర్షవ్యవస్థ లెన్నిటిలోనో, ఏకత్వమును తానుచూచి, లోకమునకు చూపించి, మన సమాజమున సువ్యవస్థ నెలకొల్పిన మహామనీషి శంకరులు.

సర్వజ్ఞపీఠం :

ఆపైన కాశ్మీరంలోని సర్వజ్ఞ శారదాపీఠంపై వేదాంతవిద్యా సరస్వతికి కనకాభిషేకాలు చేయించాడు. అస్సాం ప్రాంతంలోని వామాచారులను వైదిక మార్గమునకు మళ్ళించేయత్నంలో ఎన్నో ప్రమాదాల నెదుర్కొన్నాడు. ఒకసారి ఆయనపై హత్యాప్రయత్నం జరిగింది. అలాగే వేరొకసారి మంత్రప్రయోగంతో ప్రాణంతీసే యత్నం జరిగింది. అన్నింటిలోనూ ఆయనే విజయం పొందాడు. చివరకు శారీరకంగా, ఆరోగ్యంపాడైంది. బ్రతికిన 32 ఏండ్లలో ఏనిమిది ఏండ్లవరకూ గురుకులంలోను. 16వ యేడువరకు నర్మదా ఆశ్రమంలోనూ అధ్యయనంలో నిమగ్నమైయున్న శంకరుడు, తదనంతరం 16 సంవత్సరాలకాలంలో అనేక భాష్యాలు, వ్యాఖ్యానాలు, ప్రకరణగ్రంథాలు వ్రాస్తూనే, వివిధదర్శనాల ప్రతినిధులతో వాద ప్రతివాదాలు చేస్తూనే కాలినడకన అనేక పర్యాయములు యావద్భారతం పర్యటించాడంటే ఎంతటి శ్రమపడ్డాడో అర్థమవుతుంది. ఫలితంగా శరీరం జర్జరమై ఆయనకు భగందరవ్యాధి సంక్రమించి ఎంతోబాధ పెట్టింది. ఆయనకది లెక్కలేదు. సనాతనధర్మం హైందవసమాజమున మరల సువ్యవస్థితమగుటయే ఆయన పరమలక్ష్యం. అది దైవకార్యం.

**అవతార సమాప్తి :**

తాను చేయవలసిన దైవీకార్యం పూర్తి అయినతర్వాత, శంకరులు, బదరి కాశ్రమంలో కొంతకాలం ఉండి, ఆపైన మహాప్రస్థానంగా హిమాలయాల లోనికి నడచిపోయి అదృశ్యమైనట్లు చెప్పబడింది. కైలాసగిరి నుండి దిగివచ్చిన శంకరుడు, ఆదిశంకరాచార్యుడై అవనిని చరించి, అంతిమదశలో మరల హిమగిరిలోని కైలాసానికే తరలిపోయినట్లు చెప్పుకొనుట సమంజసము.

ఇది అంతయు ఆదిశంకరుడు హైందవసమాజమునకూ ఆర్షధర్మమునకూ చేసిన మార్గదర్శనమును వివరించుట. ఇంతటి కృషిచేసిన వారిని హిందూ ధర్మము దేశికోత్తమునిగా స్తుతించుట సహజమే. జగద్గురువు అని ఆయనను మన సమాజము భావించింది. వివిధ దేశములలో ఆయా సమయముల కవసరమైన మార్గ నిర్దేశము చేసినవారిని అట్లు సమర్థించుట యున్నదే. జగద్గురువుగా శంకరుని భావించుటకు కారణము, హైందవమూ సనాతమూనైన ధర్మమనెడి విస్తృతప్రపంచమునకు దిశాదర్శనము చేసినవాడని మాత్రమే గాదు. యావజ్జగత్తుకు అయన మార్గ నిర్దేశము చేసిన మహామనీషి. ఆయన విశ్వమునకు అందించిన విజ్ఞానవిశేష మెట్టిదో నిరూపించినప్పుడే 'జగద్గురువు' అనుపేరులోని సార్ధకత విదితము కాగలదు గదా.

**ఆధునిక ప్రపంచమునకు ఆచార్యుని సందేశము :**

హైందవసమాజము, వైదికసాహిత్యము ఎన్నడునూ సంకుచితమైన పరిధుల కంటిపెట్టుకొని లేవు. విశ్వవ్యాప్తమైన, 'మానవుడే' వానిలక్ష్యము, వానిని గురించియే ఆలోచనము, వాని ఉన్నతికే నిరంతరప్రయత్నము ఈ దేశమున సాగినది. 'కృణ్వంతోవిశ్వమార్యం' అన్న వేదవాక్యం, భారతీయ సమాజలక్ష్యాన్ని సూచిస్తుంది. "ఏతద్దేశప్రసూతస్య సకాశాదగ్ర జన్మనః స్వంస్వం చరిత్రం శిక్షేరన్ పృధివ్యాం సర్వమానవాః" అన్న మనువాక్యం భారతీయుల బాధ్యతనూ గుర్తు చేస్తుంది. అందకనే ఇచట వికసించిన సంస్కృతీ. సభ్యత, వేదంత, కళా, సాహిత్యాల ఆలోచనా పరిధులు విశ్వమంతటనూ చుట్టి వచ్చినవే.

ఈ దృష్ట్యా ఆదిశంకరుల అద్వైతము, ఆలోచనలు, ఆధునిక విశ్వమునకు ఎట్లు అన్వయించునో స్థాలీపులాకముగా సూచింపదగును.

**ఉపనిషద్విద్య :**

భారతము వేదభూమి గదా. వేదమనగా విజ్ఞానము, వైదికవిజ్ఞానము సనాతనము. అనగా అతి పురాతనమూ, నిత్యనూతనము గూడ. సత్యజ్ఞానమెప్పుడు

నిత్యనూతనముగనే యుండునుగదా. ఈ సృష్టిని గురించిన పరమసత్యమేమిటి? మానవజీవితపరమావధి ఏమిటి? యన్నప్రశ్నలకు వేదసారములైన ఉపనిషత్తులలో సమాధానములున్నవి. వాటికి సరియైన వివరణములను ఇచ్చుచూ ఆదిశంకరులు వ్యాఖ్యానరూపమైన భాష్యములను రచించినాడు. అట్టి ఉపనిషద్భాష్యములు విజ్ఞానులైన మానవకోటికి తరుణోపాయములు.

ఈనాడు శాస్త్రీయ విజ్ఞానము, భౌతికవాదము పెచ్చుపెరిగిన దశలో మతము, వేదాంతములకర్థమూ అవసరములేదను వాదమొకటి ప్రబలుచున్నది. కావుననే ధార్మిక విజ్ఞానమునకు ఆధునికులు దూరమగుచుండుట జరుగుచున్నది. ఉపనిషత్తులలో ఇట్టి ఆలోచనముల విశ్లేషణము ఎట్లు చేయబడినదో-దానిని శంకరుడెట్లు వివరించినారో పరిశీలింతము.

పుట్టుకలో పశుతుల్యముగా జన్మించిన మానవుడు వయసుపొంగులో, ఆలోచనలు ఎదుగనిదశలో, కేవలమూ, భౌతికవస్తుజాతమునకే పరిమితమైన బ్రతుకు సీడ్చుచూ, శారీరక, ఇంద్రియవాంఛా పరిపూర్తికై తనకాలమును, సర్వశక్తులనూ వినియోగించును, భౌతిక విజ్ఞానవికాసమే పరమావధియని భావించును. ఇది సహజము. ఈ వలయమున చిక్కిన మానవజీవితమును శంకరుడు ఉపనిషద్భాష్యములలో అన్నమయ కోశము పరిభ్రమించుటనుగా చెప్పినాడు. అది సత్యము కాదనలేదు. అది జీవితవికాసమున తొలిమెట్టుగా చెప్పుట జరిగినది.

ఎంత తినిపించిననూ ఇంద్రియముల ఆకలి తీరదనీ, ఏదో తెలియని ఆరాటము మనసున మిగులుననీ గుర్తించిన మరుక్షణమే జీవి-ప్రాణమయ కోశమున ప్రవేశించును. అనగా తాను అనుభవించు సర్వస్వమూ అనగా అన్నమంతయూ-ప్రాణము నిలుపుకొనుటకేయని గుర్తించును. ప్రాణము నిలిచిననూ, వీరుని మనస్సు ఏదో ఆరాటమునకు గురికాక తప్పదు. ఆ ఆరాటము తీరుటకు యత్నమారంభించిన నాడే మనిషి మనోమయకోశమున కెదుగును. భావనాప్రపంచమున బ్రతుకుటకారంభించును. అప్పుడే దైహికవాంఛలకు, భావతీవ్రతలకు సంఘర్షణము లేర్పడును. అట్టిచో దైహికవాంఛలను అదుపుచేయు సంస్కారములను మనిషి రూపొందించుకొనును. దానినే మనము సంస్కృతీ శబ్దమున సూచింతుము. ఈ భావ సంవేదనల తీర్చుకొనుటకై మానవుడు అనంతమైన కళాప్రపంచమును సృష్టించుకొనును. అయిననూ మనిషి మనస్సుకు ఊరటలేదు. తను సృష్టించుకొనిన కళాప్రపంచ

మునకు తాను జీవించుచున్న వాస్తవ ప్రపంచమునకూ అంతర్లీనముగా భాసించే, ఆనంద కారణమేమిటో తెలుసుకోవాలనే ప్రశ్న ఎదురవుతుంది. దానికి సమాధానము వెదుకుటకారంభించిన జిజ్ఞాసతో, విజ్ఞానమయకోశమున మానవ ప్రవేశము జరుగును. కార్యకారణ విజ్ఞానము పెంపొందినకొలదీ, మానవుడు విజ్ఞాన శాస్త్రమును వికసింప చేసుకొని, పరిణతి చెందును. అయిననూ ఈ దశలో ఎంతటి విజ్ఞానము సాధించిననూ ఇంకనూ తెలుసుకొనదగినది ఎంతయో మిగిలిపోవుచున్నదని, తన జ్ఞానపు పరిమితులను మానవుడు గుర్తించిన రోజున అతడు ఆనందమయకోశమున ప్రవేశించును. ఏది తెలిసుంటే, ఇంక తెలుసుకోవలసినదిలేదో? ఏది జీవితమున పరమ విశ్రాంతి సాధనమో అట్టి బ్రహ్మానందమును పొందుట జీవన పరమావధిగా మానవుడు ఎదుగును - అట్టి ఆనందము, విశ్వమందంతటనూ ఎంతగా వెదికిననూ దొరుకదు. అది తనలోనే ఇమిడి ఉన్నది. అదియే ఆత్మజ్ఞానమున లభించిన ఆత్మానందము. అదియే మానవ జీవన చరమలక్ష్యము. అదియే శాశ్వతము. దానికొరకు యత్నించుట జీవన లక్ష్యము అను విజ్ఞానమును ఈ ఉపనిషత్తులద్వారా వైదికసాహిత్యము ప్రతిపాదించినది. అట్టి విజ్ఞానమును విశ్వమునకు వివరించి చూపిన మహామేధావిగా ఆదిశంకరుడు విశ్వమానవకోటికే దేశికుడు కాదగునుగదా అందుకనే "జగద్గురు" శబ్దము ఆదిశంకరునకు సార్థకమే అని మనము భావించవచ్చును.

అద్వైత దర్శనము :

విజ్ఞానశాస్త్రము విపులముగా విస్తరించిన నేటిప్రపంచమున, ఉపనిషద్బోధలవంటి వేదాంతవాక్యములు ఆలోచనా పరిధులలో మాత్రమే అన్వయించు కొనవచ్చునుగానీ, భౌతికమైన, పదార్థప్రపంచమున ప్రత్యక్షప్రమాణములతో కొనసాగు అన్వేషణకు, వేదాంతమునకు పొంతన కుదరదను వారుందురుగదా.

ఆ దృష్ట్యాగూడ ఆధునికవిజ్ఞాన శాస్త్రమునకు ఆదిశంకరులందించిన జ్ఞానదీపికలను ధృవీకరించ ప్రయత్నింతము. మన దర్శనశాస్త్రములు నేటి శాస్త్రీయ విభాగములతో కొంతపోల్చవచ్చును. దర్శనములలో ప్రతిపాదితార్థములను ఆధునిక, వైజ్ఞానిక పారిభాషికపదములలో వివరించుట ఇట అవసరము.

వైశేషికదర్శనము ఈనాటి భౌతికశాస్త్రమునకు పునాదివంటిది. దీనికర్త కణాదమహర్షి. దీని సారాంశమేమనగా ఈ సృష్టియంతయూ పరమాణుమయము. పర

మాణువులలో ఒకనిర్దిష్టక్రమమున్నది. ప్రతిపరమాణువునందును విశిష్టమైనపద్ధతిలో ఒక స్పందము, (Motion) నిరంతరమూ కొనసాగుచునేయుండును. ఈ పరమాణు లలోని స్పందము కారణముగా ఈ ప్రపంచమంతయూ నిర్మాణమగుచున్నది. ఈ పరమాణుతత్వజ్ఞానమే, విజ్ఞాన సర్వస్వము అదియే జీవికి ముక్తి మోక్షమూ-దీనికి ఈశ్వరునితో ప్రమేయములేదు. పరమాణువేనిత్యము సత్యమూ.

అట్లే మీమాంసాదర్శనమును గూడ భౌతికశాస్త్రపరిధిలో చర్చించవచ్చును. మీమాంసదర్శనమునకు జైమినికర్త. దీని ప్రకారము, శబ్దమునిత్యము-శబ్దగుణకము ఆకాశము అనగా 'అవకాశము' క్రియారూపమున ఇందు ప్రారంభమగుసృష్టికి మూలము 'శబ్దము' వేదము అపౌరుషేయము. యజ్ఞకర్మానుష్టానమున అవశ్యము పుట్టును కర్మచేయనక్కరలేని దశయే మోక్షము. అంటే కర్మరాహిత్యము మోక్షము-ఇది యంతయూ 'Sound' సంబంధిత శాస్త్రవిషయముగా పరిశీలింపదగును.

మూడవది సాంఖ్యదర్శనము. ఇది Bio chemistry విభాగము క్రింద చేర్చదగినది.దీని కర్త కపిలుడు. ఇది సర్వదర్శనములలోనూ మొదటిదని యందురు. దీని ప్రకారము ప్రకృతియే ఈ సృష్టికి మూలకారణము (Nature) సృష్టి. సంరక్షణ, వినాశములన్నియూ ప్రకృతిలోని విచిత్ర శక్తివలననే జరుగుచున్నవి. వీనిని గురించి న సరియైన అవగాహనే వివేకం అదియే మనిషికి జ్ఞానప్రదమై-మోక్షాన్నిస్తుంది. దీని పకారం ఈశ్వరుడు ఈ సృష్టికక్కరలేదు. మొన్నటి Darwin సిద్ధాంతమూ, నేటి Law of Mutatonsలను దీనితో సరిపోల్చుకొనవచ్చును గదా.

నాలుగవది న్యాయదర్శనం. దీని కర్త గౌతముడు. ఇది సర్వదర్శన ములకు వెన్నుపూస. తర్కబద్ధము, ప్రమాణపూర్వకముగా పదార్థజాతమును గురించిన విజ్ఞానమును పొందుటయే ఇందలి సారము. logic, Rational thinking లను దీనితో అంతర్భాగంగా చేసుకుని ఆలోచించదగును.

ఐదవది యోగదర్శనము. దీని కర్త పతంజలి మహర్షి. ఈ సృష్టి అంతయు "మనస్సు"వలననే యున్నదని ఇందు చెప్పబడినది. మనస్సును తగురీతిగా శిక్షణ ఇచ్చుటద్వారా సర్వవిజ్ఞానమును, మోక్షమునుగూడ సంపాదించవచ్చునని ఇది సూచించును. నేటి విజ్ఞానశాస్త్ర విశేషములన్నియూ Mind నుండే వికసించుచున్నవి. ప్రతిశాస్త్రముననూ పైమెట్టు - మనస్సును కేంద్రీకరించుటచేతనే ఊహించబడుట పరిశోధించబడుట జరుగుచున్నది గదా.

అరవది అన్నిటికన్న ముఖ్యమైనది వేదాంతదర్శనము. దీని కర్త బాదరాయణుడు. దీని సారమును లోకమున కందించిన ప్రముఖుడు ఆదిశంకరుడు. దీనిప్రకారము-ఆత్మయొక్కటే విశ్వమునకు కారణము-బాహ్యముగానగపించుచున్న సృష్టియంతయూ, తాత్త్వికముగా లేదు. పదార్థము, చైతన్యము రెండూ వేరుకాదు. ఆధునిక విజ్ఞానశాస్త్రమున Quantum Mechanics అను శాస్త్రీయవిభాగము వికసించినకొలదీ-ఐన్‌స్టీన్ మొదలుకొని-పరిశోధనలన్నియునూ - ఈ వేదాంతదర్శనము ప్రతిపాదించు అద్వైతమైన-నిత్యసత్యమైన ఒకే 'ఆత్మ'దిశగా పయనించుచున్నవని-ప్రపంచ సిద్ధులైన ఫ్రిట్ జోఫ్ కాప్రా వంటి భౌతికశాస్త్రజ్ఞులు సూచించుచున్నారు.

ఈవిధంగా చూచిననూ నేటి విజ్ఞానశాస్త్ర పరిశోధనలకు గూడ అవసరమైన విజ్ఞానభూమికను అద్వైతమున సూచించుటద్వారా ఆదిశంకరుడు జగద్గురుత్వమునకు' అర్హుడేయని చెప్పకతప్పదు. ఆత్మజ్ఞానమే సర్వవిజ్ఞానశాస్త్రమునకూ పరమావధిగా గుర్తింపబడురోజు, అతిత్వరలో రానున్నదని, విజ్ఞానశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. వేదాంతమునకు, విజ్ఞాన శాస్త్రమునకు విరోధము లేదన్నది పండితులందరూ గుర్తించినదే. ఇట్టి వేదాంతవిజ్ఞాన దీపికలను విశ్వమున కందించిన ఆదిశంకరుడు అవతారమూర్తి, ఆరాధ్యుడు అని మనవిచేస్తూ-వేదాంత వాణిని విశ్వవ్యాప్త మొనర్చుట భారతీయుల కర్తవ్యమని-భావిస్తూ ముగిస్తాను.

తావత్ గర్జంతి శాస్త్రాణి జంబూకా విపినేయధా
నగర్జంతి మహాశక్తిర్యావ ద్వేదాన్త కేసరీ

వేదాంత సింహగర్జనము విశ్వమునకు వినిపింతుము గాక.

ఇతి - శమ్

# శంకర భగవత్పాదులు - అద్వైతం

డా॥ ఇలపావులూరి పాండురంగారావు

ఆదిశంకరులను స్మరించగానే అద్వైతం స్ఫురిస్తుంది. అద్వైతమంటే శంకరాద్వైతమని వేరే చెప్పనక్కరలేదు. శంకర నామానికీ అద్వైత తత్త్వానికీ అలాంటి అవినాభావ సంబంధం ఏర్పడి పోయింది. అదికూడా ఒక విధమైన అద్వైతమే. కాని అద్వైతం శంకరులతో ఆరంభించిన వేదాంత దర్శనం కాదు. వేదవాఙ్మయంలో, ముఖ్యంగా వేదాంతమనే పేరిట ప్రసిద్ధి పొందిన ఉపనిషత్ సారస్వతంలో అద్వైత తత్త్వాన్ని వ్యక్తం చేసే సూక్తులు అడుగడుగునా వినిపిస్తాయి. "ఏకోఽహం బహుస్యాం", "ఏక మేవాద్వితీయం బ్రహ్మ," "ఏకం సద్విప్రాబహుధా వదంతి" లాంటి శ్రుతి సూక్తులలో నానా వస్తు సమన్వితమైన నామ రూపాత్మక జగత్తును ఏక సూత్రంలో సంధించి శాసించే పరతత్త్వం ఒకటే అన్న పరమ సత్యం స్పష్టంగా గోచరిస్తుంది. వేదాలలో, వేదాంతంలో వినిపించే తత్త్వచింతనను సమన్వయపరచి సమగ్రంగా బ్రహ్మపదార్థాన్ని సూత్రీకరించి చెప్పిన బ్రహ్మసూత్రాలలో కూడా అద్వైత తత్త్వం సూచ్యాసూచ్యంగా కనిపిస్తుంది. కాని యీ సమస్త వాఙ్మయాన్ని కూలంకషంగా పరిశీలించి అందులోని అద్వైత నవనీతాన్ని అందరికీ అందుబాటులో ఉండేట్టుగా తమ అమృత హస్తాలతో పంచిపెట్టిన ప్రాతఃస్మరణీయులు శంకర భగవత్పాదులే అని చెప్పాలి. అందువల్లనే అద్వైతమన్నా శంకరులన్నా ఒకటే అనిపించింది - ఆదిశంకరుల ఆచార్యత్వాన్ని అనుసరించి చరించిన అద్వైత పరాయణులకు.

అద్వైతానికి ఆధారం ద్వైతమే. రెండు కానిది అద్వైతం. రెండు కాక పోవటం కూడా అద్వైతమే. నిజంగా రెండు కాకపోయినా రెండుగా కనిపించటం వల్లనే అవి రెండుకాదని చెప్పవలసిన అవసరం ఏర్పడుతుంది. ఈ రెండింటితో ఒకటి ప్రత్యక్షంగా కనిపించేదీ, మరొకటి నిశితంగా పరిశీలిస్తేనే కాని కనిపించక పోయినా కనిపించినట్టు అనిపించేది అవటంవల్ల అవిరెండూ తాత్త్వికంగా ఒకటే అని

తెలియజెప్పటం, తెలిసిరావటం రెండూ కష్టసాధ్యమౌతాయి. ప్రత్యక్షంగా కనిపించే ప్రపంచం నిజంగా నిజంకాదనీ, ఇందులోని జీవకోటి పరబ్రహ్మ స్వరూపమేననీ, బ్రహ్మ మాత్రమే సత్యమనీ మిగిలిందంతా మిథ్య అనీ అద్వైతంచెప్పే వేదాంతానికి సారం. 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నా పరః' - అన్న శ్లోకార్థం లోని పదహారు అక్షరాలలో ఈ పరమార్థం ఒదిగిపోయింది. కాని యిది పొడిపొడి మాటల్లో చెప్పినంతమాత్రాన బుర్రకెక్కదు. ఇందులోని ప్రతి పదార్థాన్ని నిత్య జీవితంతో సమన్వయించుకొని అందులోని అంతరార్థాన్ని అవగాహనం చేసుకుని అనుభూతిలోకి అనువదించుకుంటేనే కాని పరమార్థం చేతికి చిక్కదు.

ప్రత్యక్షంగా కనిపించే ప్రపంచం అసత్యమని ఎలా నమ్మటం ? సామాన్య దృష్టికి కనిపించని పరతత్త్వం ఒకటి ఉన్నదని ఏమిటి ఆధారం ? అస్థిచర్మ రక్త మాంసాలతో కూడిన జీవి పరబ్రహ్మస్వరూపుడని ఎలా తెలుసుకోవటం? కనిపించింది నిజం అనుకోవటం లోకసహజం. కనిపించని నిజాన్ని కనుక్కోవటం విజ్ఞుల లక్షణం. కాని కనిపించేది నిజంకాదనీ, కనిపించని పరమార్థమే కనిపించే పదార్థంలో ఉన్నదనీ, అదే సత్యమనీ తెలుసుకునేందుకు సర్వసామాన్యమయిన లోకానుభవం చాలదు. అందుకు లోకోత్తరమయిన అనుభూతి కావాలి. అలాంటి అనుభూతని వివరించి చెప్పేందుకు విలక్షణమయిన వాగ్విభూతి కావాలి. ఈ విభూతినే లోక శంకరులయిన శంకర భగవత్పాదులు జన్మజన్మాంతర సంస్కారంతో సాధించి సాధకలోకానికి ప్రసాదించారు.కనుకనే వారికి ఋణపడి ఉన్న బ్రహ్మచారులు తమకు బ్రహ్మభిక్ష పెట్టిన ఆచార్యవర్యులకు కృతజ్ఞత చెప్పుకుంటూ అంటారు :

శ్రుతి స్మృతి పురాణానాం ఆలయం కరుణాలయం
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరం

అద్వైతం ఆదిశంకరులతోనే ఆరంభంకాలేదని ఇంతకుముందు మన మనుకున్నాం. శంకరులకు ముందు భర్తృప్రపంచ, భర్తృమిత్ర, భర్తృహరి, బ్రహ్మదత్తాది విద్వాంసులెందరో వేదాంతచర్చ చేశారు. వీరిలో కొందరు ద్వైతాన్ని, కొందరు అద్వైతాన్ని, మరికొందరు ద్వైతాద్వైతాన్ని సమర్థిస్తూ అనేక రచనలు చేశారు. వీరిలో శబ్దాద్వైత వాదాన్ని ప్రతిపాదించిన భర్తృహరి పేరు ప్రత్యేకంగా చెప్పుకోవాలి. వేదాంతదర్శనం పరబ్రహ్మగా నిరూపించిన పరతత్త్వం వాక్యపదీయ

కర్త అయిన భర్తృహరి దృష్టికి శబ్దబ్రహ్మగా సాక్షాత్కరించింది. శంకరుల సమకాలికులయిన మండనమిశ్ర కూడా భర్తృహరి నిరూపించిన శబ్దబ్రహ్మను అనుసరించి 'స్ఫోటసిద్ధి' అనేగ్రంథం రచించారు. జయంతభట్టు లాంటి నైయాయికులు కూడా భర్తృహరి ప్రతిపాదించిన శబ్దాద్వైత వాదాన్ని సాదరంగా స్మరించారు. బౌద్ధమతానికి చెందిన శాంతరక్షితుడు కూడా తన 'తత్త్వసంగ్రహం'లో ఈ శబ్దాద్వైతవాదాన్ని ఉదాహరించటం జరిగిందంటే దీని విస్తృతి, విశిష్టతలను గురించి వేరే చెప్పనక్కరలేదు. అద్వైతం అఖండం, అభిన్నం అయిన వాక్కు. పరమ చైతన్య స్వరూపం. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి - నాలుగురూపాలు శబ్దబ్రహ్మకు నాలుగు ముఖాలు. ఒకేశబ్దం నాభి, హృత్, కంఠ, రసనాదులలో వేరువేరుగా వ్యక్తమయినట్టు ఒకే బ్రహ్మపదార్థం సగుణంగా, నిర్గుణంగా, పరమాత్మగా, జీవాత్మగా భాసిస్తుంది. ఇది శంకరుల వివర్తవాదానికి చాలా సమీపంగా ఉంటుంది. భర్తృహరి శబ్దాద్వైతాన్ని జాగ్రత్తగా పరిశీలించి చూస్తే శంకరుల అద్వైతానికి ఇది ఆధారభూతమయి ఉండవచ్చుననిపిస్తుంది. వివర్త పదాన్ని కూడా భర్తృహరి శంకరుల పద్ధతిలోనే వాడటం గమనించదగ్గ విషయం. శబ్దంనుంచి ప్రపంచం ఎలా ప్రభవించిందో వివరిస్తూ భర్తృహరి అంటాడు :

అనాది నిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరం
వివర్తతేర్ధభావేన ప్రక్రియా జగతోయతః

శంకరులే కాదు, కాళిదాసాది కవిపుంగవులు కూడా వాగర్థప్రతిపత్తికోసం వాగర్థముల వలె సంపృక్తులయిన పార్వతీపరమేశ్వరులను స్మరించటం ఈ సందర్భంలో స్మరణీయం. అంతేకాదు, నాలుగు శతాబ్దాలక్రితం భక్తకవి గోస్వామి తులసీదాసు కూడా జలతరంగముల వలె వేరుగా కనిపిస్తున్నా వేరుకాని వాగర్థాలను 'గిరా అర్థ జల్‌బీచి సమ్ కహియత్ భిన్న న భిన్న' అని కీర్తిస్తాడు. వాక్ప్రపంచంలో పరమసత్యాన్ని ప్రతిపాదించే యీ శబ్దాద్వైత్వం శంకరాద్వైతానికి మూలమని చెప్పటం దుస్సాహసం కావచ్చు, కాని రెండింటి సామ్యం మాత్రం మనం కాదన లేము.

శంకరులు తనకు ముందు అద్వైత తత్త్వాన్ని తమ రచనల్లో వ్యాకరించిన వేదాంత శిఖామణులను ఎంతో శ్రద్ధాభక్తులతో స్మరించటం వారి ఔదార్యానికి నిదర్శనం. ఇలాంటి మహనీయులలో ఉపవర్షులు అగ్రగణ్యులు. వీరినిగురించి

శంకరులు రెండు మూడు చోట్ల 'భగవాన్ ఉపవర్షః' అని 'భగవతోపవర్షేణ' అని వ్యవహరిస్తారు. శాబర భాష్యంలో కూడా వీరి ప్రసక్తి వస్తుంది. 'వర్ణా ఏవతు శబ్దాః ఇతి భగవాన్ ఉపవర్షః' అని శాంకర భాష్యం భాషిస్తే 'అథ గౌరిత్యత్రకః శబ్దః? అని ప్రశ్నించు కొని గకార-ఔకార-విసర్జనీయాః-ఇతి భగవానుపవర్షః అని దానికి శాబరభాష్యం సమాధానం చెప్పుకుంటుంది. ఈ రెండు ఉదాహరణల్లో కూడా వర్ణ శబ్దమీమాంస చర్చనీయం కావటం కూడా గమనించ దగ్గ విషయం.

ఇలాగే మాండూక్యభాష్యంలో 'ఆగమవేత్త'లనీ, బృహదారణ్యక భాష్యంలో 'సంప్రదాయవేత్త'లనీ ద్రవిడాచార్యులనే బ్రహ్మవేత్తలను శంకరులు కీర్తిస్తారు. తనకు మనన్కరించని భర్తృ ప్రపంచాచార్యులను గురించిచెప్తూ శంకరులు తమ బృహదారణ్యక భాష్యంలో ఆయన కేవలం ఔపనిషదమ్మన్యులని చులకనగా మాట్లాడుతారు. దీనిని బట్టి శంకరులుతనకు ముందు తాత్త్వికులు చేసిన తత్త్వమీమాంసను తదీయభావంతో తరచి చూచి మంచిని సేకరించి పదిమందికి పనికి వచ్చే ప్రయోజనకరమైన పరమార్థాన్ని తమ అద్వైత సిద్ధాంతంగా రూపొందించారని స్పష్టమవుతుంది.

శంకరులకు ముందు అద్వైత తత్త్వానికి అన్నప్రాశన చేసిన మహనీయులలో మననీయులు గౌడపాదులు. వీరు శంకరులకు పరమాచార్యులు. శంకరులకు గురువులయిన గోవిందపాదులు వీరి శిష్యులే. రససిద్ధశరీరులయిన గోవిందపాదులు అద్వైత వేదాంతాన్ని గురించి ఏమీవ్రాయలేదు. కాని వారు వ్రాసిన 'రసహృదయ తంత్రా'న్ని "సర్వదర్శన సంగ్రహ" కర్త మాధవాచార్యులు పేర్కొన్నారు. శంకరుల అద్వైతానికి మూలాధారం మాత్రం గౌడపాదుల మాండూక్యకారిక. పరమాచార్యుల పరతత్త్వపరమార్థం ఆచార్యుల అమృత హస్తాల ద్వారా శంకరులకు అందిందని చెప్పాలి. మాండూక్యకారికలోని నాలుగు ప్రకరణాలలో మొదటిది ఆగమ ప్రకరణం, రెండవది వైతథ్యప్రకరణం. మూడవది అద్వైతప్రకరణం, నాల్గవది అలాత శాంతిప్రకరణం. ఈ ప్రకరణాల పేర్లలోనే అద్వైత సిద్ధాంతానికి ఆధారసూత్రం కనిపిస్తుంది. మూడవ ప్రకరణం పేరే అద్వైతం. కీలకమయినప్రకరణం ఇదే దీనికి మూలం మాండూక్యంలో ప్రణవనాదంతో ఆత్మతత్త్వాన్ని సమీకరించి చెప్పే పన్నెండు మంత్రాలలోని ఏడవ మంత్రం. అకార-ఉకార-మకారాలకు అతీతమయిన ప్రణవనాదపరాకాష్ఠలా జాగ్రద్ - స్వప్న - సుషుప్తి దశలను అధిగమించి తురీయా

వస్థలో స్వయంప్రభాభాస్వరంగా వెలుగొందే పరమాత్మ స్వరూపాన్ని నిరూపించేందుకు ప్రయత్నించే ఈ మంత్రరాజం గౌడపాదులకూ, ఆ తర్వాత శంకరభగవత్పాదులకూ తిరుమంత్రంగా ఉపకరించింది. జాగ్రదవస్థలోని వైశ్వానర విభూతికీ, స్వప్నదశలోని హిరణ్యగర్భసంభూతమైన దివ్యతేజస్సుకూ, సుషుప్తిలోని ఆనంద మూర్తిగా ఆత్మానందాన్ని అనుభవించే ప్రాజ్ఞస్వరూపపరమేశ్వరునికి అతీతంగా కంటికి కనిపించకుండా, ఉన్నట్టు అనిపించకుండా, చేతికి చిక్కకుండా, ఇట్టిదని తెలియకుండా, ఆలోచనలకుకూడా అందకుండా, చెప్పేందుకు వీలుపడకుండా ఆత్మ సారంతో ఆత్మరూపంలో ఏకైకంగా ప్రశాంతంగా ప్రాపంచిక పరిధులను అధిగమించి ప్రకాశించే అద్వైత రసానుభూతి యీ మంత్రంలో అక్షరభారతిగా సాక్షాత్కరిస్తుంది. ఇందులోని అద్వైతశబ్దం ప్రత్యేకంగా గమనిస్తూ మంత్రాన్ని మననం చెయ్యాలి. ఉపనిషత్పద సంపద అనుభవైక వేద్యం.

"నాంతః ప్రజ్ఞం న బహిష్ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం
న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞం అదృష్టం,
అవ్యవహార్యం, అగ్రాహ్యం, అలక్షణం, అచింత్యం,
అవ్యపదేశ్యం, ఏకాత్మప్రత్యయసారం, ప్రపంచోప
శమం, శాంతం, శివం, అద్వైతం-చతుర్థం మన్యంతే
స ఆత్మా సవిజ్ఞేయః"

ఇందులోని ప్రత్యక్షరం ప్రాపంచిక జీవులకు పారమార్థికమైన తత్త్వాన్ని ప్రసాదిస్తుంది. వేరు వేరు ప్రాణులలో వేరు వేరుగా ఉన్నట్టు కనిపించే ఆత్మతత్త్వం వేరు కాదు, ఒకటే అని దీని సారాంశం. దీనినే 'అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితం' అని స్మృతి బోధిస్తే 'ఏకో దేవః సర్వ భూతేషు గూఢః' అని శ్రుతి శాసిస్తుంది. 'తత్త్వమసి', 'అయమాత్మా బ్రహ్మ' అన్న మహావాక్యాలలోని పరమ నిగూఢమయిన పరమార్థం కూడా ఇదే. పరమాచార్యులకూ, ప్రశిష్యులకూ - ఇద్దరికీ అద్వైతతత్త్వాన్ని స్ఫురింపజేసిన యీ మాండూక్యవాక్యం ఎంత మననం చేసుకుంటే అంత సఘనంగా, సాంద్రంగా, సారగర్భితంగా కనిపిస్తుంది. అందువల్లనే కారికాకారులయిన గౌడపాదులు ఈ ఒక్క మంత్రానికే తొమ్మిది కారికలు వ్రాశారు. దీనికి ముందువచ్చిన ఆరు మంత్రాలకు తొమ్మిది కారికలు, తరువాతి అయిదు మంత్రాలకు

పదకొండు కారికలు వ్రాశారు. అంతేకాదు, అద్వైత సిద్ధాంతానికి ఆధారభూతమయిన జీవబ్రహ్మ సమైక్యం ఈ మంత్రభాష్యంలోనే వ్యాఖ్యాతమయింది. మాయను గురించిన ప్రసక్తి కూడా ఈ సందర్భంలోనే వచ్చింది. ఉదాహరణకు రెండు శ్లోకాలు చాలు.

> అనాది మాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే
> అజమనిద్రమస్వప్నమద్వైతం బుధ్యతే తదా. (16)
> ప్రపంచోయది విద్యేత నివర్తేత న సంశయః
> మాయామాత్ర మిదం ద్వైతం-అద్వైతం పరమార్థతః (17)

నిద్రపోతున్న వ్యక్తికి నిద్రలో తాను చూసేదంతా నిజమనే అనిపిస్తుంది. కాని మెలకువ రాగానే తాను గాంచిన కలలన్నీ కాలక్షేపానికి తాను కల్పించుకున్న కల్లలని తేటతెల్లమవుతుంది. అలాగే ప్రాపంచికజీవులు మాయ అనే నిద్రలో నిమగ్నులై తమ నిజస్వరూపాన్ని తెలుసుకోలేకపోతారు. మాయ విడిపోగానే తాను జన్మరహితుడనీ, నిద్ర నెరుగని ప్రజాగరుడనీ, కలలలో కరిగిపోని కాలాతీతుడనీ తనకూ తత్త్వానికీ భేదం లేదనీ, అంతా ఒక్కటే ఆత్మ విలసితమయిన అఖండ చైతన్యమనీ తెలుసుకోగలుగుతాడు. ద్వైతం మాయాకల్పితం. మాయను దాటేస్తే అద్వైతమే అద్వైతం కనిపిస్తుంది.

ఈ రెండు శ్లోకాలలో గౌడపాదులు అద్వైతతత్త్వాన్ని బోధ పరుచుకునేందుకు కావలసిన పరిజ్ఞానాన్ని పదిలంగా పొందుపరిచారు. రెండు వందలకు మించిన మిగిలిన కారికలన్నీ ఈ పరమార్థాన్నే వివరించి చెప్తాయి. శంకరుల అద్వైత సిద్ధాంతంకూడా ఈ నాలుగు చరణాల్లోనే ఇమిడిపోతుంది. బ్రహ్మసత్యం. జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ, నా పరః-ఈ నాలుగు వాక్యాల్లో ఇమిడిపోయిన అద్వైతత్త్వమే గౌడపాదులు రచించిన నాలుగు ప్రకరణాల్లో విపులీకరించబడిందని స్థూల దృష్టికికూడా స్ఫురిస్తుంది. ఆత్మతత్త్వం, లేక బ్రహ్మ పదార్థం ఒక్కటే, అదే సత్యం అని చెప్పే ఆగమ (మొదటి) ప్రకరణం 'బ్రహ్మసత్యం' అనే సత్యాన్ని చాటి చెప్తుంది. రెండవ ప్రకరణం - వైతథ్య ప్రకరణం- జగన్మిథ్యా అనే సత్యాన్ని విప్పి చెప్తుంది. మూడవ ప్రకరణం, అద్వైతప్రకరణం 'జీవో బ్రహ్మైవ' (జీవుడే బ్రహ్మ) అన్న అద్వైత సత్యాన్ని సంగ్రహంగా గ్రాహ్యపరుస్తుంది. చివరి ప్రకరణం - అలాతశాంతప్రకరణం- ద్వైతభావం నశించి అద్వైతభావం ఉదయించే పద్ధతిని నిరూపించి 'నాపరః'

అన్న అనుభూతిని అందిస్తుంది. ఇలా పరిశీలించి చూస్తే మాండూక్య కారికలలోని నాలుగు ప్రకరణాలే శంకరాద్వైతానికి నాలుగు పాదాలను సమకూర్చాయని స్పష్టమవుతుంది. చతుష్పదమయిన ఆత్మతత్త్వంలోని నాలుగు పాదాలే త్రికాలాతీతమయిన ప్రణవనాదంలోని నాలుగు మాత్రలనీ, ఆ పాదాలే యీ మాత్రలు - ఈ మాత్రలే ఆ పాదాలని మాండూక్యం (ఎనిమిదవ మంత్రం) వివరించినట్టు గౌడపాదుల ప్రకరణాలే శంకరులకు చరణాలని చెప్పవచ్చు. ఆ ప్రకరణాలే యీ చరణాలు. ఈ చరణాలే ఆ ప్రకరణాలు. ఇది కూడా ఒక విధమయిన అద్వైతమే.

కాని శంకర భగవత్పాదులకు అద్వైతస్ఫూర్తిని ప్రసాదించింది వారి పరమాచార్యులయిన గౌడపాదులే అయినప్పటికీ ఆ స్ఫూర్తికి పరిపూర్తిని సమకూర్చుకునేందుకు శంకరులు కేవలం మాండూక్యకారికలతో తృప్తి పడకుండా వేదాంత దర్శనానికి మూలకందమయిన ప్రస్థానత్రయిని తన అద్వైత సౌధానికి ఆధారం చేసుకున్నారు. అక్షరభారతిని అద్వైతభావంతో ఆరాధించిన భర్తృహరి శబ్దాద్వైతాన్ని కూడా మనస్సులో పెట్టుకొని శబ్దానుశాసనుడయిన పాణినిని భగవత్స్వరూపులుగా భావించిన జగద్గురువుల సాహితీ లహరిలో అడుగడుగునా అక్షరపరబ్రహ్మ సాక్షాత్కరిస్తుంది. ఎనిమిది అధ్యాయాల ఛాందోగ్యం చూడగనే ఛందస్సారాన్ని చూరగొన్న శంకరులకు శబ్దబ్రహ్మ పరాయణులయిన పాణిని అష్టాధ్యాయి స్ఫురిస్తుంది. 'ఓమిత్యేతదక్షరం' - ఇత్యాద్యష్టాధ్యాయీ ఛాందోగ్యోపనిషత్ - అని శంకరుల ఛాందోగ్యభాష్యం ఆరంభమవుతుంది. ఓంకారం లోని అక్షరపరబ్రహ్మకూ, ప్రపంచానికి అతీతమయిన నిర్గుణ పరబ్రహ్మకూ అద్వైతాన్ని అనుసంధించి సాక్షాత్కరించుకున్న శంకరులు ఛాందోగ్యభాష్యానికి ఉపోద్ఘాతంలోనే యీ విధమయిన అద్వైత-ఆత్మవిజ్ఞానం (అద్వైతమయిన ఆత్మానుభూతి) లేకుండా ఆత్యంతికమయిన నిశ్శ్రేయసప్రాప్తి సాధ్యం కాదని ఘంటాపథంగా ఘోషించి చెప్తారు. (నహ్యద్వైతాత్మ విజ్ఞానాదవ్యత్రాత్యంతికీ నిఃశ్రేయసప్రాప్తిః)." సత్-ఏకమేవ-అద్వితీయం', 'ఆత్మైవేదం సర్వం', 'అక్షరం బ్రహ్మపరమం' లాంటి శ్రుతిస్మృతి ప్రామాణ్యం శంకరుల వాదానికి నాదాన్ని చేకూర్చుతుంది. దీనిని బట్టి శంకరుల అద్వైతంలోని సామరస్యం, సమన్వయం, సర్వస్వతం ఎంత ఉన్నతస్థాయిని అందుకున్నాయో అర్థమవుతుంది. కనుకనే మొన్న మొన్నటి వరకు మన మధ్యనున్న వేదాంతప్రవక్త డా॥ రాధాకృష్ణ పండితులకు శంకరుల వేదాంత దర్శనంలో ఒక సమగ్రమయిన కళాసృష్టికి కావలసిన పరిపూర్ణత గోచరించింది. ముందు వెనకలను తనలో జీర్ణించుకుని అంతకు

ముందు చెప్పినదానికి భరతవాక్యంగా ఇకముందు చెప్పబోయేదానికి నాందిగా తాను చెప్పదలచుకున్నది తనదయిన నూతనపద్ధతిలో చెప్పగలగటం వల్ల అలాంటి స్వాన్యతపోనిధులకు పూర్వాపరాలతో ప్రయోజనం లేదని రాధాకృష్ణ పండితులు ఆత్మప్రత్యయంతో అంటారు : "His philosophy stands complete needing neither a before nor an after. It has a self Justifying wholeness characteristic of works of art" (Indian Phylosophy Vol. II).

ఇలా సర్వతోముఖంగా శంకర భాగవత్పాదులు ప్రతిపాదించిన అద్వైత వేదాంత దర్శనానికి ప్రాతిపదిక ప్రస్థానత్రయం అని ఇంతకుముందు చెప్పుకున్నాం. ప్రస్థానత్రయంలో బ్రహ్మసూత్రం ప్రధానమయిన రచన. మిగిలిన రెండు రచనలయిన ఉపనిషత్తులకూ, భగవద్గీతలకూ ఇది సంధిసూత్రం అని చెప్పవచ్చు. ఉపనిషత్తులలో ఉపన్యసింపబడిన ఆధ్యాత్మిక సందేశాన్ని సమన్వయపరచి సాధకుల సందేహాలను తీర్చేందుకు బ్రహ్మసూత్రాలు ప్రతి సూత్రంలో ప్రయత్నించటం వల్ల ఇది ఉపనిషత్తుల తర్వాతి రచన అనటంలో సందేహంలేదు. దీనిని ఒకవిధంగా ఉపనిషత్సందేహ నివారిణి అనవచ్చు. ఈ దృష్టితోనే ఉపనిషత్తులను వేదాంతం అంటారు కాబట్టి బ్రహ్మసూత్రాలను వేదాంత దర్శనం అనటం పరిపాటి అయింది. 'బ్రహ్మ సూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః -అని శ్రీమద్ భగవద్గీతలో బ్రహ్మసూత్రాలను గురించిన ప్రసక్తి కనిపిస్తుంది. కాబట్టి యిది భగవద్గీతలకు తర్వాతి రచన అనిఅను కోవటంలో కూడా పొరబాటు లేదు; ఈ విధంగా ప్రస్థానత్రయికి మధ్యబిందువుగా రూపొందిన బ్రహ్మసూత్రం ఆది శంకరుల అద్వైత సిద్ధాంతానికి మంగళ సూత్రంగా ఉపకరించి ఉంటుందని నిరపోహంగా నిర్ణయించవచ్చు. అథాతో బ్రహ్మ జిజ్ఞాసా -అన్న తొలిసూత్రంలోని మొట్టమొదటి మాట 'అథ'ను వ్యాఖ్యానిస్తూ భాష్యకారులు "అథ శబ్దః శ్రుత్యా మంగళప్రయోజనో భవతి" అంటారు. దీనిని బట్టి శంకరుల మనస్సులో కూడా ఇలాంటి మాంగళ్యభావం ఉదయించిందని తోస్తుంది. శంకర శబ్దానికి కూడా మంగళకరమనే అర్థం.

ఎందుకో తెలియదు కాని శంకరుల భాష్యరచన ప్రస్థానత్రయంలోని చివరి మెట్టయిన బ్రహ్మసూత్రంతోనే ఆరంభమయి ఉండాలనిపిస్తుంది. బ్రహ్మసూత్రా లలో ప్రతిపాదింపబడిన ప్రధానవిషయం బ్రహ్మజిజ్ఞాస, ఇది ధర్మజిజ్ఞాసకు భిన్న మయిందని చెప్తూ దీనికి కావలసిన సాధనచతుష్టయాన్ని కూడా శంకరులు సవిస్త రంగా సూచిస్తారు. ధర్మజిజ్ఞాసకు అభ్యుదయం ధ్యేయం. బ్రహ్మజిజ్ఞాసకు గమ్యం నిశ్రేయసం. ధర్మజిజ్ఞాసకు ప్రమాణం శ్రుతి. బ్రహ్మజిజ్ఞాసకు అనుభూతి లేక

అనుభవమే పర్యవసానం, శ్రుతి ననుసరించి కామ్యకర్మలను ఆచరించి ధర్మసమ్మత మయిన కర్మఫలాన్ని పొందవచ్చు. కానిబ్రహ్మసాక్షాత్కారం ధర్మానికీ, అధర్మానికీ, కృతానికీ, అకృతానికీ, భూతానికీ,భవ్యానికీ అతీతమయిన సాక్షాత్కృతి.

అన్యత్రధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్
అన్యత్రభూతాచ్చ భవ్యాచ్చయత్తత్పశ్యసి తద్వద
కఠోపనిషత్తు (1-2-14)

కాబట్టి దీనికి కావలసింది కేవలం అనుష్టానం కాదు, అనుభవజన్యమైనజ్ఞానం

అభ్యుదయఫలం ధర్మజ్ఞానం, తచ్చానుష్ఠానాపేక్షమ్
నిఃశ్రేయస ఫలంతు బ్రహజ్ఞానం, న చానుష్ఠానాంతరాపేక్షమ్.
బ్రహ్మసూత్రభాష్యం (1-1)

బ్రహ్మభావమే బ్రహ్మజ్ఞానం. ప్రపంచంలో బ్రహ్మపదార్థమొక్కటే సత్యం. మిగిలినదంతా మిథ్య. నిత్యసత్యసందీప్తమయిన తన బ్రహ్మస్వరూపాన్ని తాను పొందిన జీవికి ఆవృత్తి ఉండదు. ఇలాంటి అనావృత్తితో బ్రహ్మసూత్రాలలోని బ్రహ్మ జిజ్ఞాసకు సంబంధించిన శాస్త్రం పరిసమాప్తి చెందుతుంది.

బ్రహ్మ సూత్రం చూచేందుకు చాలాచిన్నది. ఇందులో నాలుగు అధ్యాయాలు. ఒక్కొక్క అధ్యాయానికి నాలుగుపాదాలు. పదహారు పాదాలలో మొత్తం మీద 555 సూత్రాలున్నాయి. ఈ సూత్రాలలోనే బ్రహ్మపదార్థం సమగ్రంగా సంగ్రథితమై ఉంది. దీనినే శంకరులు నాలుగు అక్షరాలలో 'బ్రహ్మసత్యం' అని తేల్చేశారు.శంకరుల అద్వైత సిద్ధాంతానికి ఇది ప్రథమపాదం కాబట్టి బ్రహ్మసూత్రంతోనే శంకరుల భాష్యరచన ప్రారంభమయి ఉంటుందని ఊహించటం పొరబాటు కాకపోవచ్చు. ఆ మాట ఎలా ఉన్నా బ్రహ్మసత్యం అన్న చతురక్షర సారానికి ఆధారం బ్రహ్మ సూత్రం,దానికి శారీరక మీమాంస అనే పేరిట శంకరులువ్రాసిన భాష్యం అని నిస్సంశయంగా చెప్పవచ్చు సూక్ష్మంలో మోక్షం అన్నట్టు సూత్రకారులూ, భాష్యకారులూ బ్రహ్మవిద్యను ఎంత అవలీలగా చెప్పినా దానిని గ్రహించి తరించేందుకు సంస్కారం, అధికారం కావాలి. ఇలాంటి అధికార నిర్ణయం చేస్తూ శంకరులు నాలుగు లక్షణాలను నిర్వచించి చెప్పారు.

నిత్యానిత్య వస్తు వివేకం, ఇహాముత్రార్థ భోగవిరాగం, శమదమాది సాధన సంపత్తి.. ముముక్షుత్వం-ఈ నాలుగులక్షణాలు కలవాడే బ్రహ్మజిజ్ఞాసకు అధికారి అని శంకర నిర్ణయం. ఏది నిత్యం, ఏది అనిత్యం, ఏది శాశ్వతం, ఏదిక్షణభంగురం అనే పరిజ్ఞానం అన్నిటికంటే ముందు అవసరం. ఇది ఆధ్యాత్మిక సాధనకు పునాది. ఇది కూడా అందరికీ ఉండదు. పూర్వజన్మ సంస్కారం వల్ల ఏ కొందరికో యిది పుట్టుకతో లభిస్తుంది. కొందరికి సాధన వల్ల క్రమంగా ఏర్పడుతుంది. ఇలాంటి వివేకం ఉదయించిన తర్వాతకూడా ప్రత్యక్షంగా కనిపించే అనిత్యసుఖాల మీదనే ఆసక్తి ఏర్పడుతుంది. కాని కఠోరసాధనవల్ల ఎప్పుడోకాని అనుభవానికి రాని శాశ్వత సౌఖ్యంకోసం వేచిఉండటం చాలా అరుదు. ఇదే శంకరులు సూచించిన రెండవ మెట్టు, దీనిని వారు భోగవిరాగం అన్నారు. ఈ భోగం ఐహికంకావచ్చు, ఆముష్మికం కావచ్చు. స్వర్గ సౌఖ్యం కూడా స్వాత్మానందం ముందు ఎందుకూ పనికిరాదు. అందు వల్లనే నచికేతుడు పరమ దుర్లభమయిన భోగభాగ్యాలను తృణీకరించి పరమ పదం కోసం పట్టుపట్టాడు.ఇలా మునిమనస్సులను కూడా మురిపించే సుఖసంతతిని త్యజించి పరమానందాన్ని పొందాలంటే విడివడని వైరాగ్యం కావాలి. ఇలాంటివైరాగ్యం కావాలంటే శమదమాది సాధనసంపదకావాలి. శంకరులు దీనిని మూడవ మెట్టుగా భావిస్తారు. బహిరింద్రియనిగ్రహం శమం. అంతరింద్రియనిగ్రహం దమం. నిగ్రహించిన ఇంద్రియములను నిలకడ చేకూర్చుకొనటమే ఉపరతి. కష్ట సుఖాలను, శీతోష్ణాలను సమదృష్టితో సహనంతో అనుభవించి వాటికి లొంగకుండా చూచుకోవటమే తితిక్ష. బ్రహ్మపదార్థము మీదనే తన మనస్సును, బుద్ధిని నిశ్చలంగా నిలబెట్టుకొటమే సమాధానం. శాస్త్రం చేసిన శాసనంపట్ల, గురువులు చెప్పిన మాటల మీద గౌరవం ఏర్పరచుకొనటమే శ్రద్ధ. చేయదలచిన పని చిత్తశుద్ధితో చేయటం కూడా శ్రద్ధ అవుతుంది. ఇలా శమం, దమం, ఉపరతి, తితిక్ష. సమాధానం, శ్రద్ధ-అనేవి ఆరూ శమదమాది సంపదగా పరిగణింపబడుతాయి. ఈ షట్కాన్ని సాధిస్తే చివరి మెట్టయిన ముముక్షుత్వం తనంతటతానే ఏర్పడుతుంది. మోక్షలాలసనే ముముక్షుత్వం అంటారు. కాని యిది విషయలాలస వంటిది కాదు. అసలిదిలాలసేకాదు. లాలస కాని లాలస. ఇతర లాలసలను లయింపజేసే ఐతరేయ లాలస.

ఇలా బ్రహ్మజిజ్ఞాసకు అధికార నిర్ణయం చేసిన తర్వాత భాష్యకారులు బ్రహ్మపద పరిశీలనం ప్రారంభిస్తారు. బ్రహ్మసూత్రాలతో మొట్టమొదటి సూత్రమయిన 'అధాతో బ్రహ్మ జిజ్ఞాసా' అన్న వాక్యంతోనే యీ బ్రహ్మసమీక్ష ప్రారంభమవుతుంది.

అసలు బ్రహ్మపదార్థమంటూ ఒకటి ఉందా అనేది మొట్టమొదటి ప్రశ్న. దీనికి సూటిగా సమాధానం చెప్తూ శంకరులంటారు: "అస్తి తావద్బ్రహ్మ నిత్యశుద్ధబుద్ధ ముక్త స్వభావం, సర్వజ్ఞం, సర్వశక్తి సమన్వితం" (బ్రహ్మసూత్రం 1.1.1). బ్రహ్మపదార్థం ఉన్నది. అది సర్వకాల సర్వావస్థలయందు విశుద్ధమయిన స్వస్వరూపంతో భాసిస్తూ ఉంటుంది. సంసారబీజరూపమయిన అజ్ఞానం పరిజ్ఞాన స్వరూపమయిన పరబ్రహ్మను స్పృశించలేదు. సర్వతంత్ర స్వతంత్రమయిన బ్రహ్మ సర్వదా ముక్తంగా ఉంటుంది. బ్రహ్మను తెలుసుకున్న తర్వాత ఇక తెలుసు కొనవలసినదంటూ ఉండదు. బ్రహ్మ సర్వజ్ఞం. ప్రపంచంలోని శక్తిసర్వస్వం బ్రహ్మపదార్థంలో సారగర్భితంగా ఇమిడి ఉంటుంది. ఇలా నిత్యశుద్ధం, నిత్యబుద్ధం, నిత్యముక్తం, సర్వజ్ఞం, సర్వశక్తి సమన్వితం అయిన బ్రహ్మను నిరాకరించటం ఆత్మవంతులకు సాధ్యంకాదని శ్రుతి శాసిస్తుంది. 'అహం బ్రహ్మాస్మి', అయమాత్మా బ్రహ్మ మొదలయిన శ్రుతి వాక్యాల ననుసరించి తానే బ్రహ్మ. తన ఆత్మే బ్రహ్మ అయినప్పుడు బ్రహ్మను నిరాకరించటం తనను తాను నిరాకరించటం అవుతుంది. తన వాక్కులో, తన శ్వాసలో, తన కండ్లలో, తన చెవులలో చేరి తనచేత మాట్లాడిస్తూ, ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నడిపిస్తూ, చూడ వలసినవి చూపిస్తూ, వినవలసినవి వినిపిస్తూ తనవెంటనే అంటి పెట్టుకొని ఉన్న ఆత్మను కాదనటం సామాన్యమైన పరిజ్ఞానం ఉన్నా సాధ్యంకాదు. అందుకనే కేనో పనిషత్తు శాంతిపాఠంలోనే 'మాహం బ్రహ్మ నిరాకుర్యాం' మా మా బ్రహ్మ నిరాకరోత్, అనిరాకరణ మస్తు, అనిరాకరణం మే-అస్తు అని జిజ్ఞాసాపరుడు రెండు మారులు నిరాకరణ బుద్ధిని నిరాకరించుకుంటాడు. అస్తీ త్యేవోపలబ్ధవ్యః అన్న కాఠక సూక్తిని బట్టి బ్రహ్మ ఉన్నదనుకుంటే ఉన్నది, లేదనుకుంటే లేదు. ఉన్నదని గట్టిగా నమ్మి ఉనికిని ఉపాసిస్తే ఆ ఉనికికీ తన ఉనికికీ భేదం లేదనే జ్ఞానం ఉదయిస్తుంది. అసలు ఉనికి ఒక్కటే. అదే తాను, అదే ఆత్మ, అదే బ్రహ్మ. కాని తన తనువే తానను కోవటం వల్ల నిజంగా తానెవరో తెలియకుండా పోతుంది. నీ చెవులు వినటం లేదు. నీ చెవులకు వినేశక్తి ప్రసాదిస్తున్నది నీ ఆత్మ అదే బ్రహ్మ. అలాగే నీ కండ్లకు చూచే సామర్థ్యం, మనస్సుకు ఆలోచించేశక్తి, వాక్కుకు మాట్లాడేశక్తి ఆత్మవల్లనే లభిస్తుంది. అదే బ్రహ్మ (తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే). నీవు ఉపాసిస్తున్న తనువు బ్రహ్మకాదు, తనువులో నున్న తనువుగాని తానే బ్రహ్మ అని ఉపనిష ద్వాక్యాలు మంద బుద్ధులయిన మనుష్యులను మాటిమాటికి మందలిస్తాయి.

బ్రహ్మ పదార్థం అంటూ ఒకటి ఉన్నదనీ, అది మన చెంతనే ఉనదనీ, దానిని ఎరుకపరుచుకోవటమే జీవితపురుషార్థమనీ శంకరులు బ్రహ్మసూత్రభాష్యంలో మొదటి నాలుగు సూత్రాలలోనే స్పష్టం చేస్తారు. దీనిని ఎరుకపరుచుకోవటం ఎలా అనే ప్రశ్నకు సమాధానంకూడా ఇక్కడే చెప్తారు. అందుకే మొదటి నాలుగు సూత్రాలకు శంకరులు చేసినవ్యాఖ్యానం చాలా ముఖ్యమయిందని బ్రహవేత్తలు భావిస్తారు. దేనినే 'చతుస్సూత్రి' అని కూడా అంటారు. బ్రహ్మను తెలుసుకునేందుకు సర్వసామాన్యమయిన ఒక సంధానసూత్రాన్ని వరుణ మహర్షి తన కుమారుడయివ వారుణికి అందించినట్టు తైత్తిరీయంలో ఒక చక్కని ఇతివృత్తం కనిపిస్తుంది. 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' అన్న మొదటిసూత్రంలో 'జిజ్ఞాస' శబ్దాన్ని చూడగానే శంకరులకు ఈ సందర్భం జ్ఞప్తికి వస్తుంది. వరుణ మహర్షి వారుణికి ప్రసాదించిన బ్రహ్మసూత్రాన్ని శంకరులు ఒకసారి కాదు, పలుమారులు ఈ సందర్భంలో ఉదాహరిస్తారు. 'యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ ప్రయంత్యభి సంవిశంతి, తద్విజిజ్ఞానస్వ, తద్ బ్రహ్మేతి' - ఇదీ వారుణికి వరుణ మహర్షి ప్రసాదించిన సంధానసూత్రం. "ప్రాణికోటి ఏ శక్తి నుంచి ప్రభవించిందో, ఎవరి పోషణవల్ల పెరిగి పెద్ద అవుతుందో, చివరకు ఎందులో లయించిపోతుందో, దానిని తెలుసుకో, అదే బ్రహ్మ" - ఇదే యీ బ్రహ్మసూత్రం. 'ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై యెవ్వని యందుడిందు' నన్న శ్రీ మద్భాగవతం సూచించిన భాగవతసూత్రం కూడా ఇదే. ఈ సూత్రాన్నే ఆధారం చేసుకుని వారుణి ముందు 'అన్నమే బ్రహ్మ' అని అనుకుంటాడు. 'కాదు, కాదు, ఇంకా ఆలోచించు' - అని తండ్రి అంటారు. తర్వాత ప్రాణం బ్రహ్మ అవుకుంటాడు. అదికూడా కాదని తెలిసి మనస్సు బ్రహ్మ అనుకుంటాడు. కాదు, విజ్ఞానం బ్రహ్మ కావచ్చు ననుకుంటాడు. చివరకు ఈ నాలుగింటికి అతీతమయిన ఆనందమే బ్రహ్మ అని నిశ్చయించుకుంటాడు. తండ్రికూడా దీనికి సమ్మతించి 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అని ఆనందవాదాన్ని ప్రతిపాదిస్తాడు. ప్రపంచంయొక్క సృష్టి స్థితి లయాలకు మూలకారణమయిన ఆనందమే పరబ్రహ్మ స్వరూపంగా నిరూపించటం ఈ బ్రహ్మ జిజ్ఞాసకు పరమావధి.

ఆనందస్వరూపమయిన బ్రహ్మను పొందడమే బ్రహ్మభావం. అదే ఆత్మసాక్షాత్కారం లేక బ్రహ్మసాక్షాత్కారం. ఆత్మకూ, బ్రహ్మకూ భేదం లేదు. ప్రపంచం ఉపశమిస్తేనే కాని యీ బ్రహ్మపదార్థం గోచరించదు. అంతవరకు ప్రపంచమే సత్య

మనిపిస్తుంది. కారణం కంటికి కనిపించేది ప్రపంచమే కాబట్టి. ప్రపంచం ఉన్నట్టు అని పిస్తుందే కాని, నిజంగా ఉన్నది యిందులోని సచ్చిదానందస్వరూపమయిన బ్రహ్మ పదార్థమే కాని నామరూపాత్మకమయిన ప్రపంచం కాదని ప్రాపంచిక పరిధులను అధిగ మించి చూస్తేనేగాని తెలియదు. ఇలా సత్యం అసత్యంగా, అసత్యం సత్యంగా గోచ రించటానికి మరోకారణం ప్రపంచం బ్రహ్మపదార్థంతో మిళితమైయుండుట కూడా కావచ్చు. అస్తి, భాతి, ప్రియం, నామం, రూపం - ఈ అయిదు లక్షణాల సమ్మేళనమే జీవితం. వీటిలో మొదటి మూడు బ్రహ్మలక్షణాలు. చివరి రెండూ జగల్లక్షణాలు.

అస్తి భాతిప్రియం రూపం నామచేత్యంశ పంచకం
ఆద్యంత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం.

సర్వకాల సర్వావస్థలయందు సర్వత్రాఉండటం 'అస్తి'. ఉన్నది ఉన్నట్టు తన వెలుగుతో తాను వెలుగొందటం 'భాతి'. ఉనికిమీద, వెలుగు మీద నలుదిక్కులా చెలిమిని వెల యించి చిరంతన చైతన్యాన్ని చేరదీసి ప్రేమను పెంపొందించటమే 'ప్రియం'. ఈ మూడు బ్రహ్మ లక్షణాలు. వ్యావహారికంగా చూస్తే మనకు కనిపించి వినిపించి మురి పించే నామరూపాలు నిజమనిపిస్తాయేకాని నిజానికి అవి నిజంకావు. ఈనాడు కనిపి స్తాయి. రేపు కాలవాహినిలో కరిగిపోతాయి. ఈనాడు మురిపిస్తాయి. రేపు విసిగిస్తాయి. కాని అవినశ్వరమయిన ఆత్మతత్త్వం నశ్వరమయిన యీ పార్థివత్త్వంలోనే దానితో కూడి ఉంది. క్షణభంగురమయిన శరీరంలోనే శాశ్వతమయిన బ్రహ్మపదార్థం నెల కొనివుంది. అసత్యమయిన ప్రాపంచికవైభవానికి మురిసిపోకుండా అందులోని అనంత మయిన అఖండమయిన ఆనందాన్ని అందుకోవటమే ఆత్మవంతుల లక్షణం.

కాని నిజం కానిది నిజంగా ఎందుకు కనిస్తుంది? నిజమయినది ఎందుకు కనిపించదు? దీనికి సమాధానమే శంకరుల మాయ. అద్వైత దృష్టికి అవరోధం కల్పించేది మాయ. జీవులను బ్రహ్మకు వేరు చేసేది మాయ. బ్రహ్మయొక్క సత్స్వ రూపాన్ని కనిపించకుండా చేసేదిమాయ. సత్యంకాని ప్రపంచం సత్యమని నమ్మించి మనస్సును మరిపించి మురిపించేది మాయ. ఉన్న దానిని కప్పిపుచ్చి లేని దానిని ఉన్నట్టు కనిపింపజేసె కనుగట్టువిద్య మాయ. ఉన్నదానిని కనిపించకుండా కప్పి పుచ్చటం మాయకు సహజంగా అలవడిన ఆవరణ శక్తి. లేనిది ఉన్నట్టు చేయటం మాయ నేర్చుకున్న విక్షేపవిద్య. ఈ రెండు శక్తులతో మాయ, లేని దానిని ఉన్నట్టూ,

ఉన్న దానిని లేనట్టూ చేస్తుంది. అసలు మాయ కూడా ఉన్నదా, లేదా అని చెప్పటం కష్టం. "సా మాయా యా న విద్యతే" ఏది లేదో అదేమాయ. (యామా సా మాయా) అని శంకరులు కూడా అంటారు. కాని మాయ కల్పించిన ప్రపంచం కంటికి కనిపిస్తూ మనస్సును మురిపిస్తూ ఉన్నదికాబట్టి అది లేదని కూడా మనం అనలేము. కాని యీ ప్రపంచం క్షణభంగురం కాబట్టి అది ఉన్నదని కూడా చెప్పలేము. కాబట్టి మాయసత్-అసత్ - రెండింటికీ అతీతమయి అనిర్వచనీయమైన అవ్యక్తశక్తి లేక అవిద్య అని చెప్పుకోవలసి వస్తుంది. తెలియదు కాబట్టి అవ్యక్తం లేదు. కాబట్టి అవిద్య. కాని యిది సృష్టికి బీజం. ఇది పరమేశ్వరుని ఆశ్రయించి ఉంటుంది. సుషుప్తి దీని లక్షణం. గాఢనిద్రలో తన ప్రపంచంలో తాను తేలిపోతున్న సుప్తజీవి లాగా సంసార చక్రంలో పరిభ్రమించే ప్రాపంచికజీవి పారమార్థికమైన తన ఉనికిని విస్మరించి మాయామయమయిన మహానిద్రలో మునిగి ఉంటాడు.

> అవిద్యాత్మికా హి బీజశక్తి :- అవ్యక్త శబ్ద నిర్దేశ్య
> పరమేశ్వరాశ్రయా మాయామయీ మహాసుషుప్తిః
> యస్యాం స్వరూప ప్రతిబోధరహితాః శేరతే సంసారిణో
> జీవాః - బ్రహ్మసూత్రభాష్యం (1-4-3)

పరమేశ్వరుని ఆధ్వర్యంలో పరాప్రకృతి ప్రపంచాన్ని సృష్టిస్తుంది కాబట్టి మాయను ప్రకృతిగా కూడా భావించవచ్చు "మాయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే చరాచరం". 'మాయాంతు ప్రకృతిం విద్యాన్ మాయినంతు మహేశ్వరం'-ఇలాంటి వాక్యాలు ఈ భావాన్ని బలపరుస్తాయి.

మాయ వల్లనే అయథార్థమయిన ప్రపంచం యథార్థంగా భాసిస్తుంది. అది కేవలం ప్రాతిభాసికం. పారమార్థికంకాదు. వ్యావహారికదృష్టిలో ప్రపంచం సత్యమే. కాని పారమార్థికదృష్టి లభించగానే అది మిథ్య అనిపిస్తుందే. ఈ వాదాన్ని సమర్థించేందుకే గౌడపాదులు స్వప్న సాదృశ్యం ఆశ్రయించారు. దానినే శంకరులు బలపరచి 'జగన్మిథ్యా' అన్న సత్యాన్ని నిరూపించారు. ప్రత్యక్షంగా కనిపించే దాన్ని మిథ్య అని ఎలా భావించటం అని సందేహించేవాళ్ళకు సమాధానంగా ఆచార్యులు ఈ సాదృశ్యాన్ని చూపించారు. దృశ్యత్వం (కనిపించటం), అసత్యత్వం (కనిపించినా నిజం కాకపోవటం) స్వప్న జగత్తుకూ, వ్యావహారిక జగత్తుకూ సామాన్యలక్షణం

మాండూక్య కారికలలోని వైతథ్యప్రకరణం ఈ తథ్యాన్ని నిరూపించేందుకే అనేక విధాల ప్రయత్నిస్తుంది. ఈ ప్రకరణం చివర గౌడపాదులు చేసిన తత్త్వచింతన గమనించదగ్గది. బాహ్యప్రపంచంలోని ప్రాతిభాసిక సత్యాన్నీ, అంతరజగత్తులోని ఆధ్యాత్మిక (పారమార్థిక) సత్యాన్నీ గ్రహించిన తత్త్వవేత్త సర్వకాల సర్వావస్థల యందూ తత్త్వచింతనతో తాత్త్వికమయిన దృక్పథంతో తత్త్వపరాయణుడై ఉంటాడట.

తత్త్వమాధ్యాత్మికం దృష్ట్వా తత్త్వం దృష్ట్వాతుబాహ్యతః
తత్త్వభూతస్తదారామస్తత్త్వా దప్రచ్యుతో భవేత్

మాండూక్యకారిక (2-38)

ఈ శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ శంకరభగవత్పాదులు ప్రతిపాదించిన ఆత్మ తత్త్వంకూడా అనుసంధించి అర్థం చేసుకోవాలి. "ఆత్మాచ సబాహ్యాభ్యంతరోహ్యజో పూర్వోఽనపరోఽనంతరోఽబాహ్యః కృత్స్నః ఆకాశవత్ సర్వగతః సూక్ష్మోఽచలో నిర్గుణో నిష్కలో నిష్క్రియః" అంటారు శంకరులు. బహిరంతరజగత్తులో సమానంగా వెలుగొందే ఆత్మ జన్మరహితమయినది. అంతకుముందేమీ లేదు. దాని తర్వాత కూడా ఏమీ లేదు. దానికి మధ్యాంతరాలంటూ ఏమీ లేవు. దానికి ఆవలివైపు, వెలుపలివైపు అనేవి లేవు. ఆకాశంలాగా అది అంతటా వ్యాపించి ఉంటుంది. అతి సూక్ష్మంగా నిశ్చలంగా నిర్గుణంగా నిష్కలంగా నిష్క్రియంగా నిఖిలజగత్తులో నిండి ఉంటుంది. ఇలాంటి ఆత్మ తత్త్వ మొక్కటే సత్యం, అదే నీవు (తద్సత్యం స ఆత్మా తత్త్వమసి).

'బ్రహ్మ మాత్రమే సత్యం, ప్రపంచమంతా మిథ్య' అని తెలుసుకున్న తరువాత జీవబ్రహ్మ సమైక్యం బోధపడటం సులభమవుతుంది. అసలు జీవుడంటే ఎవడు? 'జీవోహి నామచేతనః శరీరాధ్యక్షః ప్రాణానాం ధారయితా' అంటారు శంకరులు. శరీరానికి అధ్యక్షత వహించి ప్రాణధారణం చేసే చైతన్యస్వరూపుడే జీవుడు. జడపదార్థమయిన శరీరంలో అధివసించే చైతన్యమూర్తి జీవుడు. అలాంటి జీవుడు బ్రహ్మస్వరూపుడే, 'నహి జీవో నామ అత్యంత భిన్నో బ్రహ్మణః'. జీవాత్మకూ, పరమాత్మకూ తాత్త్వికంగా ఏమీ భేదంలేదు. ఉపాధికల్పనవల్ల జీవికి కర్తృత్వం, భోక్తృత్వం సంక్రమిస్తాయి. బ్రహ్మ నిరుపాధికం, నిర్గుణం నిర్వికల్పం అయినందువల్ల కర్తృత్వ భోక్తృత్వాదుల ప్రసక్తి లేదు. బ్రహ్మ వేరు, తాను వేరు - అనే ద్వైతబుద్ధి

అజ్ఞానంవల్లనే ఏర్పడుతుంది. నీటిలో కనిపించే చంద్రబింబం నీరు చలించగానే చలించినటు కనిపిస్తుంది. కాని చలిస్తున్నది బింబమూ కాదు, చంద్రుడూ కాదు. నీరు మాత్రమే చలిస్తుంది అలాగే అజ్ఞానంవల్ల జీవి తనపై కర్తృత్వ భోక్తృత్వాదులను అరోపించుకుంటాడు. తాను నిజంగా వీటికి అతీతుడనే విషయం తెలుసుకున్న మరుక్షణంలో అతనికి బ్రహ్మభావం ఏర్పడుతుంది. 'బ్రహ్మ విద్ బ్రహ్మైవ భవతి' - బ్రహ్మను తెలుసుకున్నవాడు బ్రహ్మతో తాదాత్మ్యాన్ని పొందుతాడు. దానినే ముక్తి అంటారు. తనకూ బ్రహ్మకూ భేదం లేదనే జ్ఞానమే ముక్తి. తాను వేరు, బ్రహ్మ వేరు అనుకోవటమే అజ్ఞానం. మోహం. ఆ మోహం క్షీణించటమే మోక్షం.

బ్రహ్మ సత్యం, ప్రపంచం మిథ్య, జీవుడే బ్రహ్మ-అని తెలుసుకోవటంతో అద్వైత సిద్ధాంతంలో మూడు చరణాలు దాటి నట్టవుతుంది. నాల్గవచరణం (నాపరః) చివరి సోపానం. ఇంతవరకు అద్వైతతత్త్వాన్ని అవగాహనం చేసుకోవటంతోనే సరిపోయింది. ఇకదానిని అనుభూతిలోకి తీసుకురావాలి. ఇదే అన్నిటి కంటె దుష్కరమయిన కార్యం. ఆచరణకు పనికిరాని చరణాలవల్ల ప్రయోజనం లేదు. హృదయాన్ని స్పందింపజేసే అనుభూతిని అందించలేని వాగ్విభూతి నిష్ప్రయోజనం. దీపం దీపం అనుకుంటే చీకటిపోదు. దీపం వెలిగిస్తేనే అంధకారం పోయి ఆలోకం లభిస్తుంది. వాగ్వైఖరి, శబ్ద సామర్థ్యం, శాస్త్ర వైదుష్యం భుక్తికి ఉపయోగించవచ్చునేమోకాని ముక్తికిమాత్రం పనికిరావని శంకరులు చమత్కరిస్తారు. "భుక్తయే నతు ముక్తయే" అన్న శంకరసూక్తి ఆచరణపట్ల ఆచార్యులకున్న ఆదరభావాన్ని చాటి చెప్తుంది. ఆచరించి తరించవలసిన మార్గంలో తాను చరించి ఇతరులను సంచరింపజేసే సుజ్ఞాన సంపన్నులే ఆచార్యులు. ఇలాంటి మహాజ్ఞాన సంపన్నులను గూర్చి ప్రసంగిస్తూ భాష్యకారులు మాండూక్యభాష్యంలో అంటారు :

> అజేసామ్యే పరమార్థతత్త్వే ఏవమేకాతి యేకేచిత్
> స్త్రీయదయోపి సునిశ్చితా భవిష్యంతి చేత్, త ఏవహి లోకే
> మహాజ్ఞానాః నిరతిశయ తత్త్వవిషయజ్ఞానా ఇత్యర్థః (4-95)

ఇందులో శంకరులు తమ పరమాచార్యులు చెప్పిన కారికను అక్షరశః అనువదించారనే చెప్పాలి. గౌడపాదుల మూలకారికతో ఈ భాష్యాన్ని పోల్చి చూస్తే ఆ విషయం స్పష్టమవుతుంది.

అజీ సామ్యేతు యే కేచిద్ భవిష్యంతి సునిశ్చితాః
తే హి లోకే మహాజ్ఞానాస్తచ్చ లోకోన గాహతే.

ఆద్యంత రహితమై సకలసృష్టిలో సమదృష్టిని స్థాపించి నిరూపించగల పరమార్థ తత్త్వాన్ని ఇదమిత్థమని కూలంకషంగా గ్రహించిన వారే మహాజ్ఞానులని గౌడ పాదులు ప్రతిపాదించారు. శంకరులు అలాంటి మహాజ్ఞానులలో స్త్రీలనుకూడా (స్త్ర్యాదయోనపి) చేర్చారు. దీనినిబట్టి శంకరుల ఔదార్యం, సమరసభావం, హృదయ వైశాల్యం స్పష్టమవుతాయి. శంకరులు తమ భాష్యంలోచేర్చిన మరో విషయం నిరతిశయత్వం. తత్త్వజ్ఞానం నిరతిశయమయి ఉండాలని శంకరుల అభిప్రాయం. ఇక తెలియవలసింది లేదన్నంత వరకు తత్త్వ విషయిక మైన జ్ఞానం కలవాడే మహాజ్ఞాని. దీనినిబట్టి జ్ఞానం అంటే శంకరులకు ఎంత గౌరవమో గూడా తెలుస్తుంది జ్ఞానంవల్లనే ముక్తి లభిస్తుందని శంకరుల నిశ్చితాభిప్రాయం. కర్మవల్ల బంధనం ఏర్పడుతుంది కాని ముక్తి లభించటం కల్ల అని ఆచార్యుల అభిమతం. ఆత్మవిదులు కర్మ యోగాన్ని కలలోకూడా స్మరించరని శంకరుల నిష్కర్ష (ఆత్మ విదః....కర్మయోగః స్వప్నే అపి సంభావయితుం నశక్యః-భ.గీ.భా. VI.). చిత్తశుద్ధిని సాధించి జ్ఞానానికి అర్హత సంపాదించుకునేవరకు కర్మలను ఆచరించవచ్చునని భగవత్పాదులు అనుమతిస్తారు. కర్మనిరతి జ్ఞానసాధనకు అధికారం అందిస్తుందేకాని తనంతటతాను పురుషార్థ సిద్ధికి తోడ్పడలేదని శంకరనిర్ణయం. ఉపనిషత్తులలో కేవలం ఆత్మ విచారమే కాని కర్మకాండయొక్క ప్రసక్తి లేదు. దీనిని బట్టి శంకరులు-జ్ఞానాన్ని కర్మవిరోధిగా భావించారు. కాని భగవద్గీతకు భాష్యం చెప్పేప్పుడు భాష్యకారులు కొంచెం సమాధానపడ్డట్టు కనిపిస్తుంది. నిష్కామ కర్మవల్ల చిత్తశుద్ధి ఏర్పడుతుంది కాబట్టి అలాంటికర్మలు జ్ఞాన ప్రాప్తికి దోహదం ఇస్తాయని సమాధాన ధోరణిలో అక్కడక్కడా అంటారు. కాని సకామ కర్మలను మాత్రం వారు ఏ మాత్రం హర్షించరు. శాస్త్ర విరుద్ధముగా చిత్తము వచ్చినట్టు విచ్చలవిడిగా ఆచరించే కర్మలను పశు తుల్యములయిన తుచ్ఛకర్మలని నిరసిస్తారు. కాని జ్ఞానోదయానికి సహకరించినంతవరకు కర్మనిష్ఠలో దోషం లేదని ఆచార్యుల ఆచార మీమాంసకు తాత్పర్యం అని చెప్పవచ్చు.

కేవలంజ్ఞానం వల్లకానీ, జ్ఞానకర్మ సముచ్చయం వల్ల కానీ. కర్మ జ్ఞాన భక్తి సముచ్చయం వల్లకానీ ఎలాగయినా ముక్తిలభించటమే జీవిత పరమావధి.

ముక్తిని కూడా లెక్కపెట్టని కొందరు భక్తి రసైకజీవులు తప్ప వేదాంత విశారదు లందరూ ముక్తిని పరమలక్ష్యంగా స్వీకరించిన వారే. శంకరుల అద్వైత సిద్ధాంతానికి కూడా పరమావధి, మోక్షమే. జీవితకాలంలోనే ఇలాంటి ముక్తిని సాధించటం మంచిదని ఉపనిషత్తులు చెప్పినమాటలను శంకరులు పూర్తిగా సమర్థిస్తారు. "ఇహ చేదవేదీదథ సత్యమస్తి, న చేదిహావేదీన్మహతీ వినష్టిః" - అని కేనోపనిషత్తు కొనమాటగా చెప్తుంది. ఈ శరీరం నశించక ముందే ఇందులోని ఆత్మను దర్శించి ఆత్మవంతులు కావటం వల్ల జన్మసార్థకమవుతుంది. లేకుంటే దుర్లభమయిన జన్మ నిరర్థకం కావటంవల్ల ఆత్మతత్త్వం అందినట్టే అంది చేజారిపోతుంది. దీనినే భగవద్గీతలు కూడా సమర్థిస్తాయి. జీవితకాలంలోనే ముక్తిని పొందిన వాళ్ళను జీవన్ముక్తులంటారు, అలాంటి మహనీయులకు శరీరంతో అవసరంలేదు. కాని శరీరయాత్ర నిర్లిప్తంగా సాగిస్తారు. అలాంటి వాళ్ళ సాన్నిధ్యంవల్లనే అనేకులు తరిస్తారు. లోకకల్యాణంకోసం వారు జీవిస్తారు. దేహపాత సమయంలో వాళ్ళు నిర్భయంగా శరీరాన్ని త్యజించి బ్రహ్మలీనులయి పోతారు. వారికి జరామరణాలు లేవు. రాగ ద్వేషాలు లేవు. కష్ట సుఖాలు లేవు. శోక మోహాలు లేవు. "తత్ర కో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యతః" అని ఈశావాస్యంతీర్పు చెప్తుంది. భగవద్గీతలో కీర్తింపబడిన స్థితప్రజ్ఞులు కూడా ఈ కోవకు చెందినవారే. ఇలాంటి జీవన్ముక్తి గురించి ఆచార్యులు ఆత్మ బోధలో అంటారు.

జీవన్ముక్తిస్తు తద్విద్వాన్ పూర్వోపాధి గుణాంస్త్యజేత్,
స సచ్చిదాది ధర్మత్వం భేజేభ్రమర కీటవత్,

(గొంగళిపురుగు సీతాకోకచిలుక అయినట్టుగా వివేకవంతుడు పూర్వవాసనలను త్యజించి ఉపాధి గుణములను ఉపసంహరించుకొని సచ్చిదానంద జీవిగా మారుతాడు. ఇలా తన స్వస్వరూపాన్ని స్వస్వభావాన్ని పొందటమే జీవన్ముక్తి.)

ఇలాంటి జీవన్ముక్తులు కనుకనే శంకరభగవత్పాదులు కలకాలం జీవకోటిని తరింపజేయగల జ్ఞానామృతం ప్రపంచానికి పంచి పెట్టగలిగారు. ప్రస్థానత్రయ పయోధిని తన ప్రజ్ఞాపాటవంతో మథించి ఆచార్యపాదులు సాధించిన అద్వైతామృతం ఈనాటికీ జిజ్ఞాసువులకు తుష్టినీ పుష్టినీ ప్రసాదిస్తూ ఉంది. ఆదిశంకరులు తమ అద్వైత వేదాంతాన్ని ప్రతిపాదించి ఇప్పటికి దాదాపు పన్నెండు వందల సంవత్సరాలు గడిచా. ఆయి తర్వాత వేదాంతదర్శనం ఎన్నో మలుపులు తిరిగింది. ఎందరో ఆచార్యులు తమ సిద్ధాంతాలను ప్రతిపాదించారు. కొందరు శంకరుల సిద్ధాంతంతో

ఏకీభవించి వారి అద్వైత మతాన్ని సమర్థించారు. కొందరు కొద్ది మార్పులతో దానిని సవరించారు. మరికొందరు నిర్మొహమాటంగా నిరసించారు. కాని 'వాదే వాదే-జాయతే తత్త్వ బోధః' అన్నట్టు భగవత్పాదులు ప్రతిపాదించిన సిద్ధాంతాలకు తదనంతర తత్త్వజ్ఞులు కొంగ్రొత్త వన్నెలను సంతరింపజేశారే కాని ఆధారభూతమయిన ఆలోచనలకు అంతగా అంతరాయం ఏర్పడలేదు. కొందరికి అందులో ఒక విశిష్టత కనిపించింది. అది విశిష్టాద్వైతమయింది. మరికొందరికి అది శుద్ధాద్వైతమయింది. మరికొందరు అందులో ద్వైతాన్నీ, అద్వైతాన్నీ చూశారు. వారికది ద్వైతాద్వైతమయింది. కొందరు నిర్మొహమాటంగా ఇందులో అద్వైతం ఏమీ లేదన్నారు. వారి దృష్టికి అది ద్వైతంగా కనిపించింది. ఎవరి దృష్టి వారిది. కాని అందరికి దృష్టికీ ఆధారమయినది ఒకటే సృష్టి. ఆ సృష్టిని పరిశీలించిన పరమ ఋషులు ప్రతిపాదించిన ప్రస్థాన త్రయమే అందరికీ మూలంగా ఉపకరించటం ఇందులోని విశేషం. ఒకే పరమసత్యం వేరు వేరు దృక్కోణాలతో చూస్తే వేరు వేరుగా కనిపించవచ్చు. కాని వస్తువొకటే. వాస్తవం కూడా ఒకటే. తత్త్వం ఒకటే తద్గితమయిన పద్ధతి వేరు కావచ్చు. ఈ దృష్టితోనే భక్త శిరోమణి గోస్వామి తులసీదాసు సర్వమత సమన్వయాన్ని సమర్థిస్తూ ఒక చక్కని మాట అంటారు:

కోవు కహసత్య ఝూఠ్ కశా కోవూ
జుగల్ ప్రబల్ కోవు మానై
తులసిదాస్ పరిహరై తీన్ భ్రమ్
సో ఆపన్ పహిచానై.

(కొందరికి అది సత్యంగా గోచరిస్తుంది. మరికొందరికి అది అసత్యంగా కనిపిస్తుందట. కొందరు రెండూ నిజమని అంటారట. తులసీదాసుమాత్రం ఈ వాదోపవాదాలకు దూరంగా అన్నింటినీ పరిహరించి అంతరాత్మను ఆరాధించి తరించాలని ప్రయత్నించినవాడే ధన్యుడంటారు.)

ఆత్మజ్ఞానం ఆత్మవంతులకే లభిస్తుందని ఇందులో సారాంశం. ఆచార్యవర్యులందరూ చెప్పింది కూడా ఇదే. గీతాచార్యులు చివరిమాటగా చేసిన హితబోధ కూడా ఇదే.

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ.

# శ్రీ శంకర భగవత్పాదుల వ్యాఖ్యానములు

భాగవతుల కుటుంబరావు

అద్వైతమత ప్రతిష్ఠాపకులైన శ్రీ శంకర భగవత్పాదులు ప్రస్థానత్రయముల తోపాటు అనేకవిధములైన స్తోత్రములను వ్రాసినారు. ముముక్షువులైన అధికారుల నుద్దేశించి శ్రీ విష్ణుసహస్రనామ లలితాత్రిశతీ స్తోత్రములకు, సనత్సుజాతీయము (అను గ్రంథమునకు) ఆపస్తంబీయ అధ్యాత్మపటలమునకును, ఉత్తమాధికారులను మన స్సునుంచుకొని, ఈశ కేన కఠ ముండక మాండూక్య తైత్తిరీయ ఛాందోగ్య బృహ దారణ్యక, శ్వేతాశ్వతర, నృసింహతాపన్యాది ఉపనిషత్తులకు, బ్రహ్మసూత్రములకు, భగవద్గీతకును, వ్యాఖ్యానములను వ్రాసినారు. ఈ వ్యాఖ్యానములను ముఖ్యముగా ఉపనిషాది వ్యాఖ్యానములను భాష్యములను పేరుతో వ్యవహరించుచున్నాము.

వ్యాఖ్యాన భేదములు

సూత్రము, శ్లోకము, వచనము, మంత్రముల రూపముననున్న మూలగ్రంథమునకు అర్థమును తెలుపుటను వ్యాఖ్యానము అని సామాన్యముగ ననినను, ఆతెలుపుటలో అనేక విధములున్నవి. 1 వృత్తి = "సూత్రమాత్ర వివరణము" సూత్రములోని పదము లకు గల అర్థమును మాత్రమే వివరించుట లఘు వివరణము అనవచ్చును. శ్రీ శంకరులే ఒక చోట "అల్పగ్రన్థా వృత్తిరియ మారభ్యతే" = అల్పమైన గ్రన్థము గల వృత్తిని ప్రారంభించుచున్నాను అనినారు. (2) వార్తికము = "ఉక్తానుక్త దురుక్త చింత" సూత్రాదులలో చెప్పిన, చెప్పక వదలిన, సరిగా చెప్పని అర్థమును గురించి విచారించుటకు వార్తిక లక్షణము. పాణినీయ వ్యాకరణమైన అష్టాధ్యాయికి కాత్యాయనుని వార్తికములకు ఈ లక్షణము వర్తించినది. ఆనందగిరియతి వ్రాసిన సురేశ్వర వార్తిక వ్యాఖ్యానము నందు ఉక్తానుక్త ద్విరుక్తాది చిన్తా యత్ర ప్రవర్తతే। తం గ్రన్థం వార్తికం ప్రాహుః వార్తికజ్ఞాః మనీషిణః అని యున్నది. ఇచట దురుక్త మను పదము యొక్క స్థానములో "ద్విరుక్త మని" యున్నది. ఒకే యర్థమును రెండు పర్యాయములు చెప్పినపుడు, ఆద్విరుక్తి యొక్క ప్రయోజనమును విచారించుట యని [illegible] చెప్పవలెను. ఈవార్తికము యొక్క బాగోగులను ప్రత్యేకము విచారింపవలయును.

**వ్యాఖ్యానము :—**

పదచ్ఛేదము, పదార్థోక్తి, విగ్రహము, వాక్యయోజనము, ఆక్షేపము, సమాధానము, అను అంశములున్న వివరణము వ్యాఖ్యానమగును.

**భాష్యము :-**

"సూత్రార్థో వర్ణ్యతే యత్ర (పదైః) వాక్యైః సూత్రాను సారిభిః। స్వపదాని చ వర్ణ్యన్తే భాష్యమ్ భాష్యవిదో విదుః" అను ఒక లక్షణము ప్రసిద్ధముగ నున్నది. (2) "ఆక్షిప్య భాషణాత్ భాష్యమ్" అని కావ్యమీమాంస యందొక లక్షణమున్నది. (3) సూత్ర సూచితార్థోప పాదనేపి" భాష్యత్వమ్" అని యొక వ్యాఖ్యాత అనినారు సూత్రానుసరణము గల పదములతో, వాక్యములతో నెచట సూత్రార్థము వర్ణితమగునో, ఎచట స్వపదములు (= వ్యాఖ్యాత యొక్క పదములు గూడ), వర్ణితములగునో, దానిని భాష్యమందురు. (2) ఒక విషయము నాక్షేపించి దానిని సమాధానము చెప్పుట భాష్యమగును. (3) సూత్ర సూచితార్థమును ఉపపాదన చేయుట భాష్యమగును.

పై లక్షణములోని పదములు, స్వప్రయోజనములని అభిజ్ఞులు తెలిపినారు. సాగరాది వర్ణన వ్యావృత్తిని చేయుటకు "సూత్రార్థవర్ణనము" అనుపదమున్నది. "సూత్రానుసారి" అనునది, వార్తిక వ్యావృత్తిని చేయును, "వాక్యైః" అనుటచే కేవల పదరూప వృత్తికే లక్షణము పట్టదు. "స్వపదాని చ వర్ణ్యన్తే" అనుటవలన భాష్యేతరములకన్నిటికిని వ్యావృత్తి కలుగును.

**అధికరణము :-**

"విషయోవిషయశ్చైవ, పూర్వపక్ష స్తథోత్తరమ్। నిర్ణయశ్చేతి పంచాంగం శాస్త్రేధికరణమ్ మతమ్। ఒక గ్రంథములోని ముఖ్యవిషయము, సంశయము, పూర్వపక్షము, సమాధానము, నిర్ణయము - అను అయిదు అంశములను సూచించునది అధికరణము. టీక — సాధారణముగ ప్రతిపదార్థము అయినను ఒకపుడు వ్యాఖ్యను గూడ,టీక, అనుచున్నాము- వివరణమనునది భాష్యలక్షణోపేతము గూడకావచ్చును. ఇక తాత్పర్యము. గచ్ఛత్ వ్యాఖ్య, (అటనట మాత్రమేవ్యాఖ్యానము చేయుట) టిప్ టీక, (అచ్చట నచట మాత్రమే అర్థమును తెలుపుట, మొదలగునవి ప్రసిద్ధములే—

ఇచట నొకవిషయమును గుర్తుంచుకొనవలయును. శ్రీ శంకరులు తమ వ్యాఖ్యానములను, వ్యాఖ్య, వృత్తి, వివరణము-అను నామములతో వ్యవహరించినారు.

1) తైత్తిరీయక సారన్య వ్యాఖ్యేయం సంప్రణీయతే (తై. భా.)
2) వేదాన్త మీమాంసా శాస్త్రస్య వ్యాచిఖ్యాసితస్య (బ్ర. సూ. భా.)
3) తస్యేయమల్ప గ్రన్థావృత్తి: (బృ. ఉ. భా.)
4) సంక్షేపతో వివరణం కరిష్యామి (గీ. భా)
5) అతస్తదర్థ వివరణే యత్నః క్రియతే మయా (గీ. భా)
6) ఋజు వివరణ మల్పగ్రన్థమిదమారభ్యతే (ఛాం. ఉ)

అప్రస్తుతమైనను ఒక విషయమును సూచింపవలెను. "నేను యత్నము చేయు చున్నాను" "అల్ప గ్రంథమును" అనుటలో శ్రీ శంకరుల గర్వరాహిత్యము కొట్ట వచ్చుచున్నట్లు కనుపడుచున్నది. ఋజు వివరణమును, అల్పగ్రంథమును అర్థము చేసికొనుటకే ఎన్నియో వ్యాఖ్యానములు వెలిసినవి గదా? ఇంకొక విషయము భాష్య లక్షణములోని సూత్రపదమును, శ్లోకమన్త్రాదులను ఉపలక్షణముగా గ్రహింప వలయును.

ఇచటనొక సందేహము వచ్చినది. బ్రహ్మసూత్ర భాష్యమునందు మొట్టమొదట నున్న "యుష్మదస్మత్ ప్రత్యయయోః" మొదలైన భాగము ఏ సూత్రమునకును అర్థముగాదు మిగిలిన భాష్యాదులలో నున్న ఉపోద్ఘాతములును ఆచటనున్న శ్లోక మన్త్రాద్యర్థములుగావు. అయినను, "అథాతోబ్రహ్మ జిజ్ఞాసా" అను సూత్రమునందు సూచితమైన జిజ్ఞాసయొక్క అక్కఱ యున్నదా? లేదా? అది సప్రయోజనమా? ప్రయోజన రహితమా? అను సందేహములను నివారించుటకు ఆ భాగము విరచిత మైనది. కాగా సూత్రసూచితార్థోప పాదనమునకు సంబంధించుటచే నదియు భాష్యమే యగును. లేదా! ఆక్షేప సమాధానము లుండుట వలనైనను భాష్యత్వము సమన్విత మగును. మిగిలిన భాష్యోపోద్ఘాతములను కూడనిట్లె అర్థము చేసికొనవలయును.

మఱియొక విషయము. కేనోపనిషత్తునకు ఇతరోపనిషత్తులకున్న భాష్యము వంటి భాష్యమేగాక, "వాక్యభాష్యము" అని మఱియొక భాష్యమున్నది. శ్రీ శంక రులు ఎందుకిట్లు వ్రాసినారు? శ్రీ ఆనంద గిరియతి తమ వ్యాఖ్యానములో నిట్లు వ్రాసి నారు". పూర్వము ఈ ఉపనిషత్తును, పదశః వ్యాఖ్యానించినారు. అయినను శారీరక న్యాయములతో ఆయుపనిషదర్థము నిర్ణయము చేయలేదు. అనుకొని అసంతుష్టులైన శ్రీ భగవత్పాదులు, శ్రుత్యర్థ సంగ్రాహకములైన వాక్యములతో వ్యాఖ్యానింప నెంచి నారు" ఇచట ఉపనిషదర్థ వివరణమునందు శ్రీ శంకరులు చూపిన శ్రద్ధను మనము భావింపవలయును.

ఘటము నశించినప్పుడు, ఘటబుద్ధి (=ఘటము విషయముగా గల జ్ఞానము) నశించినపుడు, (వ్యభిచరించినపుడు) ఘటము లేకుండుటచే "సన్" ఉన్నది అను బుద్ధియు లేదుగదా ! అందువలన ఆ బుద్ధియు వ్యభిచరించుచున్నది గదా ! (ఎప్పుడును ఉండుటలేదుగదా.)

సమాధానము

"న, పటాదావపి సద్బుద్ధి దర్శనాత్ విశేషణ విషయైవ సా సద్బుద్ధి :—

కాదు, వస్త్రము మొదలైన వానిలో గూడ "సన్" ఉన్నది, అను జ్ఞానమున్నది గదా ! అందువలన అది నశింపలేదు. అందుచే వ్యభిచరింపలేదు. సద్బుద్ధి - విశేషణమే విషయముగాగలదిగదా. (సన్ ఘటః, సన్ పటః - అనునపుడు అన్నిటను సన్ అనునది విశేషణము - ఘటము - పటము, హస్తి అనునవి విశేష్యములు.) ఘటము నశించినను, అచట సన్ - ఉన్నది అను జ్ఞానము లేకున్నను, 'సన్పటః" అనుచోట, పటమునకు విశేషణముగా "సన్" అను బుద్ధ యున్నదిగదా ! ఉన్నది అను విశేషణము ఎచటనో ఒకచోట ఎప్పుడును ఉండును.

ఆక్షేపము

"సద్బుద్ధివత్ ఘటబుద్ధిరపి ఘటాంతరే దృశ్యత ఇతిచేత్,"

సన్- అను జ్ఞానము, నశించిన ఘటములో లేకున్నను, వేఱొక ఘటములో కనుపడుచున్నదిగదా.

సమాధానము

"న, పటాదావదర్శనాత్" కాదు - వస్త్రము మొదలైన వానిలో ఘటబుద్ధిలేదు "సన్" అను బుద్ధి మాత్రమున్నది.

ఆక్షేపము

"నను సద్బుద్ధిరపి నష్టే ఘటే, నదృశ్యతా ఇతి చేత్= సన్ అను బుద్ధికూడ పటమునందుఉన్నను, నశించినను, ఘటమునందు లేదు గదా !

సమాధానము

న, విశేష్యాభావాత్, సద్బుద్ధిః విశేషణ విషయాత్, విశేష్యాభావే విశేషణా —

నుపపత్తౌ, కిం విషయాస్యాత్, నతు పునస్సద్బుద్ధే ర్విషయాభావాత్.

కాదు. విశేష్యము (కుండ) లేనందు వలన "సన్" అనునది భాసించుటలేదు. సద్బుద్ధి విశేషణము విషయముగా కలది గదా ! అయినపుడు, విశేష్యములేనపుడు, విశేషణమనునది పొసగకుండుటచే, దానికి ఏది విషయమగును ? (విశేషణమను విషయము లేదు) అంతమాత్రమేకాని, సద్బుద్ధికి విషయము లేకుండుట వలనగాదు (సద్బుద్ధికి విషయముండనే యున్నది)

**ఆక్షేపము**

"ఏకాధికరణత్వమ్ ఘటాది విశేష్యాభావే నయుక్తమితిచేత్

**సమాధానము**

"న, ఇదముదకమితి మరీచ్యాదౌ,అన్యతరాభావేపిసామానాధికరణ్యదర్శనాత్".

**ఆక్షేపము**

ఏకాధికరణత్వము (సాహచర్యము) ఘటము మొదలైన విశేష్యములు లేనపుడు కుదరదుగదా! రెండునునున్నచో రెండింటికి ఒక్క ఆశ్రయము (సాహచర్యము) అనవచ్చును. అందులో ఒకటి లేనపుడు ఏకాధికరణత్వము ఎట్లు?

నీరులేని ఎండమావులనుచూచి, ఇది నీరు అనునపుడు, రెంటిలో ఏ ఒకటి లేకున్నను సామానాధికరణ్యము, అనుభవములో నున్నది గదా! (ఎండమావులలో నీరు లేకున్నను ఇది ఉదకము అనుచున్నాముగదా).

తుది నిర్ణయము "తస్మాత్ దేహాదేః ద్వంద్వస్యచ సకారణస్య, అసతః, నవిద్యతే భావః ఇతి తథా సతశ్చ ఆత్మనః అభావః అవిద్యమానతా నవిద్యతే, సర్వత్రా వ్యభిచారాత్".

అందుచే సకారణమైన దేహాది ద్వంద్వమునకు, అసత్తు అయినదానికి, భావము (ఉనికి) లేదు. అటులే సత్-అయిన ఆత్మకు లేకుండుటలేదు. అది అంతటను నుండుటయే దీనికి కారణము. పై భాష్యమునందు, మూలవాక్యము నందలి పదములకు అర్థము. "సత్" "అసత్" అనువాని లక్షణములు ఆక్షేపములు సమాధానములు నున్నవి. ఇచటి హేతుబద్ధమైన వాక్యరచనము, సదసత్తుల నిర్వచనము, పాశ్చాత్య తత్త్వజ్ఞుల మెప్పునందినవి. ప్రతిజ్ఞ, హేతువు, దృష్టాన్తము, ఉపనయము నిగమనడా అను పరార్థాను మానమునకు కావలసిన ఆయిదు అవయవ వాక్యములు గూడ పరిశీకుల కిట గోచరించును.

సూత్రభాష్యము నందలి మొదటి సూత్రము "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" ఈ సూత్రమునకు విస్తృతమైన భాష్యమున్నది. అథ, అతః బ్రహ్మ జిజ్ఞాసా అను మూడు పదములకును విడివిడిగా శ్రీశంకరులు, అర్థము చెప్పినారు. "అథ" అను పదమునవు

డును, 'బ్రహ్మ" అని అనేక విధములుగా భ్రమను పొందుచుండుటచే జిజ్ఞాస వచ్చినది, అని సమాధానము చెప్పినారు. సూత్రములోని మూడు పదములకు ఎంత గంభీరమైన అర్థమున్నదో, ఆ అర్థమును గంభీరములైన వాక్యములలోనెట్లు వివరించినారో, తాము చెప్పిన అర్థము సరియైన దనుటకు, శ్రుతి, యుక్తి, అనుభవములను ఎట్లు ఉదాహరించినారో, తెలిసికొనుటకు, ఈ మొదటి సూత్రమునకున్న భాష్యమును సూక్ష్మ దృష్టితో పరిశీలించినచో విజ్ఞులకు తెలియును - ఈ విమర్శన శక్తిని, విశ్లేష శక్తిని మెచ్చుకొనని వివేకులుండరు. బుద్ధికి కావలయుననుకొనువారు, కనీనము చతుస్సూత్రి భాష్యమునైనను, సావధానముగ చదువవలయును. ఇచటనే శ్రీశంకరుల సర్వవేదశాస్త్ర పాండిత్యము, సర్వమతసిద్ధాన్త పరిజ్ఞానము-వాదకుశలత, ప్రతిభ, బాగుగా తెలియును. ఈ మొదటి సూత్రమును వ్యాఖ్యానించుటకు, ముందు ఉపోద్ఘాత రూపముగా శ్రీ శంకరులు కొంత భాష్యమును వ్రాసినారు. దానిని "అధ్యాస భాష్యము" అందురు. అచట మొదట ఒక ప్రౌఢము, ఉదాత్తమునైన వాక్యములో "అధ్యాసః, మిథ్యేతి, భవితుమ్ యుక్తమ్" అధ్యాసమిధ్య అనుట తగును అని, ఒక సిద్ధాన్త వాక్యము చెప్పి, అధ్యాస యననేమో వివరించినారు. "స్మృతిరూపః పరత్ర పూర్వదృష్టావభాసః" అని ఒక లక్షణము చెప్పినారు. తరువాత ఇతరులు చెప్పిన అధ్యాస లక్షణములను మూటిని పేర్కొని, దాని సారాంశమును "అన్యస్య అన్య ధర్మావభాసతా" ఒకటి వేఱొకటిగా భాసించుట అనితేల్చి, దానికి లోకములోని దృష్టాన్తము నిచ్చినారు. ఈ అధ్యాస భాష్యముపైన ఎన్నియో బృహత్ వ్యాఖ్యానములు వెలిసినవి. దీనివలన శ్రీ శంకరుల వాక్యములెంత గంభీరములో, శ్రుతి యుక్త్యనుభవ పూర్వకములో విచక్షణులైన విమర్శకులను సులభముగ తెలియును, ఇటులనే భగవద్గీత ఉపనిషత్తులు బ్రహ్మ సూత్రముల భాష్యములలో కొన్ని కొన్ని ఘట్టములలో శ్రీ శంకరుల విశ్వరూపమును, తాండవమును. మనము చూచి గర్వపడగలము. అభినందింతుము. నమోవాకము లర్పింతుము.

### భాష్యసిద్ధాన్త విశిష్టత

ఉపనిషత్తులు, భగవద్గీత, సూత్రభాష్యము ఈమూటిని ప్రస్థానత్రయముఅందురు. అద్వైతేతర మతాచార్యులుగూడ, వీనికన్నిటికిగాని కొన్నిటికిగాని వ్యాఖ్యానములు వ్రాసినారు. శ్రీ శంకరవ్యాఖ్యాన విశిష్టత ఏమి అని ప్రశ్నవచ్చును. కొన్నివిశిష్టాంశములను ప్రస్తుతము పరిశీలింతము.

1. శ్రీ శంకరులు ప్రతిపాదించిన విషయము అనాది సంప్రదాయాగతము - అనునది మొదటి విశేషము. శ్రీశంకరుల వాక్యములను కొన్నిటి నిట నుదాహరించు చున్నాను. 1) ఓం నమో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో వంశర్షిభ్యోనమో గురుభ్యః (బృ. భాష్యము) 2) "సమాప్తా బ్రహ్మవిద్యా సా యేభ్యః బ్రహ్మాదిభ్యః పారం పర్య క్రమేణ సంప్రాప్తా, తాభ్యోనమః" (ఛాందోగ్య. భా.) 3) "శ్రుత్యర్థ సంప్రదాయ పరం పరయా ఆగతముపనిషద్విజ్ఞానమద్యాపి విద్వత్సు అవగమ్యతే" శ్రుత్యర్థము యొక్క సంప్రదాయ పరం పరతో వచ్చిన ఉపనిషద్విజ్ఞానము నేడును విద్వాంసు లలో కనుబడుచున్నది -అని తమ వఱకును ప్రాచీన పరంపరాగతమైన శ్రుత్యర్థము వచ్చినది అనినారు. గీతాభాష్యమునందు "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచతే" అనుశ్లోకము నుదాహరించి "ఇదిసంప్రదాయ విదుల వచనము" అనినారు. సూత్రభాష్యములో కూడ "అనాది మాయయా సుప్తః యదా జీవః ప్రబుధ్యతే। అజమనిద్రమస్వప్నమ్ అద్వైతం బుధ్యతే తదా అను శ్లోకమును ఉదాహరించి, ఇది యును వేదాన్తార్థ సంప్రదాయ విదుల అభిప్రాయమే అనినారు. గీతాభాష్యమునందు 13వ అధ్యాయమున, "సర్వశాస్త్రములను తెలిసినవాడైనను సంప్రదాయమును తెలి యని వానిని మూర్ఖునివలె ఉపేక్షింపవలెను". అన్నారు. మఱియొకచో, సంప్రదాయ విదులుకాని తార్కికులను భటురాజులుగా నిందించినారు. భాష్యములయందంతటను సంప్రదాయప్రాధాన్యమును తెలుపు వాక్యములెన్నియో యున్నవి.

**సంప్రదాయము**

శ్రీ శంకర ప్రతిపాదితమైన అద్వైతము-శ్రీ శంకరులు తమ భాష్యములలో ఉపనిషదాదులకు చేసినవ్యాఖ్యలు సంప్రదాయాగతములని, పైవాక్యములవలన తెలియు చున్నది. "నారాయణం పద్మభువం వశిష్ఠం శక్తిం చ తత్పుత్రపరాశరం చ వ్యాసం శుకం గౌడపదం మహాన్తమ్" గోవిన్దయోగీన్ద్రమ్ "అను గురు పరంపరా సూచిక శ్లోకమును మనము చదువుచున్నాము. శ్రీమన్నారాయణుడు కృష్ణరూపమున గీతను చెప్పినాడు. "ఇమం వివస్వతే యోగమ్" అను గీతా శ్లోకములో- తాను నారా యణుడుగా పూర్వము ఉపదేశించిన యోగమునే ఇపుడుచెప్పుచున్నాననినారు. బ్రహ్మ గీతలు, జ్ఞాన వాశిష్ఠము- వ్యాసుని భారతములోని భగవద్గీత, మిగిలిన వేదాన్తఘట్ట ములు, శుకుని భాగవతము, గౌడపాదుల మాండూక్య కారికలు - ఇవి యన్నియును అద్వైత బోధకములే. వ్యాసుని బ్రహ్మసూత్రములును అందువలననే అద్వైతబోధక

ములు అవశ్యము కావలయును. "ప్రకటార్థ వివరణము" నందు ఉదాహృతమైన, పరాశర ప్రోక్తమైన ఈ క్రింది శ్లోకములు అద్వైతమునే బోధించును.

"అపక్షయ వినాశాభ్యామ్ పరిణామర్ధి జన్మభిః
వర్జితశ్శక్యతే వక్తుమ్ యస్సదా స్తీతి కేవలమ్
సోహం, న త్వం జగచ్ఛేదం సదేవాసురమానుషమ్
అవిద్యామోహితాత్మానః పురుషాః భిన్నదృష్టయః"

శ్రీరామానుజాచార్యులుగూడ పూర్వాచార్యులుగా కీర్తించిన "ద్రమిడాచార్యులు" అద్వైతవాదులే అని విమర్శకులు సిద్ధాన్తీకరించినారు. గురుపూజ చేయునపుడు శ్రీ శంకర సంప్రదాయులు ద్రమిడాచార్యులకు ప్రముఖస్థానమిచ్చి పూజింతురు. భాష్యమునందు ఇంకను పూర్వాచార్యుల మతములను శ్రీ శంకరులు తమకు అనుకూలముగా నున్నట్లుదాహరించినారు.

శ్రీ శంకర ప్రతిపాదితమైన అర్థము సంప్రదాయగతము అనుటకు ఇంకను ఎన్నియో ప్రమాణములున్నవి. అందుచే అది పరమ ప్రమాణమని మనము అంగీకరింప వలయును, ఇతర మతములు ప్రాచీన సంప్రదాయ గతములగునా కాదా? అను విషయమునిట చర్చించుట యుచితముగాదు.

## శ్రీ శంకరభాష్య ప్రశంసలు

శ్రీ శంకరుని భాష్యములను ఆధారముచేసికొనియే, అద్వైతములోనే భామతీ ప్రస్థానము, వివరణ ప్రస్థానము అనిరెండు మార్గములు వెలిసినవి. వాచస్పతిమిశ్రులు వ్రాసిన "భామతి" అను వ్యాఖ్యానముపై నెన్నియో వ్యాఖ్యానములు వచ్చినవి. అటులే శ్రీ శంకరుని శిష్యులే అయిన పద్మపాదాచార్యులు, బ్రహ్మసూత్ర భాష్యమునకు వ్రాసిన "వివరణము" అను వ్యాఖ్యానమునకును ఎన్నియో వ్యాఖ్యానములు వచ్చినవి శ్రీ సురేశ్వరాచార్యులు బృహదారణ్యక తైత్తిరీయ భాష్యములను వార్తికములను వ్రాసినారు. "అద్వైతసిద్ధి" అనునది యొక అద్వైతవాద గ్రంథము శ్రీ హర్షుడు "ఖండన ఖండఖాద్యము" అనునొక యుద్గ్రంథమును వ్రాసి అద్వైత మతమును సమర్థించినారు. ఇంకను ఎన్నియో గ్రంథములు "సంక్షేపశారీరకాదులు" ఈ మతమును బోధించునవియే ప్రకటితమైనవి. ఇందువలన శ్రీ శంకరభాష్య ప్రాశస్త్యము గాంభీర్యము తెలియును.

కొన్ని ప్రశంసలు

శ్రీ వాచస్పతి మిశ్రులు - "నత్వా, విశుద్ధ విజ్ఞానమ్ శంకరం కరుణాకరమ్ భాష్యం ప్రసన్నగంభీరమ్ తత్ప్రణీతం విభజ్యతే" భాష్యము, ప్రసన్నముగను, గంభీరముగను నున్నదని కీర్తించినారు. అమలానన్దసరస్వతి - తమ కల్పతరు వ్యాఖ్యానము నందు - "వేదాన్తార్థ, తదాభాస క్షీర నీర వివేకినమ్ నమామి భగవత్పాదం పరహంస పురంధరమ్" వేదాన్తములకు ప్రమాణశుద్ధమైన అర్థము, శుద్ధమైనదిగా భాసించు అర్థము - అను క్షీరమును, నీరమును విభజింపగల పరహంస, శ్రీ శంకరులు - అని స్తుతించినారు.

పద్మపాదాచార్యులు - భగవతో భాష్యకారస్య మతమ్ ఆగమయితవ్యమ్ శ్రీ శంకర భగవత్పాదుల భాష్యమును ఆగమముగా (వేదముగా) గ్రహింపవలెను. అనినారు.

గౌడ బ్రహ్మానందులు అను మహాపండితులు, "అద్వైతసిద్ధి" అనుగ్రంథమును వ్రాసిన మధుసూదన సరస్వతిని "మధుసూదన సరస్వతియొక్క వాక్పారము సరస్వతికి తెలియును. సరస్వతియొక్క పారము మధుసూదన సరస్వతికి తెలియును అని స్తుతించినారు.

ఆ మధుసూదన సరస్వతి "నేనుగూడ భగవద్గీతకు వ్యాఖ్యానమును వ్రాసినను నాకు భాష్యకారునితో సామ్యములేదు. బంగారముతో పాటుగా, గురింద గుంజనుగూడ (బంగారమును తూచునపుడు) త్రాసునందు ఉంతురు. అంత మాత్రమున గురింద గింజ బంగారముతో సమానమగునా ? అనినారు.

ఇక అప్పయ్యదీక్షితులకు శ్రీ శంకరులపైనున్న గౌరవమునకు పరిమితిలేదు. ఒకచోట "ప్రామాదికమ్ సంపాతాయాతం భగవత్పాదాః ననిఖన్తి" భగవత్పాదులు ఎప్పుడు పొరబాటున గూడ తప్పు వ్రాయరు అనినారు. తాము వ్రాసిన సిద్ధాన్తలేశ సంగ్రహమునందు "అధిగతభిదా పూర్వాచార్యాన్ ఉపేత్య సహస్రధా సరిదివ మహీభేదాన్ సంప్రాప్య శౌరిపదోద్గతా" "జయతి భగవత్పాద శ్రీమన్ముఖాంబుజ నిర్గతా జనన హరణీసూక్తిః బ్రహ్మాద్వయైక పరాయణా" అని స్తుతించినారు. విష్ణుపాదము నుండి పుట్టిన ఒకేగంగ ఆయా దేశములలో చీలి భిన్న నదులుగా ప్రవహించినట్లు శ్రీ శంకరుని సూక్తియొకటియే ఆయా వ్యాఖ్యాతల ముఖమున వివిధముగా వెడలినది అనగా శ్రీ శంకరుల తరువాత వచ్చిన వ్యాఖ్యాతలు ప్రతిపాదించిన, అవచ్ఛేద వాదము, బింబ ప్రతిబింబ వాదము అభాస వాదము, ఏకజీవ వాదము మొదలగు పరస్పర విరుద్ధ వాదము లన్నియు శ్రీ శంకరుల భాష్యములలో లభించు రత్న

ములే వానికన్నిటికిని మూలములు భాష్యములయందే కనుపడునని భావము. దీని వలన శ్రీ శంకరుల భాష్యములెంత గంభీరార్థములో తెలియవలెను.

**Charles Johnston - "....silver tongued Shankara taught the final lessons of Vedantic phiolosophy. Every conclusion even the very phases of our best modern thought have their counterparts in the great teacher's works, and we are constrained to say, the Indian expression of the altimate truth has a finer quality of style than the modern. for Shankara says, the last reality is not the reverted will toward life, or some hypothetical Force, but our own inmost and eternal selves, and we can easily see how much higher an expression, from the print of View of powcr and beauty, Shankara's is than kaut and Schopenhaur."**

శ్రీ శంకరుల తాత్త్వికదృష్టి వాదప్రధానము. స్వాభిమాన పూరితము కాదు. మనసులో కొన్ని అభిప్రాయములను ముందుగనే సిద్ధాన్తములుగా గ్రహించి, ఆ సిద్ధాన్తముల కనుకూలముగా, వేదాదులకు అర్థమును చెప్పగూడదు అనినారు శ్రీ శంకరులు "వేదార్థ జిజ్ఞాసుభిః పూర్వనిర్ణీతాః స్వాభిప్రాయాః నోపనిషత్సు అన్వేషణీయాః అపితు నిర్మత్సరైః శ్రుత్యర్థో విచార్య నిర్ణేతవ్యః" — "ఏవం తర్హి శ్రుణు శ్రుత్యర్థమ్, హిత్వా సర్వాభిమానమ్, న, స్వాభిమానేన వర్షశతేనాపి శ్రుత్యర్థో జ్ఞాతుం శక్యతే సర్వైః పండితమ్మన్యైః" ముందుగనే తాము నిర్ణయించుకొనిన అభిప్రాయములు ఉపనిషత్తులలో ఎచట దొరకునా అని వెదకదగదు మఱి, మాత్సర్యము విడిచి శ్రుత్యర్థమును విచారింపవలెను.

"అగుచో అభిమానమునంతను వదలి శ్రుత్యర్థమును వినుము అభిమానముతో నూరేళ్ళు గడిచినను ఏ పండితమ్మన్యులును శ్రుత్యర్థమును తెలిసికొనలేరు".

"కిం పరమత నిరాకరణేన పరవిద్వేష కారణేన...." ఏకత్వ దర్శనం ప్రతి ఆదరవన్తో ముముక్షవః స్యురితి తార్కిక మతదోష ప్రదర్శనం కించి దుచ్యతే స్మాభిః నతు తార్కికవత్ తాత్పర్యేణ".

పరులకు ద్వేషమును కలిగించు, పరమత నిరాకరణముతో మాకు పనిలేదు. అయినను ముముక్షువులు, ఏకత్వ దర్శనమునందు ఆదరము కలవార మగుదురు

గాక, (ఏకత్వ దర్శనమునందు ఆదరము కలిగి, ముముక్షువు లగుదురుగాక) అను నభిప్రాయముతో తార్కిక మతములోని కొన్ని దోషములను చెప్పుచున్నాము. అంత మాత్రమే కాని తార్కికులవలె, దోషములను కేవలము చూపవలయును అను తాత్ప ర్యముతో చూపించుట లేదు. ఈ వాక్యముల వలన శ్రీ శంకరులు స్వమతాభి నివేశ ముతో పిడివాదము చేయలేదని తెలిసికొనగలము.

కొన్ని మతాలలో ఇతరులుచెప్పిన వ్యాఖ్యానమునుగూడ, తమయొక్క ముఖ్య సిద్ధాంతమునకు విరోధము కానిచో అంగీకరించినారు. ఈశావాస్యోపనిషత్తు నందున్న "విద్యాంచావిద్యాంచ" అను మన్త్రమునకు, మూడు చోట్ల మూడు విధముల వ్యాఖ్యాన ములను గూడ వ్రాసినారు. న్యాయ మీమాంసా సాంఖ్య సూత్రభాష్య కర్తలమతమును తాము పూర్తిగా అంగీకరింపకున్నను, వారి ప్రస్తావన వచ్చినప్పుడు వారిని పూజ్య భావముతో సగౌరవముగ పరామర్శించినారు.

"శ్రీ శంకరుల ప్రామాణ్య వాదము విజ్ఞానశాస్త్రీయ దృష్టి"-నేడు సైంటిస్టులు అనుకొను వారి దృష్టికిని శ్రీ శంకరుల దృష్టికిని ఏ మాత్రమును తేడా లేదు - వేద ప్రమాణ విచారణ చేయునపుడే విషయము గోచరమగును.

"న వాక్యస్య వస్త్వన్వాఖ్యానమ్ క్రియాన్వఖ్యానం వా ప్రామాణ్యకారణమ్। కిం తర్హి నిశ్చిత ఫలవద్విజ్ఞానోత్పాదకత్వమ్। తదృత్రాస్తితత్ ప్రమాణమ్। యత్ర నాస్తి తదప్రమాణమ్ ఒక వస్తువును గుఱించిగాని, క్రియనుగుఱించిగాని తెలియచేసి నంత మాత్రమున ఒక వాక్యము - ఉపనిషద్వాక్యమైనను - ప్రమాణముకాదు. మఱియేమి? నిశ్చయముగా ఫలమును కలుగజేయు విజ్ఞానమును కలుగచేయుటయే ఆ వాక్యమునకు ప్రామాణ్యమును కలుగచేయును. ఉపనిషద్విజ్ఞానము, మన అజ్ఞాన మును పోగొట్టుట - అను ప్రత్యక్షఫలమును నిశ్చయముగా నిచ్చుటచే ఉపనిషత్తులు ప్రమాణములైనవి - "నిశ్చిత ఫలవత్ విజ్ఞానమును" కలుగచేయ వాక్యము అప్రమా ణము....

"అనుభవాదయశ్చ యథా సంభవమ్ ఇహ ప్రమాణమ్-అనుభవావసానత్వాత్, భూతవస్తు విషయత్వాచ్చ బ్రహ్మజ్ఞానస్య"

అనుభవము మొదలైనవియును యథాసంభవముగ ఇచట ప్రమాణము. బ్రహ్మ జ్ఞానముఅనునది అనుభవముతో సమాప్తిచెందును - అది ఇదివఱకే సిద్ధమైన వస్తు వును (ఆత్మను = బ్రహ్మను) గుఱించి తెలియచేయును. అనుభవములోనికి తెచ్చును.

జ్ఞానమనునది 'వస్తు తన్త్రము' ఉన్నవస్తువుపై నాధారపడినది కాని, పురుషుని ఊహపైగాని కేవలము ఇంద్రియ జ్ఞానముపైగాని ఆధారపడలేదు. పసికర్లు అను

కంటిజబ్బు కలిగిన వాని చూపు వస్తువును ఉన్నదున్నట్లు చూపలేదు. చంద్రుడు - అను వస్తువు ఎప్పుడును ఒక రీతిగనే యుండును మన చూపుననుసరించి మాఱదు. చంద్రుడు - అందఱకును సరియైన చూపు ఉన్నవారికి ఒక రీతిగనే కనుపడును, ఈ వాక్యముల వలన తేలినది మనకు అనుభవము కలుగజేయునదియే ప్రమాణము. అది అందఱకును ఒక విధమగు అనుభవమునే కలుగజేయును. ఆత్మ అనునది అందఱకును అనుభవములో నున్నదియే. ఇక "అది బ్రహ్మ" అను విషయములో శ్రుతి వాక్యము ప్రమాణము. సాధన చతుష్టయ సంపత్తి కలిగిన బ్రహ్మను తెలిసిన వారికి అందఱకును ఏకాత్మతానుభవమే కలుగును. బ్రహ్మాత్మాభేదానుభవమ్ కలుగును. లేనివారికి కలుగదు. ఆ అనుభవము లేనివారు బ్రహ్మగత భేదాభేదములను గుఱించి మాట్లాడుటకే అర్హులుకారు. అందువలననే శంకరులు బ్రహ్మానుభవములేని తార్కికులనుద్దేశించి యిట్లనినారు. "యోహ్యాత్మానమేవ న జానాతి స కథం మూఢ తద్గతమ్ భేదమ్అభేదమ్వా విజానాతి"? తననేతెలిసికొనని మూఢునకు, తన యందలి (ఆత్మయందలి) భేదముకాని, అభేదముకాని ఎట్లు తెలియును ?

ఇంకొకవిషయము సైన్సు అనునది లేని వస్తువునుగాని క్రియను గుఱించిగాని తెలుపదు. అదివఱకు ఉన్నదానినే, మనకు తెలియని దానిని తెలియచేయును. గురుత్వాకర్షణ సూత్రమువిషయము సాపేక్షవాద విషయము ఆది వఱకు ప్రకృతిసిద్ధముగనేయున్నవి. కాని మనకు, పూర్వము, వాని విషయము తెలియదు. విజ్ఞానశాస్త్రజ్ఞులు వానిని తెలిసికొని మనకు తెలిపినారు. ప్రకృతిలోనున్న ఆ క్రియా లక్షణములను వారు సృష్టింపలేదు, ఈ విషయమునే శ్రీ శంకరులు "జ్ఞాపకమ్ హి శాస్త్రమ్-న కారకమ్" శాస్త్రము జ్ఞాపకమేగాని కారకముగాదు అని తెలిపినారు. ఉపనిషత్తులలో చెప్పిన విషయమును "ఆత్మశరీరము" అను ప్రయోగశాలలో పరీక్షింప వచ్చానని, ఆత్మ బ్రహ్మయే అనుట అనుభవసిద్ధమే అని శ్రీ శంకరుల అభిప్రాయము - సైంటిస్టుల దృష్టికి ఈ అభిప్రాయమునకు భేదమేమి ?

"ఈ ప్రామాణ్యవాద ఫలము" ప్రమాణ వాక్యనిర్వచనమును ఇట్లు చేసినందు వలన శ్రీశంకరులు వేద వాఙ్మయమునకు మహోపకారము చేసినారు. తార్కికుల మతము ననుసరించి, ఈశ్వర ప్రోక్తమగుటచే వేదములు ప్రమాణములైనవి ఈశ్వరుడున్నాడనుటకు ప్రమాణము వేదమే అనుచో అన్యోన్యాశ్రయము అను దోషము వచ్చును. అందుచే కుండను చేయుటకు కుమ్మరి ఒకడుండవలయును. జగత్తును సృష్టించి నడుపుటకు ఈశ్వరుడుండవలయునని ఈశ్వరుని సాధించినారు. మీమాంసకులు, వేదము అపౌరుషేయము, శబ్దార్థ సంబంధము నిత్యము అనిచెప్పి వేదమును

ప్రమాణముగా నంగీకరించినారు. కాని, అందులో "స్వర్గకాముడు నిష్కామముగ కర్మలను చేసినచో అవి జ్ఞాన సంపాదకములై క్రమముక్తి సాధనములగుననినారు.

అ) "కర్మయోగః సత్వశుద్ధిః జ్ఞానప్రాప్తిః సర్వకర్మ సన్యాసః జ్ఞాననిష్ఠా, క్రమేణశాన్తిః" గీ.భా. కర్మయోగము వలన సత్త్వశుద్ధిచే (మనశ్శుద్ధి) దానిచే జ్ఞాన ప్రాప్తి తరువాత సర్వకర్మ సన్న్యాసము తరువాత జ్ఞాననిష్ట తుదకు శాన్తికలుగును.

ఆ) "కర్మనిష్ఠాయాః జ్ఞాననిష్ఠాప్రాప్తి హేతుత్వేన పురుషార్థ హేతుత్వమ్ న స్వాతంత్ర్యేణ" కర్మనిష్ట, జ్ఞాననిష్టను పొందుటకు హేతువగుటచే అది పురుషార్థ హేతువు. స్వతంత్రముగ పురుషార్థ హేతువు మాత్రముగాదు. కర్మనిష్టచే లబ్ధమైన జ్ఞాననిష్ట మాత్రము సాక్షాత్తు స్వయముగ పురుషార్థ హేతువగును.

ఇ) అంతమాత్రమేగాదు నైష్కర్మ్యము-కర్మరాహిత్యము సిద్ధింపవలయు నన్నచో కర్మలను చేయవలయును అనియు చెప్పినారు. "కర్మారంభస్యైవనైష్కర్మ్యో పాయత్వాత్" నైష్కర్మ్యమునకు కర్మల నారంభించుటయే యుపాయము.

ఈ విధముగ మీమాంసకులకు తమ జ్ఞానప్రణాళికలో చోటును కల్పించియే వారి పరమ సిద్ధాన్తమును మాత్రము కాదనినారు. అందువలననే తరువాతి కాలపు మీమాంసకులు ఆత్మదర్శనము విషయమై శ్రీ శంకరుల వేదాన్త దర్శనమును ప్రమాణముగ గ్రహింపవలెననినారు.

జ్ఞానము - జ్ఞాననిష్ఠ ప్రత్యక్ష ఫలముల నిచ్చును ....

పూర్వము సూచించిన రీతిని కొన్ని కర్మలు ఈ లోకములోనే, ప్రత్యక్ష ఫలములనేయవు. జ్ఞానము మాత్రము ఈ లోకమునందే ఫలమునిచ్చును.

1) "అనవగమన నివృత్తేః దృష్టత్వాత్ - దృశ్యతే హి ఏకత్వ విజ్ఞానాదేవ - అనవగమన నివృత్తిః"

తెలియకపోవుట అనునది జ్ఞాన నిష్ఠ వలన పోవును. అది దృష్టమైన ఫలము ఏకత్వ విజ్ఞానము వలన, అనవగమనము - తెలియమి, తొలగిపోవును.

2) "అవిద్యాతమోనివర్తకమైన జ్ఞానము దృష్టమైన కైవల్య ఫలమునిచ్చును"

3) "అవిద్యా నివృత్తియనెడు ఫలము కనుపడుటచే ఈ జ్ఞానము అనర్థకము = నిష్ప్రయోజనము కాదు. దీనికి బాధకమైన జ్ఞానము వేఱొకటి కలుగుటలేదు

అందుచే ఇది భ్రాన్తియును గాదు.

4) దర్శన పర్యవసానములైన శ్రవణాదులు ఆవర్త్యమానములైనపుడు .... ధాన్యమును దంపినపుడు, పైపొట్టు పోవుట, అనుదృష్టఫలకము కనుపడినట్లే, దృష్టార్థములు (అజ్ఞాన నివృత్తియను ప్రత్యక్ష ఫలమునిచ్చునవి) అగును.

ఇట్లు పలుతావులలో, శ్రీ శంకరులు ఉపనిషత్తులలో చెప్పిన శ్రవణ మననాదులును ప్రత్యక్ష ఫలదములనియు, బ్రహ్మాత్మైక విజ్ఞానము మోక్షమనెడు దృష్ట ఫలమునిచ్చుననియు చాటిచెప్పినారు. "ఆత్మజ్ఞానము సద్యోముక్తికరమనియు"ను చెప్పినారు. సాధన సంపత్తి కలవారికి ఆ మోక్షను భూతి, అందఱకును కలుగును అని తెలిపినారు. ఇది సైంటిస్టుల దృష్టికి తీసిపోవునదికాదు.

శ్రీ శంకరులు హేతువాదము:- శ్రీ శంకరులు హేతువాదమును అంగీకరించినారు. శ్రోతవ్యో "మన్తవ్యో" అను వాక్యమును వ్యాఖ్యానించునపుడు మన్తవ్య: తర్కత:- తర్కముతో మననము చేయవలయును అనినారు. ఈ విషయమునే "మన్తవ్యశ్చోప పత్తిభి: ఉపపత్తులతో మననము చేయవలయును" అనినారు. కేనోపనిషత్తునకు ఒక భాష్యమును వ్రాసినారు. అచట శారీరక న్యాయములతో అర్థ నిర్ణయము చేయలేదు, అను అసంతుష్టితో న్యాయప్రధానములైన శ్రుత్యర్థ సంగ్రాహక వాక్యములతో రెండవ భాష్యమును వ్రాసినారు అని ఆనందగిరి వ్యాఖ్యానము నందున్నది. అందుచే ఆగమార్థముచే పరీక్షా పూర్వకముగా నిర్ణయించుటకు ఈ కాండ ప్రారంభమైనది. (బృ. .) అనినారు.

"తస్మాదాగ మార్థస్యైవ పరీక్షా పూర్వకం నిర్ధారణాయ ఇద మారభ్యతే" న్యాయశాస్త్రమునందు చెప్పిన వ్యాప్తిని (Syllogism) హేత్వాభాసలను (fallacies) అంగీకరించి, వానితోనే నైయాయిక మతమును ఖండించినారు. మీమాంసక న్యాయములను గ్రహించి, వానికి అనుగుణముగ గూడ తమ భాష్యములను వ్రాసినారు. "నాసతో విద్యతే భావః" అను గీతాశ్లోక భాష్యమును చూచితిమిగదా! అది అంతయు హేతు బద్ధము కాదా? అసలు శ్రీ శంకర భాష్యమునందు హేతుబద్ధము కాని వాక్యార్థమే లేదు అయినను హేతువాదమునకు ఒక పరిమితి యున్నది. 1) హేతువాదము ప్రత్యక్ష దృష్టమైన విషయములను ఆధారము చేసికొనియే, ప్రవర్తించును. 2) తర్కము ఆయా పురుషుల బుద్ధిబలము ననుసరించి యుండును. సాంఖ్యులను నైయాయికులు ఖండించినారు. నైయాయికులను తమ వాదముతో సాంఖ్యులు నిరసించినారు. తర్కముతో "ఇది తుది నిర్ణయము" అన, సాధ్యముకాదు. తర్కము అప్రతిష్ఠితము. పురుషులు దోషదూషితులు. వారి తర్కమును దోషదూషితమయి తీర

వలయును. అందుచే కేవల తర్కముతో నిర్ణయము చేయుట తగదు. "ఇతశ్చ నాగమగమ్యే అర్థే కేవలేన తర్కేణ ప్రత్యవస్థాతవ్యమ్" వేదము చేతనే తెలియ దగిన విషయములో కేవల తర్కము ఉపయోగించదు. "యస్మాత్ నిరాగమాః పురుషోత్ప్రేక్షా నిబంధనాః తర్కాః అప్రతిష్ఠితాః భవన్తి ఉత్ప్రేక్షాయాః నిరంకుశ త్వాత్" ఆగమ బలములేని కేవలము పురుషోహాజన్యములైన తర్కములకు అంతుం డదు. ఉత్ప్రేక్ష నిరంకుశముగదా! "తథాహి కైశ్చిదభియుక్తైః యత్నేనోత్ప్రేక్షితాః తర్కాః అభియుక్తతరైః అన్యైః ఆభాస్యన్తే ఇతి నప్రతిష్టితత్వమ్ తర్కాణామ్" ప్రతిభావంతుడైన ఒక పండితుడు, ఎంతయో యత్నముచేసి ఊహించిన విషయ మును ఆయనకంటె ఎక్కువ ప్రతిభగల పండితుడు, ఆ ఊహసరికాదని నిరూపిం చును"—"కపిలకణభుక్ ప్రభృతీనాం పరస్పర విప్రతిపత్తి దర్శనాత్" కపిలుడు కణాదుడు పరస్పరము దోషోద్భావనమును చేసినారు. అందువలన తర్కమునకు తావులేదని కాదు. ప్రస్తుతము ఆత్మ స్వరూప విచార విషయము అతి గంభీరమైనది. ఇటువంటి విషయములో, తర్కమునకు తావులేదు. మిగిలిన విషయములలో నున్నది అని నిరూపించినారు. పై వాక్యములును హేతుబద్ధములుగనే యున్నవి గదా! ఇచట శంకరులు చెప్పిన విషయమునే భర్తృహరి రచితమైన వాక్యపదీయ బ్రహ్మకాండలో, ఈ పదములతోనే వివృతమగుటను మనము గుర్తింపవలెను. ఉదా॥ యత్నేనానుమితోప్యర్థః కుశలైరను మాతృభిః అభియుక్తతరైరన్యై రన్యథై వోప పాద్యతే"

శ్రీ శంకరులు-శ్రుతి:- ఒక్కొక్కచో ఒక్కొక్క ప్రమాణముపనికి వచ్చును. చెవి కేవలము వినగలదు. కన్ను చూడగలదు. ఒకదానిపని ఒకటి చేయలేదు. అటులే లౌకిక విషయములో ప్రత్యక్షానుమాన ప్రమాణములు ఉపయోగించును అందులోను ప్రత్యక్షమునకు విరుద్ధమగు అనుమానము ప్రమాణముకాదు. అటులే అతీంద్రియమగు నర్థమును తెలిసికొనుటకు వేదమే పరమ ప్రమాణము. అసలు వేదమనునదియు ఒక విధమగు ప్రత్యక్షమే ఋషులకు దివ్యదృష్టి యున్నది. ఆ దృష్టితో చూచినవి ప్రత్యక్ష తుల్యములే. "అస్మాకమ్ అప్రత్యక్షమపి చిరంతనానామ్ ప్రత్యక్షమ్" మనకు ప్రత్యక్షముగాకున్నను, పూర్వులకు ప్రత్యక్షమే అనినారు శంక రులు. భర్తృహరియు "అతీంద్రియా న సంవేద్యాన్ పశ్యన్త్యార్షేణ చక్షుషా" అను వచనములో ఈ విషయమునే తెలిపి వారి దర్శనము, "ప్రత్యక్షాన్నాతిరిచ్యతే' ప్రత్య క్షము కంటె భిన్నమైనది కాదు అనినారు. ఆ దర్శనము "నానుమానేన బాధ్యతే" అది అనుమానముచే బాధింపబడదు అనినారు. మన కనులకు కనపడని నక్షత్ర గ్రహములు టెలిస్కోపులో చూచినపుడు కనపడును. మనకు కనపడలేదని, ఆ నక్ష

త్రములు లేవనగలమా? **Sub Conscious, Conscious, and Super Conscious states**, అని మూడు **అవస్థలున్నవి.** ఋషివాక్యములు, శ్రుతి వాక్యములు మూడవ దశకు సంబంధించినవి. నైయాయికులును "యోగజ **ప్రత్యక్షమును**" **అంగీకరించి** నారు. యోగులకు అతీంద్రియ వస్తువులు గోచరించును" "మన ఏవ కేవలం రూప జ్ఞాననిమిత్తం యోగినామ్" అనినారు శంకరులు. యోగులకు **రూపమును** చూచుటకు మనసొకటి చాలును. అని దీని భావము. **ఈనాడు Para psychology Tele pathy clairvoyance** అనువానిని గుఱించి మనము తెలిసికొనినపుడు, **శ్రుతి** ప్రామాణ్యమును మనము గుర్తింపగలము. అంతమాత్రమున వేదప్రాముఖ్యము **అన్ని** విషయములకును వర్తింపదు. వేదమైనను ప్రత్యక్షప్రమాణమునకు విరుద్ధమైనచో, దానిని పాటింపనక్కఱలేదు.

న హి ప్రత్యక్ష విరోధే శ్రుతేః ప్రామాణ్యమ్. న హి శ్రుతి శతమపి శీతోగ్నిః అప్రకాశః ఇతి బ్రువన్ ప్రామాణ్యమ్ **ఉపైతి**" ప్రత్యక్ష విరోధమైనపుడు శ్రుతి ప్రమాణముగాదు. నిప్పు చల్లగా నుండును. దానికి ప్రకాశములేదు. అని వేదము చెప్పినను ప్రమాణమగునా ? అనినారు శంకరులు.

వ్యవహార జగత్తు

శ్రీశంకరాద్వైతము ననుసరించి ప్రపంచమునకు **పారమార్థిక** సత్యత్వములేదు వ్యావహారిక సత్యత్వమున్నది. ద్వైతులు చెప్పినట్లు పారమార్థిక సత్యత్వములేదు. అందుచే బ్రహ్మాత్మైక్య జ్ఞానముకలుగు వఱకును, వేదవిహిత కర్మలను, చేయవలెను వ్యావహారిక క్రియలను నిర్వహింపవలెను. అనియే శంకరులు చెప్పినారు. "ప్రాక్ ప్రబోధాత్ సంసారిత్వాభిగమః - సర్వవ్యవహారాణామేవ ప్రాక్ బ్రహ్మాత్మత్వ విజ్ఞానాత్. సత్యత్వోపపత్తేః స్వప్నవ్యవహారస్య ప్రాక్ప్రబోధాత్" మెలకువ రానంతవఱకు కలయు సత్యమే - అయితే బ్రహ్మజ్ఞానము కలుగుటకు **పూర్వము** ప్రపంచము సత్యమే. అనుటచేఅద్వైతులు ప్రపంచసత్యత్వము నంగీకరింపరనుట సత్యదూరము.

పురుషప్రయత్నము

పురుషకారమునకు తావులేనిచో, అంతయు దైవాధీనమే అగుచో "కర్మలు చేయుడు" అని శాసించిన శాస్త్రము, అనర్థకమగును. అందుచే **పురుషప్రయత్నము** అవసరమే అనినారు. పురుషుడు, ముందు రాగద్వేషముల పోగొట్టుటకు యత్నింపవలెను. అపుడు శాస్త్రము చెప్పినట్లు నడిచినచో ఫలితము దక్కును....

"పురుషకారస్య విషయానుపపత్తేః శాస్త్రానర్థక్యమ్" శాస్త్రార్థే ప్రవృత్తః **పూర్వమేవ రాగద్వేషయోః వశం నాగచ్ఛేత్** "(గీ. భా.) **జ్ఞాతే అనర్థమూలే** తదుచ్ఛే

దాయ యత్నం కుర్యాత్; అనర్థనాశనమునకు యత్నింపవలెను అనినారు. అద్వైత మతము నిష్క్రియతను బోధించును అను ఆక్షేపము సరియైనదికాదు. నిష్క్రియ అను కు నిష్కామకర్మ, కర్తృత్వాభిమాన రహితమైన కర్మ అని అర్థము. అటు వంటి కర్మను చేయుడనియే, శంకరుల బోధ. లౌకిక వ్యవహార విషయమునగూడ నీ విషయము వర్తించును. ఏ ప్రయత్నము చేయగూడదనలేదు.

నీతి

కఠోపనిషత్తులో "నా విరతో దుశ్చరితాత్ నాశాన్తో నా సమాహితాః నాశాన్త మానసో వాపి ప్రజ్ఞన్నైవ మాప్నుయాత్'' అని యున్నది. దుశ్చరితము నుండి విరమింపని వానికి ఆత్మప్రాప్తి లేదు అని యీ సూక్తి సూచించును. ''పాపకర్మణః అవిరతః" నాపీన్ద్రియ లౌల్యాత్ అనుపరతః అని శంకరులు వ్యాఖ్యానించినారు. పాపకర్మలు చాలింపవలెను. ఇంద్రియ లౌల్యము కూడదు కేవల ప్రజ్ఞతో ఆత్మ లాభము కలుగదు. అని భావము. ''ఆదౌ ఇంద్రియాణి స్వవశేస్థాపయితవ్యాని" మొదట సాధకుడు, ఇంద్రియములను తన వశము నుంచుకొనవలయును- ''శాస్త్రా చార్యోపదేశ శమదమాది సంస్కృతమ్ మనః ఆత్మదర్శనే కారణమ్" శాస్త్రము - ఆచార్యులు వీరి ఉపదేశముతో, శమము దమము - అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహము వీనితో, సంస్కృతమైన, మనస్సు ఆత్మదర్శనమునకు కారణము అని నారు. ఇట్లు క్రమశిక్షణ, ఇంద్రియ జయము, నైతిక ప్రవర్తనయు అవసరమనియే ఉపనిషత్తులు, శ్రీ శంకరులును చెప్పినారు. ''నిస్త్రైగుణ్యే మార్గమున విహరించు వారికి విధినిషేధములు లేవు." అనుమాట సామాన్యుల విషయమున వర్తింపదు.

ఆధ్యాత్మవిద్య - రాజనీతి

"ఇమం వివస్వతేయోగం ప్రోక్తవాన్ అహమవ్యయం" అను గీతా శ్లోకమును వ్యాఖ్యానించుచు శ్రీ శంకరులిట్లనినారు.

"జగత్పరిపాలయిత్రూణాం క్షత్రియాణాం బలాధానాయ"-తేన, హి, యోగ బలేన యుక్తాస్సమర్థా భవంతిబ్రహ్మ పరిరక్షితుం" జగత్తును పరిపాలించు క్షత్రియు లకు అధ్యాత్మ విద్య బలము నిచ్చును. అని దీని భావము. సర్వబ్రహ్మ భావన కల వారికి రాగద్వేషము లుండవు ప్రజలను నిష్పక్ష పాతముగ పరిపాలింపగలరు. ప్రజా క్షేమమే తమ క్షేమముగను, ప్రజాసౌఖ్యమునే తమ సుఖముగను చూడగలరు. "తత్రకోమోహః కశ్శోకః ఏకత్వమను పశత్యః" ప్రపంచము నంతటను బ్రహ్మను, ఏకత్వమును చూచునతనికి శోకమోహము లెట్లుండును? అవి లేనపుడు, రాజ్య పరి పాలనము ధర్మ్యముగా సాగును. ఇచట, ఈ జ్ఞానమును "యోగబల" మనినారు.

ఇది యోగ యోగము-మనువు గూడ "ఇంద్రియాణామ్ జయేయోగమ్ సమాతిష్ఠేత దివానిశమ్" జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః" రాత్రింబవళ్లు రాజయిన వాడు ఇంద్రియ జయమును యోగముగా సాధన చేయవలయును. జితేన్ద్రియుడు ప్రజలను వశము చేసికొనగలడు" అని భావము. పై గీతా భాష్యమునందే శంకరులు ఇంకొక వాక్యమును చెప్పినారు. "బ్రహ్మక్షత్రే పరిపాలితే, జగత్పరిపాలయితుమలమ్" బ్రహ్మ క్షత్రములను పరిపాలింపగలచో, జగత్తును (ఒక రాష్ట్రమో దేశమోకాదు) పరిపాలింప వచ్చును. ఈ వాక్యార్థమునకు వివరణము మనుస్మృతి యందు, మనకు లభించును.

"బ్రహ్మక్షత్రం చ సంపృక్తమిహచాముత్ర వర్థతే"
"యత్రాదృష్టభయం బ్రహ్మప్రజానాం శమయత్యుత
దృష్టంచరాజా బాహుభ్యామ్"

"బ్రహ్మక్షత్రములు కలియుచో, ఈ లోకము పరలోకముల యందుగూడ వృద్ధి నందును" మనకు తెలియని, దైవికమైన దుర్భిక్షాది ప్రమాదములను బ్రహ్మ నివారించును. తెలిసిన శత్రువుల వలన వచ్చిన భయమును రాజు తన బాహుబలముతో పోగొట్టును. గీతలోనే ఉపోద్ఘాత భాష్యములో "బ్రాహ్మణత్వస్య హి రక్షణేన రక్షితిస్స్యాత్ సర్వోధర్మః" "బ్రాహ్మణత్వమును రక్షించుటచే సర్వధర్మము రక్షితమైనట్లే" అనినారు. "బ్రాహ్మణత్వమనగా" సత్త్వగుణమును కలిగియుండుట, అని మఱియొకచో చెప్పినారు. "ధర్మమనగా అభ్యుదయ నిశ్శ్రేయస సాధనమైనది" అనియును ఇచటనే చెప్పినారు. సత్యాహింసా శౌచశమ దయా దమాదులకును ధర్మమని నిర్వచన మున్నది. ఇవి ఆత్మ గుణములు కూడనగును. ఇటువంటి ధర్మమును రాజు రక్షించుచో, ప్రపంచము క్షేమముగ నుండును. శ్రీరాముడు, జనకుడు మొదలగు వారు అందువలననే, కేవలము రాజులుగారు, రాజర్షులైనారు, శ్రీ శంకరుని సందేశమును నేటి యువతరము, నాయకులు గుర్తింపదగును. "గుణాధికైః హిగృహీతః అనుష్ఠీయమానశ్చ ధర్మః ప్రచయం గమిష్యతి"

కర్మలు-నిత్యకర్మ 1) ఇహాముత్రఫలభోగార్థాని కామ హేతూని కర్మాణి 2) ప్రాగాత్మ జ్ఞానాత్ ప్రవృత్త్యుపపత్తేః 3) అభ్యుదయార్థోపి ప్రవృత్తి లక్షణః ధర్మః వర్ణానాశ్రమాంశ్చ ఉద్దిశ్య విహితః దేవాధిస్థాన ప్రాప్తి హేతురపి, సన్నీశ్వరార్పణ బుద్ధ్యా అనుష్టీయమానః సత్వశుద్ధయే భవతి ఫలాభి సంధివర్జితః 4)యావత్ ధ్యానావరోహణా సమర్థా: తావత్ గృహస్థేన అధికృతేన కర్తవ్యం కర్మ 5) నిత్యస్య చ కర్మణ: వేద ప్రమాణ బోధ్యత్వాత్ ఫలేన భవితవ్యం అన్యదా వేదస్య ఆనర్థక్య

ప్రసంగాత్" కోరికలతో చేసిన కర్మలు ఇహపర భోగముల నిచ్చును. 2) ఆత్మజ్ఞానము కలుగుటకుముందు ప్రవృత్తి (వేద విహిత కర్మలు చేయుట, లౌకిక కర్మలు చేయుట) ను ఉపపన్నమే అగును. వర్ణాశ్రమాది ధర్మములు దేవలోకాదులను పొందుటకు కారణములైనను, నిష్కామముగ, ఈశ్వరార్పణ బుద్ధితో చేసినచో మనసు పరిశుద్ధ మగును. ధ్యానయోగము కుదఱనంత వఱకు గృహస్థు కర్మలను చేయవలయును. నిత్యకర్మలును వేదములు బోధించినవియే అగుటచే వానికిని ఫలమున్నది. లేనిచో వేదము నిరర్థకమగును. ఈ చివరి విషయమున శ్రీ శంకరులు మీమాంసకాభిప్రాయమును, నిత్యకర్మలు నిష్ఫలములు అవి చేయనిచో ప్రత్యవాయము (దోషము) కలుగును. అనుదానిని వ్యతిరేకించినారు. చేయకుండుట, అను అభావము నుండి దోషము అను భావము పుట్టుటకు వీలులేదు. వేద విహిత కర్మకు ఫలము వుండి తీరవలయును అనునది వారు చూపిన హేతువు. ఇది ఎంత యుక్తియుక్తముగ నున్నదో మీ మాంసకులకును కనువిప్పును కలుగచేయుచున్నదో భావుకులు ఊహింపగలరు.

ఉపాసన-సగుణారాధనము :-ఉపాసనలును కర్మలతో తుల్యములే. సాక్షాత్ మోక్ష ప్రదములు కావు. అయినను జ్ఞానైశ్వర్యాదులు కలుగును "మహతో బ్రహ్మణ! విజ్ఞాన ప్రతీకేన ఉపాసనాత్ జ్ఞానైశ్వర్యవన్తః భవన్తి" బ్రహ్మయొక్క ప్రతీకోపాసనచే జ్ఞానైశ్వర్యవంతులగుదురు.

"పురుషుల బుద్ధులు మన్దమధ్యమోత్తమములుగా నుండును. అందఱును నిర్వికారము, అనన్తమునైన బ్రహ్మయందు బుద్ధిని ఉంచలేరు. అందుచే సగుణోపాసన అచట నచట ఉపదేశింపబడుచున్నది. బ్రహ్మ అంతటను ఉన్నను, ఉపలబ్ధి కొఱకు శాలగ్రామమునందు విష్ణువును ఆరాధించినట్లు, ఏదియో ఒక స్థానములో భావించుట దోషముగాదు." అనినారు శ్రీ శంకరులు—

"నిర్గుణమపి సత్ బ్రహ్మ, నామరూపగతైః సగుణమ్, ఉపాసనార్థం తత్ర తత్ర ఉపదిశ్యతే - సర్వగతాస్యాపి బ్రహ్మణః ఉపలబ్ధ్యర్థ్యం స్థానవిశేషో నవిరుధ్యతే శాలగ్రామ ఇవ విష్ణోః (సూ. భా.)

పరాపర బ్రహ్మసాధనగా, ఓంకారోపాసనము విహితమైనది -" పరావర బ్రహ్మ ప్రాప్తిస్థానత్వేన ఓంకారస్యోపాసనమ్"- హృదయాకాశమునందు ఉపాసనచేయుచో మనోమయత్వాది ధర్మవిశిష్టమైన బ్రహ్మసాక్షాత్తుగ లభించును, (తై. ఉ) అని ప్రణవోపాసనను అంగీకరించినారు. హృదయాకాశమున ధ్యానించుట ఫలప్రదము అనినారు.

భాష్యములు - సాహిత్యదృష్టి— భాష్యములలో, ఉపమారూపకాలంకారములు ఎక్కువగా కనుపడును. కొన్ని వాక్యరచనలలో అర్థాన్తరన్యాస, కావ్యలింగ, వస్తు ప్రతి వస్తూపమ - ముక్తపద గ్రస్తాలంకార చ్ఛాయలు కనుపడును -రూపకాలం కార ములలో విశిష్టత గోచరించును.

ఉపమ ఇత్యేవం పరస్పర విరుద్ధార్థ కల్పనాత్

ఆమిషార్థిన ఇవ ప్రాణినః అన్యోన్య విరుద్ధమానార్థ దర్శిత్వాత్ అపకృష్యన్తే పరమార్థతత్త్వాత్ దూరమేవ" సాంఖ్యులు తార్కికులు మొదలైన ద్వైతవాదులు, పర స్పర విరుద్ధములైన ప్రమాణములతో వస్తునిర్ణయము చేయుచున్నారు. వారు మాంసపు ముక్కకొఱకు పరస్పరము పోట్లాడుకొను ప్రాణులవలె, పరమార్థము నుండి బాగుగా దూరముచేయబడుచున్నారు. ఇచట ఉపమ అర్థవంతము గంభీరము, ప్రసన్నమును.

రూపకము (1) "అతోనుమాన కౌశలమ్ దర్శితమ్ అపుచ్ఛశృంగైః తార్కిక బలీవర్దైః" అందువలన, తోక, కొమ్ములు లేని తార్కికులనెడు అబోతులచే (ఎద్దు లచే) అనుమానకౌశలము ప్రదర్శితమైనది.—

అనుమానకౌశలము ప్రదర్శితము కాలేదు అను అర్థము వ్యంగ్యము. రూప కము రమణీయము గంభీరార్థ స్ఫోరకము. (బృ.ఉ.)

(2) అతో న తార్కిక వాద భటప్రవేశో వేదాన్త రాజప్రమాణ బాహుగుప్తే ఇహైకత్వవిషయే" వేదాన్తమనెడు రాజుయొక్క ప్రమాణములనెడు బాహువులచే సంరక్షితమైన, ఏకత్వమనెడు దేశమునందు (వేఱొకచో దుర్గము అనునారు) తార్కి కుల వాదములనెడు భటులకు ప్రవేశములేదు.

కఠోపనిషద్భాష్యములోని అశ్వత్థవృక్ష వర్ణనమును అభినందించి తీరవల యును. అందలి స్వభావోక్తి రూపకోపమలు హృదయంగమములు. వేదాన్త సిద్ధాంత భావగర్భితములు. అది జన్మ జరామరణాద్యనేకానర్థాత్మకము. ప్రతిక్షణము అన్యథా స్వభావముగలది. మాయామరీచ్యుదక గన్ధర్వనగరాదులవలె దృష్ట నష్ట స్వరూపము కలది అగుటచే, తుదకు చెట్టువలెనే అభావరూపమైనది. కదలే స్తంభమువలె నిస్సా రము, అనేక శతపాఖండ వికల్పములకు ఆస్పదము — వేదాన్త నిర్ధారిత పర బ్రహ్మ మూలసారము, అవిద్యాకామ కర్మావ్యక్త బీజ ప్రభావము, అపర బ్రహ్మ విజ్ఞాన క్రియాశక్తి. ద్వయాత్మక హిరణ్యగర్భాంకురము సర్వప్రాణి లింగభేద స్కంధ, తృష్ణా జలావసేకోద్భూత దర్పము, బుద్ధీంద్రియ విషయప్రవాలాం కురము శ్రుతి స్మృతి న్యాయ విద్యోపదేశ పలాశము యజ్ఞదానతప ఆద్య నేక క్రియా సుపుష్పము, సుఖ దుఃఖ వేదనానేక రసము, ప్రాణ్యుపజీవ్యాన న్త

ఫలము తత్ ప్రాణితృష్ణా సలిలావసేక ప్రరూఢ జడీకృత దృఢ బద్ధమూలము, సత్యనామాది సప్తలోక బ్రహ్మాది భూత పక్షికృత నీడము, ప్రాణి సుఖదుఃఖోద్భూత హర్షశోక జాతనృత్యగీత వాదిత్ర క్ష్వేలితాస్ఫోటిత హసితాకృష్టరుదిత హా హా ముంచ ముంచేత్యాద్యనేక శబ్దకృత తుములీ భూత మహారవము, వేదాన్త దర్శనా నంగ శస్త్ర కృతో చ్ఛేదము సంసార - వృక్షము - అశ్వత్థమువలె కామ కర్మవాతేరిత నిత్య ప్రచలితస్వభావము, స్వర్గ నరక తిర్యక్ ప్రేతాదులనెడు శాఖలతో అవాక్ శాఖ మైనది సనాతనము ఇందులోని భావనాపటిమను, ప్రతిభను, వ్యుత్పత్తిని, గాంభీర్యమును, శబ్ద సంఘటనౌచిత్యమును, సమాసౌచిత్యమును, సహృదయులు భావింప గలరు. గీతాభాష్యములో ఒకచో "న్యాయాచ్ఛ" న్యాయము వలనను, అనినారు. ఆ న్యాయము "సాధ్యము సిద్ధించినపుడు సాధనమున నాదరింపరు" అనునది - దీనిని మనసులో నిడుకొని "నహి నద్యాః పారగః నావం నముంచతి" నదిని దాటినవాడు నావను వదలి వేయకుండడుగదా ? అని వస్తు ప్రతి వస్తూపమ చ్ఛాయను సూచించి నారు. శబ్దాను ప్రాసలు రచనము నందంతటను కనుపడును. నా సతో విద్యతే - భాష్యమునందలి అర్థాన్తరన్యాసము సూచించుటయైనది - ఇట్టి సాహిత్య దృష్టితో చూచినచో ఎన్నియో విశేషములు కనుపడును.

శ్రీ శంకరాద్వైతము-సైన్సు! ఆధునిక విజ్ఞాన శాస్త్రవేత్తలు అనేకులు శ్రీ శంకరాద్వైత సిద్ధాన్తమును "బ్రహ్మ ఏకమే "అద్వితీయమే" జగము మాయ-మిథ్య" అను విషయమును సాపేక్షాది వాదములతో పరిశీలించి అభినందించుచున్నారు వ్యాసవిస్తర భీతిచే కొందఱి అభిప్రాయముతో, కొన్ని పంక్తులను మాత్రమిచ్చు చున్నాను.

"The only possible alternative is simply to keep to the immediate exprience that Conscicusness is a singular of which the plural is unknowrn. That there is only one thing and that what seems to be plurality is merly a servise of different aspects of one thing produced by a deception (the Indian Maya) the same illusion is produced in a gallery of mirrory"

"In christion terminology to say" Hence I am God Almighty" sounds blasphemous and lunatic. But please disregard these connotations for the moment, and consider whether the

above inference is not closest, a biologist can get to, proving God and immortality at a stroke.

Schrodinger - "The Life Epilogue")

2) "So few of us, absorbed as we are in the business of living, pause to think of Maya, (if our definition was right) that the phenomennal universe represents merely a relative or a derived reality pheno reality .... It is to Sankaracharyas everlasting glory that he did just that. (Advaita Vedantha Arther Isenberg).

3) క్రైస్తవులు "Love thy neighbour as thyself" అనినారు. పొరుగు వానిని ఎందుకు ప్రేమింపవలెను? అద్వైతమే సమాధానము చెప్పగలదు. "తత్ త్వమసి" ఆత్మైక్యము ఉన్నది కనుకనే అని సమాధానము.

"సవాఅరె పత్యు: కామాయపతి: ప్రియోభవతి ఆత్మపస్తుకామాయపతి: ప్రియో భవతి" ఆత్మప్రియ మగుటచేతనే భర్త ప్రియుడగుచున్నాడు. ఆత్మ విత్తముకంటె భార్యాపుత్రులకంటె ప్రియతమమైనది. అందుచే అందరను-సర్వమును- ఆత్మగా బ్రహ్మముగా భావింపవలెను. మైత్రి-కరుణ ముదిత అనుసవియు ఈ భావనా మూలములే.

అద్వైత ప్రయోజనము! సర్వాత్మ భావన కలుగును రాగద్వేషములు నశించును. "త్వయిమయి సర్వత్రైకో విష్ణు: వ్యర్థం కుప్యసిమయ్యసహిష్ణు:" వసుధైవ కుటుంబకమ్ అను భావన కలుగును. ఒక హెచ్చరిక-అందరము సమానమనినంత మాత్రమున ప్రయోజనము లేదు. అంతటను ఆత్మను-బ్రహ్మను భావింపవలయును.

అద్వైతప్రభావము! శ్రీ శంకరాద్వైతము-లేదా ఉపనిషదద్వైతము పాశ్చాత్త్యుల నెందఱినో ప్రభావితులను చేసినది-ఒక ఉదాహరణము.

Garlyle "This solid seeming world after all is an air image over Me, the only reality, and nature with its thousand

fold production and destractions but the reflex of our inward force the fantacy ot our dream.

St Catherine of Genoa "My me' is God.

Sui Saint Bayazid" I went from God until they cried from me in me "Oh thou I"

ఇంకొక విషయము మాధ్వుల ద్వైతవాదమును వదలినచో, మిగిలిన వాదము లన్నియు తను వాదములు అద్వైత వాదములనియే అనినారు. ఒక విశేషణమును మాత్రము చేర్చినారు.

1) విశిష్టాద్వైతము 2) ద్వైతాద్వైతము 3) శుద్ధాద్వైతము.

శ్రీ శంకరులు షణ్మతములను స్థాపించినారు. బౌద్ధ కాపాలిక పాషండాది మతములు బహుళ వ్యాప్తిలోనుండి దేశమున కనర్థమును కలుగచేయు చుండగా, ఆనాడున్న మతములలో అవైదికములయిన వానిని పరిహసించి ఆరు మతములను అంగీకరించినారు. వానిలో గూడ తగిన తగిన సంస్కరణలను చేసినారు. అందున నే షణ్మత స్థాపనాచార్యులని పేరువచ్చినది. గీతా భాష్యము నందలి "స చ భగవాన్ జ్ఞానైశ్వర్య శక్తి బలవీర్య తేజోభిస్సదా సంపన్నః" అను వాక్యముతోనున్న జ్ఞానా దులు క్రమముగా శివవిష్ణు, శక్తి, గణపతి, కుమార, సూర్యరూప భగవచ్ఛక్తులను సూచించునని అభిజ్ఞుల యభిప్రాయము.

శ్రీ శంకరులు ఆదర్శము భారత దేశమున నలుమూలల పీఠములను నెలపి భారత సమైక్య భావమును భారతీయ సంస్కృత్యేకత్వమును సూచించినారు.

సర్వ దేవతా స్తోత్రములు వ్రాసి, శివవిష్ణాదిభేద దృష్టి కూడదని ప్రబోధించి నారు. మతాంతరీకరణము అర్థము లేనిది, మన్త్ర తన్త్రాదులయందు శ్రద్ధగలవారికై ప్రపంచ సారతంత్రమును వ్రాసినారందురు.

న్యాయ మీమాంసా సాంఖ్య యోగాది శాస్త్రములలోని అంశములను గ్రహించి నారు. న్యాయశాస్త్రములోని అనుమానరచనను Syllogism హేత్వాభాసలను గ్రహించినారు. వారి తర్కములతోనే వారివాదము నిర్మూలమని తెలిపినారు. "తత్త్వ జ్ఞానాన్నిశ్రేయసాధిగమః" అను మహర్షి గౌతమ సూత్రార్థము తమకు సమ్మతమే.

ఆత్మ భేద వాదము మాత్రమే సమ్మతముగావని నిరూపించినారు. "దీనితో యోగము ప్రత్యాఖ్యాతమైనది" అని సూత్రమున్నను యోగశాస్త్రమునందు చెప్పిన ఆసన ప్రాణాయామాదులను, సిద్ధులను అంగీకరించినారు. సాంఖ్యమునందలి త్రిగుణములను, పురుషనిర్లిప్త భావమును స్వీకరించినారు. ద్వైతభావనను కాదనినారు. ప్రకృతి కర్త్రిగాదనినారు. మీమాంసకుల వేద ప్రామాణ్యము నంగీకరించినారు. వేదమున కంతటికిని ప్రామాణ్యమును సాధించినారు. నిత్యకర్మలుకూడ ఫలమునిచ్చుననినారు ఈ విషయములో మీమాంసకుల కంటె ఎక్కువ ప్రామాణ్యమునే వేదమునకు సంపాదించినారు. న్యాయ మీమాంసాది శాస్త్రకర్తలు తమశాస్త్ర విషయాలను నిరూపణలు చేసి చివఱకు అధ్యాత్మ విషయములో శ్రీశాంకర సిద్ధాంతమేఅనుసరణీయమని సూచించినారు. ప్రమాణ నిర్వచనమునందు నేటి సైంటిస్టులకు సైన్సుకు సరిపోవు సిద్ధాంతమును చేసినారు. బౌద్ధాలలో మాధ్యమికాల విషయమును ప్రస్తావించి బ్రహ్మేతరమైన జగత్తు శూన్యము అనుటలో తమ అభ్యంతరము లేదని నిరూపించినారు. ద్వైతుల్వేవరును చేయని రీతిని "సతస్య, సత్యమ్" అను వాక్యార్థమును విశ్లేషించి, బ్రహ్మగత సత్యత్వము పారమార్థికము, జగత్తు మాయ — సత్యానృతముల మిధునీ భావము. అని నిరూపించినారు. ఇందువలన ద్వైతులనుకొనిన జగత్సత్యత్వమును పూర్తిగా త్రోసివేయలేదు.

తాము నిర్గుణ వాదులేయైనను, సగుణారాధనను కూడ అంగీకరించినారు. కర్మలు బంధమును కలుగచేయును, జ్ఞానమే మోక్షప్రదము. కర్మజ్ఞాన సముచ్చయము కుదరదు అని వాదించియు, కర్మలు నిష్కామములగుచో చిత్తశుద్ధికారకములే, అని నిరూపించి, ఉపాసదలు జ్ఞానప్రదములే, అని నిరూపించి, పరాభక్తి జ్ఞానమే అని తెలిపినారు. ఇట్లు కర్మభక్తి జ్ఞానములకు అధికారభేదము ననుసరించి స్థానమును చూపినారు. "అజ్ఞాన నివృత్తియే మోక్షము" అది ప్రాప్యముగాదు. సహజసిద్ధమే ఈ లోకముననే, ఈ దేహముతోనే ముక్తి ననుభవింపవచ్చును. అని సశాస్త్రీయముగ సయుక్తికముగ నిరూపించినారు. హేతువాదము నంగీకరించినారు, అతీంద్రియ జ్ఞానమున మాత్రము దానికి తావులేదని నిరూపించినారు. ఆధునిక పాశ్చాత్య తత్త్వవేత్తలు సైంటిస్టులును ఈ వాదమును అంగీకరించుచున్నారు. నీతి అవసరము, సమాజములోపురుషప్రయత్నమున అవసరము అనినారు. తమకు ఏమతమువారితోను, విరోధము లేదు. వారిని విమర్శింపవలెనని విమర్శింపలేదు. యధార్థనిరూపణకే వారి

వాదములలో దోషము చూపినననినారు. గురుశిష్య సంబంధము విద్యా ప్రాప్తికి ఆవ సరము "ఆచార్యవాన్ పురుషోవేద" ప్రశ్న సమాధాన రూపమున విషయము బోధించుట, తెలిసికొనుట మంచిది "శ్రద్ధావాన్ లభతే విద్యామ్" శ్రద్ధలేని వానికి విద్య రాదు. విన్న దానిని విమర్శించి నిర్ణయింపవలెను అనినారు. బ్రహ్మసూత్ర సమన్వయాధి కరణమునందు అన్ని ఉపనిషద్వాక్యములకును, పైకి కనుపడు విరోధమును· పరిహరించి, సమన్వయము చూపినారు. అన్ని మతములలో మంచిని గ్రహించినారు· అధికార భేదము ననుసరించి అందరకును ముక్తి మార్గములున్నవని తెలిపినారు. ఎవరికి కొదవలేదు. ప్రపంచమంతయు ఒకటియే భేదదృష్టి యథార్థము కాదు దానిని వదలి ఏకత్వ దృష్టిని సాధింపవలెను-అను శ్రీ శంకర సందేశము, విద్యా· ర్థులకు, రాజకీయ నాయకులకు, శిరోధార్యము అయినపుడు ప్రపంచశాన్తి కలుగును

ఉత్తిష్టత జాగ్రత-ప్రాప్యవరాన్ని బోధిత
"శంకర శ్శంకరో భూయాత్"




తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3